# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానములవారిచే సంభావింపబడిన

## శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

పదునాఱవ భాగము



:: సంపాదకుఁడు ::

విద్యా భూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

**ధనకుధరం వరదాచార్యులు**



:: ప్రకాశకులు ::

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 522 006

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

## పదునాఱవ భాగము

మొదటి ముద్రణము
వేయి ప్రతులు

ధాత - ఆశ్వయుజము
**అక్టోబరు 1996**
రామానుజ శకము ౯౮౦

మూల్యము :-
నూఱు రూపాయలు

ముద్రణము :-
షిరిడి సాయి ప్రింటర్స్,
2/1 బ్రాడీపేట,
గుంటూరు - 2.

---

[ This book is published with the financial assistance of
Tirumala Tirupati Devasthanams under the
Scheme Aid to publish religious books ]

# సమాలోచన సమితి

♦ ♦ ♦

'వ్యాకరణ విద్యాప్రవీణ - భాషా ప్రవీణ'
శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M. A.
విశాఖపట్టణము

*

'న్యాయవిద్యాప్రవీణ'
డాక్టర్ : యస్. బి. రఘునాథాచార్యులు, M. A; Ph. D.
డైరక్టర్, రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠము
తిరుపతి

*

శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు, M. A., M. Ed.
రాజనీతిశాఖాధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ్ గురుకుల డిగ్రీ కళాశాల
నాగార్జునసాగర్ - విజయపురి సౌత్

*

'కవికోకిల - విద్వత్కవి - కావ్యకళానిధి'
శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు
సాహిత్యవికాసమండలి అధ్యక్షులు
సిద్దిపేట

*

డాక్టర్ : చించాపట్టణం శ్రీరంగాచార్యులు, M. A., Ph. D.
రిటైర్డు తెలుగు లెక్చరర్,
నాగోల్ - హైదరాబాదు
(రంగారెడ్డి జిల్లా)

*

'మహామహోపాధ్యాయ - ఉభయవేదాంత శిరోమణి'
శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, M. A, B. O L.
సంస్కృతోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర వివేకవర్ధిని సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

'కవితార్కిక కేసరి - ఉభయ వేదాంతవిద్వాన్'
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు, B. O L.
వరంగల్

*

'విద్యాప్రవీణ - భాషాప్రవీణ - ఉభయవేదాంతశిరోమణి'
శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, M A
రిటైర్డు ప్రిన్సిపాల్ :- వేద సంస్కృతకళాశాల
నెల్లూరు

*

'సంగీత సాహిత్య కళానిధి - ఉభయవేదాంతవిశారద'
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు
సువర్ణ హస్త కంకణ విరాజితులు
విజయవాడ

*

'సాహిత్య విద్యాప్రవీణ'
డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు, M. A., Ph. D.
ఉపన్యాసకులు :- విశిష్టాద్వైత విభాగము
రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠము
తిరుపతి

*

'సాహిత్య విద్యాప్రవీణ'
డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు,
M A Ph. D.
సంస్కృతోపన్యాసకులు :- ఆంధ్రగీర్వాణ విద్యా పీఠము
కొవ్వూరు

## శ్రీ రామానుజ కీర్తి కౌముది

# అంకితము



షోడశ కళాపరిపూర్ణము, శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము నగు
శ్రీ రామానుజ కీర్తి కౌముదిని - ధార్మికహృదయులు, పూజ్యులు,
పరమపదవాసులు, మాతాపితరులు నగు
లక్ష్మీనరసమ్మ, రామానుజాచార్యులు గారలకు
భక్తి ప్రపత్తులతో అంకితము గావించుచున్నాను.

— సంపాదకుడు.

# ప్రముఖులు - ప్రశంసలు

( పదునైదవ భాగమునుగుఱించి )

డా॥ చించాపట్టణం శ్రీరంగాచార్యులు, M.A.Ph.D హైదరాబాదు.

శ్రీ రామానుజ కీర్తి కౌముది - పదునైదవభాగ మందినది అందులో దేవరవారు పొందుపరచిన 'విష్ణుసహస్రనామ స్తోత్రప్రభావము', 'శ్రీవిష్ణుభగవానుని దివ్యవైభవము', 'దశావతారములు - తద్విశేషములు', 'శ్రీమద్రామానుజులు - వేదాంత సారము' ఇత్యాది వ్యాసరాజము లన్నియు - విషయ వివరణ వైశారద్యముతో నొప్పారుచున్నవి. దేవరవారు సిద్ధ సంకల్పులు. శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు సంస్థాపించి ప్రవచించిన శ్రీవైష్ణవ సంప్రదాయ విజ్ఞాన విశేషములను విశదీకరించుచు, శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ సంపుటముల రూపమున ప్రకటింపబూనుట సాహసము. శ్రీమన్నారాయణుని కృపవలన దేవరవారి కృషి ఫలింపనున్నందులకు మిక్కిలి సంతసించుచున్నాను.

Dr. PREMA NANDAKUMAR SRIRANGAM

SRI RAMANUJA KEERTHI KAUMUDI VOLUME XV Edited by Dhanakudharam Varadacharyulu (Sri Ramanuja Keerthi Kaumudi Granthamala, Sri Lakshminarayanapuram, Guntur - 522006. 1995. 240 pages. Rs. 60)

The penultimate volume of **Sri Ramanuja Keerthi** Kaumudi edited by Dhanakudharam Varadacharyulu contains a rich assembly of information on the Philosophy and theology of Sri Vaishnavism down the ages. The editorial opens

with the wellknown poem to the all-pervading Vishnu : "As the elephant by its rut, the sky by raindrops, the autumnal night by the full moon, woman by her chastity, the horse by its swift ness, temples by festivals. language by grammar, rivers by pairs of swans, seminar by scholars, the dynasty by good son and the kingdom by emperor, the three worlds are illumed by Vishnu '

The concept of Vishnu harks back to the Vedas Howe- ver, it is in the **Mahabharata** that we see the first major pra- yer to Vishnu in the Sahasra ama taught by Bhishma to Yudhistira, even as the former lay on the bed of arrows. Kida- mbi Srinivasa Ramanujacharyulu speaks of the Prayer as a transformatory instrument (**divya rasayana**) for aspirants who recite it. The prayer helps them overcome the frustrations of daily living Dhanakudharam Varadacharyulu reserches deeper into the Vishnuidea and lists other well known prayers.

It is appropriate that this essay is followed by Paravasthu Appan Govindacharyulu's Telugu commentary on Kurattalwar's **Sri Stava** Kurattalwar was an earnest disciple of Ramanuja and **Sri Stava** underlines the significance of Lakshmi as the mediating power between the aspirant jiva and the answering Grace of Vishnu. Lakshmi is the home of all auspicious quali- ties and she alone can grant us eternal servituede to qualities and she alone can grant us eternal serviteude to the Lord. Her compassion is boundless. Looking upon her, Vishnu feels satis- fied only by her glances It is then not surprising that the as- pirants too await her compassion-laden look.

Samudrala Venkata Rangaramanujacharyulu's essay on the ten incarnations is a book by itself. There is a thorough- ness about this presentation which is, however, touched in simple language The puranas and the Tamil hymns of the Alwars are invoked throughout the essay. For instance, the

Vamana Avatara is detailed from its Vedic beginnings (**Idam Vishnurvichakrame–rig Veda**). Later puranic imagination gave us the story as we know it. For the Alwars, the Vamana incarnation is a favourite theme. The **Ramayana** speaks of it in the Bala Kanda. The Vamana Purana is revelatory of the Lord's easy accessibility (**saulabhya**) as a young student and His suprnormal nature (**Paratva**) as the Trivikrama The learned author reminds us of the **Ramayana's** importance as a scripture of Surrender (**Prapatti sastra**), the Krishna consciousness that pervades the hymes of the Alwars the exquisite bridal mysticism of Andal self-lost in her love of Krishna, the **Yadavabhyudayam** of Vedanta Desika, the Radha–Krishna idea propounded by the Chaitanya School and the symbolic significance of the Krishna idea.

The future incarnation of Kalki defies all imagination. Dittikavi Lakshmi Narasimhacharyulu attempts a critique of the subject. According to astrologers, it is 195, 58, 85, 095 years since this creation began. Time has moved forward with a steady tread passing by aeons. It is true the present (Kali) yuga would go from bad to worse, but the Kalki incarnation will once again restore Dharma

Ramanuja's commentary on the Brahma Sutras is a democracy of humanistic ideals as the Acharya set forth several revolutionary concepts that were reformatory in character In the course of 156 Adhikaranas, the Acharya exhorts upon us to seek Brahma-knowledge which is eternal and which alone gives us unalloyed Ananda. Brahma is that which creates, sustains and withdraws into itself this creation. Its nature is Ananda, a positive quality. Naturally, no one need be a stranger to it, except of course the Shudra. The term 'Shudra' refers not to one's caste but to one who has no Brahma-knowledge or one who is lost in the pleasures of the material world, preyas. Brahma-knowledge can be possessed by any one, provided he has a wide, deep and unfailing aspiration

Many poets in the past have paid homage to Ramanuja who has presented such a clear exposition of the Brama Sutras and lighted our path way to the Divine. Among such devotional poets is Tiruvarangathu Amudanar who indited the **Ramanuja Nuttandadi**. The present volume of the Kaumudi carries Kuntimaddi Sesha Sarma's narrative poem on the legend of Ramanuja proving the authenticity of the Srinivasa icon a top the Venkata Hill. Ramanuja explained to the critics that the Bilwa leaves (usually associated with Saivism) are used for worshipping Srinivasa since the tree is dear to Lakshmi according to the **Sri Sukta**. The Nagabharanas that ornament Srinivasa's image were offered by a king who was commanded to do so in a dream. When the Saivites still expressed doubts, Ramanuja sealed the sanctum after leaving the conch and-discus as well as trident and-noose symbols at the feet of the deity. The next morning when the doors were opened, the Lord appeard holding the conch and discus Sri Sesha Sarma's poem does rool on gently and is an ornament to the **Kaumudi**.

The **Kaumudi** has also Prativaji Bhayankara Vedantachaiyulu's detailed essay which explained the theological differences between the Vadagalai and Thengalai sects of Srivaishnavism. The volume concludes with a note on the Varadaraja temple, Kanchipuram, dear to Ramanuja. The author, Dhanakudharam Varadacharyulu briefly touches upon the history of the temple through the reigns of the Pallavas, the Cholas, the Pandyas and the Nayakas. Several Acharyas were associated with, it, among them Ramanuja, Tirukachi Nambi and Vedanta Desika Tirumangai Alwar, Kurattalwai, Appayya Dikshitar, Daggupalli Duggannakavi and Kudicherla Tipparaju, Tyagaraja and Kshetrayya have hymned the Lord's glory in soulful prayers. The heroic strivings of Dhanakudram Varadacharyullu to publish the **Sri Ramanuja Keerthi Kaumudi** volumes deserve high praise from those who are committed to the sustenance of India's hoary and glorious culture based on a spiritual approach to life



# పత్రికా ప్రశంస

( పదునైదవ భాగమును గురించి )

గైర్వాణీ (చిత్తూరు) జనవరి 1966

పరిచయః :- ఉ. వే. ప్ర. శ్రీమాన్ ధనకుధరం వరదాచార్య స్వామీ - ఉభయ వేదాంత ప్రవర్తకాచార్యాణాం శ్రీమతాం ప్రాచార్యాణాం ద్వాదశసంఖ్యాకానాం ద్వాదశసూరిసదృశానాం సమాలోచన సమితిం సంస్థాప్య, తత్సమాలోచనం పురస్కృత్య, శ్రీ రామానుజ కీర్తి కౌముదీం - శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ భూతాం - సామయికపత్రికాం స్వరూపాం (పీరియాడికల్) గ్రంథ రాజం ప్రథమాది పూర్ణిమా పర్యన్తాం సంపాద్య, సుష్ఠు సంముద్ర్య, అద్యావధి ప్రాచీకశత్ । మహత్తర మిదం కృత్యం - రాకాచంద్రి కేందూ పూర్ణత్వముపగచ్ఛతి కౌముదీ స్వరూపేణ । యద్యపి రామానుజ దివాకరస్య సహస్రకిరణతయా శతధాఽథ సహస్రశః నిమగ్నానాం ప్రబన్ధానాం చ సంకలనేన ప్రకాశనకృత్యే అనుష్ఠీయమానే సత్యపి, తదీయ వైభవస్య అనవధికతయా 'నాలం మాతుమియత్తయే'త్యావాదశిష్యేత,తథాఽపి,'ఠింగళురాది త్రియన్ మెళుం దార్ పోల్' ఇతి భగవద్రామానుజస్య చాన్ద్రిమసః కాన్తిరేవేదానీం ఆచార్యపాదైః ప్రకాశనదశాం ప్రాపితా । భాస్కరప్రభాయా స్తావదానన్త్యం స్వరూపసిద్ధం నిరవధికమేవ శశ్వత్సిద్ధ్యతీతి సతాంమతమ్ ।

శ్రీ రామానుజ కీర్తి కౌముద్యాః పూర్ణిమాయా మస్యాం యథాపూర్వం ప్రముఖానాం - శ్రీమతాం - ఆచార్యవర్యాణాం

నిబన్ధ ప్రబన్ధైః, సచిత్ర కవి పండిత పరిచయేన సాకం, శ్రీ శ్రీ శ్రీ త్రిదండి (చిన్న) శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామినాం మంగళాశాసనేన - 'పూర్ణమిదం పూర్ణమదః' ఇతి ప్రత్యయో న స్సంజాతః । సంపాదకాచార్యవర్యస్య ఆదిమధ్యావసాన సరణ్యా - (1) సంపాదకీయం (విష్ణోర్భగవతో వైశిష్ట్యం) (2) భగవతో విష్ణోః దివ్య వైభవమ్ (3) శ్రీ వరదరాజ క్షేత్ర వైశిష్ట్యమ్ - ఇతి నిబన్ధ త్రయేణ - ఉపక్రమోపసంహార న్యాయః సమ్యక్ పాలితః । అతో త్యేషు దశసు - ద్వౌ హృద్య పద్యప్రబన్ధౌ । అవశిష్టాః వ్యాఖ్యోపన్యాస కాత్మకాః అష్టౌ నిబన్ధాశ్చసన్తి । నిబన్ధ ప్రబన్ధాత్మకేషు ఆచార్యాణాం ప్రబోధేషు - 2, 5, 9 సంఖ్యాకా నిబన్ధాః ఉల్లేఖనీయాః అంగోపాంగైః శ్శిష్టైః బహుగ్రంథావలోకనకృతం విషయ వైవిధ్యం తేషు ఆచార్యవర్యైః సమగ్రతయా సముపన్యస్తమ్ । 140 తమ పృష్ఠతః ఆరభ్య, 200 పృష్ఠపర్యన్తం - వేదాన్తసారానువాదః సమగ్రతయా ప్రకాశితః । భగవద్రామానుజస్య శ్రీ భాష్య - వేదాంతదీపే - వేదాంతసారేషు అతివిస్తృతం, నాతి విస్తృతే సంక్షిప్త శరీరేషు - అన్తిమో భాగస్సాన్తమనూదితః । శ్రీ వేంకట పతి స్తుతిః, శ్రీ రామానుజ విజయః ఇతి ప్రబన్ధౌ - భగవద్భాగవత పారమ్యం నిరూపయితః ।

ఇయంచ పత్రికా - సామయికః శ్రీ రామానుజ కీర్తి కౌముదీ - ఆన్ధ్రప్రాంతవాసినాం, తత్ప్రియాణాం చ ఆన్ధ్రభాషాభిజ్ఞానామేవ అత్యన్త పరమోపకదం జనయన్తీ ఆదితః ప్రారంభాదేవ ప్రసిద్ధాస్తి । అస్యాః శ్రీ రామానుజ కీర్తి కౌముద్యాః పరిసమాప్తిం అత్యన్త

సామర్థ్యేన సాధితయ స్తః - శ్రీమ స్తః ధనకుధరం వరదాచార్య స్వామినః సిద్ధహస్తాః, సిద్ధసంకల్పాశ్చేతి సర్వథా అభినన్దనీయాః। ప్రకాశితానిచ విషయజిజ్ఞాసూనా ముపాదేయతమాని చేతి నః ప్రత్యయః ।

శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ ప్రచారే ఆర్థికసాహాయ్యం యథోచితం సమర్ప్య, తిరుమల - తిరుపతి దేవస్థాన యాజమాన్య మపి - అభినన్దనీయం - సిద్ధమ్ । ధర్మో విలసతు ఇతి - గైర్వాణీ సహర్షం ప్రస్తౌతి ।



శ్రీనివాసాయనమః  శ్రీమతే రామానుజాయ నమః



# అమృతవాణి

## ( సంపాదకీయము )

"లక్ష్మీనాథ సమారంభాం నాథయామునమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్ ॥"

శ్రీనివాసభగవానుని కృపావిశేషముచే - శ్రీ రామానుజ కీర్తి కౌముది - పదునాఱు కళలను సంతరించుకొని, శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వముగా సూర్యాలోకభాగ్యము నంది నందులకు మేము పరమ హర్షము నందుచున్నాము.

ఈ గ్రంథ ప్రచురణ మహోద్యమ సందర్భమున - అమూల్యములు, సంప్రదాయబద్ధములు నగు రచనలను అందజేసిన కవిపండితులకు, గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయమును గావించిన తిరుమల - తిరుపతి దేవస్థానములవారికి, విరాళము లొసంగుట మూలముననుం, మా గ్రంథమాలలో సభ్యులగుట మూలముననుం మా మహోద్యమమునకు సహకరించిన మహనీయులనును - ఇందుమూలమున మా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము.

"సన్మార్గ సందీ ప్తి విరాజయంతీ సమ్యక్ పవిత్రాసకలోక సేవ్యా ।
సుదృక్ ప్రమోదం చ వివర్ధయంతీ విభాతి రామానుజ కీర్తి కౌముదీ ॥"

సదాచారమునకు శోభనుగూర్చు నదియు, ఆకాశ పథమునకు వెలుగునిచ్చునదియు, మిక్కిలి పవిత్రమైనదియు, విద్వాంసులచే సంసేవింపబడునదియు, ప్రజలందఱి చేతను ప్రశాంతముగ పరిశీలింపబడు నదియు, జ్ఞానవంతులకు ప్రమోదమునుగూర్చునదియు, మంచిచూపు గలవారికి ఆనందమును చేకూర్చునదియు నగు 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' - ప్రకాశించుచున్నది."



"రామానుజాచార్య దివ్యాజ్ఞా ।
వర్ధతా మభివర్ధతామ్ ॥"

# విషయానుక్రమణిక



శ్రీ పద్మావతి

శ్రీ వేంకటాచలపతి

# శ్రీ నివాస విలాసము

‘ సంగీత సాహిత్య కళానిధి – ఉభయ వేదాంత శిరోమణి ’

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



శ్రీరామానుజదేశికోత్తమ యశఃస్థేమాకృతిన్ వైష్ణవా
చారోద్య ద్ధనశైలవంశ వరదాచార్యోద్ధతిన్, వైభవ
శ్రీరాజ ద్భుజగేంద్ర శైలపతి - నిస్సీమాదృతిన్ వెల్వడెన్
శ్రీ రామానుజ కీర్తి కౌముది - జగజ్జేగీయమానంబుగన్.

ముప్పది వత్సరమ్ములకు బూర్వము - శ్రీ వరదార్యు డెందమం
దుప్పరవీథిపై స్థిత మయూఖుని రీతిగ - భాష్యకృ ద్గురుం
డొప్పుగ దోచి, స్వీయ కిరణోత్కరముం బ్రసవింపచేసి, యా
యొప్పులకుప్ప మానసము నుత్పల మట్లు రమింపజేసె దాన్.

ఏమీ ! యీ గురుమౌళి - నా మనమునందే నిల్చియున్నాడు, త
ద్ధామం బచ్చ సుధాకరం బగుచు సంతర్ధ్వాంతమున్ జిమ్మి, ఏ
దో మార్గంబును జూపుచుండె నిపు డేదో చెప్పనట్లుండె నం
చా మాన్యుండు మనమ్మునందు తలపోయన్ సాగె నేకాగ్రతన్.

పదునాఱు కళల శశి నిభ
వదనంబును జూపి చూపి వరదార్యునకున్
మది నొక స్ఫూర్తి నొసగె న
య్యదియే ఈ కౌముదీ సమాఖ్యన్ వెలసెన్.

వర్షి యోగురు రక్షితంబు నగు దివ్యంబైన సిద్ధాంతమున్
హర్షం బొప్పగ భాష్యకారుడు ధరన్ వ్యాపింపగా జేసె ను
త్కర్షం బియ్యది శ్రీనివాసుకృపచేతన్ త ద్యశ; కౌముదిన్
వర్షింపన్ వలె గ్రంథరూపమున సేవాభావసంపత్తిచే.

శ్రీమ చ్ఛేషగిరీంద్రమ స్తకముపై జెల్వొంది, కారుణ్య వీ
క్షా మాధుర్య రసప్రవాహమున దోగం జేసి, భక్తౌఘమున్
ప్రామాణ్యైక విధాయియై, కలియుగ ప్రత్యక్ష దైవంబునై
సామంబున్ వినుతింప వెల్గు పరు డిచ్ఛాపూరకుం డయ్యెడిన్.

నా పూర్వుల్ యతిరాజ దర్శిత విధాన శ్రీనిధానోజ్జ్వలున్
నీ పాదమ్ములు నమ్మి కొల్చిన గణాన్వీతుల్ తదీయాన్వయ
శ్రీ పెంపొందగ భాష్యకారుల యశః శ్రీ కౌముదీ పూర్తికై
నాపై నింపుము నీ కృపారసము నన్నా ! శ్రీనివాసప్రభూ !

వెనుకన్ ముందును ప్రక్కలంగనిన - నుర్విన్ శక్తి సామర్థ్యముల్
గనరాకున్నవి విత్త మంగబల మాఖ్యాన క్రియా ప్రౌఢియున్
జన సాహాయ్యము నీవ యూచు యతిరా ట్చంద్రద్యుతుల్ మేదినీ
జన హృత్తాపము దీర్పగా దలపు మోజన్ శ్రీనివాసప్రభూ !

మానసమందు జందురుడు - మానుగ బుట్టెను నీ కటంద్రుడు, నా
మానసమందు బుట్టె నతిమాత్ర సుధామయ గోపురుండు - రా
మానుజు డిందుడై, అతనియందు గలంకము లేదు, త ద్యశో
గానము శ్రీనివాస ! సుధ గావలె నీ వలె సౌమనస్యమున్.

చదువుల్ నేర్వనివారికిన్ సులభమా చాయన్ యతీశాను న
భ్యుదితమ్ముల్ మది కెక్కి, ఆంతర తమః ప్రోత్థానముల్ మాసి, నీ
దు దయావీక్షకు బాత్రులై జనన పాథోరాశి దాటంగ ని
య్యది పోతం బగుగావుతన్ నిగమగేయా ? శ్రీనివాసాహ్వయా !

యతిరాణ్మస్తక సంగతిన్ గురువరుల్ ప్రాచీనులున్ బాత సం
గతి సర్వాత్మనులెల్ల రుత్తమ గతిన్ గాంక్షించినారట, త
ద్యతిరాణ్ణాయక రత్నసంకలిత సర్వాచార్య హారప్రభా
న్వితమై గ్రంథము శోభిలన్ వలయు - క్షోణిన్ శ్రీనివాసప్రభూ !

ధనమా ! సాధనమా ! మనో మథనమా ! తాత్పర్యమా ! తత్త్వ నే
వనమా ! వేదనమా ! ఫలమ్మునకు త్వత్కారుణ్యమే సర్వదా
ధనమున్, సాధనమున్, మనో మథనమున్, తాత్పర్యమున్, తత్త్వ వే
దనమున్, వేదనమున్, నిదానము సమస్త శ్రీనివాసోదయా !

శ్రేయమ్ముల్ బహు విఘ్నముల్ తను జల స్తైమంబు - తాత్కాలికం
బాయుర్దాయము బుద్బుదంబు; గణనీయుంబైన ఈ కార్యమం
దే యాతంకము లేక సాగ గను మోయీ ! నీదు నామంబె పా
థేయార్థమ్ముగ గొంటినయ్య ! గుణకంథ ! శ్రీనివాసా ! హరీ !

ఏదో ఇట్టి మహాత్కృతిన్ దలచి, నీవే శ్రీయతీంద్రాకృతిన్
స్వాదు స్వాదు సుధాకరాంశువులతో సందర్శనం బిచ్చినా
వే - దాసుండు నిమిత్తమాత్రము - త్వదీయేచ్ఛాగతుల్ మంచికిన్
పాదుల్ దేవరహస్యముల్ సిరుల కుప్పల్ - శ్రీనివాసా ! విభూ !

ఆచార్యుల్ గల రెందరో ధర విశిష్టాద్వైతసిద్ధాంత సం
ఖ్యాదాచార్యులు, లేఖకోత్తములు, ప్రఖ్యాతుల్, కవీశానులున్
వాదోయుక్తిపటుల్, విమర్శన కలా పాథోనిధుల్ - వారు, నా
ఈ చైదమ్మున భాగమున్ గొనక యుంద్రే ? శ్రీనివాసా ! కృపన్.

అంతో, ఇంతయొ నేర్చినాడను విశిష్టాద్వైత సంఖ్యాత సి
ద్ధాంతార్థమ్ములు గ్రంథమధ్యమున నా ఆచార్య నీరాజనో
దంతార్థమ్ముగ కేవలమ్ము, సుమనోహారమ్మునన్ బుష్టమై
కాంతిం బొల్చెడిరీతి జేయుము శుభేశున్ శ్రీనివాసా ! హరీ !

హనుమ జ్జాంబవ దంగదాదులు మహా హార్యమ్ములన్ వైవ, తో
య నిధిన్ వై చెను సైకత మ్ముడుత, తా నా రీతి నా యీ అకిం
చన కైంకర్యము నా దరింపవలె సాక్షా ద్భాష్యకారుండు, నీ
వును నీ దాస్య సుధారసప్రణయ భావుల్ - శ్రీనివాసా ! సదా.

ఏను నిమిత్తమాత్ర మని ఇంతకు మున్నె వచించుకొంటి, స్వా
ధీన సమస్త జీవుళ వనిష్ఠిత తుంగ మహీధరుండవే
సైనను డిగ్గి వచ్చి, ప్రణతార్తులు దీర్చి శుభంబు లిచ్చు సు
శ్రీనిధి ! శ్రీనివాస ! ప్రవసింపగబోకుము నన్ను వీడుచున్.

సుందరమై, కటాక్షిత వసుంధరమై, మునిరాజ భావనా
మందిరమై, కృపా విభవ మంధరమై, స్వవశీకృతాంబు రు
ణ్మందిరమైన నీ పదమునన్ భర ముంచితి శ్రీనివాస ! స
క్చందన శంఖ చక్రతిలకద్యుతి మోహన ! లోకపాలనా !

శయనంబై, యుపధానమై, సదనమై, ఛత్రలబునై, పాదుకా
ద్వయమై, సర్వవిధోపచారములు నిర్వర్తించు శేషుండె నీ
నియమమ్ముం గొనివచ్చె ని ద్ధరణికిన్ - నీ నిత్య కైంకర్య వృ
త్తియె మర్త్యాళికి తారకం బనెడి బుద్ధిం గూర్పగా, న మ్మహో
దయు చారిత్ర మహత్త్వ బోధములు గ్రంథస్థంబులై, చంద్రికా
ప్రియముల్ గావలె నూత్న మార్గమున దంద్రీ ! శ్రీనివాసా ! హరీ !

నీకుం దాలిమి శంఖ చక్రములు, పత్నిన్ సంధిలన్ జేసి, తా
చేకూర్చెన్ గత నైజ వైభవములన్ శ్రీలక్ష్మణార్యుండు త
ల్లోకాతీత మహత్త్వముం దెలుప - నాలో గల్గె నుత్కంఠ, నా
ఈ కృత్యమ్మ భవ ద్విధేయమును గాదే ! శ్రీనివాసా ! హరీ !

శ్రీరామానుజహాని లేని యెడ, మా చిత్తమ్మునన్ - నీవునున్
శ్రీరంగేశుడు, యాదవాద్రిపతియున్, శ్రీహస్తిశైలేశ్వరుం
డీ రీతిం బరతత్త్వ వైభవములో నింపార వర్తింతురా ?
మీరల్ ఘోర కృదృష్టిలో నడగి స్వామీ ! శ్రీనివాసా ! ధరన్.

వరదుం డా యతిమూర్తి సంతతిని సంభావించె నంగీకృతిన్
వర రంగేశ్వరు డాత్మ సన్నిధి జరావాసంబు గాంక్షించె దా
స్థిర నారాయణ శైల శౌరి సుతుడై చెల్వొందె, త ల్లక్ష్మికిన్
గురుభావంబున నీవు గంటి వతిలోకునన్ శ్రీనివాసా ! ప్రభూ !

శ్రుతి సూత్రమ్ములు నాంతర జ్వరముచే శోషిల్లె కొండొక్కనా
డతిమాత్రమ్ముగ, దానికిన్ భిషజుగా నానాడు నీ పంపునన్
యతిచంద్రుం డమృతాంశులేపనమునన్ వ్యాధి న్నివారింప స
స్మృతులై నేడు వెలుంగుచుండె నవి-స్వామీ! శ్రీనివాసా ! ప్రభూ!

తొలుతన్ వేదము,లా పయిన్ ఋషులు, భక్తుల్, కావ్య వాచస్పతుల్
కలకాలమ్మున నీదు కన్నుల యలంకారమ్ము వర్ణించినా
రలు - కానీ, యతిరాజు చందమున పూర్ణంబైన సౌందర్య సం
కలనమ్మును దిలకించినారె ! సుదిదృక్షున్ శ్రీనివాసా ! రసన్.

నీ మంత్రంబు వచించె వేదములు దానిన్ దేవ ! లోకోత్తర
ప్రేమన్ గుప్తము జేయ కెల్లరకు నేర్పెన్ భాష్యకారుండు, నీ
వామోదించితి నెందరోకనిరి సౌఖ్యం బర్థ సంబుద్ధిచే
నా మంత్రార్థము లిందు గూర్పవలె నయ్యా ! శ్రీనివాసా ! తగన్.

నీవో ? శేషుడో ? సైన్యనాథుడో యనన్ విద్వాంసు లూహింపగా
యావ ద్భారత దేశమందు గల నీ అర్చావతారంబులం
దావిర్భావము గన్న దివ్య మహిమల్ వ్యాపింపగా జేసె, నీ
ద్యానా భూముల అంతరాళము ననంతన్ శ్రీనివాసా ! భళీ !

కాశ్మీరమ్మున కేగి, శిష్యతతితో గావించి వాణీపతీ
వేశ్మం బందవి సూత్రవృత్తి గొని నిర్వేదంబు బోనాడి, త
ద్దర్శి ప్రస్తుతి మ త్స్వయం రచిత సద్భాష్య ప్రకాశమ్ముచే
నశ్మ ప్రాయము నుద్ధరించె క్షితి నాహా ! శ్రీనివాసా ! విభో !

సమ్యగ్దృష్టిని సంతరించుకొని మున్ శాస్త్ర ప్రమాణంబులన్
రమ్యాలోకన మాచరించి ఋషి వాగ్రాజి ప్రధానంబుగా
సా మ్యంశమ్మె ప్రమాణమం చన కశేషత్ర య్యుదంతమ్ములన్
గమ్యంబున్ గృపజేసినట్టి దతడేకా ! శ్రీనివాసా ! నినున్.

సంధిన్ గూర్పను ముక్తితోడ యతిదా ట్సంబంధి సంబంధి సం
బంధం బెన్నితరాలవారికయినన్ భంగంబు లేకుండ నీ
సంధాసూత్రము సాగగావలయు నీ చందాననే ధారణిన్
కంధుల్ సగ్రహ తారకల్ నిలచుదన్కాన్ శ్రీనివాసా ! ప్రభూ !

పూర్ణప్రజ్ఞయు, లౌకికానుభవమున్, పూర్ణాయురారోగ్యముల్
పూర్ణాఖ్యుల్ గుణపూర్ణు లేవురు గురుల్ పూర్ణాశ్రమప్రాప్తియున్
పూర్ణాత్పూర్ణ మితి శ్రుతిన్ మదిని నిల్పున్ శ్రీ యతీంద్రుండు, నీ
పూర్ణానుగ్రహపాత్ర మయ్యె నని తెల్పున్ శ్రీనివాసాచ్యుతా !

ప్రజ్ఞాద్యుల్ యతిరాజు శిష్య లోకచో బ్రహ్మదు లేతెంచి, మే
మాజ్ఞాదాతల మందురేని, 'అపహాస్యం' బిద్దియే - మీర లీ
శ జ్ఞానమ్ము ద్యజించి, మా గురుని పత్సాన్నిధ్యముం జేరి, ఆ
త్మ జ్ఞానమ్ము నెఱుంగు" డంద్రపర ధాతల్ శ్రీనివాసా ! మహిన్.

నాటికి నాటికిన్ శతగుణంబుగ నీ విభవంబు వర్ధమై
కోటికి మీరుచుండె శతకోటి ధరుండును నీదు గోటికిన్
సాటికిరాడు భూతపుర సంభవ సంయమివర్య ! సంపదు
ద్ఘాటనకై కరం బిడుము దంచిత రీతిని శ్రీనివాసుడా !

త్యాగుల్ భోగులు సర్వ సంగమ పరిత్యాగుల్, మహారాజులున్
రాగుల్, రోగులు - నీదు దివ్య చరణాగ్రంబందు దేహమ్మొగిన్
సాగం జేయుచు మ్రొక్కు కాలమును, వైషమ్యమ్ము బోనాడచున్
ద్రాగుత్సారిత సంస్కృతిశ్రమములు గారా ! శ్రీనివాసా ! ధరన్.

సిరినిం గూడిన నిత్య యోగమున సంసేవించు భక్తాళికిన్
పరమాహ్లాద మొసంగు మంగళ తను భ్రాజిష్ణుతన్ - నిత్య కిం
కర భావమ్మె స్వరూప సిద్ధ మని మాకై పాదముల్ సూపు నీ
వరణీయ మ్మగు భర్గముం దలతు దేవా ! శ్రీనివాసా ! మదిన్.

పాపమ్ముల్ దహియించు పర్వత శిరోభాగంబుపై వాసమున్
ధూపాఘ్రాపణముల్, పయోదపవనస్తోమంబు లారాధకుల్
శ్రీపూర్ణుల్ ద్రుహిణాది దివ్య పురుషుల్ - నీ శైల సోపానముల్
సోపానమ్ములు ముక్తికిన్ సురలు, ప్రేష్యుల్ - శ్రీనివాసప్రభో !

వేదవ్రాతము నీదు నిశ్శ్వసితమై విన్వీథిలో బర్వగా
దేవర్షుల్ కనిపట్టి నీ విషయముల్ విజ్ఞానులై, త్వన్మయా
మోదం బంచి సుఖించి, వాఙ్మయ ఝరమ్ముల్ బర్వగా జేసి రా
స్వాదం బిచ్చి - పరంపరానుగతమై, వాల్మీకమై, భారత
మ్మై, దివ్యాగమమై, స్తుతిప్రతతియై, యచ్ఛేద్యమై - నేటికిన్
జ్యోతిం గాంచుచునుండె నీ కలన నెప్డున్ శ్రీనివాసా ! క్షితిన్.

స్తోత్ర వ్రాతమునన్ బ్రపన్న రచిత స్తోమంబులన్, రాగ వై
చిత్రీ సంయుత గేయపాళి బహు రాశిన్ నీ గుణౌఘ మ్మదే
శత్ర స్థానము గల్గినం దరుగ కాకాశ ప్రదేశాన - న
క్షత్ర వ్యూహములై వెలుంగుదు రమేశా ! శ్రీనివాసా ! హరీ !

ఏవం భూత మహా ప్రభావ నిధివై యేపారు నీచూపునం
దే వీసమ్మొ, శతాంశమో, తదణునో - ఈ నాసుపై బర్వినన్
దావ న్మాత్రమె చాలు మేరు నగ ముల్లంఘించెదన్ లీలమై
నీవాడన్‌గద శ్రీనివాస ! గుణధామీ ! వాసుదేవా ! హరీ !

అని శ్రీమ ద్వరదార్యమాళి బహుధా ప్రార్థించి గ్రంథోత్యమ
మ్మను సంద్రమ్మున మందర మ్మగుచు ధైర్య స్ఫూర్తితో నిల్చె నా
ఘను ప్రజ్ఞాకలితమ్మై ఈ అమృత కూకాంత్యోద్యమమ్ముల్ ఫలిం
చెను రామానుజ కీర్తి కౌముది యిటులన్ చెల్వొందె సంపూర్ణమై.

శ్రీరామానుజ దేశికేంద్ర కరుణా శీలాయ, పద్మావతీ
ప్రాణేశాయ, పదాంబుజ ప్రణతికృద్భక్తామరక్ష్మారుహే
దూరాదూరవిహారిణే - సురగణ ప్రత్యర్థి సంహారిణే
నిత్యశ్రీ రఖిలాత్మనే భగవతే శ్రీ శ్రీనివాసాయ తే.



# కౌముదీ దర్శనము

' ఉభయ వేదాంత విశారద '

## శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ, ఎం. ఏ.



### మొదటి మాట

'దర్శన' మనగా - శాస్త్రము, చూపు, చూపించు - అని అర్థములు. శ్రీ రామానుజ కీర్తి కౌముది - పదునారు కళలుగా వెల్లివిరిసినది. ఆహ్లాదకరమైన వెన్నెల విరియవచ్చుగాని, చూపు లేని యతేషు - దర్శింపజాలరు, ఆనందింపలేరు.

"రామానుజ దివాకరః" - అను సూక్తి - అజ్ఞానాంధకారమును దూర దూరము గావించు మహనీయులు - శ్రీ రామానుజులు - అని మనకు బోధించుచున్నది. అట్టి యా రామానుజుల కీర్తిని - 'కౌముది' - అన్నారు. చంద్రుని కాంతి - కౌముది. కాదనము. కాని, చంద్రునకు సహజమైన కాంతి లేదు.

**"సలిలమయే శశిని, దివే ర్ధీధితయో౽చింతితా స్తమో నైనం ఛిన్దన్తి."**
అని ప్రవచనము. చూడగాని రవి కిరణములు చంద్రునిపై బడి, దర్శనీయములు, మనోజ్ఞములును - అగుచున్నవి.

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారి సంపాదకత్వమున - 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' - షోడశ (16) కళలుగా ప్రసరించుచున్నది.

భక్తవత్సలు డగు తిరుమల శ్రీనివాస భగవానుడు - ఒకానొకపుడు తనకు శ్రీమద్రామానుజులు శంఖ చక్రములను ప్రదానము చేసిన కారణమును పురస్కరించుకొని, ఇపుడు శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వముగా వెలువడుచున్న ఈ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథ ప్రచురణ మహోద్యమమునకు దోహద మొసంగుటయు, అందులకు కృతజ్ఞతగా - ప్రతి సంపుటములో ప్రారంభమునందు శ్రీ వేంకటేశ్వర స్తుతిగా నొక పద్య రచన ప్రకటింపబడుటయు - ఎంతేని సముచితముగా నున్నది.

# 1. ప్రతిపత్కృతి

మొదటి సంపుటములో - (1) శ్రీ వేంకటేశ స్తవము (2) హిందూమత వైభవము (3) శ్రీ పాంచరాత్రము - తద్విశేషము (4) శ్రీ వైష్ణవ మత వైభవము (5) భక్తి తత్త్వము (6) భక్తి వాఙ్మయము (7) శ్రవణ భక్తి (8) నామ సంకీర్తన మహిమ (9) సంఘ సాహిత్యము - వైష్ణవ తత్త్వము (10) పన్నిద్ద రాళ్వారుల వైభవము - అను పది రచనలు కలవు.

"శ్రీమ ద్వేంకట శైలమందిర ! నమ శ్శ్రీ రస్తు తే సర్వదా
భూమీనాథ ! సమేరతాల స్వ కరుణా స్ఫూర్తి ర్మయి ప్రత్యహమ్ ।
శ్యామాంభోద సమానగాత్ర సుషమా సౌభాగ్య లీలామూర్తే ! జయ
స్తోమ స్స్యాత్ భవతే వినమ్ర జన బంధో! వేంకటేశ ప్రభో !"

అను - శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులవారి 'శ్రీనివాస స్తవము'తో ఈ మొదటి భాగము ప్రారంభమైనది. అనంతరము - శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్య విరచిత

మగు 'హిందూమత వైశిష్ట్యము' - అనెడి వ్యాసము. ఈ వ్యాస ములో - వైష్ణవ మత ప్రాచీనత, విష్ణు ప్రాశస్త్యము మోక్ష ప్రాప్తికి ఉపాయము - మున్నగు అంశములు కలవు.

విశిష్టాద్వైతము నిరవధికాతిశయ స్వరూపుడైన పరమాత్మతో పాటు, సర్వసాఖ్యానుభూతి.

"రసో వై సః, రస గ్గ హ్యే వాయం లబ్ధ్వానందీ భవతి."

అనునట్లు - ఆవృత్తి లేని పరమ భావమున, భగవ త్సారూప్య, సాలోక్య, సాయుజ్యరూప మగు ముక్తికి అందఱును అర్హులే. త త్ప్రాప్త్యుపాయము - 'భగవ చ్చరణ శరణాగతియే' - అనియు, ఆ ప్రపత్తి - జ్ఞాన కర్మాంగకమైన భక్తియోగము కంటెను - సులభము, 'అవ్యభిచరితము' - అనియు, నిరూపింపబడినది. ఇయ్యది - సర్వ జన పఠనీయము, ఆచరణీయమును.

శ్రీమాన్ పొడిచేటి శ్రీరంగాచార్యులవారు - పాంచరాత్రాగమశాస్త్ర వైశిష్ట్యమును ప్రమాణ పూర్వకముగ నిరూపించినారు. శంకరాచార్యాది మత ప్రవర్తకులు - తమ గ్రంథములలో పాంచ రాత్రాగమశాస్త్రమును ప్రశంసించి, కారణములను నిరూపించి, ఈ శాస్త్రము - ముముక్షువులకు మార్గదర్శకమైన దని సూచించినారు.

శ్రీమాన్ - వేదాంతం జగన్నాథాచార్యులుగారు - విశిష్టాద్వైత మత స్వరూప స్వభావములను - 'శ్రీవైష్ణవ మత వైభవ' మను తమ వ్యాసములో - వేద - వేదాంత ప్రమాణ పుర స్సరముగ నిరూపించుచు, శరీరమును వదలిపోవు జీవులు - కర్మ

ముక్తులు, కర్మబద్ధులును పయనించు తెరువులను, గమ్యమును చేరి నంతట - వా రనుభవించు ఫలమును కన్నులకు కట్టునట్లు నిరూపించి నారు. అంతియగాక, పరమాత్మయొక్క వ్యక్తావ్యక్త రూపములను సవిస్తరముగ వివరించి, ఆ యా దశలయందు అనుష్ఠింపదగిన కృత్య ములను, జీవుల యభ్యున్నతిని గోరి ఆచరింపవలసిన క్రియలను - విశ దీకరించినారు. మఱియు - సాధన సప్తక - అష్టాంగయోగాది విష యము లనేకములను సవిస్తరముగ ఉపపాదించి, జిజ్ఞాసువులకు, పాఠకు లకు - కొన్ని ముఖ్యాంశములను బోధించినారు.

శ్రీమాన్ బృందావనం రంగాచార్యులుగారు - 'శ్రవణ భక్తి' - అను తమ పద్య రచనలో - శ్రవణ భక్తి - మోక్ష సాధనమైన విధ మును సరల సుందరము లగు పదములతో వివరించినారు. వచనము విశదముగ విషయ బోధకు అనుకూలమె యయ్యును - పలుమారులు ఆవర్తించుకొనుటకు, గొంతెత్తి కీర్తించుటకు, కంఠగత మొనర్చుట కును - పద్యరచన - ప్రశస్త మార్గము.

ఎంతటి వివేకి యైనను - సంపదలు, అధికారము - అనునవి అపమార్గమును పట్టించును. చేసిన కర్మ - శిష్టమో, దుష్టమో - అనుభవింపకతీరనిది. పశ్చాత్తాపము కొంతలో కొంత ఉపశమనము గావించునని - "శృంగముని ప్రసాదిత విశేష మహాబల శాప శక్తి కిన్ గ్రుంగిన" పరీక్షి న్మహారాజు చర్యవలన నిరూపింపబడినది.

ఎట్లైన నేమి ? పరీక్షిత్తు అకార్య మొనర్చి - శిక్షకు గురి యైనను, పండ్రెండు (12) దినములలో ముక్తుడై, భగవ త్కథా శ్రవణ ప్రవణు లైనవారు సులభముగ ముక్తిని పొందజాలు భాగ

నతే మహా పురాణమును మనకు ప్రసాదించినందులకు - వ్యాస భగవానుడు ప్రశంసనీయుడు. దానిని సద్వినియోగ మొనర్చుకొన వలసిన విధి - మనది.

శ్రీయుతులు - యస్వీ జోగారావుగారి 'భక్తి వాఙ్మయము'- ప్రశస్తమైన రచన. భక్తికి రసత్వ మున్నదా ? లేదా ? అను విచార ములో, జగన్నాథపండితరాయలు కూలంకషముగ విచారించి, 'భక్తిలో రస మేల లేకుండును ?' - అను సిద్ధాంతమునకు వచ్చియు, తుదకు చేతులు తేలవైచిన విషయము- ఈ వ్యాసమున చక్కగ నిరూ పితమైనది. భగవద్రామానుజులు - జ్ఞాన కర్మయోగములు స్వతంత్ర ముక్తి సాధనములు కా వనియు, 'అయ్యవి - భక్తికి అంగములు మాత్రమే' అనియు - తమ గ్రంథములలో నిరూపించియున్నారు. ఇంకను - అనేక విశేషములను తెల్పు భక్తివాఙ్మయమును, భక్త్యతి శయమును నిరూపించినారు - జోగారావుగారు.

శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు - హరినామ కీర్తనా ప్రభావ మును ప్రమాణ పురస్సరముగ నిరూపించినారు. నాస్తికుల భావము లను మార్చివైచి, వారిని హరినామ సంకీర్తనాసక్తచిత్తులుగ జేయ గల వ్యాస మిది. 'అష్టాంగ యోగములు' - అను శీర్షికలో వీరు వ్రాసిన విషయములు - ఎల్లరును గ్రహింపదగి యున్నవి

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు - 'సంఘు సాహి త్యము - వైష్ణవ తత్త్వము' అను వ్యాసమున - తమిళము, అందలి గ్రంథములు, ఆళ్వారుల ప్రాభవాదులు - మున్నగు అనేక అపూర్వ అవశ్య జ్ఞేయ విషయములు వివరింపబడినవి.

శ్రీమాన్ రొంపిచర్ల పార్థసారథి భట్టాచార్యులవారు - 'పన్నిద్దరాళ్వారుల వైభవము' అను వ్యాసములో, ఆళ్వారుల జనన - పాండిత్య - దివ్యప్రబంధ నిర్మాణ విశేషములను వివరించి, పాఠకుల చిత్తములను భగవ ద్భాయ త్తము గావించినారు.

కడపట - 'కవి పండిత పరిచయము' - అను శీర్షికతో - వ్యాస కర్తల ఛాయాచిత్రములతో బాటు - వారి వారి జనన - పఠన - రచనాది విశేషములను - సంపాదక మహాశయులు తెలియజేయుట ప్రశంసనీయము.

ఇట్లు ఈ కౌముది - 'ప్రతిపత్ కళ' నామకమై, చతురస్రముగ శోభిల్లుచు, శ్రీ రామానుజ కీర్తి సౌధమును ప్రతిష్ఠించు చున్నది.

## 2. విదియ

రెండవ భాగములో - (1) శ్రీ వేంకటేశ్వర స్తవ రాజము (2) భాగవత మత వైభవము (3) మోక్ష సాధనములు - ప్రపత్తి దర్శనమ్ (4) పన్నిద్దరాళ్వారులు - నాలాయిర దివ్య ప్రబంధము (5) ఆళ్వారుల భక్తి సిద్ధాంత ప్రాశస్త్యము (6) శ్రీ విష్ణుచిత్తుల కవితా వైశిష్ట్యము - అను ఆఱు రచన లున్నవి.

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారి 'శ్రీ వేంకటేశ్వర స్తవ రాజము' - ప్రశంసనీయము. శ్రీమాన్ - నిడమర్తి కందాడ గోవిందరాజ శ్రీభాష్యకారాచార్యులవారు రచించిన 'భాగవత మత వైభవము' - అను వ్యాసములో - 'భగవంతుడు,

భాగవతులు, భక్తి' - అను భక్తేయము యొక్క స్వరూప స్వభావ మహత్వములు, వానిలోని భేదములు - అనేక శాస్త్ర ప్రమాణము లతో నిరూపితములై, రక్తి, భక్తి, ముక్తి పదములుగా విరాజిల్లు చున్నవి ఈ వ్యాసరాజము నేటి యువకులు సైతము తప్పక అధ్యయ నము చేయదగియున్నది.

'మోక్ష సాధనములు - ప్రపత్తి దర్శనము' - అను వ్యాస ములో శ్రీమాన్ - 'శిరోమణి' చెలమచర్ల రంగాచార్యులుగారు - మోక్ష స్వరూపము, తత్సాధనోపాయము, యోగములు - అను వానిని గూర్చి విపులముగా తెలియచేసియున్నారు.

'నరజన్మ మెత్తిన జీవి సాధించవలసిన ప్రయోజనముల నాల్గింటిలో - ప్రధానము - మోక్ష పురుషార్థము. అనగా, ప్రకృతి బంధ విముక్తి, పరమ పదమున పరమాత్మతో శాటు - సర్వ సౌఖ్యానుభూతియు అందుకు సాధనములు - గీతలో నిర్వచింప బడిన జ్ఞాన కర్మ భక్తి ప్రపత్తులు.

అద్వారకము, సద్వారకము - అని, ప్రపత్తి రెండు విధములు. భక్తికి అంగమైన ప్రపత్తి - సద్వారకము. ఇయ్యది - భక్తునకు గల్గు అవరోధములను నివారించును. భక్తియే అంగముగా గల ప్రపత్తి - అద్వారకము. అదియే శరణాగతి. ఈ నాల్గు యోగముల స్వరూపము లను, వాని ఫలములను - సమగ్రముగ, సప్రమాణముగ నిరూపించి నారు - రంగాచార్యులుగారు.

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారి 'పన్నిద్దరాళ్వా రులు - నాలాయిర దివ్య ప్రబంధము' - అను వ్యాసములో -

ద్రావిడ వేద మని వాసికెక్కిన నాలాయిర దివ్య ప్రబంధ మహత్త్వము, ఆ ప్రబంధములను రచించిన ఆళ్వారుల వైశిష్ట్యము - కనులకు గట్టునట్లు విశదీకరించినారు. 'ఆళ్వార్' శబ్ద నిష్పత్తితో బాటు, వారి రచనలలోని విశేషములను వివరించుచు, 'అరవము తెలియని చదువరులకు - వాని సార మేరీతిగ నైన గ్రహించి తీరవలె' నను ఆసక్తిని కలిగించినారు.

'ఆళ్వారుల భక్తి సిద్ధాంత ప్రాశస్త్యము' - అను శీర్షికతో - శ్రీ జి. టి. గోపాలకృష్ణ నాయుడుగారు - ఆళ్వారుల రచనలలోని ప్రాశస్త్యము, క్షీరార్ణవ మథన జనిత సుధను వలె వెల్లడించుచు, ఆ యా యాళ్వారుల జీవితములలోని భగవత్సంబంధమైన విశిష్ట సన్నివేశములను విశదీకరించి, విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్యమును నిరూపించినారు. మఱియు - ఈ విశిష్టాద్వైత సిద్ధాంతము - 'కులమున కన్న - గుణము మిన్న' యనియు, 'భగవత్సేవ కంటెను భాగవత సేవయే మిన్న' - యనియు, అట్టి భాగవత సేవయే మానవుని సంసార సాగరము నుండి తరింపజేయగల దనియు, ఈ తత్త్వమును ఆళ్వారుల కుల వృత్తులలో దర్శింపవచ్చు ననియు వివరించినారు.

'కళాప్రపూర్ణ - పద్మశ్రీ' ఇత్యాది బహు బిరుద విభ్రాజితులగు శ్రీమాన్ - పుట్టపర్తి నారాయణాచార్యులవారు - 'విష్ణుచిత్తుల కవితా వైశిష్ట్యము' - అను తమ వ్యాసములో - 'పెరియాళ్వారు' అను పేరు వీరికి వచ్చిన కారణమును వివరించుచు, శాస్త్ర గ్రంధము లేని ఈతని యెడ భగవానుని యనుగ్రహము కల్గిన విధమును వివరించినారు.

పాండ్యరాజ సభలో - ప్రత్యర్థి విద్వాంసులను వాదసంగరమున పరాజితుల గావించి, విష్ణుపరత్వమును ప్రమాణ పురస్సరముగ స్థాపించిన విషయమును శ్రీకృష్ణదేవరాయలు - 'ఆముక్త మాల్యద' అను ఆంధ్ర కావ్యములో వివరించినాడు.

యశోదాదేవి తన్మయతను తా మొంది, కృష్ణలాలనాదులను కీర్తించిన విధము, గోపికలు కృష్ణునిపై మోపిన నేరములు - ఈ వ్యాసమున ఉదాహరణ పూర్వకముగా నిరూపింపబడినవి.

ఈ విధముగ - విష్ణు పారమ్య వైశిష్ట్యము, 'విశిష్టాద్వైత తత్త్వ మహత్వము' - అను రెండు అంశములు - ఈ రెండవ భాగమున నిండి, నిబిడీకృతమై యున్నవి.

## 3. తదియ

మూాడవ భాగములో - (1) స్తుతి చందనము (2) ఆళ్వారుల భక్తితత్త్వము (3) పాణయోగి ప్రభావము (4) దశ విధ వైష్ణవులు (5) ఆంధ్ర వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము - అను ఐదు రచనలు కలవు.

శ్రీ చింతలపాటి నరసింహదీక్షిత శర్మగారిచే రచింపబడిన 'స్తుతిచందనము' అను పద్యరచన - మిగుల హృద్యమై, శ్రీనివాస భగవానుని - చందనాను లేపనముతో పరిమళించుచున్నది.

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు - 'ఆళ్వారుల భక్తితత్త్వ' మను వ్యాసమున - ఆళ్వారు లనుసరించిన శ్రవణాది నవ

విధ భక్తిమార్గములను వివరించుచు, ఆళ్వారుల పాశురములను దృష్టాంతములుగా - సర్వగ్రాహ్య మొనర్చినారు.

శ్రీమాన్ కొమాండూరు గోపాలకృష్ణమాచార్యులవారు 'పాణయోగి ప్రభావ' మను పద్య రచనలో - తిరుప్పాణాళ్వారుల అనన్య భక్తి తత్త్వమును, ఆ యాళ్వారులపై ప్రసరించిన శ్రీరంగ నాథుని కృపా విశేషమును అభివర్ణించుచు, తమ 'విద్వత్కవిరాజ' బిరుదమును సార్థక మొనర్చుకున్నారు.

శ్రీ లంకా వేంకట నరసయ్య సూరి గారు - వైష్ణవులలో గల దశ విధ భేదములను, వారివారి భక్తి ప్రపత్తి విశేషములను చిత్తము నకు హత్తుకొనునట్లు వివరించినారు.

అచార్య - కె. వి. ఆర్. నరసింహంగారు - 'ఆంధ్ర వాఙ్మ యము - వైష్ణవ మత ప్రభావము' - అను తమ వ్యాసములో - ఆంధ్ర భాషయందు గల నానావిధ ప్రబంధములలోని విశిష్టాద్వైత మత ప్రభావమును తెలుగు కవులు వ్యక్తీకరించిన విధానమును సోదా హరణముగ నిరూపించి, తమ బహు గ్రంథ పరిశీలనా సామర్థ్యమును వ్యక్తీకరించినారు.

తొలుత అద్వైతులుగా నున్నవారి వంశమున జనించియు - వైష్ణవ దీక్షను స్వీకరించి, శ్రీ వేంకటేశ్వర సంకీర్తనా నిరతులైన తాళ్ళపాక అన్నమాచార్యులయొక్కయు, తద్వంశీయులయొక్కయు కీర్తనములను, అన్యదేవతా విముఖతను, తత్త త్కావ్యములను ప్రక టించిన విధమును - ఈ వ్యాసకర్త - తమ వ్యాసమునందలి 'మాన వుడు - మతము' - అను ఉపశీర్షికలో వివరించినారు.

మతము మార్చుకొనుటలో విశేషము లేదు. విశిష్టాద్వైత మత ప్రచారకులైన శ్రీ రామానుజులకు గురు వగు 'యాదవప్రకాశు' డను అద్వైత సన్యాసి - తన అంతేనాసి యగు రామానుజులతోనే పంచసంస్కారముల నొంది, వైష్ణవ దీక్ష గైకొనుట - చారిత్రక సత్యము.

'శ్రీకృష్ణదేవరాయలు పూర్వమునుండియు - వైష్ణవ సంప్రదాయము గలవారి వంశమునకు చెందినవాడే. తన వైష్ణవ ప్రతిపత్తిని ఆముక్తమాల్యదలో - బహుముఖములుగా ప్రదర్శించినా'డని - నరసింహముగారు విశదీకరించినారు.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన కవీంద్రు డగు అల్లసాని పెద్దన కవీంద్రుడు - మధ్య వైష్ణవుడు. "యథా రాజా తథా ప్రజాః" - అనునట్లు - వైష్ణవమును స్వీకరించినను - పూర్వవాసనలను పారద్రోలు కొనజాలక, తన మనుచరిత్రలో - లక్ష్మీపతితోబాటు - పార్వతీ పతిని, వినాయకాదులనుగూడ స్తుతించినాడు. కాని, కృష్ణదేవ రాయలు - తన ఆముక్తమాల్యదలో - విష్ణువును, ఆ స్వామి ధరించిన ఆయుధములను, ఆళ్వారులను కీర్తించెనుగాని, ఇతర దేవతలను స్మరింపలేదు. ఇదియే సహజమైన 'వైష్ణవ లక్షణము' - అని వివరించుచు -

"జలజదళనేత్ర నీ భక్తజనులతోడ
కలహ మాడెదుకంటె చావు మేలు"

అని - శేషప్పకవిత నుదహరించినారు. ఈ రీతిగా - అనేక గ్రంథములను పరిచయము గావించినారు నరసింహంగారు. కాని, వాని

నన్నింటిని పరామర్శించుట - అలవిగాని పని. కావున, కీర్తి కౌముది లోని ఈ మూడవ కళను ప్రత్యక్షర ముగ పరిశీలించి, ఇందలి విశేషాంశములను గ్రహించుట - పాఠకులకు అత్యంతము ప్రయోజనకరము.

## 4. చ వి తి

ఈ నాల్గవ భాగములో - (1) శ్రీ వేంకటేశ్వర స్తుతి మాలిక (2) పరమార్థ తత్త్వము (3) శ్రీ నమ్మాళ్వారుల వైభవము (4) శ్రీ రామకృష్ణావతారములు - ఆళ్వారుల భక్తివిశేషములు (5) పరకాల విలాసము (6) అనుక్తమాల్యదా సౌరభము - అను ఆఱు రచన లున్నవి.

బహు కావ్య నిర్మాతలై, విద్వత్కవిగా విఖ్యాతి గాంచిన శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులవారి 'శ్రీ వేంకటేశ్వర స్తుతి మాలిక' - ఈ సంపుటమునకు తలమానికము.

నరదేహధారి - విద్యార్జనతో - భవబంధ విముక్తి గావించు కొనవలెనని శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులవారు - 'పరమార్థ తత్త్వము' అను తమ వ్యాసమున వివరించినారు.

**"ద్వే విద్యే వేదితవ్యే, అవిద్యయా మృత్యుం తీర్త్వా, విద్యయా అమృత మశ్నుతే."**

మానవుడైనవాడు - విద్యను, అవిద్యను - రెంటిని నేర్వవలెను. అవిద్యచే మృత్యువును జయించి, విద్యచే అమృత పదవిని పొందవలెను' - అని వేద ప్రబోధము. ఇట - అవిద్య యనగా - లౌకికవిద్య. విద్య యనగా - 'బ్రహ్మవిద్య' అను 'వేదాంత విద్య' - అని తాత్పర్యము.

శ్రీమాన్ - శిరోమణి - టి. కె. వి. యన్, సుదర్శనాచార్యులవారు - నమ్మాళ్వారుల వైభవమును, వారి రచనయైన తిరువాయిమొళియొక్క సర్వోత్కృష్టతను విపులముగా, సామవేద సారముగా వివరించుచు, అనుపనీతులు సంస్కృత వేదమును అధ్యయనము చేయరాదనియు, ద్రావిడ వేదము - సర్వాధికారిక మైనదనియు - పేర్కొనినారు. అదియునుగాక, కర్మ జ్ఞాన భక్తి యోగ ములకంటెను - ప్రపత్తియోగము సర్వజనార్హమైన ముక్త్యుపాయ మనియు, సర్వ సులభ మనియు వక్కాణించుచు, వానిచే - ఐహిక, పారలౌకిక ఫలములను పొందవచ్చునని నిరూపించినారు.

'శ్రీ రామకృష్ణావతారములు - ఆళ్వారుల భక్తి విశేషములు'- అను వ్యాసమున శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు - నాలాయిర దివ్య ప్రబంధములో - ఆళ్వారులు వెలువరించిన విభవావతారుడుగా - రామకృష్ణాది రూపముల దాల్చిన పరమపద నాథునిపైగల భక్తి విశేషమును కనువిందుగా అతి విపులముగ విశదీకరించినారు.

ఆళ్వారుల దివ్య ప్రబంధము లన్నింటిని ఆమూలాగ్రముగ పరిశీలించినవారలకెగాని, అన్యులకు అలవిగాని కృత్య మిది. వాత్సల్య - మధుర - భక్తి భావములను ఆళ్వారులు వెలువరించినరీతు లిట ప్రత్యేకముగ - కృష్ణావతారముపై గల వాత్సల్య - మధుర భక్తిభావములను, తాము యశోదగా, రాధగా తన్మయతను గాంచి, ఆ యానంద మనుభవించిన విధానము - ఈ వ్యాసమున, నిరూపింపబడినది.

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారిచే విరచితమైన 'పరకాల విలాస' మను పద్య ప్రబంధము - కడుంగడు హృద్యముగ శోభిల్లుచున్నది. ఈ యాచార్యులవారు - సంగీత సాహిత్యముల రెంటియందును అరితేరినవారు. కనుకనే -

''గతిభేదములు తాళ గమనమ్ముననెగాని
తలపులం దెంతమాత్రమును లేదు.''

ఇత్యాది పద్యమున - వారి సంగీత - సాహిత్య వైభవము గుబాళించుచున్నది.

"చిరునగవా ? అద్ది వితివిల్లు పాదుషా
తణి మొన ఐద్దించి తాల్చు కత్తి"

ఇత్యాది పద్యమున - నగవుపై ఖడ్గత్వ మారోపింపబడినది. 'మందహాసత్వము చిరునగవా?' అన్న ప్రశ్నతో అపహ్నుతమై, అపహ్నుత్వ లోకోదాహరణ మగుచున్నది.

"శార్దూల మత్తేభ సంపత్తి సత్కవీ
శ్వర కావ్యరీతి కైవసము సేయు"

ఇత్యాది పద్యమున - శ్లేషోత్థాపిత ఉపమా ద్యలంకారము విలసిల్లుచున్నది. ఈ రీతి - పరకాల విలాసమున విరోధాభాస ప్రతీపా ద్యలంకారములు నిండుకొని, ఆలంకారిక ముదాహరణముగ రాజిల్లుచున్నది. శ్రీమాన్ కృష్ణమాచార్యులవారు ఆకంఠ పరిపీత సరస్వతీ స్తన కుంభయుగ నిరర్గళ నిస్సర త్కవోష్ణ పయోధారలు గలవారు కావుననే - ఈ ప్రబంధమును ఇంతటి రసవత్తరముగ రచింపగల్గినారు.

ఇక ఈ ప్రబంధమునందలి విషయ వివేచనములో - నీలుని భాగవతార్చనా విధానము - కంచి వరదునకే ప్రశంసాపాత్రమై, నీలుని ప్రాకృత బంధ విముక్తి నిదానమై, ప్రపన్నులకు మార్గదర్శకమై యున్నది.

తిరుకచ్చూరినంబి సన్నిధిని పంచసంస్కారములను పొందిన వైష్ణవు డయ్యెను, మరల - శ్రీ వరదరాజస్వామి ముఖకమల మరందాయమాన మగు తిరుమంత్రమును ఉపదేశము పొందుట - పరకాలుని భాగ్య విశేష మనియే భావింప నగును.

'ఆముక్త మాల్యదా సౌరభము' - అను వ్యాసమున శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులవారు - ఆముక్తమాల్యదా ప్రబంధములోని విషయములను పద్యశః విభజించి, విషయ వివేచనము గావించుట - గ్రంథమును పారదెంచి చూపించిన ట్లున్నది.

కృష్ణదేవరాయల బహుభాషా పాండిత్యము, చెప్పదలచిన విశిష్టాద్వైత మతానుసారము సూత్రముగా, అనేకాంశములను గుది గూర్చి పాఠకుల కందించుటేగాక, ప్రకృతి పరిశీలనము, వర్ణనా వైలక్షణ్యము, రాజనీతి వైశద్యము, భగవద్భక్తి, సంప్రదాయ పరినిష్ఠితత్వము మున్నగు విషయములను సైతము - సవిస్తరముగ వివరించినారు.

ఆముక్త మాల్యదను పఠించి ప్రభావితుడైన పాశ్చాత్యుడగు బ్రౌన్ పండితుడు - గ్రంథమునందలి పద్యములను అకారాదిగా అనుక్రమణికను రచించినట్లు వివరించుచు, ప్రౌఢమైన ఆముక్త

మాల్యదా సౌరభమునకు కరదీపికల వలె నున్న వ్యాఖ్యాన విశేషములను సైతము విస్పష్టము గావించినారు వీరరాఘవాచార్యులవారు.

## 5. పంచమి

ఐదవ భాగములో - (1) శ్రీ వేంకటేశ్వర స్తుతి (2) ఆళ్వారుల విశిష్ట భావములు (3) శ్రీ కులశేఖర వైభవము (4) ముకుందమాల (ఆంధ్ర వ్యాఖ్యా సహితము) (5) వైజయంతీ వైభవము (6) శ్రీ నాథమునుల వైభవము (7) శ్రీ యామునాచార్య వైభవము (8) శ్రీ విష్ణుచిత్తీయము - వైష్ణవ మతము - అను ఎనిమిది రచనలు కలవు.

శ్రీ వంగవోలు ఆదిశేషశాస్త్రి రచితమైన 'శ్రీ వేంకటేశ్వర స్తుతి' - యను పద్య రచనలో - తిరుమల శ్రీనివాస భగవానుని దివ్య వైభవము - దివ్యముగ, హృద్యముగ - వర్ణింపబడినది.

"నీ నామంబు పఠించినం దలఁగవే నిక్కంబుగాఁ బాపముల్
మా నిద్యం బగు జీవితంబునకు – 'ఫుల్‌స్టా'' పింక పెట్టించి, సు
జ్ఞానానందమయాత్ములన్ సలుప – నీ నామంబు మా జిహ్వలం
దేనాడున్ వసియింపఁ జేయగదె తండ్రీ ! వేంకటేశప్రభూ !" (పుట 3.1)

ఈ పద్యములో - భగవన్నామ ప్రభావము ప్రపంచితమైనది.

"ఏడుం గొండలవాఁడ ! యెదుగడవై యీరేడు లోకాలఁ గా
పాడం గంకణ మూనినట్టి దొర ! నిర్ద్వంద్వాకృతీ ! శ్రీపతీ !
వేదంబోము త్వ దన్యదైవముల, ని న్వేదంగబో మెన్నఁడున్
వేదంబోకుము మమ్ము దీనుల కృపాబ్ధీ ! వేంకటేశ ప్రభూ !" (పుట 5)

ఈ పద్యములో - అనన్య భక్తి స్వరూపము వివరింపబడినది.

"శాంతాకార ! భుజంగశాయి ! సురరక్షా ! పద్మనాభా ! యఘు
ధ్వాంతాదిత్య ! మహా మునీంద్ర ! హృదయ ధ్యానైక గమ్యా ! మన
శ్చింతాదూర ! వినీల వర్ణ ! వర లక్ష్మీకాంత ! యాశాంత వి
శ్రాంతానంత యశోనివేశ ! పరమేశా ! వేంకటేశప్రభూ !" (పుట. 6)

ఈ పద్యము - "శాంతాకారం భుజగ శయనం" - అను శ్లోక మును స్ఫురింపజేయుచున్నది.

"కను లున్నందుకు నిన్నుఁ జూడగల భాగ్యం బబ్బె; పాణిద్వయం
బును గన్నందుకు నీ పదాంబుజ యుగమ్ముల్ గొల్చు భాగ్యమ్ము గ
ల్గెను; జిహ్వంచల మున్నయందులకు నిన్ గీర్తించు భాగ్యమ్ము గ
ల్గెను; మమ్మున్ కరుణించి కావు మిఁక లక్ష్మీ వేంకటేశప్రభూ !" (పుట. 8)

ఈ పద్యము - కులశేఖరాళ్వారుల ముకుందమాలలోని - "జిహ్వే కీర్తయ కేశవం" అను శ్లోక భావమును ప్రస్ఫుటింపజేయు చున్నది. ఇట్లు ఈ పద్య రచన - ఆపాత మధురముగ విరాజిల్లు చున్నది.

'ఆళ్వారుల విశిష్ట భావములు' - అను శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారి వ్యాసములో - భక్తి ప్రపత్తులే మోక్షో పాయము లని ఆళ్వారుల పాశురములలోని ఉదాహరణములతో, సవివముగ నిరూపించినారు.

" గుణాః పూజాస్థానం – గుణిషు న చ లింగం న చ వయః. "

అని - కాళిదాసు వాకొన్నట్లు, గుణ గణములలో - కులము లెక్కింప రానిది. ఏ కులమువా రైనను - భగవ ద్గుణానుసంధానముతో ఆడుచు, పాడుచు - తన్మయుడై, శ్రోతలను, ద్రష్టలను పరవశులను గావించువారు సన్మాననీయులే.

"భాగవతులైనవారల పజ్జ జేరఁ గల్గు యోగంబు; శ్రేయంబు గల్గు దాన."

అని - వరదాచార్యులవారలే యన్నట్లు - భాగవత సత్సంగము - వై రాగ్యాపాదకము. శంకరాచార్యులవారును -

"సత్సంగత్వే నిస్సంగత్వం - నిస్సంగత్వే నిర్మోహత్వమ్
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం - నిశ్చల తత్త్వే జీవ న్ముక్తిః"

అన్నారు. కావున, భాగవత సంసర్గముచేత భౌతిక విషయవాంఛా రాహిత్యము, వారి వచనామృత ధారాస్వాదనముచే భగవ ద్భక్తియు సమకూరు ననియు, దానిచే మోక్షము లభించుననియు తెలుపుచు, ఆళ్వారుల భక్తి భావనా వైశిష్ట్యమును, శరణాగతి మహాత్త్వమును - ఆళ్వారుల పాశురోదాహరణములతో వివరించినారు వరదాచార్యుల వారు.

శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులవారు - 'శ్రీ కులశేఖర వైభవ' మను తమ వ్యాసములో - శ్రీ కులశేఖరుల భగవ ద్భాగవత భక్తిని, అనుదిన రంగయాత్రాఘోషముతో నిరూపించుటె గాక, భగవ దారాధనకన్న, భాగవతారాధన మిన్న; భగవానుడు తన సేవ కన్న, తన భక్తుల సేవ తనకు అధికానంద కరము; తన్ను అలక్ష్యము చేసినను సైచునుగాని, భాగవత తిరస్కా-

రము నిసుమంతయు సైపజాలము' అను విషయములు - భాగవతారాధ నకు, భగవ ద్దర్శన యాత్రకు 'వాయిదాలు' వేయుట - అను నిత్య క్రియతో - నిరూపించినారు.

అదియునుగాక, శ్రీ కుల శేఖరుల లౌకిక సౌఖ్యానుభూతితో బాటు, భాగవతుల నిత్యారాధనలు, సజ్జన సాంగత్యముతో లౌకిక సౌఖ్య నిర్లిప్తత, 'రాముని భార్య యగు సీతను రావణాసురుడు హరించినా' డన్న పురాణ వార్తా శ్రవణముతో - కుల శేఖరులు రావణ సంహారార్థము సకల సైన్యమును సన్నద్ధము గావించుటకు ఉద్యుక్తుడైన తన్మయత్వము - కన్నులకు కట్టునట్లు విశదీకరించినారు. కుల శేఖరుల జీవితము - నరరూప దేహ ధారులకు ఆదర్శప్రాయము.

శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులవారు - ఉభయ భాషలందే గాక, ఉభయ వేదాంతము లందును దిట్టలు. అట్టి వీరు - శ్రీ కుల శేఖరాళ్వారులు సంస్కృత భాషలో 'ముకుందమాల' అను పేర స్తోత్ర గ్రంథముగా రచించిన నలువది (40) శ్లోకములకును, తెలుగులో - సులభసుందరమైన శైలియందు - తాత్పర్య విశేషార్థము లను హృదయంగమముగా రచించినారు. ఈ వివరణము - పాఠకులకు ఆనంద సంధాయక మగుననుట - అతిశయోక్తి కాదు.

భగవద్భక్తి పొంగి, పొరలి, కుల శేఖరుల ముఖ కమలము నుండి - 'ముకుందమాల'గా - ప్రసరించినది. ముకుందమాలలోని ఒకటి - రెండు శ్లోకములనైనను - కంఠగతముగాని వైష్ణవు డుండడు. కాని, ఈనాటి యువకులకు - ఆ భాషా సౌందర్యమును అవగతము

జేసికొను శక్తి సామర్థ్యములు లేవు. అట్టి వారికి - అప్పలాచార్యుల వారి వివరణము - అత్యంతము, ఉపయుక్త మగును.

'విప్రనారాయణ', 'భక్తాంఘ్రిరేణువు' - అను నామాంతరములు గల్గు తొండరడిప్పొడియాళ్వారుల మధుర గాథను - 'వైజయంతీ వైభవ' మను పేర, కమనీయ కావ్యముగ - పద్య గద్యములలో రచించినారు - శ్రీమాన్ కొమాండూరు గోపాలకృష్ణమాచార్యులవారు.

"మ్రొక్కన, నెవ్వ రేమడు, మో మటు పెట్టక చక్కఁబోయె; నే
దిక్కును జూడ డాయె, నొక దీవన మాటయు నాడ డాయె; వీ
డెక్కటి వైష్ణవుండు ? మన మేటికి మ్రొక్కితిమమ్మ యమ్మరో ?
నెక్కొని వెఱ్ఱి బుద్ధిమెయి నిద్దురవోయినవాని కాళ్ళకున్?"

అను - సారంగు తమ్మయ కవి పద్యమును -

"వారక వైష్ణవుం డితఁడు - వచ్చిన కార్య మదేమి యంచుఁ దాఁ
బేరఁగ జీరి వాకొనఁడు; చిన్నెల వన్నెలనైనఁ జూడ 'దే
కోరిక లేనివా డితఁడొకో !' యను మాడ్కి నినున్నవాఁడు, వీఁ
డారయ భీష్ముఁడో ? శుకుఁడొ ? యర్జునుఁడో ? తెలియంగరా దిటన్"
(148 పుట)

అను - గోపాలకృష్ణమాచార్యులవారి పద్యమును - సమాలోకించినచో - పాత్ర చిత్రణమున ఇరువురు దేవ దేవులకును చాల భేదము కానవచ్చుచున్నది. ఏమన ? -

తమ్మయకవి దేవదేవి - 'పెద్దలు, పూజ్యులు' - అని నమస్కరించి, వారి దీవెనల నాసించినది. దీవింపకున్నను, ఆదర మేదుర

దృక్కులతో కటాక్షించినను - తనివి నందు స్వభావ మామెయంచు కానవచ్చుచున్నది. కాని, కృష్ణమాచార్యులవారి దేవదేవికి - తన అంద చందములను తిలకించి, పులకించి, తల యూచి, చిరు నగవుల పల్లవింపవలె నని కోరిక.

"నిద్ర వోయిన కాళ్ళకు మ్రొక్కినట్లు, ప్రావంచిన వ్యవహార మెరుగనివానికి మ్రొక్కుట - దండుగ" - అను దేవదేవికి :-

"నీ వేమి జితేంద్రియుడవా ? చూతము నీని బింకము !"

అను దేవదేవికిని గల తారతమ్యము సహృదయ హృదయైక వేద్యము.

'తవిరుటాకుల మేతఁ దనరు కోయిల కూత
ముసరు తేఁటుల మ్రోత వెసక మెసఁగ' -(186 పుట.)

ఇత్యాది అలతి యలతి తేట తెలుగు పదములతో - అనుప్రాసలతో రాణించు రచనలే గాక,

"ఆంత లతాంత కాంత సముదాంత విజృంభిత చండ భాస్కరో
ద్ధ్వాంత నితాంత వహ్నికణత ప్త మహాగజయూధ గాహిత
ప్రాంత సరోవరాంతరము, భానుకరానల శుష్కతంబు, శు
క్రాంత రుషంబు - గ్రీష్మ మతి భాసుర మయ్యె వనాంతరంబుసన్"
(187 పుట)

అను సంస్కృత వ్యాదీర్ఘ సమాస గుంఫిత ప్రౌఢ పద భ్రాజిష్ణు రచనా విలాసములను సైతము - చెడజల్ల గల దీ కవిశేఖరుని లేఖని.

దేవదేవియొక్క కపట నాటక విలాసములతో విలసిల్లునట్టి యీ మధుర ప్రబంధము - పాఠకులకు ప్రమోదమును గూర్చినదియై యున్నది.

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారి 'నాథ మునుల వైభవ' మను వ్యాసము - వైష్ణవ హృదయు లెల్లరకును అవశ్య పఠనీయము.

నేటి కాలమున - 'మాతృ దేవో భవ, పితృ దేవో భవ' - అను పదములకే తాత్పర్యము తెలియరానపుడు, ఇక - 'ఆచార్య దేవో భవ !' - అను వాక్యము తలపున కవకాశ మెచ్చట ? తమ పితామహ ప్రపితామహుల స్వరూప స్వభావములు తెలియని నేటి యువతకు - ఆచార్య పరంపర చరిత్ర తెలియవలయు ననెడి ఆస్థ - అరుదు. అది కలవారికి చెప్పువారును అరుదే.

రక్త - మాంస - అస్థి మయ మగు శరీర ప్రాప్తికి కారణ మైన మాతా పితరుల కంటెను అజ్ఞాన ధ్వంసక - జ్ఞాన దాత యైన గురువు - మానవునకు పరమోపకారకుడు.

> "గు' శబ్ద స్త్వంధకార స్స్యాత్ 'రు' శబ్ద స్తన్నిరోధకః
> అంధకార నిరోధిత్వాత్ - గురు రి త్యభిధీయతే.''

'గు' - అనగా - అంధకారము. 'రు' - అనగా, నిరోధము - అని తాత్పర్యములు. అజ్ఞాన మను అంధకారమును పారద్రోలు నతడు గురువు అని - దీని సారాంశము.

> "లక్ష్మీనాథ సమారంభాం - నాథ యామున మధ్యమామ్
> అస్మదాచార్య పర్యంతాం - వందే గురుపరంపరామ్.''

అనునట్లు, లక్ష్మీనాథుడు - అప్రత్యక్ష గురువు. నాథమునులు - మంత్రోపదేశికులైన ప్రత్యక్ష గురు శేఖరులు; ముక్తిమార్గోపదేశి కులు; మన పూర్వులకు - మంత్రత్రయోపదేశికులు. అంతియ గాక, లుప్తప్రాయమైన నాలాయిర దివ్య ప్రబంధ సంపాదకులు. వారి సంతత కృష్ణానుచింతనము - సర్వులకు శ్రీరామ రక్ష. మహనీయు లైన అట్టి నాథమునుల చరితము - ఈ పంచమ కళలో - విజ్ఞాన దాయకమై, విరాజిల్లుచున్నది.

దానికి తోడైనదే యామునాచార్య చరిత్ర. శ్రీమాన్ కె. వి. వి. యల్. నరసింహచార్యులవారు - 'శ్రీ యామునాచార్య వైభవము' అను వ్యాసమునందు, 'నాథ - యామున మధ్యమామ్'' అను నట్లు, వైష్ణవ మాత్రమునకు ఆచార్య పరంపరలో చేరిన శ్రీ యాము నాచార్యులవారు - తమ గురువైన భాష్యభట్టరు సన్నిధిలో - విద్యాభ్యాస కాలమునందే - "విద్యా దదాతి వినయం" - అను నానుడికి భిన్నముగా, పాండిత్యమును గడించియు, గర్వగ్రంథియైన 'అక్కి-యాన్' - పండితులనుండి పాండిత్య శుల్కమును 'వసూలు' చేయుటను సైపలేని శ్రీ యామునాచార్యులు, భటులు తెచ్చిన పన్ను 'తాఖీదు' పత్రమును చించిపారవైచి, 'పన్ను కట్టుటకు యథా జాతు లిందెవరును లేరు - పొండని - భటులను ధిక్కరించినారు. అపుడు భటులు - 'నీ వేమి పండితుడవా ? కవివా ? రాజుగారి ఆజ్ఞా పత్రమును చించితి వేల ?' అని ప్రశ్నింప, అపుడు యామునా చార్యులు -

"కాము కవిమాత్రులము మేము, కాము తంత్ర
పారగులుమాత్రమే; దుర్నివారమత్త

పండితానేక వాదోపవారణాంకు
శాయితాఖండ పాండితీకొండు లేము."

— (నా 'యతిరాజీయము')

అని వ్రాసి పంపిన - గుండె దిటవు గల - గండర గండడు యామునా చార్యులు.

అంతియగాక, రాజసభ యందు - లౌకిక శాస్త్ర వాదము లతో - వ్యాకోచ ప్రతిభా సమార్జిత సమస్తాశా ద్విపశ్చిద్వారా నీకుండైన' అక్కియాళ్వానును నోరెత్తనీయక, మూగగా నొనర్చిన ప్రతిభావ్యుత్పత్తి సంపన్నులు యామునాచార్యులు. ఈ పంచమి కరలో - కడపటిది - 'విష్ణుచిత్తీయము - వైష్ణవ మతము' అను వ్యాసము - శ్రీ దివాకర్ల వేంకటావధాని విరచితము.

ఇందు - శ్రీకృష్ణదేవరాయల విశిష్టాద్వైత తత్త్వ పారంగత త్వము సువ్యక్తము గావింపబడినది. ప్రధాన కథ - గోదా కల్యాణమే యయ్యును - విశిష్టాద్వైత తత్త్వ వివరణమునకు కారణమును కల్పిం చుకొని, ఖాండిక్య కేశిధ్వజాది గాథలు - అందు గుదిగూర్చబడిన వని నిరూపింపబడినది.

రాజసభయందు విష్ణు పరత్వ ప్రతిపాదనము సమమె యైనను, విష్ణుచిత్త - యామునుల లిరుదిలో గల తారతమ్యమును వెల్లడించి, 'పాండిత్యమునకన్న - భక్తి మిన్న' - అన్న యాథార్థ్యమును వ్యక్తము గావించినారు అవధానిగారు.

ఆముక్తమాల్యదా పాఠకులు గ్రహింపవలసిన విషయము లనేకము లిందు ప్రతిపాదింపబడియున్నవి.

## 6. షష్ఠి

ఈ ఆఱవ భాగములో - (1) శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము (2) ఆళ్వారుల తాత్త్వికదృక్పథము (3) శ్రీ రామానుజావతరణము (4) శ్రీ రామానుజ యుగము - నాటి సాంఘిక పరిస్థితులు (5) శ్రీమద్రామానుజులు - శ్రీ వేంకటాచలము (6) శ్రీ రామానుజ వాఙ్మయము - త ద్విశేషము - అను ఆఱు రచన లున్నవి.

పూర్వము - ప్రతివాది భయంకర అణ్ణన్‌స్వామి - శ్రీ వేంకటేశ్వర సుప్రభాత స్తోత్రమును సంస్కృత భాషలో రచింప, ఇపుడు ఆ వంశీయు లగు వేదాంతాచార్యులవారు ఆంధ్రీకరించిన శ్రీ వేంకటేశ్వర సుప్రభాత స్తోత్రము - ఈ ఆఱవ భాగారంభమున ప్రకటింపబడి, భక్తిప్రబోధకమై, పాఠకులను ఆకట్టుకొనుచున్నది.

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు - 'ఆళ్వారుల తాత్త్విక దృక్పథ' మను వ్యాసమున - భక్తి ప్రపత్తులతో పరమాత్మ స్వరూప స్వభావములను తెలియవచ్చు నని - సోదాహరణముగ నిరూపించినారు.

శ్రీ గూడ సుందరరామయ్యగారు - 'శ్రీమద్రామానుజులు - నాటి సాంఘిక పరిస్థితులు' అను వ్యాసమున, భగవద్రామానుజుల కంటెను పూర్వము గల సాంఘిక పరిస్థితులను, శ్రీ రామానుజులు ఈ లీలా విభూతిలో వేంచేసియున్నపుడు గల సాంఘిక పరిస్థితులను, అనంతర కాలమున సంభవించిన పరిణామములను - వివరించియున్నారు. ఇయ్యది - అభినందనీయము.

'శ్రీమద్రామానుజులు - శ్రీ, వేంకటాచలము' అను వ్యాసమున — శ్రీమాన్ టి. కె. వి. యన్. సుదర్శనాచార్యులవారు - శ్రీమద్రామానుజులు - 'తిరుమల క్షేత్రము వైష్ణవమే' యని నిరూపించి, ఆ క్షేత్రమున వేంచేసియున్న శ్రీనివాస భగవానునకు శంఖ చక్రములను ధరింపజేసి, అట - అనేక కట్టడుల నేర్పరచిన వృత్తాంతములను విశదీకరించినారు.

'శ్రీ రామానుజ వాఙ్మయము - త ద్విశేషము' - అను వ్యాసములో శ్రీమాన్ విశాఖ్రిల శేషాచార్యులవారు - ఉపనిషత్తులలో, పురాణేతిహాసాదులలో వర్ణింపబడియున్న శ్రీ రామానుజ అవతార విశేషాదులను వివరించినారు.

## 7. స ప్త మి

ఈ యేడవ భాగములో - (1) శ్రీనివాస స్తుతి (2) దివ్య ప్రబంధములు - సంగీత సాహిత్యములు (3) శ్రీ రామానుజ వైభవము (4) శ్రీమద్రామానుజోదాహరణము (5) శ్రీమద్రామానుజులు - విశిష్టాద్వైతము (8) శ్రీ రామానుజ స్తుతి - అను ఎనిమిది రచనలు కలవు.

"శ్రీ రమణీ మనోహర ! విశేష దయారస భాసురా ! మహో
దార గుణాకరా ! ప్రథిత ధార్మిక సువ్రత తత్పరా ! దరా
భార సమాపనోదన శుభప్రకరా ! పరిపూర్ణ నిత్య కౌ
మార కళా రమాధర ! నమ స్సుమనస్సులు వేంకటేశ్వరా !"

అను - శ్రీమాన్ బృందావనం రంగాచార్యులవారి 'శ్రీనివాస స్తుతి' పద్య రచనతో - ఈ సంపుటము ఆరంభమై,

''ముద్దు మొగంబు, కెంజిగురు మోవి, దయారస మొల్కు కన్నులున్,
నిద్దపు జెక్కులున్, వనిది నిగ్గులు దేఱెడి మేను, బాగుగా
దిద్దిన యూర్ధ్వపుండ్రములు, తెల్లని జన్నిదమున్, త్రిదండమున్,
తద్దయు నొప్పు చిన్ని సిగ దాల్చిన మా యతిరాజు గొల్చెదన్.''

అను - పూర్వకవి విరచిత మగు భగవ ద్రామానుజ స్తుతి పరమైన పద్యముతో ముగియుట - విశేషము.

'దివ్య ప్రబంధములు - సంగీత సాహిత్యములు' - అను శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారి వ్యాసమున - ద్రావిడ దివ్య ప్రబంధములు ఏ యే రాగ తాళములతో నిబంధింపబడిన వియో, ఆ యా విశేషములు సవిస్తరముగా విసరింపబడినవి. మఱియు - ఆళ్వారులు తమ భావములను తాముగాను, ఇతర పాత్రల మూలముననను - వెల్లడించుట - అను రెండు పద్ధతులను అనుసరించి నట్లు తెలుపబడినది.

ఆళ్వారులు ప్రబంధములను మహా కావ్యములుగ మాత్రమేగాక, ఖండకావ్యములుగ సైతము రచించుటకు కారణము - ప్రబంధములందు ఏక నాయకత్వము గల ఇతివృత్త ముండుటయే. వివిధములైన భావములను, శృంగార - విషాద - ఆవేదనాదులను ప్రదర్శించుటకు తగిన యవకాశము లేనందునను, ఖండ కావ్యములలో స్వేచ్ఛగా - తమ భావములను వ్యక్తీకరించుటకు తగిన అవకాశ ముండుట - అను అంశములు ఈ వ్యాసమున వరదాచార్యులవారిచే - సోదాహరణముగ వివరింపబడినవి.

శ్రీమాన్ - కందాడై శ్రీనివాసాచార్యులుగారు రచింప, శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులుగారు పరిష్కరించిన 'శ్రీ రామానుజ వైభవము' అను వ్యాసము - నవరసభరితముగ, ఒక వచన కథా కావ్యముగ రాణించుచు, భగవద్రామానుజుల పవిత్ర చరిత్రాంశములను వివరించుచున్నది.

శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులుగారు రచించిన 'శ్రీమద్రామానుజోదాహరణము' - అష్ట దళములతో గూడిన కవితా ప్రసూనము —

"యతిరత్నంబవు నీవు - నిన్ను గొలుతున్ - ప్రేమ ప్తించు నీచేత స
ద్గతి - నీకై కృతు లిత్తు - నీవలన చేతఃప్రీతి సంధిల్లు - శ్రీ
పతి నీకుం గడు గూర్చువా డగుట సంప ద్వృద్ధి నీయందు - సు
వ్రత ! రామానుజ ! మమ్ము నేలుకొనుమీ ! స్వామీ ! నమోవాకముల్."

అను - సార్వవిభక్తికముతో విరాజిల్లుచున్నది.

'శ్రీమద్రామానుజులు - భక్తి తత్త్వము' - అను వ్యాసమున, శ్రీమాన్ చింటాపట్టణం శ్రీరంగాచార్యులవారు - భగవద్రామానుజుల అనంత కల్యాణ గుణాకరత్వమును, పరత్వ భావత్వములను, జగజ్జననాది కర్తృత్వాదులను - శ్రీమద్రామానుజ గ్రంథములాధారముగ నిరూపించినారు.

'శ్రీ యతిరాజ వైజయంతి' - అను పద్య రచనలో శ్రీమాన్ తిరుమల నరసింహాచార్యులుగారు - యతిరాజుల చరితము - మతిమంతులకే అలవి కాని దనుచు, ఆ యతిరాజుల వైభవమును కమనీయముగ వర్ణించినారు. మఱియు,

"మతములలో రామానుజ మత మనుపమ సాత్త్వికమ్ము, మంజుల మెన్నన్
మత సామరస్య మహిత మ్మతుల నయ విశేష విహిత మానందముగన్.

రామానుజ మతమే సాత్త్వికమైన దనియు, మత సామరస్యము గల దనియు, ఆశ్రయించినవారికి ఆనందమును చేకూర్చునదియునై యున్న దనియు - కమనీయముగ వర్ణించినారు.

శ్రీమాన్ కె. లక్ష్మీనరసింహాచార్యులవారు రచించిన 'శ్రీమద్రామానుజులు - విశిష్టాద్వైతము' - అను వ్యాసము - సర్వోపనిషత్సార మనదగినది. ఈ వ్యాసమున - చిద చిదీశ్వర తత్త్వ యాథార్థ్యము - కన్నులకు గట్టినట్లు నిరూపింపబడినది. ఈ భాగమున కిది - తలమానిక మనదగియున్నది.

## 8. అష్టమి

ఈ ఎనిమిదవ భాగములో - (1) శ్రీ వేంకటాద్రీశ్వర స్తుతి (2) దివ్య ప్రబంధ నీరాజనము (3) భగవ ద్విషయము - త ద్విశేషము (4) శ్రీ రామానుజ దర్శనము (5) శ్రీ రామానుజ నవరత్నములు (6) శ్రీమద్రామానుజులు - యోగవిద్యా రహస్యము (7) ధనుర్మాసు (8) తిరునామములు - వైష్ణవ తత్త్వము - అను ఎనిమిది రచనలు కలవు.

"శ్రీకాంతా కుచ కుంకుమాకింత తను శ్రీగంధ సౌగంధ శో
భా కాం త్యుజ్జ్వల దివ్య మంగళ గళ వ్యాకీర్ణ మాధుర్యతా
నీక శ్యామల దివ్య పుష్ప తులసీ నిక్షిప్త మాలాధరా !
స్వీకార మ్మొనరించు నా నతు లివే ! శ్రీ వేంకటాద్రీశ్వరా !"

అను శ్రీ వేంకటేశ్వర స్తుతితో ఆరంభమైన ఈ అష్టమ కౌముదిలో - అనంతర రచన - 'దివ్య ప్రబంధ నీరాజనము' - శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారిది. ఈ వ్యాసములో - నాలాయిర దివ్య ప్రబంధమునందు - ఏ యే భాగములు ఏ యే సమయ సంద ర్భములందు అధ్యయనము చేయబడుచున్నవో, ఆ యా వివరములు తెలుపబడినవి. మఱి యింకను యీ వ్యాసములో - అనంతర భక్తి సంప్రదాయములపై - ఈ ద్రావిడ దివ్యప్రబంధ ప్రభావ విశేష ములు వివరింపబడినవి.

"భగవ ద్విషయము - త ద్విశేషము" అను వ్యాసమున శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులవారు - నమ్మాళ్వారులచే ద్రవిడ భాషలో రచింపబడిన 'తిరు వాయి మొళి' దివ్య ప్రబంధ ప్రశ స్తిని గుఱించి వివరించుచు, సంస్కృత వేదము కేవలము ద్విజులకు మాత్రమె ప్రవచనార్హత కలిగియున్నదనియు, ద్రావిడ వేదము అట్లు గాక, సర్వులకును అధ్యయనార్హమై యున్నదనియు - వివరింపబడినది.

శ్రీమాన్ తట్టా విజయరాఘవాచార్యులుగారు - 'శ్రీ రామానుజ దర్శనము' - అను తమ వ్యాసమున, త త్త్వ హిత పురు షార్థముల స్వరూప స్వభావములను సప్రమాణముగ వివరించుచు, అద్వైత సిద్ధాంతమును నిరాకరించినారు.

'శ్రీమద్రామానుజులు - యోగవిద్యా రహస్యము' - అను వ్యాసమున - శ్రీమాన్ చించాపట్టణం శ్రీరంగాచార్యులుగారు - యోగ త త్త్వమును, యోగ విషయమున పతంజలి - రామానుజుల

భిన్నాభిప్రాయములను విశదీకరించుచు, భక్తశిఖామణు లగు ముముక్షువులు - సర్వాంతర్యామి యగు పురుషోత్తముని దివ్య కటాక్షములకు పాత్రులు కాగల రని - శ్రీభాష్య, గీతాభాష్య ప్రమాణములతో నిరూపించినారు.

శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్యగారు - రసిక జన మనోరంజక ముగ - హేమాంగీ ధనుర్దాసుల శృంగార లీలా విలాసములను, అనం తర భగవ ద్భాగవత ప్రపణతను - హృదయము ద్రవించి ఆనంద బాష్పముల రాల్చునట్లు కవితా ఝరిని ప్రవహింపజేసినారు. 'ధనుర్దాసు' కావ్యములో, తప్పక పఠింపదగిన మధుర కావ్య మిది.

శ్రీమాన్ - కిడాంబి నరసింహాచార్యులుగారు - 'తిరునామ ములు - వైష్ణవ తత్త్వము' అను వ్యాసమున - తిరునామములు కథాత్మక, భావాత్మకములుగా ద్వివిధములుగ నుండుననియు, కథా త్మకములైన తిరునామములలో - భాగవతోత్తముల వృత్తాంతములు; భావాత్మకములైన తిరునామములలో - శ్రీవైష్ణవ మత తత్త్వ విశేష ములును వివరింపబడియుండుననియు తెలుపుచు, ఈ రెండు విధానము లను పేర్కొనియున్నారు.

## 9. నవమి

ఈ తొమ్మిదవ భాగములో - (1) శ్రీనివాస స్తవము (2) శ్రీమద్రామానుజులు - వేదార్థ సంగ్రహము (3) భగవద్రామాను జులు - శ్రీభాష్యము (ప్రథమాధ్యాయము) (4) భగవద్గీత - రామానుజ దర్శనము (5) యతిరాజ సప్తతి (6) శ్రీ రామానుజీయ

మనో భావన (7) శ్రీ రామానుజ తారావళి (8) శ్రీవైష్ణవ మత వైశిష్ట్యము (9) అన్నమాచార్యులు - సంకీర్తన వాఙ్మయము - అను తొమ్మిది రచనలు కలవు.

"శ్రీమ త్సప్తాద్రివాసం శ్రితజన వరదం స్నిగ్ధ భావ ప్రసన్నం
కల్యాణానాం నిదానం - కలిమల శమనం - కంజపత్రాయతాక్షమ్
అర్మే ల్మంగావధూటీ ప్రణయ మధుసర స్సంచర ద్రాజహంసం
సేవే భక్త్యా, ప్రపత్త్యా - స్మితముఖ కమలం - శ్రీనిధిమ్ వేంకటేశమ్"

అను - శ్రీమాన్ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులవారి 'శ్రీనివాస స్తుతి' పద్య రచనతో - ఈ తొమ్మిదవ భాగ మారంభమైనది.

'శ్రీమద్రామానుజులు - వేదార్థ సంగ్రహము' - అను వ్యాసమున శ్రీమాన్ భట్టా విజయరాఘవాచార్యులుగారు - జీవ - ఆత్మ - పరమాత్మల స్వరూప స్వభావములను వివరించుచు, "తత్త్వ మసి", "అయ మాత్మా బ్రహ్మ" - అను అద్వైత ప్రతిపాదకము లగు ఉపనిష ద్వాక్యములకు - ఘటకశ్రుతులచే నేర్పడిన అపృథ క్సిద్ధ శరీర - శరీరి భావములతో ఏకత్వమును వివరించినారు.

'భగవద్రామానుజులు - శ్రీభాష్యము' - అను వ్యాసమున - శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారు - వ్యాస రచితము లగు బ్రహ్మసూత్రములకు - బోధాయన వృత్తి ననుసరించి వ్రాసిన శ్రీభాష్యము నందలి ప్రథమాధ్యాయములోని నాల్గు పాదములలో గల యంశములను విశదము గావించుచు, జీవునకు పరమాత్మవిచార మావశ్యక మనియు, జగ జ్జననాది కారణము ప్రకృతి కాదనియు నిరూపించి, పరమాత్మయే భవబంధ విముక్తికి ఉపాసింపదగినవాడని విశదము గావించినారు.

వాదములతో జటిలమైన సంస్కృత సూత్రభాష్యము సర్వ గోచరము కాదని భావించి, సులలిత పద జాలముతో — ప్రతిపాదింప నెంచిన యంశము సర్వ వేద్య మొనర్చినారు అప్పలాచార్యులవారు.

'భగవద్గీత — రామానుజ దర్శనము' — అను వ్యాసమున తెలికిచెర్ల కందాడ గోపాలాచార్యులవారు — రామానుజ దర్శనము లోని ఇరువది రెండు (22) విశేషములను వివరించుచు, 'తత్త్వత్రయ స్వరూప స్వభావములు, శ్రీమన్నారాయణుడే పరతత్త్వము - ఇత్యాది విషయములను విశదీకరించి, సాధన భక్తికి - ఆత్మ పర మాత్మజ్ఞానము, భగవ దాజ్ఞా పరిపాలన రూప మగు కర్మము - అంగము కావున, అయ్యది సర్వాధికారము కాదనియు, ప్రపత్తి సర్వముక్తిప్రద మనియు, రామానుజ దర్శన విశేషములను భగవ ద్గీతోదాహరణములతో స్పష్టము గావించినారు.

శ్రీమాన్ - డి. టి. తాతాచార్యులవారు సంస్కృతమున వ్రాసిన వ్యాసమును - శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజా చార్యులవారు - 'శ్రీ రామానుజీయ మనోభావన' అను శీర్షికతో ఆంధ్రీకరించుచు, నిష్కామ కర్మానుష్ఠానమున - భగవద్రామానుజుల బోధలను పాటించువారలే - ఇతరులకు బోధించు అర్హత గలవారగుదు రనియు, ఆత్మానుష్ఠానము లేనిదే బోధనకు అర్హత ఏర్పడ దనియు తెగజెప్పినారు.

'శ్రీవైష్ణవ మత వైశిష్ట్యము' - అను వ్యాసమున శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు - అవైదిక వైదిక దర్శనములను,

వాని ఉపాదేయత్వ - త్యాజ్యములను - సప్రమాణముగ వివరించి నారు. విశిష్టాద్వైతాది వైదిక మత స్వరూప స్వభావములను, రామానుజ మత నైశిష్ట్యమును - శ్రుతి స్మృతీతిహాస పురాణ ఆగమ గ్రంథాది ప్రమాణములతో నిరూపించుచు, కడపట ప్రత్యేక ముగ - 'శ్రీ వైష్ణవ మతము - పదార్థ విభాగము' - అను శీర్షికతో ఒక ప్రత్యేక పత్రమును (చార్టును) పొందుపరచుట విశేషము.

శ్రీమాన్ బృందావనం రంగాచార్యులుగారు - అన్నమా చార్యుల సంకీర్తనలలో గల సరసతా ప్రౌఢిమలను, లాలిత్య - గాంభీర్యములను, తీక్ష్ణతా సౌకుమార్యములను, సొంపు పెంపులను, ఆవేదనానందములను - భక్తి భావ బంధురముగా వివేచించినారు.

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు సంస్కృతమునుండి అనువదించిన 'యతిరాజ సప్తతి' యను పద్య రచనము, శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులవారు రచించిన 'శ్రీ రామానుజ తారావళి' యను పద్య రచనయు, కమంగము హృద్యములై, భగవద్రామానుజుల వైభవ ప్రాభవాదులను అభి వర్ణించుచున్నవి.

## 10. దశమి

ఈ పదియవ భాగములో - (1) శ్రీ పద్మావతీ శ్రీనివాస స్తుతి (2) లక్ష్మీ పురుషకార వైభవము (3) శ్రీమద్రామానుజులు - వారి కృతిరత్నములు (4) శ్రీమద్రామానుజులు - ఉపనిషత్తులు (5) శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యము (ద్వితీయాధ్యాయము)

(6) శ్రీమద్రామానుజులు - గీతా భాష్యము (7) గీతా రహస్యము (8) విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యము (9) శ్రీ రామానుజ ప్రశస్తి (10) శ్రీవైష్ణవ మతము - శ్రీ పాంచరాత్ర వాఙ్మయ ప్రభావము (11) శ్రీపాంచరాత్ర ప్రాశస్త్యము (12) వివిధ సంప్రదాయములు - వైష్ణవ మత ప్రభావము - అను రచనలు కలవు.

శ్రీమాన్ ఆసూరి మరింగంటి పురుషోత్తమాచార్యులవారి 'పద్మావతీ శ్రీనివాస స్తుతి'తో ఆరంభమైన దీ భాగము. పురాణ దంపతు లిరువురిని వేర్వేరు పద్యములలో - హృద్యముగా స్తుతించుట - ఇందు విశేషము. మచ్చుకు - రెండు పద్యములు :-

"శ్రీవక్షోరుహ కుంకుమాంకిత లసత్ శ్రీవత్స వక్షస్థలా !
భావోన్మీలిత భక్తపాలనకళా ! భవ్య ప్రపన్నోజ్జ్వలా !
గ్రావోగ్రీకృత దుష్టదృప్తజన శిక్షా దక్ష దీక్షాంచలా !
గైర్వేయ మ్మిది స్వీకరింపుము శుభాంగా ! శ్రీనివాస ప్రభూ !"

"సారమ్ముం గనలేని స్వాంతమున నస్తధ్వస్త విధ్వస్త సం
సారమ్మందున మున్గిపోవు జనులన్ సాకంగ దివ్య త్కృపా
పారమ్యం బగు వీక్షణామృతమునన్ బాధా సహస్రమ్ములన్
పారంద్రోలెడు తల్లి ! గైకొనుము కై వారమ్ము పద్మావతీ !"

అని యిట్లు పద్మావతీ శ్రీనివాసులను స్తుతించుచు, కడపట -

"పారావార పరంపరం బరగు మీ ప్రజ్ఞా దురీణాత్వమే
ధారావాహిక రూప సంకలిత తత్త్వజ్ఞాన దృక్సారులౌ
సారాచార విచార వైష్ణవ కళా సంపన్న సర్వస్వ మీ
శ్రీ రామానుజ కీర్తి కౌముది కివే శీర్షా నతా ఞ్జలుల్."

అను శ్రీ రామానుజ కీర్తి కౌముదీ ప్రశంసతో - తమ పద్య రచ నను ముగించినారు - పురుషోత్తమాచార్యులవారు.

పరమాత్మ - తన కృపకు పాత్రులైన జీవులను - తన నిత్య విభూతిలోనికి గైకొనిపోయి, సర్వ సుఖముల ననుభవింపజేయు ననియు, ఐహిక సౌఖ్యాలాసతతో, అకృత్యకరణ - కృత్యాకరణము లకు పాల్పడిన జీవులను ధర్మ రక్షణకై శిక్షింపకమానడనియు, కావున - లక్ష్మి పురుషకారముతో ఆ జీవుడు భగవ దనుగ్రహ పాత్రుడై, సకల సుఖములు పొందగల డనియు, ఇందుచే ప్రతి జీవుడు లక్ష్మిదేవిని ఉపాసించి, ఆమె యనుగ్రహమును పొంది, ఆ జగన్మాత ద్వారా - పరమాత్మ కృపకు పాత్రుడు కావలె ననియు, అట్టి లక్ష్మి పురుషకార ప్రభావము - మహత్తరమైన దనియు - శ్రీమాన్ తట్టా విజయరాఘవాచార్యులవారు - లక్ష్మి పురుషకార వైభవ మను వ్యాసమున - వివరించినారు.

శ్రీ రామానుజులవారును శరణాగతి గద్యలో - శ్రీనివాస భగవానుని శరణు చేయుటకు ముందు - శ్రీదేవిని శరణాగతి చేసి యుండుటచే, భక్త ప్రపన్నులును - ఆ రీతినే అనుసరించుచు, లక్ష్మి దేవిని ముందుగా స్తుతించి, అనంతరము - నారాయణుని స్తుతించుట - కర్తవ్యమైయున్నది. లక్ష్మినారాయణులే జగత్తునకు జననీ జనకులై యున్నారు.

శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులవారు - 'శ్రీమ ద్రామానుజులు - వారి కృతిరత్నములు' అను వ్యాసమున -

శ్రీ రామానుజ విరచితములైన వేదార్థ సంగ్రహ - వేదాంత సార - వేదాంత దీప - శ్రీభాష్య - గీతాభాష్య - గద్యత్రయాది గ్రంథ ములలోని యంశములను సంగ్రహముగ పేర్కొనుచు, యీ గ్రంథము లలో రామానుజులు ప్రదర్శించిన రచనా వైదగ్ధ్యమునుగుఱించియు, ప్రతిపాదించిన యంశములను గుఱించియు వివరించినారు.

శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులవారు - 'శ్రీమద్రామానుజులు - ఉపనిషత్తులు' అను వ్యాసమున - ప్రస్థాన త్రయములో - ఉపనిషత్తులకు గల ప్రాముఖ్యమును వివరించుచు, భగవద్రామానుజులు - తమ శ్రీభాష్యాది గ్రంథ రచనలో ప్రమా ణములుగా గైకొనిన ఈశ - కేన - కఠ - ప్రశ్న - ముండక - మాండూక్య - ఐతరేయ - తైత్తిరీయ - ఛాందోగ్య - బృహదా రణ్యక - కౌషీతకి - శ్వేతాశ్వతర - నారాయణోపనిషదాదులలో గల విశేషాంశములను విశదీకరించినారు.

శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులవారు - భగవద్రామానుజుల శ్రీభాష్యమునందలి రెండవ అధ్యాయ విశే షములను వివరించుచు, మొదటి పాదములో, సాంఖ్య - యోగ - వైశేషిక - జైన - బౌద్ధ - పాశుపత మతములను నిరాకరించి, రెండవ పాదములో - పాంచరాత్ర మతమును స్థిరీకరించి, తక్కిన రెండు పాదములలో - 'బ్రహ్మేతర మంతయు పరబ్రహ్మ కర్తృకమే'- అని నిరూపించినారు.

'శ్రీమద్రామానుజులు - గీతా భాష్యము' - అను వ్యాస మున - శ్రీమాన్ చించాపట్టణము శ్రీరంగాచార్యులవారు - గీతా రహస్యములను శ్రీరామానుజ భాష్యానుసారము వివరించినారు.

తొలుత - యామునాచార్యులవారి గీతార్థ సంగ్రహములోని 32 శ్లోకముల భావములను వివరించి, త దనుసారము భాష్యమును రచించిన శ్రీమద్రామానుజుల వివరణమును వివరించినారు.

'గీతా రహస్యము' అను పద్య రచనలో శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు - గీతలో సూక్ష్మముగా, శరణాగతిగద్య యందు విపులముగా శ్రీమద్రామానుజులు వివరించిన శరణాగతి ప్రాశస్త్యమును, ఆ శరణాగతియందు సర్వాధికారమును, సులభ ఫల దాతృత్వమును - వివరించినారు.

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులుగారు - 'విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యము' - అను వ్యాసమున, అద్వైత - ద్వైతవాదుల మతములందు - అసమంజసముగా గల వాక్యములను ఘటక శ్రుతులచే పరిహరించుచు, పరమాత్మ - సర్వమంగళ గుణాకర త్వమును, చిదచిత్తులకు అంతరాత్మను, సృష్టి స్థితి లయ కర్తృత్వ మును, సర్వోపాదాన కారణత్వమును — విశదీకరించినారు.

శ్రీ మొవ్వ వేంకటదాసుగారు - 'రామానుజ ప్రశస్తి' - అను పద్య రచనలో - 'మానితైశ్వర్య ధుర్య ! రామానుజార్య !' - అను మకుటముతో - భగవద్రామానుజ ప్రభావమును సీసపద్యములలో - హృద్యముగ వర్ణించినారు.

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు - 'శ్రీ పాంచ రాత్ర వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము' - అను వ్యాసమున - శ్రీవైష్ణవ మతమునకు పాంచరాత్ర మతమే ప్రబలమైన ఆధార

మనియు, అట్టి పాంచరాత్ర సిద్ధాంతము 'సాత్త్వత మత' మను పేర ప్రాచీనములైన ఆగమ గ్రంథములలో నిర్దేశింపబడియున్న దనియు, ఇయ్యది 'భాగవత మత' మని నేడు వ్యవహరింపబడుచున్న దని వివరించుచు, ఇట్టి వైష్ణవ సిద్ధాంత ప్రతిపాదకములైన పరమ - పౌష్కర - ఈశ్వర - శ్రీమన్నారాయణ - హాయశీర్ష - పారమేశ్వర - విష్ణుతత్త్వ - పరాశర - బృహద్బ్రహ్మ - జయాఖ్య - అహిర్బుధ్న్య - విష్ణుతిలక - పురుషోత్తమ సంహిత లందలి విశేషములనే గాక, మఱి యింకను - ప్రకాశ సంహిత, మహా సనత్కుమార సంహిత, అనిరుద్ధ సంహిత, మహోపనిషత్తు, సుదర్శన సంహిత, అగస్త్య సంహిత, వశిష్ఠ సంహిత, విశ్వామిత్ర సంహిత, విష్ణు సంహిత - మున్నగు సంహితలందలి తాత్త్విక విషయములను సైతము విపులీకరించుచు, ఇట్టి యీ పాంచరాత్ర సంహితలలో ముఖ్యముగా - జ్ఞానము, యోగము, క్రియ, చర్య - అని, నాలుగు అంశములు పేర్కొనబడియున్నట్లు సూచించి, వాని ఆంతర్యములను ఆవిష్కరించి నారు.

శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులవారు - శ్రీ పాంచరాత్ర ప్రాశస్త్యమును గుఱించి వివరించుచు, పాంచరాత్ర ప్రవక్త శ్రీమన్నారాయణుడే యనియు, ఈ పాంచరాత్ర శాస్త్రము అతి ప్రాచీనమైన దనియు, శ్రుతి - స్మృతీతిహాసములందుమాత్రమేకాక, కావ్యములందును, చరిత్ర పుటలందునుగూడ ఈ శాస్త్ర ప్రశస్తి కానవచ్చు ననియు వివరించుచు, ఇందులకు అనేక ప్రమాణములను పేర్కొనియున్నారు.

ఈ పదియవ సంపుటములో - కడపటి వ్యాసము - శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులవారిచే రచించబడిన 'వివిధ సంప్రదాయములు - వైష్ణవ మత ప్రభావము' — అనునది. ఇందు విశిష్టాద్వైత తత్త్వ మహత్త్వమును అనేక ప్రమాణములతో వ్యక్తము గావించుచు, దక్షిణ భారతమున వెలసిన రామానుజ - మధ్వ సంప్రదాయములను, ఉత్తర భారతమున ఉద్భవించిన నింబార్క - వల్లభ - రామానంద - చైతన్యాది సంప్రదాయ విశేషములను విశదీకరించినారు శ్రీమాన్ రంగాచార్యులవారు.

## ఆశంస

ఈ రీతిగా - శ్రీ రామానుజ కీర్తి కౌముదీ మహా గ్రంథ పరంపరలో — పది సంపుటములను శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ ఖండములుగా - భగీరథుని వంటి పట్టుదలతో, దీక్షతో - సర్వ పరిపుష్టములుగా, సర్వాంగ సుందరముగా విశేష సామర్థ్యముతో వెలువరించిన శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారికి శ్రీనివాస భగవానుడు సకల శ్రేయములను ప్రసాదింపవలె నని మనసార కోరుచున్నాము.



# కౌముదీ దర్శన పరామర్శము

'చారిత్రక శిరోమణి - ఉభయ వేదాంత విశారద'

డాక్టర్: శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు,

ఎం. ఏ. పిహెచ్. డి.



## పరిచయము

శ్రీమద్రామానుజులవారికి పూర్వమునుండి శ్రీవైష్ణవ మతము వర్ధిల్లుచున్నను - రామానుజులవారివలన శ్రీమతమున కెనలేని గౌరవాదరవ్యాప్తులు కల్గిన విధముగనే - శ్రీరామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాలా వ్యవస్థాపకులు - నిర్వాహకులు నైన శ్రీమాన్ ధనకుధరం వరదాచార్య మహోదయుల అవిశ్రాంత సాహితీయజన కార్యక్రమం - ఇతఃపూర్వము వెలువడిన శ్రీమద్విశిష్టాద్వైత సంబంధ గ్రంథ సమూహముల సధఃకరించి, కళా పరిపూర్ణముగా విరాజిల్లుచున్నది. ఒక్క చేతిమీదుగా ఇంతటి కృషిసల్పుట - అద్భుతమైన విషయము.

కాంచీ నగరమునుండి ప్రతివాది భయంకరంవారు, మైసూరు నుండి పరకాల మఠంవారు, తిరుమల - తిరుపతి దేవస్థానములు, ముసుమూరు శ్రీ గోదా గ్రంథమాలవారు, ఇట్లే మరికొన్ని సంస్థలు, కొందరు వ్యక్తులు - శ్రీ రామానుజ మత సంబంధ సాహితీ ప్రకాశన ప్రచారముల నొనర్చుచు, యథోచితముగా తమ శక్తి యుక్తులను ధారపోయుచున్నారు.

వీ రందరి పద్ధతికన్న ప్రత్యేకముగా ధనకుధరంవారు - ఒక సుదీర్ఘ ప్రణాళికను సిద్ధము చేసికొని, అనుభవం గల పెద్దలతో ఒక సమాలోచనా సమితిని ఏర్పాటు చేసి శ్రీ రామానుజ సాహితీ సర్వస్వమును షోడశ కళా పూర్ణ మగునట్లు 16 సంపుటములుగా వెలువరించ సమకట్టి, తిరుమల తిరుపతి దేవస్థానములవారి సాహాయ్యముతో - నేటికి లక్ష్యమును సాధించుట - మహత్తరమైన విషయము.

వీరు ఏర్పాటు చేసికొనిన ప్రణాళికయందు - శ్రీ రామానుజ స్వామివారి రచనల గూర్చిన విపుల వ్యాసములు, విశిష్టాద్వైత సంబంధ రచనలు, తదభిముఖములైన స్తోత్ర - పద్య - శతకములు - విశిష్టాద్వైత ప్రచారమునకు అతః పూర్వము సేవ చేసిన సంస్థలు, మహనీయులు మొదలగు బహువిధ విషయ పరివ్యాప్త ప్రగాఢ పరిశోధనాపూరములైనవి - ఈ శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపుటము లనుటలో - ఏమాత్రమైనను అతిశయోక్తి లేదు. ఇది యంతయు - ధనకుధరంవారు శ్రీ రామానుజ స్వామివారలకు చేయుచున్న పరిచర్యా విశేషము. తెలుగునాట వర్ధిల్లిన, వర్ధిల్లనున్న శ్రీ రామానుజ దివ్యాజ్ఞాబద్ధచేతనుల పురాకృత పుణ్య విశేషము - ఈ సంపుటముల పరసము.

ప్రస్తుత కౌముదీ దర్శన పరామర్శయందు 11 వ సంపుటము నుండి, 15 వ సంపుటమువరకుగల విషయ విశేషములగూర్చి తెల్పుటయే ప్రధానోద్దేశము. ఇటి దీని వలన, ఆ యా సంపుటముల గూర్చి పాఠకుల కొక అవగాహన యేర్పడును.

ప్రతి సంపుటమునందు సమాలోచనాసమితి సభ్యుల నామధేయములు, వారి చిరునామాలు, శ్రీమద్రామానుజుల, ఆళ్వారుల, శ్రీ వేంకటేశ్వరస్వామివారల - అపూర్వ చిత్రపటములును, గ్రంథాంతమున - ఆ సంపుటమందలి రచయితల పరిచయము (ఫొటోలతో) కలదు. వీనియందు మ రొక ముఖ్య విశేష విషయమే మనగా, సంపాదకీయమునందు కొందరు - ఏదో ఒక అప్రస్తుత విషయమును గూర్చి వ్రాయుట పరిపాటి. కాని, ధనకుధరంవారు దానికన్న - నూతన పద్ధతిలో ఈ శీర్షికయందు - 'శ్రీభాష్య ప్రభావము', 'గద్యత్రయ వైశిష్ట్యము', 'రహస్య గ్రంథములు', 'శ్రీవైష్ణవ సంప్రదాయములో రెండు శాఖలు', 'విష్ణుభగవానుని వైశిష్ట్యము' - అను విషయములగూర్చి చర్చాపటువుగా సులభ శైలిలో తెల్పుట - సంపాదకుని ముఖ్య కర్తవ్య మని భావించి వివరించి, ఈ శీర్షికకు గౌరవ మాపాదించిరి.

## 11. ఏ కా ద శి

11 - వ సంపుటమునందు సంపాదకీయ శీర్షికతో - 'శ్రీభాష్య ప్రభావము'నుగూర్చి (9 - 18 పు) ధనకుధరంవారు తెల్పినారు. శ్రీభాష్యమునకు పూర్వ పూర్వము నుండి - ఆధునిక కాలమువరకు వివిధ దృక్పథములతో - సంస్కృతాంధ్రాంగ్ల భాషలయందు వెల్వడిన వ్యాఖ్యలు, వాని కర్తలు, ముద్రణ కాలము, కృతివిశేషములను గూర్చి సంక్షేపముగా తెల్పినారు. ఆచార్యులవారు 'సంపాదకీయము'గా వివరించిన ఈ విషయము - శ్రీభాష్యమునుగూర్చి మనకు వీ రొసంగిన ఒక 'సంపాదన' సాహితీ ద్రవ్యము - అమూల్యమైనది.

ఈ గ్రంథమున - శ్రీమతి విక్రాల శ్రీదేవమ్మగారి 'శ్రీ వేంకటేశ్వర స్తుతి' (10 పద్యములు), ధనకుధరంవారి గోపుర సందేశము (పు. 157 - 160), వేముగంటివారి 'పురుషకారము', గుదిమెళ్ళవారి శ్రీ రామానుజ స్తవము (250 - 251) అనునవి పద్య కృతులు.

ప్రవచన పటువులైన శ్రీ భాష్యంవారి 'శ్రీమ ద్వాల్మీకిరామాయణము - వైష్ణవ తత్త్వము' (పు. 3 - 72), మరింగంటి శ్రీరంగాచార్యులవారి 'భగవద్రామానుజులు - శ్రీభాష్యము' (73 - 156) నారాయణ అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యమ్నిగూర్చి తెలికిచర్ల వారి రచన (171 - 184), సర్వేపల్లి రాధాకృష్ణ మహోదయుల 'శ్రీమ ద్రామానుజులు - ఆస్తిక తత్త్వము, (198 - 249), ఆంధ్రులు - విశిష్టాద్వైతమునుగూర్చి తట్టా విజయరాఘవాచార్యులవారి వ్యాసము (252 - 279)ఉన్నవి. ఇవియే గాక, గోపుర సందేశ పద్యముల వ్రాసి, సందేశ విశేషములను వేద శాస్త్ర ప్రమాణ పూర్వకముగా ధనకుధరంవారు వివరించుట - విశేషముగా గలదు.

విక్రాల శ్రీదేవమ్మగారి దశపద్య పరిమిత వేంకటేశ స్తుతి - విభక్త్యంచితము. పీనికి - కళిక, ఉత్కళికల చేర్చినచో, ఒక ఉదాహరణ కృతి యంగుసు. రచన ధారాళముగా - సులభ శైలిలో నుండి, శ్రీదేవమ్మగారి కవితా సామర్థ్యమును నిరూపించుచున్నది.

శ్రీమద్రామాయణమునుగూర్చి శ్రీభాష్యంవారు ఎన్నియో విషయములను, వాని ప్రత్యేకతలను - పరితల నాకర్షించు విధముగా వివరించి, సామాన్య వ్యక్తికి కూడ - అసామాన్య విషయముల

తెలిసికొను అవకాశమును కలిగించినారు. శ్రీమద్రామాయణమును గూర్చి తెలిసికొనదలచినవారికి ఈ వ్యాదము - అవశ్యము పఠించ దగినది.

ఆసుర ప్రవృత్తి నశించి, దైవ ప్రవృత్తి వృద్ధి నొందుట - మానవత్వము. అట్టి మానవత్వమును పెంపొందించుటయే శ్రీరామాయణము యొక్క ప్రధాన ప్రయోజనము' (పు. 22) అని శ్రీభాష్యం వారు తెల్పుచు, రావణుని రాజస - ఆసుర పద్ధతులను, రాముని సాత్త్విక - దైవ ప్రవృత్తులను - సోదాహరణముగా వివరించినారు.

విశద వాక్ప్రముఖామణులైన మదింగంటి శ్రీరంగాచార్యస్వామి వారి 'శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యము' అను వ్యాసము - (తృతీయాధ్యాయ పూర్వార్థము) సవివరముగా, అనుస్యూతముగా వచ్చుచున్నది. వారి ప్రవచన సహజ ధోరణియే ఈ వ్యాసమున ప్రతిబింబించుచు, అచ్చ టచ్చట - వివరణాధిక్యమునకు అవకాశమును కలిగించినది. శ్రీభాష్యమునుగూర్చిన వీరి యీ వ్యాసము - ప్రత్యేక గ్రంథముగా రాదగినది.

శ్రీమద్రామానుజులవారు అష్టాక్షరీ మహా మంత్రమును సకల చేతన సముద్ధరణార్థమై వినిపించినది 'దామోదర గోపురము' నుండి. అట్టి దానిని - 'గోపుర సందేశ' మందురు. ఇది ప్రసిద్ధపూర్వ విషయము. దివ్య సందేశమైన దీనిని ధనకుధరంవారు - తమ సహజ సుందర కవితా శైలితో - 15 పద్యములయందు తెల్పి, గోపుర సందేశమునకుగల వేద శాస్త్ర ప్రమాణ ప్రతిపత్తి విశేషముల వివరించినారు. దీనియందు - వివిధ (సాత్త్విక) పురాణములు, వేద

ములు, ఉపనిషత్తులు, స్తోత్రములు, భగవద్గీత, సంప్రదాయ గ్రంథ ములు మొదలైనవానినుండి ఉదాహరణముల నొసంగి, గోపుర సందేశమునకు మరల గోపుర ఖ్యాతిని గూర్చిరి.

"ఆనయం బష్టాక్షరి నెద
మననము సేయంగవలయు - మంత్రం బిదియే
మునుముందు 'ఓం నమో' యని
యనవలె, 'నారాయణాయ' యని యటుమీదన్."

ఇది వీరి పద్యరచనా శైలికి ఉదాహరణ.

'గోపుర సందేశ' పద్యరచనవెంబడే - 'అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యము' - అను తెలికిచెర్ల కందాడ గోపాలాచార్యులవారి వ్యాసము కలదు. ధనకుధరంవారి 2 రచనలు, ఈ వ్యాసము చదివిన, అష్టాక్షరీ విషయము - సంశయ రహితముగా అవగాహన మగును. మంత్ర వైభవ వివరణమున తెలికిచర్ల వారు - దివ్య ప్రబంధ విషయ ములతో, సోదాహరణముగా వివరించి, వేద ప్రామాణ్యాన్ని నిరూ పించి, అష్టాక్షరీ మంత్రమునకు గల ద్వయ (ప్రబంధ - వేద) శక్తిని ప్రవచించుట - విశేషము.

వేముగంటివారు - 'పురుషకారము' శీర్షికన, తద్విషయమును 56 పద్యములలో తెల్పిరి. ఇది యొక లఘు కథాకావ్యము.

సర్వేపల్లి వారి 'ఇండియన్ ఫిలాసఫీ' గ్రంథములకు - బులుసు వేంకటేశ్వరులుగారు చేసిన తెనుగు అనువాదము - బహుధా ప్రశంస నీయమై, వ్యాప్తిలో గలదు. ఇట్టి సంపుటములలో నొకదానియందు

గల 'శ్రీమద్రామానుజులు - ఆస్తిక తత్త్వము' అను వ్యాసమును వీరు దీనియందు చేర్చి, గ్రంథ గౌరవము నినుమడింపజేసినారు.

మధురకవి - శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులవారు చాల కాలమునాడు వ్రాసిన 'శ్రీ రామానుజ స్తవము' - పున ర్ముద్రణకు నోచుకోగలిగినది ఈ సంపుటము ద్వారానే. శ్రీమద్రా మానుజులవారిని గూర్చి వ్రాయబడి, ప్రఖ్యాతమైన 'పాషండ ద్రుమషండ...' శ్లోకానికి దీనియందలి మొదటి పద్యము - యథా మూలానువాదము. ఇత్యాది - నాతిప్రౌఢ రచన. నిత్య పర నోపకారి.

ఈ సంపుటమునందు చివరి వ్యాసము - తట్టా విజయరాఘవాచా ర్యులవారి 'ఆంధ్రులు - విశిష్టాద్వైతము'. దీనియందు వీరు - పూర్వాంధ్రదేశము మొదలుకొని, అద్యతనులైన మరింగంటి శ్రీరంగాచార్యులవారి వరకు తెల్పిరి.

సంపుటము చివరలో - రచయితల ఫొటోలు, వారి జీవిత విశే షములు - రచనలగూర్చి తెల్పుట - చాలా బాగున్నది. సంపుట ముల గూర్చి పెద్దల అభిప్రాయములు, పత్రికా వార్తలు - సమీక్ష లను చేర్చినారు. ఇది గ్రంథవ్యాప్తికి ఒక ఉదాహరణ.

## 12. ద్వాదశి

సూర్య సంఖ్యాత్మకమైన ద్వాదశి సంపుటము - 'గద్య త్రయ వైశిష్ట్యము' - అను సంపాదకీయముతో ఆరంభమైనది. ధనకుధరం వారు యథాతథముగా గద్యత్రయమును - ఈసంపుట శ్రీముఖముగా

చేర్చిరి. ఇదే గ్రంథము - వ్యాసపరంపరలో - శరణాగతి గద్యమును గూర్చి తట్టా విజయరాఘవాచార్యులగారు (144 - 160 పు), శరణాగతి గద్యలో తత్త్వార్థముగూర్చి న. చ. రఘునాథాచార్యులుగారు, శ్రీరంగ గద్యమును గురించి న. చ. కృష్ణమాచార్యులుగారు, ఇదే గద్యయందలి భావనా విశేషమునుగూర్చి కుంటిమద్ది శేషశర్మగారు, వైకుంఠ గద్య విషయమై కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులుగారు (225 - 240 పు.) - బహువిధ నూతన విషయోపబృంహణములైన వ్యాసముల వ్రాసిరి. ఇవి యన్నియు - 'గద్య త్రయ భాష్యము' వంటివి.

గ్రంథారంభములోనే 'అనుబంధము'గా - శ్రీ రామానుజ నవరత్న హారము' పేరున - సుప్రభాత స్తోత్రము, ప్రపత్తి - చతుశ్శ్లోకి - ధాటీ పంచకము - శ్రీ రామానుజాష్టకము - అష్టోత్తర శత నామ స్తోత్రము, శ్రీ భాష్యకార మంగళాశాసనము — కలవు. ఇవన్నియు - భక్తునకు ఒకే తావున లభించు అవకాశము సిద్ధించినది.

'కవిపాదుషా' - పువ్వాడ శేషగిరిరావుగారి 'శ్రీ వేంకటాద్రీశ్వర స్తవము' గ్రంథమునకు తిలకప్రాయముగా నున్నది. సప్తాద్రీశుని స్తుతి - పద్య సప్తకమున గలదు. ప్రాచీన - ఆధునిక పద్య రచనాశైలి - ఓత ప్రోతముగా - పువ్వాడవారి యందు కన్పడును.

ధనకుధరం వారు - 'భారతీయ దర్శనములు - బ్రహ్మసూత్ర భాష్యములు' - అను విలువైన వ్యాసము నందించినారు. (3-38 పు.) దర్శన శాస్త్రము, బ్రహ్మసూత్రములు, వేదాంతము - త ద్విషయముల గూర్చి సులభ శైలియందు తెల్పబడిన విషయ వివరణ మగు ఈ రచన - సర్వ జనోపయోగి.

మరింగంటి శ్రీరంగాచార్యులవారి 'శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యము' వ్యాసము (29 - 128) అధిక స్థాన మాహాత్మ్యము కలిగినది.

'శ్రీరామానుజ దృక్పథము - భగవ త్తత్త్వము' విషయమున ఏవిధముగా నున్నదో - ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులవారు వివరించినారు. ధ్యాన - మంగళ శ్లోకముల అంతరార్థమునుండి గీతా భాష్య విశేష విషయములు, విశ్వరూప సందర్శన మహిమ - మొద లగువానిని క్రొత్త చూపుతో తెల్పినారు (పు. 129 - 143).

-శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులు గారు - 'శ్రీమద్రామా నుజులు - వర్ణాశ్రమ ధర్మములు' (241 - 275 పు.) గూర్చి విపుల ముగా వివరించినారు. ఈనాడు - కుల మత ద్వేషాలకు ఒకప్పుడు పెద్దలు ఏర్పరచిన చాతుర్వర్ణ్య వ్యవస్థ కారణ మనుకొనువారు - ఈ వ్యాసమును చదివి, తమ భావనలోని అపోహను దూరము చేసికోగలరు. ఎన్నో ప్రామాణిక దృష్టాంతములతో - ఈ వ్యాస మొప్పారుచున్నది.

దశ సంఖ్యాక పరిమిత పద్య సంఖ్యతో - కరి నారాయణా చార్యులవారు రచించిన 'శ్రీ రామానుజ వైభవోల్లాస' మను పద్య రచన, ఈయున్ణ్ణి వేంకట వీరరాఘవాచార్యులవారిచే రచింపబడిన 'పరాశర భట్టరు' అను వ్యాసము, పువ్వాడవారి పద్యములు - ఎప్పు డెప్పుడో రచింపబడియుండగా, వానికి ఈ సంపుటమున ఆచార్యులవారు సూర్యాలోకభాగ్యమును కలిగించినారు. సంపుటము చివరలో - కవి పండిత పరిచయము సచిత్రముగా గలదు.

# 13. త్రయోదశి

పదమూడవ సంపుటములో ఆరంభ అనుబంధముగా - శ్రీ లక్ష్మీ నారాయణ సుప్రభాత - స్తోత్ర - ప్రపత్తి - కరావలంబస్తోత్ర - లక్ష్మీనారాయణ హృదయ - అష్టోత్తర శత నామస్తోత్ర - మంగళా శాసనము లున్నవి. ఇంతవర కీ స్తోత్రము ఒకే తావున ముద్రితము కాలేదు. చాలా కాలం క్రితము ధనకుధరం వారే ఈ సుప్రభాత స్తోత్రమును ఒక లఘు కృతిగా ముద్రణ చేయించియుండిరి. సుప్రభా తాదుల రచించి సమర్పించినవారు - బహు భాషా కవి పండితులైన విశాఖ శేషాచార్యులవా రగుట - ఒక విశేషము. శైలి తెలియు టకు ఒక ఉదాహరణ :—

"ప్రాచీనాద్రే రుదయతి రవిః పద్మినీ కంధరాయాం
తంతుం మాంగల్యక మివ నిధి ష్యన్వరో భద్రపీఠః ।
విశ్వం విశ్వేన చ కిలభృతం బాంధవానాం ఖగానాం
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్."

ఈ గ్రంథ సంపాదకీయమునందు - శ్రీవైష్ణవులకు ముఖ్యమైన రహస్య గ్రంథముల గూర్చి తెల్పుట - ఒక విశేషము. దీనిని చదివి, ఇదే సంపుటమున గల కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులవారి 'భగవ ద్రామానుజులు - నిత్య గ్రంథము' (పు. 33 - 60), భట్టా విజయరాఘవాచార్యులవారి 'అష్టాదశ రహస్యములు - త ద్విశేష ములు' (217 - 294) అను వ్యాసములను చదివినచో, ఏత ద్విష యానబోధన సుగమమై, బహు విషయ పరిజ్ఞాతృత్వ సంతృప్తి కలుగును.

వింజమూరి గోపాలకృష్ణమాచార్యులవారి 'శ్రీనివాస స్తవ రాజ' మను 17 సీస పద్యముల కృతి — ప్రాచీన కవుల ధోరణిలో - వర్ణనాత్మకముగా నున్నది. వేంకట శబ్దమును గూర్చి ఆచార్యులవారు ఇట్లు తెల్పినారు :—

'వేం' శబ్దమునకు కిల్బిష మంచు నర్థంబు
'కట' శబ్ద మరయ గొల్చుటను తెల్పు
పాప దాహక శక్తి బరగు శైలము గాన
'వేంకటాద్రి' యటంచు వినుతి కెక్కె
'వేం' అమృత స్మన వే రొక్క యర్థంబు
'కట' మన్న నైశ్వర్య గరిమ యండ్రు
ఇహ పర సంపద లిచ్చు శైలము గాన
'వేంకటాద్రి' యటంచు వినుతి కెక్కె
పాప దాహక శక్తి నైశ్వర్య దాన
చటిమ నెసగుట - వేంకటపతి వటండ్రు
సార్థకాహ్వయ ! ప్రభు వీవు సారసాక్ష !
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !"

ప్రస్తుత సంపుటమున నిది యొకటే పద్య రచన. సప్తగిరివాసునిగూర్చి వెల్వడిన స్తోత్ర సాహితీ సుమ మాలిక యందు ఈ స్తవ రాజము — మేటిగా విరాజిల్లతగినది.

'అర్చావతార వైభవము'ను గూర్చి - డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులుగారు వ్రాసిన వ్యాసము - విశేష విషయ సంభరితము. శ్రీమన్నారాయణుని పర — వ్యూహ — విభవ — అంతర్యామి - అర్చారూపముల వివరణ, వ్యక్త్యోపాసన, శ్రుతి

స్మృతుల యందు అర్చావతార వైభవము, ఆగమములు, శ్రీభాగవతములయందు అర్చావతారమును గూర్చిన విషయముల దెల్పి, మూర్తి ప్రతిష్ఠా క్రమము, దైవ ప్రవేశ భేదములు, గృహార్చనా విశిష్టత - ఇట్లు అనేక విషయములను ఆచార్యులవారు సప్రమాణముగ నిరూపించుట - ఒక ప్రత్యేకత.

కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు గారి 'భగవద్రామానుజులు - నిత్య గ్రంధము' వ్యాసము (పు. 33 - 60) విలక్షణముగా గలదు. ఆళ్వారాచార్యులు అర్చావతార సౌలభ్యమును గుర్తించి, తద్విషయమై వారు వెల్లడి చేసిన ద్రావిడ ప్రబంధ సూక్తులను, శేష - శేషి సంబంధమును, పంచోపనిష న్మంత్ర న్యాసమును - వివరించినారు. పాంచరాత్రాగమోక్త ప్రకార భగవత్ప్రతిష్ఠా క్రమమున మూర్త్యావాహనాదులు, స్నపనాది క్రియలు, వాని విశిష్టత - మొదలైనవి ఈ వ్యాసమున చక్కగా నిరూపితమైనవి. పరమైకాంతి యైన భక్తుడు అనుదినము గావించవలసిన భగవదారాధనా విధాన వివరణమైన నిత్యగ్రంధ విషయమును ఇంతవరకు ఇట్లు వివరించినారు - అరుదు.

పు. 61 - 107 వరకు విస్తరించిన మరింగంటి శ్రీరంగాచార్యులవారి 'శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యము' గూర్చిన రచన - చతుర్థాధ్యాయ పూర్వార్ధ వివరణము గలదు. 11 - విభాగములుగా అధికరణముల గూర్చిన విస్తృతి గలదు. వేద - వేదాంత - వివిధ పురాణ — భారత - రామాయణాది విషయ ప్రసక్తితో ఈ వ్యాసము - గంభీరతకు ఆలవాలమైనది.

డా॥ చించాపట్టణం శ్రీరంగాచార్యులుగారి 'శ్రీమద్రామానుజులు - తాత్త్విక దృక్పథము' (పు. 107 - 187) అను వ్యాసము - ఈ సంపుటములో గల బృహద్రచన. శ్రీమద్రామానుజ జీవిత - సాహిత్య విషయములను, వారి గ్రంథములయందు సూక్ష్మముగా తెల్పబడిన తాత్త్విక విషయములను - ఆచార్యులవారు చర్చా పటుపుగ, ప్రామాణికముగా నిరూపించి, దీని నొక సిద్ధాంత వ్యాసముగ సిద్ధ మొనర్చినారు. జీవాత్మ పరమాత్మలు, ప్రకృతి స్వరూపము లను వానిని గూర్చి తెలిసికొనుటకు - 'ఇది పిష్ట పేషణ' సదృశమని - ఎందరో దూరముగా నుందురు. కాని, చించాపట్టణమువారి యీ వ్యాసము - ఆ విధమైన చింతాభారము లేని విధముగా విషయ వివేచన మొనర్చుట - ఆచార్యులవారి పరిశీలనాదక్షత - పారక జన హృదయానంద పద్ధతికి - ఒక ఉదాహరణ.

'శ్రీ రామానుజ సిద్ధాంత ప్రవర్తకులు' గూర్చి, ఏతత్ గ్రంథమాలా సంపాదకులైన ధనకుధరంవారు తెల్పినారు. (పు. 188 - 199) శ్రీవత్సాంకమిశ్రులనుండి - మహానుభావులగూర్చి - వారి వారి రచనలు, వైదుషీ విశేషములు సంగ్రహముగా - ముఖ్య విషయ క్షతి కల్గని విధముగా తెల్పినారు.

నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారి 'శ్రీ విశ్వలోకాచార్యుల వైభవము' (పు. 200 - 216), తట్టా విజయరాఘవాచార్యులవారి 'అష్టాదశ రహస్యములు - తద్విశేషములు' (పు. 217 - 234) అను వ్యాసరాజములు - నూతన పద్ధతిలో గలవు. పూర్వ పూర్వ పండితులవలె గాక, వీరు శైలి యందును, విషయ వివేచన

యందున్న - అతి సులభ రీతిని అవలంబించి, పాఠకుని ఆకర్షింప గలుగుచున్నారు. ఒక విధముగా చెప్పవలెనన్న, కీర్తి కౌముదీ సంపుట ములయందలి భాషా పద్ధయే విలక్షణముగా నున్నది. దీనికి ఏత త్సంపాదకు లవలంబించిన రీతి - విశిష్టమైనది. ఇతర సంపుటముల యందువలెనే దీనియందుకూడ - వ్యాసరచయితల పరిచయము - సచిత్రముగా గలదు.

## 14. చతుర్దశి

శ్రీమాన్ ధనకుధరం వారి సంప్రదాయ సాహితీ యజన ఫల ముగా వెలువడిన మరియొక సంపుటము - 14వది. తాళ్ళపాకవారి శ్రీ వేంకటేశోదాహరణము, వేదాంత దేశికుల న్యాసవింశతికి - స. చ. కృష్ణమాచార్యులవా రొనర్చిన పద్యానువాదము, కె. వి. రాఘవాచార్యులవారి 'భగవద్ధ్యాన సోపానము' అనువాదకృతి - ఇవి ఈ సంపుటమందలి పద్య కృతులు. వివిధ వషయములగూర్చి 9 వ్యాసములు గలవు. గ్రంథ ప్రారంభమున శ్రీ రామానుజ సూక్తి రత్నములను (72) సంక్షేపముగా వివరించి శ్రీ రామానుజవారు వీనిని శిష్యకోటికి సందర్భోచితముగా తెల్పుచు, 'మీా రిట్లు ప్రవర్తింప వలెను' - ఎడుటివారు మనల ననుసరింతు రని, వీని నుపదేశించిరి. అట్టి వీనికి - 72 వార్త లని ప్రసిద్ధి.

రాబోవు పదునైదవ సంపుటమున, వడగల - తెంగల సంప్ర దాయముల గూర్చి ఒక వ్యాసము వెల్వడగలదని సూచన, ఈ సంప్ర దాయముల గూర్చి సంక్షేప పరిచయము - సంపాదకీయముగా

నున్నది. ఇట్లు ఈ రెండు ముఖ్య విషయములు - 14 సంపుటమునకు మకుటాయమానమైనవి.

తెనుగు సాహిత్యమునందు - 'ఉదాహరణ' వాఙ్మయము - ప్రత్యేక పరిగణన కలది. దానియందు ప్రాచీన ఉదాహరణములలో - తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారి 'శ్రీ వేంకటేశ్వరోదాహరణము' పేర్కొనదగినది. ఇతఃపూర్వమే ఈ రచన ముద్రణమై వ్యాప్తిలో నున్నను, శ్రీ రామానుజ కీర్తి కౌముదీ స్నాతకులు - తిరుమల - తిరుపతి శ్రీనివాస స్వామి కావున, ఈ 'ఉదాహరణ' దీనియందు చేర్చుట — యుక్తముగా కలదు.

శ్రీ మహావిష్ణువునకు గల ప్రత్యేకత - 'దశావతారములు'. అందువలననే, సంస్కృతాది సారస్వతములయందు - విష్ణుగాథామయ గ్రంథ రచనలు అధికముగా వెలువడినవి. అవతార ప్రాముఖ్యము - తత్త్వము, వాని భేదములు, మన్వంతరావతారములనుండి దశావతారములవరకు గల చరిత్రలను తెల్పి, వేదము, సంప్రదాయ కృతులు, సంహితలు - వానిని క్రోడీకృతముగా పరిశీలించి చేసిన సముద్రాల వారి 'అవతార తత్త్వము - దశావతారములు' - అనునట్టి వ్యాసము. దానిని పరించినవారికి - అవతార విషయమై కలుగు సంశయములు - తొలగిపోవును.

'మహాభారతము - వైష్ణవ తత్త్వము' అనునది - కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులవారి వ్యాసము, 'రామాయణ - మహాభారతముల వైశిష్ట్యము' అనునది - ధనకుధరంవారి వ్యాసము. వీనిలో - కిడాంబివారి వ్యాసము - మహాభారతమునకు, పాంచరా

శాగమశాస్త్ర ప్రాముఖ్యమును చక్కగా వివరింప, ధనకుధరంవారి రచన - "భారతః పంచమో వేదః" అనియేగాక, వివిధ భాషలలో వెలువడిన రామాయణ - మహా భారతములగూర్చి తెల్పినది.

మరింగంటి శ్రీరంగాచార్యస్వామివారి శ్రీభాష్య సంబంధ వ్యాసము (81-104 పు.) యథాపూర్వముగ కొనసాగినది. ఈ సంపుటమందలి మరొక ప్రత్యేక విషయ మేమనగా :- శ్రీ వేదాంత దేశికులవారిని గూర్చి, వారి రచనల గూర్చి తెల్పుట. మన శ్రీవైష్ణవ మునకు శ్రీమద్రామానుజాచార్యులవారి తర్వాత, అంతటి కీర్తి ప్రతిష్ఠలను, వ్యాప్తిని కల్గించిన - శ్రీ వేంకటేశ్వర ఘంటావతార మూర్తులు - దేశికులవారు. వారి పేరనే - దేశిక సంప్రదాయముగా ఒక సంప్రదాయ మేర్పడిన దనిన చో, వారి కీర్తిని గూర్చి ప్రత్యేక ముగ చెప్పవలసిన అగత్యము లేదు.

ఈ సంపుటమునందు శ్రీ వేదాంతదేశిక వైభవమునుగూర్చి ప్రతివాది భయంకర వేదాంతాచార్యులుగారు (పు. 105 - 114), దేశికుల రచనలు - త ద్విశేషములు గూర్చి ధనకుధరంవారు (పు. 115 - 123, 'వ్యాసవింశతి'కి - న. చ. కృష్ణమాచార్యులవారి అనువాదము (124 - 135 పు.), 'దేశికుల సంస్కృత సాహిత్య సేవ' అని - అప్పల్ల సోమేశ్వరశర్మగారు (పు. 136 - 152) వ్రాసిన విలువైన వ్యాసాలు కలవు. ఇవి - దేశికమహోదయుల జీవిత - సాహిత్య - సర్వతోముఖ ప్రతిభా పాటవములను వెల్లడించు విశేష రచనలు. మొత్తము మొదటి కళాసంయుక్త కృతులైన శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపుటములకే ఈ దేశిక సమాచార రచనలు - చంద్రికా

స్నాపితము లనవచ్చును. వేదాంతదేశికులవారినిగూర్చి ఎట నెటనో వెదకి చదువవలసిన శ్రమ - పాఠకునకు తప్పించగలిగినవి ఈ వ్యాస ములు. వారి జీవిత విశేషములేగాక, వివిధ రచనల పరిచయము చేయుట - వీనియందలి మరొక విశేషము.

మన దేశమందు వర్ధిల్లుచున్న శ్రీ విష్ణుక్షేత్రములలో 24టిని గూర్చి కందాడై శ్రీనివాసాచార్యులవారు - 'ప్రముఖ వైష్ణవ క్షేత్రములు - త ద్విశేషములు' పేరున వ్రాసిన వ్యాసము - విపులా విషయ సంభరితము (పు. 153 - 179).

ఈ సంపుటమందలి చివరి వ్యాసము - 'శ్రీరంగ క్షేత్ర వైశిష్ట్యము'గూర్చి (పు. 180 - 190) డా॥ శ్రీరంగాచార్య వ్రాసినది. శ్రీమద్రామానుజులవారు సేవించినదేగాక, వారి శ్రీమత వ్యాప్తికి- ఆరంభభూమికయైన 'శ్రీరంగము' గూర్చి - చారిత్రక - సాహిత్య ములయందు గల క్షేత్ర విషయములనుగూర్చి తెల్పినది ఈ వ్యాసము. పూర్వమునుండి - ఈనాటి రాజగోపుర నిర్మాణమువరకు గల వివిధ విషయములు, శ్రీరంగము గూర్చి సంస్కృతాంధ్రములలో వెల్వడిన రచనలు, వాని విశేషములు - దీనియందు గలవు. ఈ వ్యాసకర్త పరిష్కరించి - విపుల పీఠికతో ప్రచురించిన భైరవకవి - శ్రీరంగ మహత్త్వ వివరణము - విశేష విషయ భరితము. దీనిని ఆధారము చేసికొని ఇటీవల - శ్రీకృష్ణదేవరాయ విశ్వ విద్యాలయమున - రవీంద్రబాబుగారు పరిశోధన చేసి, Ph. D. పట్టము నందినారు. ఈ వ్యాసమున - శ్రీరంగ క్షేత్రము గూర్చి తెలుగువారు - తెలుసుకో వలసిన విషయము లింకెన్నియో గలవు.

దేశికులవారి 'భగవ ద్ధ్యాన సోపానము' - శ్లోకములకు కొంత కాలముక్రితము - కే. వి. రాఘవాచార్యులవారు - విపుల వ్యాఖ్యను - అనువాదయుక్తముగా ప్రకాశింపజేసినారు. దానిలోని శ్లోకములు, వాని తాత్పర్యమును మాత్రమే ఈ సంపుటమునందు ముద్రించగలిగినారు. (పు. 191 - 198). 'భగవ ద్ధ్యాన సోపానము'తో ఈ సంపుటము పూర్తి యగుట — విశేషముగా భావింపవచ్చును.

వివిధ పద్య - గద్యమయ రచనలతో రాణించుచున్న ఈ సంపుటములు - విషయ వైవిధ్యముగలవైనా - అనునట్లు, అన్ని విషయములను శ్రీ రామానుజ దివ్యాజ్ఞా బద్ధముగా మలచుకొని, తనయందు ప్రకాశమాన మొనర్చుకొనుచున్న 'కీర్తి కౌముదీ' స్నానమైన రచనా విశేషములు.

ప్రథమ సంపుటము నుండి 14 సంపుటము వరకు వెలువడిన యీ కృతుల గూర్చి - పండితులు, వివిధ పత్రికలు - వెలువరించిన అభిప్రాయములు - ఆ యా సంపుటములయందు చేర్చబడినవి.

11 - వ సంపుటమునకు శ్రీ భాష్యంవారు, వేమగంటివారు, T భాస్కరరావుగారు, S. V. రంగరామానుజాచార్యులుగారు, చించాపట్టణం శ్రీరంగాచార్యులుగారు - తమ అభిప్రాయముల వెల్వరించిరి. 'హిందూ పత్రిక' ఆంగ్లమున సముచితాభిప్రాయమును వ్యక్తీకరణ మొనర్చినది. 12 - వ సంపుటమునకు - చిలకమర్రి విజయ రాఘవాచార్యులుగారు, శ్రీవైష్ణవ సంప్రదాయ సాహిత్యోద్ధారకులైన K. T. L. నరసింహాచార్యులుగారు, డా॥ చించాపట్టణం

శ్రీరంగాచార్యులుగారు, ప్రతివాది భయంకర వేదాంతాచార్య స్వామి, రాజగురువు A V. దేశికాచార్యస్వామి, P కృష్ణమాచార్యులుగారు - తమ విలువైన అభిప్రాయములను వెల్లడి చేసిరి.

మైసూరు నివాసు లగు దేశికాచార్యులవారు వ్యక్తీకరించిన అభిప్రాయం - చాలా విలువైనది. మైసూరు ప్రాంతంలో తెలుగు వారు తమిళ దాసులై, కన్నడ లేఖకులై, సంస్కృతాంధ్రాలకు దూరు లైనా, Dr N S. అనంత రంగాచార్య, Dr. K. S నారాయణాచార్య వంటి సంస్కృతాంధ్రభాషా వైదుషీ మూర్తులు - విశిష్టాద్వైత గ్రంథ పఠన పాఠన చణులు - ఉన్నతోద్యోగ నిర్వహణమున నున్నవారు కొందరు కలరు. ఇట్టివారు - మత సంప్రదాయమును గూర్చియే గాక, వేదము, వేదాంతము, శ్రీమద్రామాయణము మొదలగువానినిగూర్చి ఆంగ్లమున గ్రంథములను ప్రకాశింపజేసి, కాలక్షేపాదుల ద్వారా ధర్మప్రచార మొనర్చుచున్న మహనీయులు గల రనుటకు - ఇట్టివారు సాక్షు లని దేశికాచార్యులవారు తమ ఆవేదనను అభివ్యక్తము గావించినారు. మన సంప్రదాయము, భాష, ఆచార వ్యవహారములయందు దేశికాచార్యస్వాములవారికి గల అభినివేశమునకు - ఈ వాక్యములు పరమ ప్రమాణములు. 'సాధన' పత్రిక - కీర్తి కౌముదీ వ్యాప్తిని అభినందించినది.

13 - వ సంపుటంలో - Dr Premananda Kumar (Srirangam) గారి వివరాణాత్మకమైన అమూల్యాభిప్రాయము, చిలకపాటివారి ప్రశంసావాక్యములు, 'గైర్వాణీ' పత్రిక చేసిన విపుల సమీక్షయు కలవు.

14 - వ సంపుటమున - A శేషాచార్యులవారు, అప్పల్ల సోమేశ్వరశర్మగారు - అభిప్రాయవ్యక్తీకరణ మొనర్చినారు. 'గైర్వాణి', 'సాధన', 'రామకృష్ణ ప్రభ' పత్రికలు - ఈ సంపుటముల సంగ్రహ సమీక్ష నొనర్చినవి. మరియు - 'News Time' పత్రిక - 'Archa worship' అను పేర - విపులముగా, విశేష విషయ భరిత సమీక్ష గావించి, బహుళ ప్రచారమునకు దోహద మొనర్చినది. సుప్రసిద్ధ వైష్ణవ క్షేత్రములలో ప్రముఖ మగు శ్రీరంగ క్షేత్రములో నివాసము జేయు డాక్టర్: ప్రేమానందకుమార్‌గారు - ఈ సమీక్షను వ్రాసిరి.

## పూర్ణిమ

శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వమైన 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' - షోడశ కళా పరిపూర్ణ మగుటకు - మిక్కిలి చేరువలోనికి వచ్చినది. అందుకు - ఈ పూర్ణిమ (15) కౌముది - ప్రత్యక్ష సాక్ష్యము.

శ్రీమాన్ ధనకుధరంవారి చిరకాల రామానుజ సాహితీ యజన ఫలము చేతి కంది నున్న యీ తరుణమున వెల్వడిన 15 వ కళా భాగము మొత్తము 300 పుటలతో సిద్ధమైనది. శేషాచలవాసుడు పద్మావతీ సమేతముగా గల చిత్ర పటము, శ్రీమాన్ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి చిత్రము, శ్రీదేవి చిత్రము, విష్ణు భగవానుని దశావతారముల చిత్రము, భగవద్రామానుజుల చిత్రము - వెరశి మొత్తము 5 చిత్రములు ఈ సంపు

టములో నున్నవి. పూర్వ సంపుటములయందువలెనే - 'సమాలోచన సమితి' వారి నామ ధేయములు, (సచిత్ర) కవి పండిత పరిచయము - కలవు.

అందమైన కవరు పేజీతో వెలువడిన దీని ధర - కేవలము 60 రూపాయలు మాత్రమే. ఇది అందరకు అందుబాటులో నున్న మూల్యము. కౌముదీ సంపాదకులైన శ్రీమాన్ ధనకుధరంవారు ఈ సంపుటమున శ్రీమాన్ ఉత్పలవారి 'వేంకటపతి స్తుతి', కుంటిమద్ది వారి 'శ్రీ రామానుజ విజయము' అను పద్యములు చేర్చినారు. ఈ యిరుపురును - మధుర కవితా మూర్తులైనందున, రచనలు ఆకర్షవంతముగా నున్నవి. వ్యాస పరంపరలో - కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులవారి శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్ర ప్రభావము (5-19 పు.), ధనకుధరం వారి శ్రీ విష్ణు భగవానుని దివ్య వైభవము (20 - 56), వీరిదే మరియొక వ్యాసము - 'శ్రీ వరదరాజ క్షేత్ర వైశిష్ట్యము' (228 - 240), పరవస్తు అప్పన్ గోవిందాచార్యులవారి శ్రీ స్తవము - వివరణ (57 - 66), సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యులుగారి 'దశావతారములు - తద్విశేషములు' (67 - 130), దిట్టకవి లక్ష్మీ నరసింహాచార్యులు గారి 'కలియుగ మహత్వము - కల్కి పురుషుని యవతరణము' (131 - 139), తట్టా విజయరాఘవాచార్యులుగారి 'శ్రీమద్రామానుజులు - వేదాంత సారము' (140 - 200), ప్రతివాది భయంకరం వారి 'వడగల - తెంగల సంప్రదాయ భేదములు' (208 - 227) అనునవి కలవు. ఇప్పటివరకు ఈ సంపుటముతో వచ్చిన 15 కౌముదుల యందు వచ్చిన శ్రీ రామానుజ సంబంధ సాహితిని ప్రత్యేకముగా సిద్ధము చేసినచో, ఒక పెద్ద సంపుట మగును.

ఈ 15 వ సంపుటములో - విష్ణు సహస్రనామ స్తోత్ర ప్రభావ మను వ్యాసమునందు - తద్విశేషములు వివరింపనైనవి. దీనియందలి మరియొక ప్రత్యేకత - వ్యాసకర్త వివిధ కోణములనుండి స్తోత్ర పరామర్శ చేసినారు. స్తోత్ర వ్యాఖ్యలను గూర్చి వ్రాయుచు - 'అనేక వ్యాఖ్యానములు కలవు' అని తెల్పి, శంకరాచార్య, పరాశర భట్టరుల వ్యాఖ్యలను పేర్కొని, స్థాలీ పులాక న్యాయముగా - వారి వివరణలయందలి భేదములను తెలిపినారు. మహా భారత సారమైన యీ స్తోత్ర మందలి నామ నిర్ణయము, పాఠ భేదములు, కవితా వైభవము మొదలగువానిని చక్కగా వివరించి, స్తోత్ర పాఠకులకు గొప్పనైన మేలు చేసినారు.

'విష్ణు భగవానుని దివ్య వైభవము' అను వ్యాసమునందు - విష్ణువు యొక్క ప్రత్యేకతను ధనకుధరంవారు - వివిధ రీతులుగా వివరించుటయేగాక, ఆ భగవానుని ఆయుధములు, పరివారముల గూర్చి - సోపపత్తికముగా, చర్చా పటువుగా నిర్ధారణ మొనర్చి, ఎన్నియో అమూల్య విషయములను వ్యక్తీకరించినారు. వేదము లందును, పురాణములయందును గల విష్ణు స్వరూప వర్ణనలను అన్నిటిని వరుసగా చేర్చుట - వీరి పరిశోధనా దృక్పథమును వెల్లడి చేయుచున్నది.

పూర్వ సంపుటములయందు కొన్ని స్తోత్రముల గూర్చిన వివరణ గలదు. ఆవిధముగనే దీనియందు శ్రీస్తవమును గురించి తెల్పబడినది. 14 - వ సంపుటములో (10 పు.) 'అవతార తత్త్వము - దశావతారములు' అను వ్యాసము కలదు. ఈ 15 - వ సంపుటము

లోని 'దశావతారములు - తద్విశేషములు' అను వ్యాసమును కలిపి ఒకటిగా చేసికొన్నచో, అవతార సాహితి గూర్చిన సమగ్రత ఏర్ప డును. ద్రావిడ ప్రబంధములు, వేద - వేదాంతములు, ఉపనిషత్తులు, పురాణములు పేర్కొని, దశావతార విశేషములను విశేషముగా అందించిన రచయిత కృషి - ప్రశంసనీయమైనది. కలియుగ మహత్వ మును గూర్చిన వ్యాసము కూడ - ప్రాచీన రీతి గణాంక వివరణలతో తెల్పబడినది. శ్రీ మహా భాగవతమందలి గల 'కలియుగ లక్షణము'- మరింత విపులముగా గలదు.

సర్వ శబ్దవాచ్యుడైన పరమాత్మను ప్రతిపాదించు వేదాంతము లను ఏకీకృతము గావించి, సులభావగాహనగా వ్యాసులవారు చెప్పిన సూత్రములు - బ్రహ్మప్రతిపాదకములై, బ్రహ్మసూత్రములైనవి. వ్యాసులవారు - వేదవ్యాసులైనారు. దీనియందలి 156 అధికరణ ములు, 4 అధ్యాయములు, 16 పాదములు, 545 సూత్రములు. వీనికి - శంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్య వ్యాఖ్య లున్నవి. ప్రస్తుత వ్యాసము - తట్టావారి 'వేదాంత సారము' - సవివరముగా వీనిని వివరించినది. విషయముచేతనే గాక, వివరణ యందును - ఇది దొక పెద్ద వ్యాసము, పరిశోధనా ఫలిత రచన.

శ్రీవైష్ణవులయం దొక కాలమున, వడగల - తెంగల శాఖా భేదములు పరాకాష్ఠ దశకు చేరి, తిరునామధారణ విషయమున న్యాయస్థానములకు వెళ్ళిన దశ కలదు. ఈనాడు అంత తీవ్రత లేకున్నను, వీరి సంప్రదాయానుసరణ భేదముల తెలిసికొనుట అవసర మను భావనతో - 'వడగల - తెంగల సంప్రదాయ భేదములు' అను

వ్యాసము కలదు. ముఖ్యమైన భేద భావములను రచయిత తెల్పినారు. కాని, ప్రపత్తి విషయమున వచ్చిన అభిప్రాయ భేదముల వివరణము నొసంగిన - మరింత బాగుగా నుండెడిది. ఉభయుల తిరునామ ధారణ విషయమున గల ఉపపత్తులను కూడ చేర్చినారు. ఒకరిది - మార్జాల కిశోర న్యాయము; మరియొకరిది మర్కట కిశోర న్యాయము. ఇది ప్రసిద్ధమైన ప్రచారము.

14 - వ సంపుటమునందు శ్రీరంగ క్షేత్రమును గూర్చిన వ్యాసము కలదు. ఈ 15 - వ సంపుటమునందు - కంచి 'వరదరాజ క్షేత్ర వైశిష్ట్యము' అను రచన యున్నది. శ్రీవైష్ణవులకు సరమ ప్రాప్యము లయిన క్షేత్రములలో - శ్రీరంగము, 'ద్వయము'నకు, కాంచి - అష్టాక్షరికి, తిరుమల - 'చరమము'నకు నిర్ణీతములు. ఇందు వలన, వీనిని సేవింపవలెను. కావుననే ఈ సంపుటమున కాంచి గూర్చిన వ్యాసము - పూర్వ పూర్వ రాజుల కాలమునుండి - తంజావూరు రాజుల వరకు - ఎవరు ఎట్లు దీనిని అభివృద్ధిపరచి సేవించినది వివరించి, క్షేత్ర ప్రశస్తి - శిల్ప సౌందర్యము - అర్చన - ఉత్సవాదులు - స్వామివారిని గూర్చి వివిధ భాషలలో వెల్వడిన సాహిత్యము - శ్రీమ ద్రామానుజాదుల కైంకర్య విశేషములు మొదలగున వన్నియు ఈ వ్యాసమున గలవు. మొత్తముపై - ఈ పూర్ణిమ కౌముది యందలి రచనలు — ఆలోచనాత్మకములు.

వివిధ శీర్షికల రచనల తెప్పించి, పరిశీలించి, సవరించి, వానిని సర్వాంగ సుందరముగా తీర్చి దిద్ది, పాఠకుల కందించుటయందు గ్రంథ సంపాదకు లెంత శ్రమను వహించుచున్నారో - సహృదయ పాఠక మహాశయులకు తెలియనిది కాదు.

వీరి పరిశ్రమను - సర్వాంగశోభితముగా వెలువడుచున్న ఈ సంపుటముల గూర్చి 'ప్రముఖుల ప్రశంసలు', 'శ్రీ రామకృష్ణ ప్రభ' (జనవరి 1995), న్యూస్ టైమ్ (18-9-1994) మొదలగువానిలోని వ్రాతలు - వీరి కృషిని స్వభావోక్తితోనే కొనియాడినవి. "రామానుజాచార్య దివ్యాజ్ఞా - వర్ధతా మభివర్ధతామ్" అనినట్లు, వీరి వరివస్యయైన ఈ కౌముదీ మహోత్సవము నిర్విఘ్నముగా కొనసాగుటకు - శ్రియఃపతి - వరదాచార్యులవారికి ఆయురారోగ్యభాగ్యములను ఇతోధికముగ ప్రసాదింపవలెనని ఆశింతము.



# ఆముక్త కళా వైశిష్ట్యము

' సాహిత్య విద్యా ప్రవీణ '

డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు,
ఎం. ఏ. పిహెచ్. డి.



## ఆశంస

సంసార ఘోర సంతాప తప్త చేతన సేచనీ ।
శ్రీమద్రామానుజమునేః జీయాచ్ఛ్రీ కీర్తి కౌముదీ ॥

## శ్రీ వైష్ణవ దర్శన వైశిష్ట్యము

శ్రీవైష్ణవ దర్శనము వైదికము. వేదములందలి విష్ణుసూక్తములలో నిక్షిప్తమైన దర్శనమును - పురాణములు, వైఖానస - పాంచరాత్రాగమములు నిరూపించినవి. ఆళ్వారుల దివ్య ప్రబంధములలో, వైదికమైన దర్శనములలో విగ్రహారూపమును సంతరించుకొని, ప్రపత్తి మార్గములో సర్వజనానుభవగోచరమైన ఆచార్య యుగములోని ఆచార్య పురుషుల తాత్త్విక దర్శన నిదర్శకములైన గ్రంథరాజములలో శ్రీవైష్ణవ దర్శనము దర్శన మిచ్చుచున్నది. శ్రీవైష్ణవ సంప్రదాయ వికాసమును మూడు యుగములుగా నిర్దేశించిన ప్రకారమునుబట్టి విభజింప నగును.

౧ : వేద - పురాణాగమ యుగము

౨ : ఆళ్వార్ యుగము

౩ : ఆచార్య యుగము

మొదటి యుగమునకు — నాలుగు వేదములు, త దుపబృంహక ములైన పురాణములలో - విష్ణు తత్త్వ ప్రతిపాదకము లగు సాత్త్విక పురాణములు, పాంచరాత్ర వైఖానసాగమములు,

రెండవ యుగమునకు చెందినవారు పన్నిద్దరాళ్వారులు. వారు అనుగ్రహించిన నాలాయిర దివ్య ప్రబంధములు — ఆర్ష దర్శనముగా విలసిల్లిన వైష్ణవ తత్త్వమును తమిళ భాషలో పాటలుగా, వర్గ విభేద ములకు అతీతముగా ఆవిష్కరించినవి. ఈ పన్నిద్దరాళ్వారులలో ముదలాళ్వారులు ముప్వురు ఏకాలమునాటివారలో స్పష్టముగ తెలియ కున్నను, వారి దివ్య ప్రబంధములు మూడు - నాలాయిరములో చేర్చ బడియున్నవి. మిగిలిన తొమ్మిదిమంది అళ్వారులలో చివరివా రగు తిరుమంగై యాళ్వారులు ఏడవ శతాబ్దమునకు చెందినవారని ఆధు నిక చరిత్రకారుల నిర్ణయము. ఆ తరువాత, అనగా — ఎనిమిదవ శతాబ్దము ప్రారంభించి శ్రీమన్నాధమునులు, శ్రీమద్యామునులు, భగవద్రామానుజులు, వేదాంత దేశికాది ఆచార్యులు - సంస్కృత మాధ్యమముగా, ప్రస్థాన త్రయ భాష్య విరచనము ద్వారా, భార తీయ వేదాంత దర్శనము సందలి మత త్రయములో రెండవదిగా, ప్రపన్న జన హృదయములలో మొదటిదిగా వెలసిన ఈ వైష్ణవ దర్శనమును విశిష్టాద్వైతముగా జగద్విఖ్యాతము గావించిరి.

## అమృత కళా కౌముదీ ప్రాశస్త్యము

ఈ ఆచార్య పరంపర అవిచ్ఛిన్నముగా తరువాత కాలములో గూడ కొనసాగినది. శ్రీమ ద్రామానుజ దర్శనముగా విఖ్యాతమైన శ్రీవైష్ణవ దర్శనమును సమగ్రముగా లోకమున కందించు ప్రయ

త్నము తెలుగులో జరుగని కాలములో, శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యస్వామివారి సంపాదకత్వమున ప్రతిప త్కళగా ఆవిర్భవించిన శ్రీ రామానుజ కీర్తి కౌముది - 15 భాగములుగా నేటి వఱకు తత్త్వ జిజ్ఞాస లోకమున తనిసి, పదునాఱు కళలతో అమృత కళగా పరిపూర్ణమై, శ్రీవైష్ణవ దర్శనమును అనితర సాధారణ శైలితో, విశ్వతోముఖముగా ఆంధ్రలోకమునందే గాక, దేశ విదేశములలో విశదము చేసినవి. ఈ షోడశ కళలు - వేద పురాణాగమాళ్వార్ ఆచార్య యుగ పరివ్యాప్తమైన శ్రీమద్రామానుజ కీర్తి కౌముదిని సర్వానుభవ పథమునకు తీసికొనివచ్చియున్నవి. ఈ షోడశసంఖ్యపరిపూర్ణ తానిదర్శకము - షోడశ కళా విలాస భాసురములైన చంద్ర చంద్రికల వలె గాక, శ్రీమద్రామానుజ యతి చంద్ర కీర్తిచంద్రికలు, సంసార ఘోర సంతాప నిర్వాపణములు, తత్త్వ జిజ్ఞాస విబుధులకు అమృత సంతర్పణములు; అక్షీణ కళా విలాస భాసురములు. షోడశ సంఖ్య చాల విశిష్టమైనది. భగవానుడు షోడశ గుణ పూర్ణుడనీ, శ్రీమద్రామాయణ బాలకాండములోని ఆదిమ సర్గములో వాల్మీకి నారదమునిని షోడశ గుణ పూర్ణుడైన పురుష చంద్రుని గూర్చి పరిప్రశ్న చేసినపుడు - ఈ గుణముల ప్రశంసనము జరిగెను. మానవుడు షోడశ కళాపూర్ణుడు. మానవుడనగా - "జీవుడు" అని ఇచట తాత్పర్యము. ఉపనిషత్తులు - పురుషుడు షోడశకళావిశిష్టు డని ఉద్ఘోషించియున్నవి.

ప్రశ్నోపనిషత్తులో ఒక కథ ఉన్నది. కోసల దేశాధిపతియైన హిరణ్యనాభుడు అను రాజపుత్రుడు - భరద్వాజ వంశజుడైన సుకేశుని ఇట్లు ప్రశ్నించెను :-

"ప్రాణాది నామాంతములైన షోడశ (16) కలలు గల పురుషునిగురించి నీ వెఱుగుదువా?" అని. ఈ ప్రశ్నకు సుకేశుడు సమాధానము చెప్పజాలడయ్యెను. సమాధానము పొందకయే రాజకుమారుడు రథ మధిరోహించి, వెనుదిరిగిపోయెను. సమాధానము చెప్పజాలని సుకేశుడు సిగ్గిలి, జిజ్ఞాసువుకు సమాధానముగా గురువు ఇట్లనెను :-

"ఇహైవాన్తశ్శరీరే సోమ్య । స పురుషో యస్మిన్నేతాః షోడశ కలాః ప్రభవన్తి ।"

"ఈ శరీరమునకు లోపలనే - షోడశ కళాన్విష్ఠాత యగు పురుషు డున్నాడునాయనా !" అని దానినే వివరించినాడు గురువు.

"స ఈక్షాం చక్రే కస్మి న్నహ ముత్క్రాన్తో భవిష్యామి కస్మిన్ వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామీతి స ప్రాణమసృజత । ప్రాణాత్ శ్రద్ధాం, ఖం, వాయు, ర్జ్యోతి, రాపః, పృథివీంద్రియం, నామ చ ।"

ఆ జీవుడు - నేను ఉత్క్రాంతిని పొందినపుడు, దేహమును విడిచి బయ ల్వెడలినపుడు - నాతో ఉత్క్రాంతిని పొందునవి ఏవి?" అని పర్యాలోచించి, ఆ జీవుడు ముఖ్య ప్రాణమును సృజించెను. ముఖ్య ప్రాణము నుండి శ్రద్ధను (ఆస్తిక్య బుద్ధిని,) పంచ మహాభూతములను, వాక్కు మొదలైన ఇంద్రియములను, మనస్సును, వ్రీహి మొదలైన అన్నమును, ఆ అన్నమునకు ఆయత్తమైయున్న శరీరేంద్రియసామర్థ్యరూపమైన వీర్యమును, శరీర శోషణాది రూపమైన తపస్సును, ఋగ్యజుస్సామాది రూపము లగు మంత్రములను, జ్యోతిష్టోమాది కర్మలను, కర్మఫలములైన స్వర్గాది లోకములను, ఆ లోకములలో స్వర్గాది నామములను సృజించెను.

"స యథే మాః సద్యః స్యందమానాః సముద్రాయణాః సముద్రం ప్రాప్య అస్తం గచ్ఛన్తి । భిద్యేతే తాసాం నామరూపే సముద్ర ఇత్యేవం ప్రోచ్యతే । ఏవ మేవాఽస్య పరిద్రష్టు రిమాః - షోడశ కళాః పురుషాయణాః పురుషం ప్రాప్య అస్తం గచ్ఛన్తి । భిద్యతే తాసాం నామరూపే । పురుష ఇ త్యేవం ప్రోచ్యతే । స ఏషోఽకలోఽమృతో భవతి."

ఎట్లు నదులు ప్రవించుచు, సముద్రోన్ముఖముగా ప్రయాణించుచు - సముద్రమును చేరి, దానిలో కలిసిపోవునో - అప్పుడు వానికి గల స్వతంత్ర నామ రూపములు లయమై, 'సముద్రము' అని మాత్రమే అఖండమైన నామ మేర్పడునో - అట్లే, ఈ భోక్తయైన జీవునకు భోగోపకరణములైన ఈ పదునారు కళలు - నిరుపాధిక పురుషునిగా చెప్పబడు పరమాత్మయైన వాసుదేవునిలోచేరి, లయమగుచున్నవి. ఈ పదునారు కళలు జీవునకు భోగ్య - భోగస్థాన - భోగోపకరణత్వాది నామ రూప భేద పరమాత్మలో లేవు గనుక, పరమాత్మ నిష్కళుడు - లేక, అకళుడు.

ఈ శ్లోకము దీనినే ఇట్లు చెప్పుచున్నది -

"అరా ఇవ రథ నాభౌ కలా యస్మిన్ ప్రతిష్ఠితాః । తం వేద్యం పురుషం వేద । యథా మావో మృత్యుః పరివ్యథా ఇతి ॥

రథపు నాభికి అరములు (ఆకులు) ఉన్నట్లు - ఏ పరమాత్మ యందు షోడశ కళలు లయమై యున్నవో, ఆ పరమపురుషుడే పూర్ణుడు. ఆయన నెఱిగినవానికి మృత్యువు తన చెంతకు రాగదు" అని గురువు షోడశ కళా తత్త్వమును, తత్కళాపూర్ణ సకళ జీవుని నిష్కళ పరమాత్మను గుఱించి బోధించెను.

ఈ ఔపనిషద కథను బట్టి, పదునాఱు కళలతో పురుషుడు పూర్ణుడనియు, దేహత్యాగానంతరము పరమాత్మ సంప్రాప్తిచేత అమృతస్థితిని పొందుననియు చెప్పబడినది. ఈ కళలకు హ్రాస వృద్ధులు చెప్పబడినవి. ఛాందోగ్యోపనిషత్తులోని - ఆఱవ అధ్యాయ మందలి ఏడవ ఖండమున - "పదునైదు దినములు ప్రాణి నీరు త్రావక ఉండజాలడు, అన్నము తినకుండ ఉండగలడు. పదునాఱవ నాటికి ఏక కళావశిష్టుడై, పురుషు డుండును. క్రమముగా పదునైదు దినములు భుజించినయెడల, పదునాఱవనాటికి షోడశ కళా పుష్టి కలుగును.

చంద్రుడు కూడ షోడశ కళా పూర్ణుడే. శుక్ల ప్రతిపత్తు నుండి పదునైదు కళలు ప్రతి దినము పరిపుష్ట మగును. సహజముగ ఎప్పు డును ఒక కళ మిగిలియే యుండును. అమావాస్యనాడు కూడ - పదునైదు కళలు పోయినను - ఒక కళ మిగిలి యుండును. పున్నమి నాటికి షోడశకళాపూర్ణుడు.

మానవునిలో - షోడశస్థానములందు ప్రాణశక్తి ఊర్ధ్వ క్రమ ణము చేసి, పదునాఱవ స్థానములో పరిపూర్ణస్థితిని పొందునని - తంత్రాగమశాస్త్ర మర్యాద. (1) మూలాధారము (2) స్వాధిష్ఠా నము (3) మణిపూరకము (4) అనాహతము (5) విశుద్ధము (6) ఆజ్ఞా (7) సహస్రారము (8) బిందువు (9) అర్ధచంద్రము (10) రోధిని (11) నాదము (12) నాదాంతము (13) శక్తి (14) వ్యాపిక (15) సమనా (16) ఉన్మనీ - ఇట్లు 16 స్థానములు దాటిన పిమ్మట, 'మహా బిందువు' అను స్థాన ముండును. 'సమనాడు' అను స్థానము వఱకు - కాలాన్వితములు. ఆ తరువాత - కాలా తీత స్థితి, అదియే పరమాత్మయైన శ్రీమన్నారాయణుని ---

అవిచ్ఛిన్న స్థానము. మూలాధారమునుండి ఏ ప్రాణి స్పందన, లేక - స్ఫూర్తి కలదో, అదియే శ్రీస్వరూపము. ఇచ్ఛా - జ్ఞాన - క్రియా శక్తులకు మూల స్రోతస్సు - ఈ శ్రీదేవియే. ఆమెయే అమృత కళ.

## ముగింపు

ఇట్లు పదునారు సంఖ్యకు - 16 కళలకు, వాని పరిపుష్టి కల పూర్ణచంద్రుని, పూర్ణజీవుని షోడశ కలా పూర్ణచంద్రుని, శ్రీమ ద్రామానుజ మునిచంద్రుని యశో విశేషమును జగద్విశ్రుతము కావింపదలచి, షోడశ భాగపరిపూర్ణమైన విజ్ఞాన సర్వస్వ మావిర్భ వించెనది. ప్రతిపత్తునుండి - పూర్ణిమ వఱకు గల పదునైదు కళల నింపుకొని, నిత్యానపాయిని - పదునాఱవ కళ యగు శ్రీదేవి నెడబాయని పరిపూర్ణతతో ప్రకాశించుచు, యశశ్చంద్రికలను దశదిశల వెదజల్లుచున్నాడు శ్రీ రామానుజ చంద్రుడు.

ప్రతిప త్కళా ప్రకాశ మందే -

**"ఇది రామానుజ కీర్తి కౌముది - కళా హేవాక మాధ్వీక సర**
**వదకుం దావల, మిద్ది వైష్ణవ జన ప్రత్యక్ష మందార, మి**
**య్యది లోకాభ్యుదయైకమూల, మిది కల్యాణ ప్రభాసారమున్**
**పిదుకన్ వేలుపు గిడ్డి భక్తులకు - దీపించున్ శుభోదర్కమై."**

అని - యీ కౌముదీ ప్రభావ విశేషము వివరింపబడినది.



# శ్రీ మహాలక్ష్మీ వైభవము

' విద్యా భూషణ - కవితా విశారద '

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు



## 1. ప్రణామాంజలి

"లక్ష్మీం క్షీర సముద్రరాజ తనయాం - శ్రీరంగధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవ వనితాం - లోకైక దీపాంకురామ్ ।
శ్రీమ న్మంద కటాక్ష లబ్ధ విభవ ద్బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం - వందే ముకుందప్రియామ్."

## 2. ప్రవేశిక

శ్రీ లక్ష్మీదేవి - సర్వైశ్వర్యములకు, సకల సౌభాగ్యములకును - నిలయమైనది. కావున, ఆ జగన్మాతను స్తుతించి, ఆరాధించి, ఆమె యనుగ్రహ భాగ్యమును పొందుట - ప్రతి మానవునకు ఆవశ్యకమైయున్నది.

లక్ష్మీ యనుగ్రహము లేనియతఁడు - బహువిధ వ్యథలతో దారిద్ర్య బాధలతో అలమటించి, క్రుంగి, కృశించి, నశించిపోవుట సహజము.

లక్ష్మీపురుషకారము లేనియతఁడు - సర్వజగదాధారుఁ డగు విష్ణుభగవానుని కరుణా కటాక్ష వీక్షములను పొందుట - కష్టసాధ్యము.

కావున, ఐహికముగ గాని, ఆముష్మికముగ గాని - మేలు కలుగవలె నన్న, లక్ష్మీదేవిని ఆశ్రయించుట - అనివార్యమై యున్నది. ఈ కారణముచే - ఆ లోకమాతను ప్రసన్నము గావించు కొనుటకై, ఆ శ్రీదేవి యొక్క కల్యాణ గుణములను, ప్రభావాదులను స్తుతించుట - అత్యంతము - ప్రయోజనకరమైయున్నది.

## 3. అవతార విశేషములు

విష్ణు భగవానుఁడు భూమండలముపై అవతారమును ధరించున పు డెల్లను, తోడనే – లక్ష్మీదేవియు - ఆ యవతారమునకు తగిన యవతారమును ధరించుచుండును.

"ఏవం యదా జగ త్స్వామీ - దేవదేవో జనార్దనః ।
అవతారం కరో త్యేషా - తదా శ్రీ స్త త్సహాయనీ."

అను విష్ణుపురాణ వాక్యమే (1-9-142) ఇందులకు పరమ ప్రమాణము.

"రాఘవత్వే భవే త్సీతా - రుక్మిణీ కృష్ణజన్మని ।
అన్యేషు చావతారేషు - విష్ణో రేషాఽనపాయినీ."
– (విష్ణు పురాణము : 1-10-144)

రామావతారమునందు సీతగా, కృష్ణావతారమునందు రుక్మిణిగా లక్ష్మీదేవి అవతరించెను ఇతరములైన అవతారములందును ఆమె - విష్ణుభగవానునకు అనపాయినిగా (వెంట నంటియే) ఉండెను.

విష్ణు పురాణ మిట్లు వివరించుచుండ, బ్రహ్మవైవర్త పురాణము లక్ష్మీదేవి యొక్క అవతార విశేషముల మఱికొన్నింటిని అభివర్ణించుచు, లక్ష్మీదేవి - శ్రీ వైకుంఠములో శ్రీ మహాలక్ష్మిగా, స్వర్గలోకములో స్వర్గలక్ష్మిగా, గోలోకములో రాధగా, పాతాళ లోకములో రాజ్యలక్ష్మిగా - గృహములో గృహలక్ష్మిగా, యజ్ఞములో దక్షిణగా, చంద్రమండలములో కాంతిగా వ్యాప్తిఁ జెంది యున్నట్లు వర్ణించుచున్నది. (2-35).

## 4. లక్ష్మీదేవి, విష్ణువు - ఒకే రూపము - సర్వ మయము

"నిత్యై వేషా జగ న్మాతా - విష్ణో శ్శ్రీ రనపాయినీ
యథా సర్వగతో విష్ణుః - త థై వేదం ద్విజోత్తమ ।
అర్థో విష్ణు రియం వాణీ - నీతి రే షావయో హరిః
బోధో విష్ణు రియం బుద్ధిః - శ్రీ ర్భూమి ర్భూధరో హరిః
సంతోషో భగవాన్ విష్ణుః - తుష్టి ర్మైత్రేయ శాశ్వతీ
ఇచ్ఛా శ్రీ ర్భగవాన్ కామో - యజ్ఞోఽ సౌ దక్షిణా తు వా
ఆజ్యాహుతీ రసౌ దేవీ - పురోడాశో జనార్దనః
సామస్వరూపీ భగవాన్ - ఉద్గీతః కమలాలయా
స్వాహా లక్ష్మీ ర్జగన్నాథో - వాసుదేవో హుతాశనః
శంకరో భగవాన్ విష్ణుః - గౌరీ లక్ష్మీ ర్ద్విజోత్తమ ।
మైత్రేయ! కేశవ స్సూర్యః - తత్ప్రభా కమలాలయా
విష్ణుః పితృగణః పద్మా - స్వధా శాశ్వత పుష్టిదా
ద్యౌ శ్శ్రీ స్సర్వాత్మకో విష్ణుః - అవకాశోఽతివిస్తరః

శశాంక శ్శ్రీధరః కాంతిః - శ్రీ స్తస్యైవానపాయినీ
ధృతి ర్లక్ష్మీ ర్జగచ్చేష్టా - వాయు స్సర్వత్రగో హరిః
జలధి ర్ద్విజ గోవింద స్త ద్వేలా శ్రీ ర్మహామతే !
లక్ష్మీస్స్వరూప మింద్రాణీ - దేవేంద్రో మధుసూదనః
యమ శ్చక్రధర స్సాక్షాత్ - ధూమోర్ణా కమలాలయా
బుద్ధి శ్శ్రీ శ్శ్రీధరో దేవః - స్వయ మేవ ధనేశ్వరః
గౌరీ లక్ష్మీ ర్మహాభాగ ! కేశవో వరుణ స్స్వయమ్
శ్రీ ర్దేవసేనా తద్భర్తా - దేవసేనాపతి ర్హరిః
అవష్టంభో గదాపాణిః - శక్తి ర్లక్ష్మీ ర్ద్విజోత్తమ !
కాష్ఠా లక్ష్మీ ర్నిమేషోఽసౌ - ముహూర్తోఽసౌ కలాయ సా
జ్యోత్స్నా లక్ష్మీః ప్రదీపోఽసౌ - ముహూర్తోఽసౌ కలా తు సా
విభావరీ శ్రీ ర్దివసో - దేవ శ్చక్ర గదాధరః
వరప్రదో వరో విష్ణుః - వధూః పద్మవనాలయా
నదస్వరూపీ భగవాన్ – శ్రీ ర్నదీరూపసంస్థితా
ధ్వజ శ్చ పుండరీకాక్షః - పతాకా కమలాలయా
తృష్ణా లక్ష్మీ ర్జగ త్స్వామీ - లోభో నారాయణః పరః
రతీ రాగ శ్చ ధర్మజ్ఞ లక్ష్మీ ర్గోవింద ఏవ చ
కిం వాత్ర బహునోక్తేన ? సంక్షేపేణే వ ముచ్యతే
దేవ తి ర్య న్మనుష్యేషు - పున్నామా భగవాన్ హరిః
స్త్రీనామ్నా శ్రీశ్చ విజ్ఞేయా నానయో ర్విద్యతే పరమ్."

– (విష్ణు పురాణము : 1-8-17-35)

మైత్రేయుని ప్రశ్నకు - పరాశరుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చు చున్నాఁడు :- ఓ ద్విజోత్తమా ! ఈ జగన్మాత యగు లక్ష్మీదేవి - నిత్యురాలు. విష్ణువునకు అనపాయిని (విడువకుండునది). విష్ణువు వలెనే ఈమెయు - సర్వగతురాలు (అంతటను వ్యాపించి యుండు నట్టిది). విష్ణువు అర్థము, ఈమె వాక్కు. ఆ స్వామి ఉపాయము, ఈమె నీతి. విష్ణువు జ్ఞాని, ఈమె బుద్ధి. ఆయన ధర్మము, ఈమె సత్క్రియ. విష్ణువు స్రష్ట, ఈమె సృష్టి. శ్రీదేవి భూమి, ఆ స్వామి భూ భరుఁడు. ఆ భగవానుఁడు సంతోషము, ఈ భార్గవి శాశ్వత తుష్టి. ఆయన కామము, ఈమె ఇచ్ఛ. ఆయన యజ్ఞము, ఈమె దక్షిణ. జనార్దనుఁడు పురోడాశము, శ్రీహరిప్రియ ఆజ్యాహుతి. లక్ష్మి పత్నీశాల, మధుసూదనుఁడు ప్రాగ్వంశ. లక్ష్మి - చితి, హరి — యూపము. శ్రీదేవి సమిధ, భగవానుఁడు కుశము (దర్భ), విష్ణుభగవానుఁడు సామ స్వరూపి, కమలాలయ ఉద్గీత. నారాయ ణుఁడు శంకరుఁడు, లక్ష్మి గౌరి. కేశవుఁడు సూర్యుఁడు, కమలా లయ సూర్యప్రభ. విష్ణువు - పితృగణము, పద్మ శాశ్వత పుష్టి; నాయకురాలైన స్వధ. లక్ష్మి స్వర్గము, సర్వాత్మకుఁడు విష్ణువు. అతి విస్తరుడైన శ్రీధరుఁడు శశాంకుఁడు, ఆయనకు అనపాయినియైన కాంతి లక్ష్మి. విష్ణువు సర్వగామియైన వాయువు, లక్ష్మి జగచ్చేష్ట. గోవిందుఁడు జలధి, మహామతి యగు శ్రీదేవి - దాని చెలియనికట్ట లక్ష్మీ స్వరూపము, దేవేంద్రుఁడు మధుసూదనుఁడు. చక్రధరుఁడు యముఁడు, కమలాలయ ధూమోర్ణ. శ్రీదేవి బుద్ధి, కేశవుఁడు వరు ణుఁడు. శ్రీదేవి దేవసేన, ఆమె నాథుఁ డగు విష్ణుభగవానుఁడు దేవసేనాపతి (కుమారస్వామి). శ్రీహరి పురుషకారము, శక్తి

లక్ష్మి. ఆ స్వామి నిమేషము, ఈమె కాష్ఠము.[1] ఈమె కల,[2] ఆయన ముహూర్తము.[3] జ్యోత్స్న లక్ష్మి, ప్రదీపము సర్వేశ్వరుఁ డగు హరి. లత జగన్మాత, శ్రీవిష్ణువు వృక్షము. రేయి శ్రీదేవి, పవలు చక్రధరుఁడైన విష్ణుభగవానుఁడు. వరుఁడు విష్ణువు, వధువు లక్ష్మి. ధ్వజము పుండరీకాక్షుఁడు, పతాక కమలాలయ. లోభము జగత్స్వామి, తృష్ణ లక్ష్మి. రతిదేవి, మన్మథుఁడు గోవిందుఁడు. పలుమాట లేల ? దేవ - తిర్యక్ - మనుష్యులలో - పురుష నామము భగవానుఁ డగు హరి, స్త్రీ నామము శ్రీదేవి - అని తెలియనగును."

పైన పేర్కొనఁబడిన విష్ణు పురాణ వాక్యములనుఁబట్టి, జగన్నాథుఁడైన విష్ణుభగవానునకు, జగన్మాతయైన లక్ష్మీదేవికిని గల అవినాభావ సంబంధము సుస్పష్టము.

## 5. లక్ష్మీ నామములు - వాని తాత్పర్యములు

శ్లో॥ లక్ష్మీః పద్మాలయా పద్మా - కమలా శ్రీ ర్హరిప్రియా
ఇందిరా లోకమాతా మా - రమా మంగళదేవతా
భార్గవీ లోకజననీ - క్షీరసాగరకన్యకా ॥

౧. లక్ష్మి ౨. పద్మాలయా ౩. పద్మా ౪. కమలా ౫. శ్రీః ౬. హరిప్రియా ౭. ఇందిరా ౮. లోకమాతా ౯. మా ౧౦. రమా ౧౧. మంగళదేవతా ౧౨. భార్గవీ ౧౩. లోకజననీ ౧౪. క్షీరసాగర

1) పది రెప్పపాట్లు - ఒక కాష్ఠము.
2) ముప్పది కాష్ఠలు - ఒక కల.
3) ముప్పది కలలు - ఒక ముహూర్తము.

కన్యకా' అని - లక్ష్మీదేవికి పదునాల్గు (14) నామము లున్నట్లు - అమరసింహుని 'నామలింగానుశాసన' మను సంస్కృత నిఘంటువు మూలమున తెలియవచ్చుచున్నది. ఈ నామముల తాత్పర్యము లివి :-

౧) లక్ష్మీః :- ఈమె చేత సర్వము చూడబడును కావున, 'లక్ష్మీ' అని చెప్పఁబడుచున్నది.

౨) పద్మాలయా :- పద్మము నివాస స్థానముగాఁగలది.

౩) పద్మా :- పద్మము హస్తములో గలది.

౪) కమలా :- (1) ప్రకాశించునట్టిది. (2) కమలము చేతియందు కలది.

౫) శ్రీః :- (1) అందఱిచేతను ఆశ్రయింపఁబడునట్టిది. (2) విష్ణువును ఆశ్రయించునది.

౬) హరిప్రియా :- హరికి ప్రియురాలు.

౭) ఇందిరా :- పరమైశ్వర్యము గలది.

౮) లోకమాతా :- లోకము లన్నింటికి తల్లి.

౯) మా :- లోకమాత యను నామమునుండియే 'మా' అని - ఏకదేశగ్రహణము.

౧౦) రమా :- క్రీడించునది.

౧౧) మంగళదేవతా :- శుభముల నొసంగునది.

౧౨) భార్గవీ :- భృగుమహర్షి పుత్రిక.

౧౩) లోక జననీ :- లోకమునకు తల్లి.

౧౪) క్షీరసాగరకన్యకా :- పాలకడలి పట్టి.

## 6. లక్ష్మీ నామాంతరములు - వాని నిర్వచనములు

ఋగ్వేదాంతర్గత మగు శ్రీసూక్తములో - లక్ష్మీదేవిని గురించి - అరువది తొమ్మిది (69) విశేషణములు ప్రయోగింపబడి యున్నవి.

౧) అచ్యుతవల్లభా :- విష్ణుభగవానునకు దేవేరి.

౨) అనపగామినీ :- విష్ణుభగవానుని విడచిపోవనిది.

౩) అశ్వపూర్వా :- తన సముఖమున నడచు అశ్వపంక్తి గలది.

౪) అశ్వదా :- భక్తుల కోరికల ననుసరించి - వారికి గుఱ్ఱముల నిచ్చునది.

౫) ఆదిత్యవర్ణా :- సూర్యకాంతితో తుల్యమైన ప్రకాశము గలది.

౬) ఆర్ద్రా :- (1) గజేంద్రునిచే కొనిరాబడిన జలముతో అభిషిక్త యైనది. (సుస్నాత). (2) తన భక్తులకొఱకు దయార్ద్ర హృదయము గలట్టిది

౭) ఉదారా :- తన భక్తులకు సర్వార్థములను ప్రసాదించు ఉదార స్వభావము గలది.

౮) కరీషిణీ :- గజరాజుపై విహరించునది.

౯) కా :- ఆనందమయమైనది.

౧౦ క్షమా :- తన భక్తుల అపచారములను క్షమించునది.

౧౧. గంధద్వారా :- సువాసన యుక్తము లగు చందనపు ద్వార ములు గలది.

౧౨. గోదా :- తన భక్తుల కోరిక ననుసరించి - వారికి గోధనమును ఇచ్చునది.

౧౩ చంద్రా :- తన భక్తులను ఆనందింపఁజేయునది.

౧౪. జ్వలంతీ :- ప్రకాశవంతమైనది.

౧౫. తర్పయంతీ :- తన భక్తుల వాంఛలను సఫలము గావించి, వారిని తృప్తుల గావించునట్టిది.

౧౬. తృప్తా :- సత్యసంకల్పము కల దగుటచే - సంతతము ప్రసన్న వదనముతో, సంతృప్తి భావమున నుండునట్టిది.

౧౭. త్రిభువన భూతికరీ :- తన దయార్ద్ర దృష్టితో - ముల్లోకము లను వైభవ సంపన్నము చేయునట్టిది.

(జగన్నాథుఁ డగు విష్ణుభగవానుఁడు - జగ జ్జననియు, సకల సంపద లకు అధిష్ఠానదేవతయు నగు లక్ష్మీదేవికి - తన వక్షస్థలమున నిత్య నివాసము చేయుటకు అవకాశ మొసంగె ననియు, లక్ష్మీదేవి - ఆ విష్ణు వక్షస్థలమున విరాజమానయై, ముల్లోకములందలి తన భక్తులను కరుణా కటాక్షముతో కాపాడుచుండె ననియు - భాగవత పురాణ సూక్తి. 8-8-15)

౧౮. దురాధర్షా :- ఎవని క్షోభను - ఏమాత్రమేని సహింపనిది.

౧౯. దేవజుష్టా :- ఇంద్రాది దేవగణముచే సేవింపఁబడునట్టిది

౨౦. దేవ :- జగద్వ్యాపారములో (సృష్టి – స్థితి - సంహారము లనఁ బడు క్రియలలో) - నిమగ్నమై యుండునది.

౨౨. ధవళతరాంశుక గంధమాల్య శోభా :- స్వచ్ఛమైన తెల్లని పీతాంబరాది వివిధ వస్త్రములచేతను, గంధలేపనముచేతను, పుష్పమాలికలచేతను - శోభిల్లునట్టిది.

౨౩. నిత్యపుష్టా :- నిత్యము పుష్టిగా నుండునట్టిది.

౨౪. పద్మదళాయతాక్షీ :- పద్మదళములవంటి నేత్రములు గలది.

౨౫. పద్మప్రాప్తా :- పద్మము నివాస స్థానమై యుండునది.

౨౬. పద్మప్రియా :- పద్మము ప్రియముగా గలట్టిది.

౨౭. పద్మమాలినీ :- పద్మముల మాలలను తన కంఠమున ధరించు నట్టిది.

౨౮. పద్మసంభవా :- పద్మమునందు ఉద్భవించినట్టిది.

౨౯. పద్మవర్ణా :- పద్మము వంటి కమనీయమైన వర్ణము గలది.

౩౦. పద్మాననా :- పద్మపత్రము వంటి సుందరమైన ముఖము గలది

౩౧. పద్మాక్షీ :- పద్మపత్రములవంటి మనోహరములైన నేత్రములు గలది.

౩౨. పద్మినీ :- (1) పద్మము వలె శోభిల్లునట్టిది. (2) సువాసనలు వెదజల్లునట్టిది.

౩౩. పద్మేస్థితా :- పద్మపత్రమునందు ప్రకాశించునట్టిది.

౩౪. పద్మోరు :- యోగశాస్త్రానుగుణముగ - జంఘలను పద్మాసన రూపమున నుంచునట్టిది.

౩౫. పింగళా :- దీపశిఖవలె, ఉజ్జ్వలమైన శరీర వర్ణముగలది.

౩౬. పుష్కరిణీ :- కమలములను తన కరకమలములలో ధరించునది.

౩౭. పుష్టి :- (1) పోషణ స్వరూపముగలది. (2) తన భక్తులను పోషించునట్టిది.

౩౮. ప్రభాసా :- ఉత్తమమైన కాంతిచే ప్రకాశించునది.

౩౯. భగవతీ :- ఐశ్వర్య - లావణ్యాది షట్ (6) దివ్య గుణములతోఁ గూడినది.

౪౦. భూమీ :- విశేషమైన శక్తి గలది.

౪౧. మనోజ్ఞా :- (1) తన భక్తుల మనోభీష్టములను తెలియునది. (2) దివ్యమైన సౌందర్యము గలది.

౪౨. మహాధనా :- విశేషమైన ధనముగలది. (నవ నిధి నిలయ)

౪౩. మహాలక్ష్మీ :- (1) పూజనీయురాలు (2) నిరతిశయ దర్శన సంపన్న.

౪౪. మాతా :- జగజ్జనని.

౪౫. మాధవ ప్రియా :- విష్ణుభగవానుని ప్రియురాలు.

౪౬. మాధవీ :- మధువిద్య ద్వారా తెలిసికొనదగినట్టిది.

౪౭. యశసా జ్వలంతీ :- తన యశస్సుచే ప్రకాశించునది.

౪౮. యష్టి :- తన భక్తులచే పూజింపఁబడునట్టిది.

౪౯. రథమధ్యా :- దివ్యమైన తన రథమునందు ఆసీనమైనట్టిది.

౫౦. లక్ష్మీః :- తన భక్తులను ఉద్ధరించు ఉపాయమును ఆలోచించునట్టిది.

౫౧. విశ్వప్రియా :- (1) విశ్వమునకు ప్రియమైనట్టిది. (2) విశ్వ స్వరూపుఁడైన విష్ణుభగవానునకు ప్రియురాలైనట్టిది.

౫౨. విష్ణుపత్నీ :- విష్ణుభగవానులచే పొందఁబడిన జగద్రక్షణ రూప మగు యశముతో - భగవానునకు సర్వదా సహక రించునట్టిది.

౫౩. విష్ణుప్రియసఖి :- తన నాథుని అవతార సమయములలో - తాను ను ఆ స్వామి యవతారమునకు తగిన అవతారమును ధరించి, ఆ స్వామికి ప్రియురాలుగా నుండునది.

౫౪. విష్ణుమనోనుకూలా :- విష్ణుభగవానుని మనోభీష్టమునకు అను కూలముగ నుండునది.

౫౫. శ్రీః :- (1) విష్ణుభగవానుని ఊరు ప్రదేశము నాశ్రయించి, విరాజమాన మగునట్టిది. (2) భగవానుని వామ భాగమున - స్వర్ణ కాంతులతో భాసిల్లునట్టిది.

౫౬. సరసిజ నిలయా :- సరస్సులో నుద్భవించు కమలము - నివాస స్థాన మైనట్టిది.

౫౭. సరోజ హస్తా :- సరస్సులో నుద్భవించిన పద్మములు హస్తము లందు గలది.

౫౮. సర్వ భూతేశ్వరీ :- జీవరాసుల నన్నింటిని శాసించునది.

౫౯. సువర్ణ రజత స్రజా :- స్వర్ణ - రజత (రత్న ఖచిత) హారము లను ధరించునట్టిది.

౬౦. సువర్ణా :- సుందరమైన దేహకాంతి కలది.

౬౧. సూర్యాసదోఢా :- విష్ణుభగవానుని వామ భాగమున - నదోఢగా సూర్యకాంతి వలె తేజరిల్లునది.

౬౨. సోస్మితా :- చిరు నగవులు చిందించునది.

౬౩. హరిణీ :- తన భక్తుల పాప - తాపములను హరింపఁజేసి, వారిని విష్ణుభగవానునికడకు పంపునట్టిది.

౬౪. హరివల్లభా :- విష్ణుభగవానుని ప్రియసఖి.

౬౫. హస్తినాద ప్రబోధినీ :- తన భక్తుల గృహములలో - గజ రాజుల ఘీంకార ధ్వనిని విని, ఆనందించునట్టిది.

౬౬. హిరణ్మయీ :- సువర్ణ మయ మైనది.

౬౭. హిరణ్య ప్రాకారా :- సువర్ణ మయములైన ప్రాకారములు గలది.

౬౮. హిరణ్య వర్ణా :- తప్త కాంచన తుల్యము, కమనీయము నైన వర్ణము గలది.

౬౯. హేమ మాలినీ :- (1) సువర్ణ మాలలను ధరించునట్టిది. (2) స్వర్ణ మయమైన వైజయంతిని ధరించునట్టిది. (3) మరకత - మాణిక్యాది - పంచ రత్నములతో ఖచితములైన స్వర్ణ హార ములను ధరించునట్టిది.

ఈ పై పేర్కొనఁబడిన లక్ష్మీదేవియొక్క వర్ణనములను మనము - ఐదు విభాగముల గావింపవచ్చును —

1) స్వరూప సూచికములు :-

ఆనందమయా, మనోజ్ఞా, సర్వజ్ఞా మాతా - ఇత్యాదులు.

2) శ్రీమూర్తి పరములు :-

ఆదిత్యవర్ణా, ఆర్ద్రా, చంద్రా, జ్వలంతీ, ధవళతరాంశుక గంధ మాల్యశోభా, పద్మదళాయతాక్షీ, పద్మప్రియా, పద్మమాలినీ, పద్మ సంభవా, పద్మవర్ణా, పద్మనాభా, పద్మాక్షీ, పద్మినీ, పద్మేస్థితా, పద్మోరు, పింగళా, పుష్కరిణి, ప్రభాసా, సరసిజ నిలయా, సరోజ హస్తా, సువర్ణ రజత స్రజా, సువర్ణా, సోస్మితా, హిరణ్మయీ, హిరణ్యవర్ణా, హేమమాలినీ - ఇత్యాదులు.

3) పతిప్రేమ ప్రదర్శకములు :-

అచ్యుతవల్లభా, అనపగామినీ, మాధవ ప్రియా, విష్ణుపత్నీ, విష్ణుప్రియసఖీ, విష్ణుమనోఽనుకూలా, హరివల్లభా - ఇత్యాదులు,

4) వైభవప్రతిపాదితములు :-

అశ్వపూర్వా, కరీషిణీ, గంధద్వారా, తృప్తా, దురాధర్షా, దేవజుష్టా, నిత్యపుష్టా, భగవతీ, భూమిః, మహాధనాః, మహాలక్ష్మీః యశసాజ్వలంతీ, రథమధ్యా, సర్వభూతేశ్వరి, హస్తినాదప్రమోదినీ, హిరణ్యప్రాకారా - ఇత్యాదులు.

5) భక్తానుగ్రహపూరితములు :-

అశ్వారా, ఉదారా, క్షమా, గోదా, త్రిభువనమూర్తికరీ, ధనదా, పుష్టీ, హారిణీ - ఇత్యాదులు.



శ్రీ మహాలక్ష్మి

## 7. లక్ష్మీ సిద్ధికి - కొన్ని ప్రక్రియలు

శ్రీ మహాలక్ష్మీదేవి - సర్వ సంపదలకు అధిష్ఠావదేవత. కావున, ఆ లోకమాత యనుగ్రహమును పొందుటకు - స్తోత్రము, వ్రతము, ఉపాసనము, యాగము - మున్నగు వివిధ ప్రక్రియలు కొన్ని నిర్దేశింపఁబడియున్నవి. అట్టివానిలో - స్తోత్ర పారాయణము అత్యంతము సులభసాధ్యమైనది. అట్టి స్తోత్రములలో - 'లక్ష్మీ హృదయము' సుప్రసిద్ధమైనది. కావున, అయ్యది ఇట పొందుపరుపఁబడుచున్నది :-

## 8. శ్రీ మహా లక్ష్మీ హృదయ స్తోత్రము

హరిః ఓమ్॥ అస్య శ్రీ ఆద్యాది మహాలక్ష్మీహృదయస్తోత్ర మహా మంత్రస్య, భార్గవ ఋషిః, అనుష్టుభాది నానాచందాగ్ంసి. ఆద్యాది శ్రీ మహాలక్ష్మీ సహిత శ్రీమ న్నారాయణో దేవతా - శ్రీం బీజమ్, హ్రీం శక్తిః, ఐం కీలకం, ఆద్యాది శ్రీ మహాలక్ష్మీ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః.

ఓమ్, ఆద్యాది శ్రీ మహాలక్ష్మీ దేవతాయైనమః, హృదయే శ్రీం బీజాయ నమః, గుహ్యే హ్రీం శక్త్యైనమః, పాదయోః ఐం బలాయనమః, మూర్ధాది పాద పర్యన్తం విన్యసేత్. ఓమ్, శ్రీం, హ్రీం, ఐం, కరతల కర పార్శ్వయోః, శ్రీం అంగుష్ఠాభ్యాం నమః, హ్రీం తర్జనీభ్యాం నమః, ఐం మధ్యమాభ్యాం నమః, శ్రీం అనామికాభ్యాం నమః, హ్రీం కనిష్ఠికాభ్యాం నమః, ఐం కరతల కరపృష్ఠాభ్యాం నమః, శ్రీం హృదయాయ నమః, హ్రీం శిరసే స్వాహా, ఐం శిఖాయై వౌషట్, శ్రీం కవచాయహుమ్, హ్రీం నేత్రాభ్యాం వౌషట్, ఆం అస్త్రాయఫట్, భూ ర్భువ స్సువరోమ్ ఇతి దిగ్బంధః.

## అథ - ధ్యానమ్

హస్త ద్వయేన కమలే - ధారయంతీం స్వ లీలయా
హార నూపుర సంయుక్తాం - మహాలక్ష్మీం విచింతయేత్ ॥ ౧

కౌశేయ పీత వసనా మరవిందనేత్రాం
పద్మ ద్వయాభయ వరోద్యత పద్మహస్తాం ।
ఉద్య చ్ఛతార్క సదృశాం పరమాంక సంస్థామ్
ధ్యాయే ద్విధీశ నత పాదయుగాం జనిత్రీమ్ ॥ ౨

శ్రీ లక్ష్మీ కమలధారిణ్యై సింహ వాహిన్యై స్వాహా.

పీతవస్త్రాం సువర్ణాంగీం - పద్మహస్త ద్వయా న్వితామ్
లక్ష్మీం ధ్యా త్వేతి మంత్రేణ - స భవే త్పృథివీపతిః॥ 3

మాతులుంగ గదా ఖేటే - పాణౌ పాత్రం చ బిభ్రతీ
నాగలింగం చ మానం చ - బిభ్రతీ నృపమూర్ధని ॥ ౪

ఓమ్ శ్రీమ్ హ్రీమ్ ఐమ్.

* * * * *

వందే లక్ష్మీం పరశివమయీం - శుద్ధ జాంబూనదాభాం
తేజోరూపాం - కనక వసనాం - సర్వ భూషోజ్జ్వలాంగీమ్ ।
బీజాపూరం కనక కలశం హేమ పద్మం దధానం
ఆద్యాం శక్తిం సకల జననీం - సర్వ మాంగల్య యుక్తామ్॥1

శ్రీమ త్సౌభాగ్య జననీం - స్తౌమి లక్ష్మీం సనాతనీమ్ ।
సర్వకామ ఫలావాప్తి సాధనైక సుఖావహామ్ ॥ 2

స్మరామి నిత్యం దేవేశి ! త్వయా ప్రేరిత మానసః
త్వ దాజ్ఞాం శిరసా ధృత్వా - భజామి పరమేశ్వరీమ్ ॥ 3

సమస్త సంప త్సుఖదం మహాశ్రియం
సమస్త కల్యాణ కరీం మహాశ్రియమ్ ।
సమస్త సౌభాగ్యకరీం మహాశ్రియం
భజా మ్యహం జ్ఞానకరీం మహాశ్రియమ్ ॥ 4

విజ్ఞాన సంప త్సుఖదం మహాశ్రియం
విచిత్ర వాగ్భూతికరీం మనోరమామ్ ।
అనంత సౌభాగ్య సుఖ ప్రదాయినీం
నమా మ్యహం భూతికరీం హరిప్రియామ్ ॥ 5

సమస్త భూతాంతర సంస్థితా త్వం
సమస్త భ క్తేశ్వరి ! విశ్వరూపే !
త న్నాస్తి చాన్య ద్వ్యతిరి క్త వస్తు
త్వ త్పాద పద్మం ప్రణమా మ్యహం శ్రీః ॥ 6

దారిద్ర్య దుఃఖౌఘ తమోని హంత్రీ !
త్వత్పాద పద్మం మయి సన్నిధత్స్వ ।
దీనార్తి విచ్ఛేదన హేతుభూతైః
కృపాకటాక్షైః రభిషించ మాం శ్రీః ॥ 7

విష్ణుస్తుతిపరాం లక్ష్మీం - స్వర్ణ వర్ణ స్తుతిప్రియామ్
వరదాభయదాం దేవీం — వందే త్వాం కమలేక్షణే ! 8

అంబ! ప్రసీద కరుణా పరిపూర్ణ దృష్ట్యా
మాం త్వ త్కృపా ద్రవిణ గేహ మిమం కురుష్వ !
ఆలోకయ ప్రణత హృద్గత శోకహంత్రీ !
త్వ త్పాద పద్మ యుగళం - ప్రణమా మ్యహం శ్రీః ॥9

శాంత్యై నమోఽస్తు శరణాగత రక్షణాయై
కాంత్యై నమోఽస్తు కమనీయ గుణాశ్రయాయై ।
క్షాంత్యై నమోఽస్తు దురితక్షయ కారణాయై
ధాత్ర్యై నమోఽస్తు ధన ధాన్య సమృద్ధిదాయై ॥ 10

శక్త్యై నమోఽస్తు శశిశేఖర సంస్థితాయై
రత్యై నమోఽస్తు రజనీకర సోదరాయై ।
భక్త్యై నమోఽస్తు భవసాగర తారకాయై
మత్యై నమోఽస్తు మధుసూదన వల్లభాయై॥ 11

లక్ష్మ్యై నమోఽస్తు శుభలక్షణ లక్షితాయై
సిద్ధ్యై నమోఽస్తు సురసిద్ధ సుపూజితాయై ।
ధృత్యై నమోఽస్తు మమ దుర్గతి భంజనాయై
గత్యై నమోఽస్తు సరసద్గతి దాయకాయై ॥ 12

దేవ్యై నమోఽస్తు దివి దేవగణార్చితాయై
భూత్యై నమోఽస్తు భువనార్తి వినాశకాయై ।
శాంత్యై నమోఽస్తు ధరణీధర వల్లభాయై
పుష్ట్యై నమోఽస్తు పురుషోత్తమ వల్సలాయై ॥ 13

సుతీవ్ర దారిద్ర్య తమోపహంత్ర్యై
నమోఽస్తు తే సర్వభయాపహంత్ర్యై।
శ్రీవిష్ణు వక్షస్థ్సల సంస్థితాయై
నమో నమ స్సర్వ విభూతిదాయై ॥ 14

జయతు జయతు లక్ష్మీ ర్లక్షణాలంకృతాంగీ
జయతు జయతు పద్మా - పద్మసద్మాభివంద్యా ।
జయతు జయతు విద్యా విష్ణువామాంకసంస్థా
జయతు జయతు సమ్య క్సర్వ సంపత్కర శ్రీః ॥ 15

జయతు జయతు దేవీ - దేవ సంఘాభిపూజ్యా
జయతు జయతు భద్రా - భార్గవీ భాగ్యరూపా ।
జయతు జయతు నిత్యా - నిర్మల జ్ఞానవేద్యా
జయతు జయతు సత్యా - సర్వభూతాంతరస్థా ॥ 16

జయతు జయతు రమ్యా - రత్నగర్భాంతరస్థా
జయతు జయతు శుద్ధా - శుద్ధ జాంబూనదాభా ।
జయతు జయతు కాంతా - కాంతి మ ద్భాసితాంగీ
జయతు జయతు శాంతా - శీఘ్ర మాగచ్ఛ సౌమ్యే ॥ 17

యస్యాః కలాయాః కమలోద్భవాద్యా
రుద్రా శ్చ శక్రప్రముఖా శ్చ దేవాః ।
జీవంతి సర్వేఽపి సశక్తయ స్తే
ప్రభుత్వ మాప్తాః పరమాయుష స్తే ॥ 18

ముఖ బీజమ్. ఓమ్. హామ్. ప్రామ్. అమ్ అమ్ యమ్ దుమ్ లమ్. వమ్.

లిలేఖ నిటలే విధి ర్మమలిపిం విసృజ్యాంతరం
త్వయా విలిఖితవ్య మేత దితి తత్ఫల ప్రాప్తయే ।
తదంతిక ఫలం స్ఫుటం కమలవాసిని శ్రీ రిమాం
సమర్పయ సముద్రికాం - సకల భాగ్య సంసూచికామ్॥19

కలయా తే యథా దేవి ! జీవంతి సచరాచరాః ।
తథా సంపత్కరీ లక్ష్మీః - సర్వదా సంప్రసీద మే ॥ 20

యథా విష్ణు ర్ధ్రువం నిత్యం - స్వకలాం సన్న్యవేశయత్ ।
తథైవ స్వకలాం లక్ష్మి ! మయి సమ్యక్ సమర్పయ ॥ 21

సత్య సౌఖ్య ప్రదే దేవి ! భక్తానా మభయప్రదే
అచలాం కురు యత్నేన - కలాం మయి నివేశ్యతామ్॥22

మదాస్తాం మత్ఫాలే పరమపద లక్ష్మి స్ఫుట కలా
సదా వైకుంఠశ్రీ ర్నివసతు కలా మే నయనయోః ।
వసే త్సత్యే లోకే మమ వచసి లక్ష్మి ర్వరకలా
శ్రియ శ్శ్వేత ద్వీపే నివసతు కలా మే స్వకరయోః ॥ 23

నేత్ర బీజమ్. ఓమ్. హ్రూమ్. హ్రీమ్. హ్రేమ్ - హైృమ్ హ్రోమ్. హ్రౌమ్.
హ్రమ్ హ్రః.

తావ న్నిత్యం మమాంగేషు - క్షీరాబ్ధౌ శ్రీకలా వసేత్ ।
సూర్యాచంద్రమసౌ యావ త్తావ లక్ష్మీపతిశ్రియా ॥ 24

సర్వమంగళ సంపూర్ణా - సర్వైశ్వర్య సమన్వితా ।
ఆద్యాది శ్రీ మహాలక్ష్మి ! త్వత్కలా మయి తిష్ఠతు॥25

అజ్ఞాన తిమిరం హంతుం - శుద్ధజ్ఞాన ప్రకాశికా ।
సర్వైశ్వర్య ప్రదా మేఽస్తు-త్వత్కలా మయి సంస్థితా॥ 26

అలక్ష్మీం హరతు క్షిప్రం - తమ స్సూర్యప్రభా యథా ।
వితనోతు మమ శ్రేయః - త్వ త్కలా మయి సంస్థితా॥ 27

ఐశ్వర్య మంగలోత్పత్తిః - త్వ త్కలాయాం విధీయతే ।
మయి తస్మా త్కృతార్థోఽస్మి - పాత్ర మస్మి స్థితే స్తవ॥28

భవ దావేశ భాగ్యార్హో - భాగ్యవా నసి భార్గవి ।
త్వ త్ప్రసాదా త్పవిత్రోఽహం - లోకమాత
ర్నమోఽస్తు తే ॥ 29

పునాసి మాం త్వత్కలయైవ యస్మా
దత స్సమాగత్య మమాగ్రత స్త్వమ్ ।
పరంపదం శ్రీ ర్భవ సుప్రసన్నా
మయ్యచ్యుతే న ప్రవిశాధి లక్ష్మీః ॥ 30

శ్రీ వైకుంఠ స్థితే లక్ష్మి ! సమాగచ్ఛ మమాగ్రతః ।
నారాయణేన సహ మాం కృపా దృష్ట్యాఽవలోకయ॥ 31

సత్యలోక స్థితే లక్ష్మి ! త్వం మమాగచ్ఛ సన్నిధిమ్ ।
వాసుదేవేన సహితా - ప్రసీద వరదా భవ ॥ 33

శ్వేతద్వీప స్థితే లక్ష్మి ! శీఘ్ర మాగచ్ఛ సువ్రతే ।
విష్ణునా సహితా దేవి ! జగన్మాతః ప్రసీద మే ॥ 33

క్షీరాంబుధి స్థితే లక్ష్మి ! సమాగచ్ఛ సమాధవే ।
త్వత్కృపాదృష్టి సుధయా - సతతం మాం విలోకయ॥ 34

రత్నగర్భస్థితే లక్ష్మి ! పరిపూర్ణ హిరణ్మయి !
సమాగచ్ఛ సమాగచ్ఛ - స్థిత్వాఽశు పురతో మమ॥ 35

స్థిరా భవ మహాలక్ష్మి ! నిశ్చలా భవ నిర్మలే
ప్రసన్న కమలే దేవి ! ప్రసన్న హృదయా భవ ॥ 36

శ్రీధరే శ్రీమహాలక్ష్మి ! త్వ దంతస్థం మహానిధిన్ ।
శీఘ్ర ముద్ధృత్య పురతః - ప్రదర్శయ సమర్పయ ॥ 37

వసుంధరే శ్రీవసుధే - వసుదోగ్ధ్రి కృపా మయి
త్వ- త్కుక్షిగత హేమాదీన్ - సంప్రదర్శయ దర్శయ॥38

విష్ణుప్రియే రత్నగర్భే - సమస్త ఫలదే శివే ।
త్వ ద్గర్భగత హేమాదీన్ - సంప్రదర్శయ దర్శయ ॥ 39

రసాతల గతే లక్ష్మి ! శీఘ్ర మాగచ్ఛ మే పురః ।
న జానే పరమం రూపం - మాత ర్మే సంప్రదర్శయ ॥ 40

ఆవిర్భవ మనో వేగాత్ - శీఘ్ర మాగచ్ఛ మే పురః ।
మా వత్స! భీరిహే త్యుక్త్వా-కామంగౌ రివ రక్ష మామ్॥ 41

దేవి ! శీఘ్రం మమాగచ్ఛ - ధరణీ గర్భ సంస్థితే ।
మాత స్త్వ ద్భృత్య భృత్యోఽహం - హృదయే త్వాం కుతూహలాత్ ॥ 42

ఉత్తిష్ఠ జాగృహి మయి - సముత్తిష్ఠ సుజాగృహి ।
అక్షయ్యాన్ హేమ కలశాన్ - సువర్ణేన సుపూరితాన్ ॥43

నిక్షేపాన్ మే సమాకృష్య - సముద్ధృత్య మమాగ్రతః ।
సమున్నతాననా భూత్వా - సమ్యక్ దేహి ధరాతలాత్ ॥

మ త్సన్నిధిం సమాగచ్ఛ - మ దాహిత కృపారసా ।
ప్రసీద శ్రేయసాం దోగ్ధ్రి - లక్ష్మీ మ్మే నయనాగ్రతః॥ 45

అత్రోపవిశ్య లక్ష్మి ! త్వం - స్థిరా భవ హిరణ్మయీ ।
సుస్థిరా భవ సంప్రీతా - ప్రసన్నా వరదా భవ ॥ 46

ఆనీతాం స్తు త్వయా దేవి ! నిధీన్మే సంప్రదర్శయ ।
అద్యక్షణేన సహసా - దత్వా సంరక్ష మాం సదా ॥ 47

మయి తిష్ఠ తథా నిత్యం - యథేంద్రాదిషు తిష్ఠతి ।
అభయం కురు మే దేవి ! మహాలక్ష్మి నమోఽస్తు తే॥ 48

సమాగచ్ఛ మహాలక్ష్మి ! శుద్ధ జాంబూనద స్థితే ।
ప్రసీద పురతః స్థిత్వా - ప్రణతం మాం విలోకయ ॥ 49

లక్ష్మీ ర్భువం గతా భాసి - యత్ర యత్ర హిరణ్మయీ ।
తత్ర తత్ర స్థితా త్వం మే - తవ రూపం ప్రదర్శయ ॥ 50

క్రీడంతీ బహుధా భూమౌ - పరిపూర్ణ కృపా మయి ।
మమ మూర్ధని తే హస్త మవిలంబిత మర్పయ ॥ 51

ఫల భాగోదయే లక్ష్మి ! సమస్త పురవాసిని ।
ప్రసీద మే మహాలక్ష్మి ! పరిపూర్ణ మనోరథే ! 52

అయోధ్యాదిషు సర్వేషు నగరేషు సమాస్థితే !
వైభవై ర్వివిధై ర్యుక్తైః - సమాగచ్ఛ ముదాన్వితే ! 53

సమాగచ్ఛ సమాగచ్ఛ - మమాగ్రే భవ సుస్థిరా !
కరుణారస నిష్పన్న నేత్రద్వయ విలాసిని ! 54

సన్నిధత్స్వ మహాలక్ష్మి ! త్వ త్పాణిం మమ మస్తకే ।
కరుణా సుధయా మాం త్వ మభిషిచ్య స్థిరం కురు ॥ 55

సర్వ రాజగృహే లక్ష్మి ! సమాగచ్ఛ బలాన్వితే !
స్థిత్వాఽఽశు పురతో మేఽద్య - ప్రసాదే నాభయం
కురు ॥ 56

సాదరం మస్తకే హస్తం - మమ త్వం కృపయాఽర్పయ ।
సర్వ రాజ స్థితే లక్ష్మి ! త్వ త్కళా మయి తిష్ఠతు॥ 57

ఆద్యాది శ్రీ మహాలక్ష్మి ! విష్ణువామాంక సంస్థితే ।
ప్రత్యక్షం కురు మే రూపం - రక్ష మాం శరణాగతమ్॥58

ప్రసీద మే మహాలక్ష్మి ! సుప్రసీద మహాశివే !
అచలా భవ సుప్రీతా - సుస్థిరా భవ మద్గృహే ॥ 59

యావ త్తిష్ఠంతి వేదా శ్చ - యావ చ్చంద్ర దివాకరే ।
యావ ద్విష్ణు శ్చ యావ త్త్వం - తావ త్కురు కృపాం
మయి ॥ 60

చాంద్రీ కలా యథా శుక్లే - వర్ధతే సా దినే దినే ।
తథా దయా తే మయ్యేవ - వర్ధతా మభివర్ధతామ్ ॥ 61

యథా వైకుంఠ నగరే - యథా వై క్షీరసాగరే ।
తథా మ ద్భవనే తిష్ఠ - స్థిరం శ్రీ విష్ణునా సహ ॥ 62

యోగినాం హృదయే నిత్యం - యథా తిష్ఠసి విష్ణునా ।
తథా మద్భవనే తిష్ఠ - స్థిరం శ్రీ విష్ణునా సహ॥ 63

నారాయణస్య హృదయే భవతీ యథా స్తే
నారాయణోఽపి తవ హృత్కమలే యథా స్తే ।
నారాయణ స్త్వ మపి నిత్యవిభూ తథైవ
సా తిష్ఠతాం హృది మమాపి దయాన్వితా శ్రీః ॥ 64

విజ్ఞాన వృద్ధిం హృదయే కురు శ్రీః
సౌభాగ్య వృద్ధిం కురు మే గృహే శ్రీః ।
దయా సువృష్టిం కురుతాం మయి శ్రీః
సువర్ణ వృష్టిం కురు మే కరే శ్రీః ॥ 65

న మాం త్యజేథాః శ్రితకల్పవల్లీ !
సద్భక్తి చింతామణి కామధేనో !
న మాం త్యజేథా భవ సుప్రసన్నా
గృహే కళత్రేషు చ పుత్ర వర్గే ॥ 66

కుక్షి బీజమ్. ఓమ్. అమ్. అమ్ - ఈమ్ - ఏమ్ - ఓమ్.

ఆద్యాది మాయే త్వ మజాండబీజం
త్వ మేవ సాకార నిరాకృతీ త్వమ్ ।
త్వయా ధృత శ్చాబ్జ భవాండసంఘః
చిత్రం చరిత్రం తవ దేవి ! విష్ణోః ॥ 67

బ్రహ్మరుద్రాదయో దేవా - వేదా శ్చాపి నశేకున్నయుః ।
మహిమానం తవ స్తోతుం - మందోఽహం శక్నుయాం
కథమ్ ॥ 68

అంబ ! త్వ ద్వత్సవాక్యాని - సూక్తాసూక్తాని యాని చ ।
తాని స్వీకురు సర్వజ్ఞే ! దయాలుత్వేన సాదరమ్ ॥ 69

భవంతీం శరణం గత్వా - కృతార్థా స్యుః పురాతనా ।
ఇతి సంచిత్య మనసా - త్వా మహం శరణం వ్రజే ॥ 70

అనంతా నిత్య సుఖిన స్త్వద్భక్తా స్త్వత్పరాయణాః ।
ఇతి వేద ప్రమాణాద్ధి దేవి ! త్వాం శరణం వ్రజే ॥ 71

తవ ప్రతిజ్ఞా మద్భక్తా ననశ్యంతీ త్యపి క్వచిత్ ।
ఇతి సంచిత్య సంచిత్య - ప్రాణాన్ సంధారయా మ్యహమ్ ॥

త్వదధీన స్త్వహం మాతః ! త్వ త్కృపా మయి విద్యతే ।
యావ త్సంపూర్ణ కామస్స్యాం -, తావ ద్దేహి దయానిధే!

క్షణమాత్రం న శక్నోమి - జీవితుం త్వత్కృపాం వినా ।
న హి జీవంతి జలజా - జలం త్యక్త్వా జలాశ్రయాః ॥ 74

యథా హి పుత్రవాత్సల్యాత్ – జననీ ప్రస్నుత స్తనీ ।
వత్సం త్వరిత మాగత్య - సంప్రీణయతి వత్సలా ॥ 75

యదిస్యాం త్తవ పుత్రోఽహం - మాతా త్వం యది మామకీ ।
దయా పయోధర స్తన్య - సుధాభి రభిషించ మామ్ ॥ 76

మృగ్యో న గుణలేశోఽపి - మయి దోషైక మందిరే ।
పాంసూనాం వృష్టి బిందూనాం - దోషాణాం చ న మే
మతిః ॥ 77

పాపీనా మహ మేకాగ్రో - దయాలూనాం త్వ మగ్రణీః ।
దయనీయో మ దన్యోఽస్తి - తవ కోఽత్ర జగ త్త్రయే॥

విధినాఽహం న సృష్టశ్చేత్ - న స్యా త్తవ దయాలుతా ।
ఆమయో వా న సృష్ట శ్చేత్ - ఔషధస్య వృథోదయః॥

కృపా మదగ్రజా కిం తే - అహం కిం వా త దగ్రజః ।
విచార్య దేహి మే వి త్తం - తవ దేవ ! దయానిధే ! 80

మాతా పితా త్వం గురు సద్గతి శ్రీః
త్వ మేవ సంజీవన హేతుభూతా !
అన్యం న మన్యే జగదేకనాథే !
త్వ మేవ సర్వం మమ దేవి ! సత్యమ్ ॥ 81

హృదయ బీజమ్ - ఓమ్ - హ్రామ్ - హ్రీమ్ - హ్రూమ్ - హ్రైమ్ - హ్రౌమ్ - హ్రమ్ - హ్రః, కురు కురు స్వాహా ॥

ఆద్యాదిలక్ష్మీర్భవ సుప్రసన్నా
  విశుద్ధ విజ్ఞాన సుఖైకదోగ్ధ్రీ ।
అజ్ఞాన హంత్రీ త్రిగుణాతిరిక్తా
  ప్రజ్ఞాన నేత్రీ భవ సుప్రసన్నా ॥ 82

అశేష వాగ్జా డ్యమలాపహంత్రీ
  నవం నవం స్పష్టు సువాక్యదాయినీ ।
మమైవ జిహ్వాగ్ర సురంగనర్తినీ
  భవ ప్రసన్నా వదనే చ మే శ్రీః ॥ 83

సమస్త సంపత్సు విరాజమానా
  సమస్త తేజస్సు విభాసమానా ।
విష్ణుప్రియే త్వం భవ దీప్యమానా
  వాగ్దేవతా మే నయనే ప్రసన్నా ॥ 84

సర్వప్రదర్శే సకలార్థదే త్వం
  ప్రభాసు లావణ్య దయా ప్రదోగ్ధ్రీ ।
సువర్ణదే త్వం సుముఖీ భవ శ్రీః
  హిరణ్మయీ మే నయనే ప్రసన్నా ॥ 85

సర్వార్థదా సర్వ జగత్ప్రసూతిః
  సర్వేశ్వరీ సర్వ భయాపహంత్రీ ।
సర్వోన్నతా త్వం సుముఖీ చ న శ్రీః
  హిరణ్మయీ మే భవ సుప్రసన్నా ॥ 86

సమస్త విఘ్నౌఘు వినాశకారిణీ
    సమస్త భక్తోద్ధరణే విచక్షణా ।
అనంత సమ్మోద సుఖ ప్రదాయినీ
    హిరణ్మయీ మే నయనే ప్రసన్నా ॥ 87

దేవి ! ప్రసీద దయనీయతమాయ మహ్యం
    దేవాదినాథ భవ దేవగణాభి వంద్యే ।
మాత స్తథైవ భవ సన్నిహితాదృశోర్మే
    పత్యా సమం మమ ముఖే భవ సుప్రసన్నా ॥ 88

మా వత్స భీ ర భయ దానకరోఽర్పిత స్తే
    మాలో మ మేతి మయి దీనజనానుకంపే ।
మాత స్సమర్పయ ముదా కరుణా కటాక్ష
    మాంగల్య బీజ మహిమాన మజస్మ మాతః ॥ 89

కంఠ బీజమ్ ఓమ్ - క్రామ్ - శ్రీమ్ - క్రూమ్ - శ్రైమ్ - క్రిమ్ - క్రాః

కటాక్ష ఇవ కామ ధుక్ తవ మన స్తు చింతామణిః
    కర స్సురతరు స్సదా నవనిధి స్త్వ మే వేందిరే ।
భవే త్తవ దయారసో రసరసాయనం చాన్వహం
    ముఖం - తవ కలానిధి ర్వివిధ వాంఛితార్థ ప్రదమ్ ॥ 90

యథా రస స్పర్శనతోఽయ సోఽపి
    సువర్ణతా స్యాత్ కమలే తథా తే ।
కటాక్ష సంస్పర్శనతో జనానాం
    అమంగళానా మపి మంగళం త్వమ్ ॥ 91

దేహీతి నాస్తీతి వచః ప్రవేశాత్
భీతో రమే త్వాం శరణం ప్రపద్యే ।
అత స్సదాస్మిన భయప్రదా త్వం
స హైవ పత్యా మమ సన్నిధేహి ॥ 92

కల్పద్రుమేణ మణినా సహితా సురభ్యా
శ్రీ స్తే కలామయ రసేన రసాయనేన ।
ఆస్తాం యతో మమ చ దృక్కరపాణి పాద
స్పృష్ట్వా సువర్ణ వపుష స్థిర జంగమా స్స్యుః ॥ 93

ఆద్యాది విష్ణో స్థిరధర్మపత్నీ !
త్వమంబ ! పత్యా మమ సన్నిధేహి ।
ఆద్యాది లక్ష్మి ! త్వ దనుగ్రహేణ
పదే పదే మే నిధి దర్శనం స్యాత్ ॥ 94

ఆద్యాది లక్ష్మీ హృదయం పఠే ద్య
స్స రాజ్యలక్ష్మీ మచలాం తనోతి ।
మహాదరిద్రోఽపి భవే ద్ధనాఢ్య
స్త దన్వయే శ్రీ స్థిరతాం ప్రయాతి ॥ 95

యస్య స్మరణ మాత్రేణ - తుష్టాస్యా ద్విష్ణు వల్లభా ।
తస్యాభీష్టం దదా త్యాశు - తం పాలయతి పుత్ర వత్ ॥96

ఇదం రహస్యం హృదయం - సర్వ కామ ఫలప్రదమ్ ।
జపః పంచ సహస్రం తు - పురశ్చరణ ముచ్యతే ॥ 97

త్రికాల మేకకాలం వా - నరో భక్తిసమన్వితః ।
యః పఠేత్ శ్రుణుయా ద్వాపి - న యాతి పరమాం
శ్రియమ్ ॥ 98

మహాలక్ష్మీం సముద్దిశ్య - నిశి భార్గవ వాసరే ।
ఇదం శ్రీహృదయం జప్త్వా - పంచవారం ధనీ భవేత్ ॥99

అనేన హృదయే నాన్నం - గర్భిణ్యా అభిమంత్రితమ్ ।
దదాతి తత్కులే పుత్రో - జాయతే శ్రీపతి స్స్వయమ్ ॥

నరేణా ప్యథవా నార్యా - లక్ష్మీ హృదయ మంత్రితే ।
జలేఽపీ తే చ తద్వంశే - మందభాగ్యో న జాయతే॥101

య ఆశ్వియేమాసి చ శుక్లపక్షే
రమోత్సవే సన్నిహితే చ భక్త్యా ।
పఠే త్తథై కో త్తర వార వృద్ధ్యా
లభేత సౌవర్ణ మయీాం సువృష్టిమ్ ॥ 102

య ఏక భక్త్యాఽన్వహ మేక వర్షం
విశుద్ధ ధీః స్స ప్తతి వారజాపీ ।
స మందభాగ్యోఽపి రమా కటాక్షాత్
భవే త్సహస్రాక్ష శతాధిక శ్రీః ॥ 103

శ్రీశాంఘ్రిభక్తిం హరిదాస దాస్యం
ప్రపన్న మంత్రార్థ దృఢైకనిష్ఠామ్ ।
గురో స్స్మృతిం నిర్మల బోధ బుద్ధిం
ప్రదేహి మే తే పరమం పదం శ్రీః ॥ 104

పృధ్వీపతిత్వం పురుషోత్తమత్వం
విభూతి వాసం నిఖిలార్థ సిద్ధిమ్ ।
సంపూర్ణ కీర్తిం బహువర్ష భోగం
ప్రదేహి మే లక్ష్మి ! పునః పున స్త్వమ్ ॥ 105

వాదార్థ సిద్ధిం - బహులోక వశ్యం
వయ స్థిరత్వం లలనాసు భోగమ్ ।
పౌత్రాది లబ్ధిం సకలార్థ సిద్ధిం
ప్రదేహి మే భార్గవి ! జన్మ జన్మని ॥ 106

సువర్ణ వృద్ధిం కురు మే గృహే శ్రీః
సుధాన్య వృద్ధిం - కురు మే గృహే శ్రీః ।
కల్యాణ వృద్ధిం కురు మే గృహే శ్రీః
విభూతి వృద్ధిం కురు మే గృహే శ్రీః ॥ 107

**శిరో బీజమ్. ఓమ్ - యమ్ - హామ్ - రమ్ - కమ్ - లమ్ - వమ్ - శ్రీమ్.**

ధ్యాయే ల్లక్ష్మీం ప్రహసిత ముఖీం - కోటి బాలార్క భాసాం
విద్యు ద్వర్ణాంబరవరధరాం - భూషణాఢ్యాం సుశోభామ్ ।
బీజాపూరం సరసిజయుగం - బిభ్రతీం స్వర్ణపాత్రం
భర్త్రా యుక్తాం ముహు రభయదాం మహ్య
మప్యచ్యుత శ్రీమ్ ॥ 108

**(ఇతి అథర్వణ రహస్యే - ఉత్తర భాగే - ఆద్యాది శ్రీమహాలక్ష్మీ స్తోత్రమ్)**

## 9. మఱికొన్ని ప్రాచీన లక్ష్మీ స్తోత్రములు

1. శ్రీ మహాలక్ష్మ్యష్టకము, 2. శ్రీ భగవత్యష్టకము, 3. కమలాత్మికా కవచము, 4. సద్యః ఫలదా - లక్ష్మీ స్వరూప హృదయము, 5. కల్యాణ వృష్టి స్తవము, 6. ధనదా స్తోత్రము, 7. శ్రీ స్తోత్రము. 8. శ్రీ సిద్ధ లక్ష్మీ స్తోత్రము, 9. కమలా స్తోత్రము, 10. శ్రీ కమలా స్తోత్రము, 11. కమలాత్మికా స్తోత్రము, 12. ప్రసన్న వరదా - శ్రీ లక్ష్మీ స్తోత్రము (అగస్త్య కృతము), 13. శ్రీ మహాలక్ష్మీ పంజర స్తోత్రము, 14. శ్రీ లక్ష్మీ లహరి, 15. ఆనంద లహరి, 16. అష్ట లక్ష్మీ స్తోత్రము 17. శ్రీవిద్యా కవచము, 18. దేవీ స్తోత్రము, 19. లక్ష్మీ స్తోత్రము, 20. లక్ష్మీ స్తవ హృదయము, 21. శ్రీ లక్ష్మీ స్తవ హృదయము, 22. ధనదా కవచము, 23. దేవీ పటకము, 24. దేవ కృత లక్ష్మీ స్తోత్రము, 25. దేవరాజ - ఇంద్ర కృత - లక్ష్మీ స్తోత్రము, 26. లక్ష్మీ సహస్ర నామ స్తోత్రము (పద్మపురాణాంతర్గతము), 27. లక్ష్మీ సహస్రనామ స్తోత్రము (స్కాంద పురాణాంతర్గతము, 28. శ్రీ లక్ష్మీ సహస్ర నామ స్తోత్రము (శ్రీ సనత్కుమార సంహితాంతర్గతము), 29. శ్రీ లక్ష్మీ సహస్రనామ స్తోత్రము (శ్రీ మహా విష్ణు ప్రోక్తము), 30. లక్ష్మీ అష్టోత్తరశతనామ (దారిద్ర్య మోచన) స్తోత్రము, 31. శ్రీ లక్ష్మీ కవచము (బ్రహ్మ ప్రోక్తము), 32. శ్రీ లక్ష్మ్యష్టకము (అహిర్బుధ్న్య సంహితాంతర్గతము), 33. శ్రీ కమలా - అష్టోత్తర శతనామ స్తోత్రము - మున్నగు 'లక్ష్మీ స్తోత్రము' లనేకములు - తంత్ర గ్రంథములందును, పురాణాది గ్రంథములందును - పొందు పఱుపఁబడియున్నవి.

## 10. అర్వాచీన లక్ష్మీ స్తోత్రములు

అర్వాచీనములైన లక్ష్మీ స్తోత్రములు - అనేకము లున్నవి. కాని, అట్టి వానిలో - మచ్చుకు - ఇట ముఖ్యములైన కొన్ని స్తోత్రము పొందుపఱుపబడుచున్నవి.

౧. శంకరాచార్యుల లక్ష్మీ స్తుతి :-

అద్వైత మత స్థాపకులైన శంకరాచార్యులు లక్ష్మీదేవిని - 'సువర్ణ ధారా స్తవ' మను పేర, ఇరువది (20) శ్లోకములలో స్తుతించి యున్నారు.

''వన్దే వన్దారు మన్దార సంతతానంద కందరమ్ ।
అమన్దానన్ద సందోహ బంధురం సిన్ధురాననే ॥''

అని - స్తోత్రారంభమున లక్ష్మీదేవికి ప్రణమిల్లుచు, అనంతరము -

"అంగం హరేః పులక భూషణ మాశ్రయన్తం
భృంగాంగనేవ ముకుళాభరణం తమాలమ్ ।
అంగీకృతాఖిల విభూతి రపాంగలీలా
మాంగల్యదాఽస్తు మమ మంగళదేవతాయాః.''

మొగ్గలే ఆభరణములుగా గల గానుఁగు వృక్షమును, ఆడు తుమ్మెదలు చేరినట్లు పులక కలిగించెడు విష్ణుభగవానుని హృదయ స్థానమున నున్న లక్ష్మీదేవి - సకల విభవము లగు సంపదలకును ఆలవాలమైన తన క్రీగంటి చూపును నాపై కలుగఁజేసి, నాకు సమస్త శుభములను ప్రసాదించుగాక !' అని ప్రార్థించి -

"స్తువన్తి యే స్తుతిభి రమూభి రన్వహం
త్రయీమయీం త్రిభువన మాతర మంబుజేక్షణామ్ ।
గుణాధికా గురుతర భాగ్య భాజినో
భవన్తి తే భువి బుధభావితాశయా."

వేద స్వరూపిణియు, చతుర్దశ (14) భువనములకు (పదునాల్గు లోకములకు) తల్లియు నగు లక్ష్మీదేవిని ఎవరు అనుదినమును స్తుతింతురో, అట్టివారు - అనేక సుగుణములు కలవారలై, అనేక సంపదలను బడసి, పండితులచే నుతింపఁబడు చరిత్ర గలవా రగుదురు - అని ముగించుచు -

"సువర్ణ ధారా స్తోత్రం యత్ — శంకరాచార్య నిర్మితమ్ ।
త్రిసంధ్యం యః పఠే న్నిత్యం - స కుబేర సమో భవేత్."

శంకరాచార్యులచే రచింపఁబడిన ఈ సువర్ణధారా స్తవమును నిత్యము మూఁడు వేళలందును పఠించునతఁడు - కుబేర సమానుఁడు కాఁగలఁ' డని - ఫలశ్రుతియు - చెప్పియున్నారు.

(ఈ సువర్ణధారా స్తవము - 'కనకధారా స్తవ' మను పేర - ప్రసిద్ధి గాంచియున్నది)

౨. యామునాచార్యుల లక్ష్మీ స్తుతి :-

యామునాచార్యులు - 'కాంతా స్తోత్ర' మను పేర - నాల్గు (4) శ్లోకములలో లక్ష్మీదేవిని స్తుతించియున్నారు.

"కాంత స్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం
వేదాత్మా విహగేశ్వరో యవని నామా యా జగన్మోహినీ ।

బ్రహ్మేశాది సురవ్రజ స్సదయిత స్త్వద్దాస దాసీగణః
శ్రీ రిత్యేవ చ నామ తే భగవతి ! బ్రూమః కథం త్వాం వయమ్.''

భగవతి వగు లక్ష్మీదేవీ ! నీ నాథుఁడు - పురుషోత్తముఁడు, శేషుఁడు శయ్య, ఆసనము. వాహనము - వేదస్వరూపి యగు గరుత్మంతుఁడు. జగత్తును మోహింపఁజేయు మాయయే తెర. నీ దాసుల యొక్కయు, దాసీల యొక్కయు సముదాయము - నీ దాస దాసులు. భార్యలతోఁ గూడిన బ్రహ్మ, శివుఁడు - మొదలగు దేవతలు - నీ దాస దాసులు. నీ పేరు - లక్ష్మి - నిన్ను మేము ఎట్లు స్తోత్రము చేయఁగలము ?' — అని మొదటి శ్లోకములో లక్ష్మీదేవిని బహు భంగులుగా ప్రస్తుతించియున్నారు. ఇట్లే - మిగిలిన మూఁడు శ్లోకములందును - లక్ష్మీదేవి - అత్యంతము కమనీయముగ వర్ణింపఁబడినది.

**౩. రామానుజాచార్యుల లక్ష్మీ స్తుతి :-**

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులు, ఆదిశేషాంశ సంభూతులు నగు భగవద్రామానుజులు - తమ 'శరణాగతి గద్య' ప్రారంభమున -

"ఓమ్. భగవన్నారాయణాభి మతానురూప స్వరూప రూప గుణ విభవ ఐశ్వర్య శీలాది అనవధికాతిశయ అసంఖ్యేయ కల్యాణ గుణ గణాం, పద్మ వనాలయాం, భగవతీం, శ్రియం దేవీం, నిత్యానపాయినీం నిరవద్యాం. దేవదేవ దివ్య మహిషీం అఖిల జగన్మాతరం, అస్మన్మాతరం అశరణ్య శరణ్యాం అనన్య శరణః శరణమహం ప్రపద్యే.''

భగవంతుఁడగు నారాయణునకు అభీష్టమైనవియు, తగినవియు - స్వరూపము, రూపము, గుణములు, విభవము, ఐశ్వర్యము, శీలము -

మున్నగు అపారమైన గొప్పదనముతో కూడిన - లెక్కలేని - మంగళ గుణములు కలదియు, పద్మవనములో నివసించునదియు, జ్ఞాన - శక్తి - బల - ఐశ్వర్య - వీర్య - తేజము లనెడి షడ్గుణ సంపన్న యగు టచే - భగవతియు, నిత్య ప్రకాశ శీలయు, నారాయణుని ఎన్నడును ఎడబాయనిదియు, ఎట్టి దోషములు లేనిదియు, బ్రహ్మేంద్రాది దేవ తల కెల్ల అకు దేవుడైన నారాయణుని దివ్యమహిషియు, సర్వలోక ములకు మాతయు, మాకు తల్లియు, నిరాశ్రయులకు ఆశ్రయమైన దియు నగు లక్ష్మీదేవిని - ఇతరమైన ఆశ్రయము లేని నేను శరణు పొందుచున్నాను' - అని, లక్ష్మీదేవిని బహుభంగులుగా ప్రస్తుతించి యున్నాడు.

౮. శ్రీవత్సాంకమిశ్రుల లక్ష్మీ స్తుతి :-

భగవద్రామానుజుల ఆంతరంగిక శిష్యులుగా ప్రసిద్ధి గాంచిన 'శ్రీవత్సాంకమిశ్రులు' అనబడు కూరత్తాళ్వారులు - 'శ్రీ స్తవ' మను పేర - పది (10) శ్లోకములు రచించుచు, అందు మొదట -

> "స్వస్తి శ్రీ ర్దిశతా మశేష జగతాం సర్గోపసర్గస్థితీ
> స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః ।
> యస్యావీక్ష్య ముఖం తదింగిత పరాధీనో విధత్తేఽఖిలం
> క్రీడేయం ఖలు నాన్యథాస్య రస దాస్యా దైక రస్యా త్తయా."

భగవంతుడు జగత్తులకు సృష్టి స్థితి సంహారములు, స్వర్గము - నరకము - మోక్షము మొదలగువాని నన్నింటిని - లక్ష్మీదేవి ముఖము చూచి, ఆమె యభిప్రాయము ననుసరించియే చేయు ననియు,

లక్ష్మీదేవి యొక్క ఆనందము వలననే భగవంతుని ఆనంద మనియు, లక్ష్మికి ఆనందము కలుగురీతి గాక, మఱియొక విధముగా ఆ లీల జరిపిన చో – భగవంతునకు ఆనందము కలుగదనియు, అట్టి లక్ష్మి దేవి - శుభములు కలుగఁజేయుగాక ! యనియు - లక్ష్మీదేవిని మనోహరముగా - స్తుతించియున్నారు. ఇట్లే, మిగిలిన శ్లోకములందును లక్ష్మి – పలు రీతులుగా ప్రస్తుతింపఁబడినది.

౩. పరాశరభట్టరు లక్ష్మీ స్తుతి -

శ్రీవత్సచిహ్నమిశ్రుల కుమారులలో నొక రగు పరాశర భట్టరు శ్రీదేవి యొక్క కల్యాణ గుణములను అఱువదియొక్క (61) శ్లోకములలో కమనీయముగ వర్ణించియున్నారు. మచ్చుకు ఇట నొక శ్లోకము, దాని భావము చాలును.

"శ్రియై సమస్త చిదచి ద్విధానవ్యసనం హరేః ।
అంగీకారిభి రాలోకైః - సార్థయ న్త్యై కృతాంజలిః" (1 శ్లో.)

భగవంతుఁడు - సమస్త చేతనాచేతన సృష్టి స్థితి సంహార మోక్షములను చేయుచుండును. అందువలన - లక్ష్మీదేవి సంతోషించును. తన ప్రియురాలు సంతోషించుటకేకదా తాను ఈ పనులను చేయుట ! సకల చేతనాచేతనములను సృజించుట యను భగవంతుని సృష్టివ్యాపారము నామోదించి, తన కటాక్ష వీక్షణములచేత ఫలవంత మగునట్లు చేయు శ్రీదేవికి అంజలి ఘటించుచున్నాను.

౪. వేదాంత దేశికుల లక్ష్మీ స్తుతి :-

తిరుమల - శ్రీనివాస భగవానుని ఘంటావతారు లగు వేదాంతదేశికులు - 'శ్రీ స్తుతి' - యను పేర - ఇరువది యైదు

(25) శ్లోకములలో లక్ష్మీదేవిని దివ్యముగా వర్ణించియున్నారు. మచ్చునకు - ఒక శ్లోకము, దాని తాత్పర్యము :-

''మానాతీత ప్రథిత విభవాం - మంగళం మంగళానాం
వక్షః పీఠీం మధువిజయినో భూషయన్తీం స్వ కాన్త్యా ।
ప్రత్యక్షాను శ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయో మూర్తిం శ్రియ మశరణ స్త్వాం శరణ్యాం ప్రపద్యే '' (1 శ్లో.)

అగణితములైన కల్యాణి గుణములచే ప్రశస్తమైన వైభవము గలట్టియు, మంగళములకు మంగళమైనదియు, విష్ణుభగవానుని వక్షస్థలమున - తన ప్రభావముచే ప్రకాశించునట్టిదియు, ఆశ్రయించిన తన భక్తులను తన మహిమలం జూపుచు, శ్రేయస్సులకు నిలయమైన- అశరణ శరణ్యమైన ఓ లక్ష్మీదేవీ ! నిన్ను శరణు వేడుతున్నాను,' ఇదియే లక్ష్మీదేవియందలి దేశికుని భక్తిభావన.

౭. సప్తాద్రివాసుని సుప్రభాత స్తోత్రములో - లక్ష్మీ ప్రశంస :-

''శ్రీశ శ్రియా ఘటికయా త్వ దుపాయభావే
ప్రాప్యే త్వయ స్వయ ముపేయతయా స్ఫురన్త్యా ।
నిత్యాశ్రితాయ నిరవద్య గుణాయ తుభ్యం
స్యాం కింకరో వృషగిరీశ న జాతు మహ్యమ్ ''
- (ప్రపత్తి . 16 శ్లో.)

ఓ వేంకటశైలవాసా ! మోక్షమునకు నీవే ఉపాయభూతుడవుగా, తెలిసినవాఁడవుగా, ఘటికుఁడవుగా — జ్ఞానము ప్రాప్తించి నపుడు - నీవును అపుడే ప్రాప్తుఁడవు కాఁగలవు తేజో విరాజితురా

లగు శ్రీ లక్ష్మీదేవిచేత సదా ఆశ్రయింపఁబడినవాఁడవు, మంగళ ప్రదములైన గుణములు గలవాడవు నగు నీవే ఆమెకు సేవకుఁడవును."

## 11. లక్ష్మీ విలాసము

రాయసము వేంకట పతి - అను నొక తెలుఁగు కవి - వసిష్ఠ గోత్ర ప్రయుక్తమైన నియోగి బ్రాహ్మణ వంశమున - శ్రీ వేంక టేశ్వరస్వామి వర ప్రసాదమున - 'పెనుగొండ'లో జన్మించి, వైష్ణవ హృదయుఁడై, వేంకటేశ్వర భక్తుఁడై, 'లక్ష్మీ విలాసము' అను పేర నొక పద్యకావ్యమును కమనీయముగ రచించి, ఆ కావ్యమును శ్రీనివాస భగవానునకే అంకితము గావించి చరితార్థుఁ డయ్యెను.

ఇట్లే, కవి కోవిదు లనేకులు వివిధ భాషలలో - వివిధ ప్రక్రి యలలో లక్ష్మీదేవిని అనేక రీతులుగా స్తుతించియున్నారు.

## 12. ముగింపు

పైన పేర్కొ-నఁబడిన స్తోత్రములనుఁబట్టియు, ఆపైన పొందు పఱుపఁబడిన విష్ణుపురాణ సూక్తులనుఁబట్టియు, అంతకంటెను పైన సూచితములైన శ్రీసూక్త వర్ణనములనుఁబట్టియు, నిఘంటు నిర్వచన ములనుఁబట్టియు - లక్ష్మీ వైభవము, లక్ష్మీ ప్రభావము - సులభ గ్రాహ్యములు. ఐనదో, మన మిట నొక పరమ రహస్యమును గ్రహింపవలసియున్నది. అదేమనఁగా :—

లక్ష్మీదేవి హస్తమందలి పద్మము - భారతీయ సంస్కృతికి ప్రతీకగా సంభావింపఁదగియున్నది. ఆ పద్మము బురదలో పుట్టి

నీటిలో నివాసముఁజేసి, కాలక్రమమున వృద్ధి జెందుట - సహజము. కాని, దానికి బురద అంటదు, నీరు హాని కలిగింపదు. దీనివలన మనకు తెలియున దేమనఁగా :- మానవుఁడు సంసార మహా సముద్రములో నున్నను, దానియందు అనాసక్తుఁడై, అందలి భోగ వైభవములకు అతీతుఁడై, వానిని త్యాగపూర్వకముగ అనుభవింపవలెనని స్పష్ట మగును.

"న కర్మణా - న ప్రజయా ధనేన
త్యాగే నైకే అమృతత్వ మానశుః"

కర్మచేగాని, సంతానముచేగాని, ధనముచేగాని లభింపని అమృత పదవి కేవలము ఒక్క త్యాగము వలననే ప్రాప్తింపగలదని - తైత్తిరీయోపనిషత్తు నొక్కి వక్కాణించుచున్నది. కావున, ఈ ఉపనిషత్సూక్తిలోని పరమార్థమును గ్రహించి, వర్తించుట - ఎల్లఱకును శ్రేయస్కరము.

"లక్ష్మీం క్షీరాబ్ధికన్యాం - త్రిభువన జననీం - విష్ణు వక్షస్స్థలస్థాం
పద్మాం - పద్మాయతాక్షీం - నిఖిల శుభకరాం - పద్మినీం - పద్మ హస్తామ్
నానా రత్నోత్తమాద్యైః, కనక విరచితై ర్భూషణై ర్భూషితాంగీం
దేవీం బాలార్కవర్ణాం - సుర ముని వరదాం - భార్గవీం నౌమి నిత్యమ్.'



# వేంకటాద్రి - శ్రీనివాసమూర్తి

(ద్రావిడ భాషలో గల - నమ్మాళ్వారుల 'తిరువాయిమొళి' దివ్య ప్రబంధ మండలి(3-8) పది పాశురములకు - ఆంధ్రానువాదము.)

' ద్రవిడాంధ్రభాషా విశారద '

శ్రీ బచ్చు పాపయ్య శ్రేష్ఠి



కొండ చరియలలోన నఖండ రీతి
శబ్దములు మ్రోగు వేంకటాచలము నందు
సుందరంబుల ప్రోగు - తేజో మయంబు
నైన విగ్రహ కాంతి యరుదు దోప,
తాత తాతలకు హేతుభూతుఁ డైన
శ్రీనివాసుని పద సేవచేయవలయు
సర్వ దేశంబులను - సర్వ సమయములను ॥ 1

నిత్యసూరి బృందములు - నిత్య విధిగ
పూజ చేసి సమర్పించు పుష్ప సమితి
పరిమళించెడు వేంకట పర్వతమున
కలియుగంబున భక్త రక్షణ మొనర్ప
వాస మొనరించు ఆ శ్రీనివాసమూర్తి,
తాతలకు, తండ్రులకు, తాత తాతలకును
కారణం బౌచు జగముల గన్న తండ్రి,
పరమ ప్రాప్యుండు మన పరంపరల కెల్ల ॥ 2

అద్భుతాశ్చర్య గుణముల నలరువాఁడు
సుందర ముఖారవింద యశో ధరుండు
పుండరీకాక్షుఁడై సదా పొలుచువాఁడు
రాగ పూరిత బింబాధరంబువాఁడు
నీల మాణిక్య కాంతులఁ నేలువాఁడు
నగు రమాపతి - శ్రీ వేంకటాద్రి యందు
సకల కల్యాణ గుణ సారసాక్షు డగుచు
వెలసియున్నాఁడు జగముల వేల్పుగాగ ॥ 3

గుణ విహీనుండ - ఈర్ష్యాది గుణ యుతుండ
నైన నను ప్రేమతో గాంచి, యాదరించి
సంగయుక్తుఁడై చెలగెడు స్వత్వకాశు
డమరులకు స్వామి యగు టొక్క యతిశయంబె ? ॥ 4

వేదవేద్యుఁడై - భోగ్యుఁడై వెలయువాని
పరమ పావన - శ్రీ శైలపతిని, భువన
కారణుం డని పల్కిన ఘనత యగునె ?
సర్వలోకాశ్రయుం డన - సందియంబె ? 5

వేంకటాచలపతియైన విష్ణుదేవు
దాసుడనుగాని, నేను స్వాతంత్ర్యపరుడ
గానటంచు వచించెడు మానవులకు
జెలగు పాపంబు నెల్లను దొలగి చనును,
కర్మబంధ సంగంబులు గలుగకుండు;

ఇది యథార్థము గాన, యి ట్లిద దలంచు
వారలకు స్వామికైంకర్య ఫలము గల్గు ॥ 6

శ్లాఘ్య మగు పుష్పములతోడ - జలముతోడ
ధూప దీప జాలంబులతోడ వచ్చి
పూజ చేసి, నమస్కారపూర్వకముగ
స్తోత్రము లొనర్చుకొను నిత్యసూరు లెల్ల
రాశ్రయించెడు శ్రీ వేంకటాద్రి - మనకు
పరమ పురుష సమానతా పదము నిడదె । 7

స్వర్గపతి నాడు రాళ్ళ వర్షంబు గురియ
గోపకులులకు కొండను గొడుగు పట్టు
వాసుదేవుండు, బలి గెల్చు వామనుండు
సర్వ లోకేశ్వరుండు వాసం బొనర్చు
వేంకటాద్రి నాశ్రయము గావింతురేని
సర్వ పాపంబులును మీకు సమసిపోవు ॥ 8

వ్యాని బాధలు నశియించు పగిది జేయు
వేంకటాచలవాసుని వికసితాంబు
రుహములం బోలు పాద సరోరుహముల
వాక్కునందును, మనమున వదలనట్టి
జలుల కెల్ల జరా మృత్యు జనన గతులు
గలుగనేరవు, కలుగు మోక్షం బొకండె ॥

భక్త జనులార ! మీ దేహ పాటవంబు
తరుగనప్పుడె, ఆ యుస్సు కరగనపుడె
శేషశాయి నివాసమై చెలగుచున్న
వేంకటాద్రిని సేవింప వేగ యరిగి
ఆ ప్రదేశంబుననే చేయు డాశ్రయంబు ॥

(శ్రీముఖసూక్తి నుండి)

# విష్ణు మహిమ

'సాహిత్య విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ - ఉభయ వేదాంత శిరోమణి'

శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, ఎం. ఏ.



## వేద ప్రామాణ్యము - హిందూ మతము

నేటి మన హిందూ మతము - ఆర్య ద్రావిడ మతముల సమ్మిశ్రణముతో ఏర్పడిన దని - చారిత్రకుల అభిప్రాయము. మాతృస్వామిక దశకు సంకేతముగ శాక్తేయము, పితృస్వామిక దశకు సంకేతముగ శైవము - నిలిచినవి. వీరి ఆయుధములు, ఆభరణములు, ఆహార విహారములు - ఆదిమ మానవ జాతిని తెలపించును. వామాచారముతో ప్రారంభమైన కాపాలిక - శాక్తేయములు కాలగతిలో - అనేక పరిణామములను పొంది — నేటి శైవముగను వైదికుల చేతిలో దక్షిణాచారమును స్వీకరించి శాక్తేయముగను - పరిణతి చెందిన వని యందురు. వినాయక - కార్తికేయులు వీరి సంతానమే. ఈ దేవతలెల్లలు - యావ ద్భారతమున ఆరాధింపబడుచున్నారు.

ఇక వైదిక మతమున - దేవతలు ముప్పది ముగ్గురుగా పరిగణింపబడిరి.

''అష్టౌ వసవః, ఏకాదశ రుద్రాః ద్వాదశాదిత్యాః, ఇంద్ర ప్రజాపతీ,''

అని, వేదము తెలియజేయుచున్నది. వైదికులు అగ్నిహోత్రము ద్వారా - దేవతలకు హవిస్సులను అందించి, తృప్తి పఱచెడివారు.

ఆ దేవతల అనుగ్రహముతో సకాల వృష్టిని, తద్ద్వారా పాడి పంటలను — సమృద్ధిగా పొంది, సుఖ జీవనమును సాగించెడివారు. వీరి యీ దేవతారాధనమునకు - 'యజ్ఞము' - అని పేరు. "యజ - దేవ పూజాయాం", అను ధాతువు నుండి ఈ రూపము ఏర్పడినది.

"అగ్నిముఖా వై దేవాః."

దేవతలు అగ్నిముఖు లని - వేద మనుచున్నది. వీరి యజ్ఞము - విష్ణు స్వరూపము.

"అదైతం విష్ణవే. చరుం నిర్వపతిః యజ్ఞో వై విష్ణుః యజ్ఞ ఏవాతతః ప్రతి తిష్ఠతి. సోఽత్ర జుహోతి. విష్ణవే స్వాహా. యజ్ఞాయ స్వాహా । ప్రతిష్ఠాయై స్వాహేతి."

అని వేదము - ఈ యంశమును. స్పష్టీకరించుచున్నది. 'విష్ణుః' అనగా - అంతటను వ్యాపించియుండువా డని యర్థము.

"అంత ర్బహి శ్చ త త్సర్వం – వ్యాప్య నారాయణ స్థ్సితః."

అను వేద వాక్యము - విష్ణు శబ్దార్థమును వివరించినది. కావున, మనము ఏ దేవతను ఆరాధించినను - చివఱకు సంతృప్తిని జెందునది ఈ విష్ణువే. ఇతడు సర్వాంతర్యామిగదా ! ఈ విషయమును వేద మెట్లు తెలియజేయుచున్నదో పరిశీలింతము :—

## అంతర్యామి

"అగ్నే రాతిథ్య మసి - విష్ణవే త్వాం । సోమ స్యాతిథ్య మసివిష్ణవే త్వా । అతిథే రాతిథ్య మసి విష్ణవే త్వం । అగ్నయే త్వారాయ స్పోష దావనే విష్ణవే త్వా, శ్యేనాయ త్వా సోమభృతే విష్ణవే త్వా."

అను సోమయాగములో - అతిథ్యేష్టి ఘట్టము నందలి వేద వాక్యము-
(౧) అగ్ని (౨) సోముడు (3) అతిథి (౪) రాయస్పోషము
నా సంగు అగ్ని (౫) సోమరాజును (సోమలతాభిమాని దేవత)
దహించు శ్యేనము - అను అయిదుగురు దేవతలను ప్రస్తుతించుచు,
అతిదేవతకు చివర - 'విష్ణవే త్వా' — అని చేర్చినది. సాయణా
చార్యులు ఈ వేదవాక్యమును వ్యాఖ్యానించుచు -

"అత్ర విష్ణుః. ఏవ హవిషో దేవతా."

'విష్ణువు ఒక్కడే ఈ హవిస్సులకు దేవత' - అని నిర్వచించెను.
మిగిలిన అగ్న్యాదులు - పరివార దేవత లట ! ఈ విషయమును
కూడ - వేదమే తెలియజేయుచున్నది.

"యావద్భి ర్వై రాజాఽనుచరై రాగచ్ఛతి - సర్వేభ్యో వై తేభ్య ఆతిథ్యం క్రియతే."

రాజు ఎందఱు అనుచరులతో వచ్చునో, అందఱకును ఆతిథ్య మొసం
గబడుచున్నది' - అని భావము.

"అంగా న్యన్యా దేవతాః"

'ఇతర దేవతలు అంగభూతులు' - అనుచున్నది - తైత్తిరీయో
పనిషత్తునందలి శిక్షావల్లి. గీతాచార్యుడును -

"అహం హి సర్వ యజ్ఞానాం - భోక్తా చ ప్రభు రేవ చ." -(భ : గీ : 9-24)
అని - ఈ విషయమునే వివరించెను. అర్జునునకు తన విశ్వరూపమును
ప్రదర్శించుటమూలమున శ్రీకృష్ణపరమాత్మ - సర్వదేవాంగకుడు,
సర్వాంతర్యామియు తానే - అని నిరూపించెను.

## ఫల ప్రదాత

"ఫలమత ఉపపత్తేః."

అను బ్రహ్మసూత్ర సూక్తి - (3-2-37) - మనము ఏదేవత నారా ధించినను, ఫలము నొసంగునది పరబ్రహ్మమే' - అని నిర్ణయించినని. గీతాచార్యుడును -

"యేఒప్యన్యదేవతా భక్తా - యజన్తే - శ్రద్ధయాన్వితాః
తేఒపి మా మేవ కౌన్తేయ ! యజ న్త్యవిధిపూర్వకమ్ "-(భ. గీ: 9-23)

అర్జునా ! దేవతాంతర భక్తులును - నన్నే ఆరాధించు చున్నారు. కాని, వారికి ఆ విషయము తెలియదు' - అని పలికెను.

ఈ యర్థమునే శంకరాచార్యులును నిర్వచించెను - దీని ననుస రించియే -

"సర్వదేవ నమస్కారః - కేశవం ప్రతి గచ్ఛతి."

అను పౌరాణిక శ్లోక మేర్పడెను. ఇట్లే గీతలో మఱియొక తావున -

"కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః - ప్రపద్య న్తేఒన్యదేవతాః ।
తం తం నియమ మాస్థాయ - ప్రకృత్యా నియతాస్స్వయా."

"యో యో యాం యాం తనుం భక్తః. శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం - తా మేవ విదధా మ్యహమ్."

"సతయా శ్రద్ధయా యుక్తః - తస్యారాధన మీహతే ।
లభతే చ తతః కామాన్ - మ య్యైవ విహితాన్ హితాన్."

"అంతవత్తు ఫలం తేషాం - త ద్భవ త్యల్పమేధసామ్ ।
దేవాన్ దేవయజో యాన్తి - మ ద్భక్తా యాన్తి మా మపి."
- (భగవద్గీత : 7-23-24)

ఆ యా కోర్కెలనుబట్టి మానవులు దేవతాంతరముల నాశ్ర యించి, అనేక నియమములతో వారి నారాధించుచుందురు. ఆ దేవ తలును నాకు శరీరభూతులే. కావున, ఆరాధకులకు ఆ యా దేవతల రూపమున - సర్వాంతర్యామినైన నేనే ఫలము నొసంగుచుందును. కాని, ఆ దేవతలకు అంతర్యామినై, ఫలము నొసంగువాడను నేనే - అను విషయమును తెలియకుండుటచే అట్టివారు పొందు ఫలము స్వల్పమైనది. ఇతర దేవతల నారాధించువారు — పునరావృత్తి గల స్వర్గాది లోకములను పొందుచుండగా, నా స్వరూప రూప గుణ విభూత్యాదుల నెఱింగినవారు - పునరావృత్తి రహితమైన మోక్ష మును పొంది, పరమానంద నిర్భరు లగుచున్నారు' - అని, భగవ దారాధకుల వైశిష్ట్యమును ప్రశంసించెగు. ఇట్లే -

"యాంతి దేవవ్రతా దేవాన్ - పితౄన్ యాంతి పితృవ్రతాః ।
భూతాని యాంతి భూతేజ్యాః - యాంతి మ ద్యాజినోఽపి మామ్."
(భగ . 7-22)

ఈ శ్లోకమునకు - శంకరాచార్యుల వ్యాఖ్యానమును చూడుడు.

"యాన్తి - గచ్ఛన్తి, దేవవ్రతాః - దేవేషు వ్రతం (నియమః, భక్తిశ్చ) యేషాం తే, దేవవ్రతాః - దేవాన్ యాన్తి. పితౄన్ - అగ్నిష్వాత్తాదీన్ యాన్తి పితృవ్రతాః - శ్రాద్ధాది క్రియాపరాః - పితృభక్తాః భూతాని - వినాయక -

మాతృగణ చతుర్భగిన్యాదీని యాన్తిం. భూతేజ్యాః = భూతానాం పూజకాః యాన్తి. మ ద్యజనశీలాః వైష్ణవాః - మా మేవం సమానేఒప్యాయాసే. మా మేవ భజన్తే. అజ్ఞానాత్, తేన తే. అల్పఫలభాజః భవన్తీ త్యర్థః."

ఇంద్రాది దేవతలను శ్రద్ధాభక్తులతో ఆరాధించువారు – ఆ యా దేవతలను పొందుచున్నారు. శ్రాద్ధాదుల ద్వారా – పితరులను పూజించువారు - అగ్నిష్వాత్తాది పితరుల సాన్నిధ్యమును పొందుచున్నారు. వినాయకుడు, చతుర్భగిని (దుర్గ) - మున్నగు భూతములను పూజించువారు - ఆ యా భూతములను పొందుచున్నారు. నన్ను యజించువారు - (ఆరాధించువారు) - నన్ను పొందుచున్నారు. ఈ విధముగా – నా భక్తులను - దేవ, పితృ, భూత పూజలకును - స్వస్వ అభీష్ట దేవాదుల అరాధనలో శ్రమ - సమానమేయైనను, పూజకులు అజ్ఞానమువలన నన్ను పొందజాలకున్నారు. కావున, వారికి లభించు ఫలము అల్పమైన దని భావము." - ఇది - శంకరాచార్యుల వ్యాఖ్య.

## చేతనాచేతన శరీరకుడు

ఈ విధముగా విష్ణువు - యజ్ఞస్వరూపిగా, యజ్ఞ ఫలదాతగా, సర్వాంతర్యామిగా వైదికులచే ఆరాధింపబడినట్లు స్పష్టమైనది. పురుష సూక్తము ఈ విష్ణుభగవానుని విశ్వకారణత్వమును విస్తరించి వివరించినది. సర్వాంతర్యామి యగు విష్ణువునకు - చేతనాచేతనాత్మకమైన ప్రకృతి - శరీరము.

"అకాశ శరీరం బ్రహ్మ."

బ్రహ్మ - ఆకాశము శరీరముగా గలది' - అని, శ్రుతివాక్యము స్పష్టము చేయుచున్నది.

"సోఽభిధ్యాయ శరీరాత్స్వాత్ । సిసృక్షుర్వివిధాః ప్రజాః ।
అప ఏవ స సర్జాదౌ - తాసువీర్య మపాసృజత్."
- (మనుస్మృతి : 1-78.)

ఆ పరమాత్మ సృష్టి గావింప సంకల్పించి, తన శరీరమునుండి శరీరములను సృజించి, వానియందు జగద్బీజమును ప్రవేశింపజేసెను'- అని, మనుమహర్షి - ఈ విషయమును విశదము గావించెను.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే । యేన జాతాని జీవన్తి । యత్ప్రయన్త్యభిసంవిశన్తి । త ద్విజిజ్ఞాసస్వ । త ద్బ్రహ్మేతి."

అని, వరుణుడను ఆచార్యుడు - తన కుమారుడు - శిష్యుడునైన భృగువునకు బ్రహ్మలక్షణములను తెలిపి, అట్టిది ఏదియో, అదియే బ్రహ్మ - అని తెలిసికొని, ఉపాసించుమని ఉపదేశించెను.

"జన్మాద్యస్య యతః."

అను బ్రహ్మసూత్రము (1-1-2) సైతము - విష్ణువునందు ఎట్లు సమన్వయించునో చూడుడు :-

"నారాయణః, విశ్వంభరః, పద్మనాభః, విశ్వమూర్తిః, జగన్నాథః, దశరూపభృత్, దైత్యారిః, జనార్దనః, పురుషోత్తమః, వటపత్రశాయీ, విష్ణుః."

మున్నగు ఇతని అన్వర్థనామములు, ఆ నామముల అర్థములను విశదీకరించు సుప్రసిద్ధములగు ఐతిహ్యములును - ఇందులకు నిదర్శనములు.

చేతనాచేతనములలోపల, వెలుపల వ్యాపించియుండువాడు నారాయణుడు. ప్రపంచమును తన బొజ్జలో నుంచుకొనినవాడు విశ్వంభరుడు. ఈ విషయమును మాఘకవి -

"యుగాన్తకాలప్రతిసంహృతాత్మనః
జగన్తి యస్యాం సవికాస మాసత ।
తనౌ మము స్తత్ర న కైటభద్విషః
తపోధనాభ్యాగత సంభవాముదః."

- (శిశుపాలవధ. కావ్యము : 1 సర్గ. 23 శ్లో.)

"యుగాంత యోగనిద్రానిరుద్ధ సర్వద్వారే - నారాయణోదర నివిష్ట మివ భూత జాతమ్."

సమయమున యోగనిద్రచే మూయబడిన సర్వద్వారములుగల నారాయణుని ఉదరమున చేరియున్న ప్రాణికోటివలె (జృంభకాస్త్రాంధకారములో సైన్యము లీనమైనది) అని - చక్కగా ప్రస్తుతించెను.

"ప్రతిమాని భేన ఉదరేణ - నారాయణ మివ బిభ్రాణమ్."

- (ఉత్తరరామచరితము : 6 అం. విష్కంభము(గ)

తన నీటిలో ప్రతిబింబించిన సకల వన - పర్వత - గ్రహ - నక్షత్రాదులచే వికసించిన నాభికమలము గల నారాయణుని వలె ఉన్న దియు.'

సృష్టి ప్రారంభ సమయమున తన నాభినుండి పద్మమును సృజించి, అందు - చతుర్ముఖ బ్రహ్మను సృష్టించుటచే - పద్మనాభుడు. సృజింపబడిన ప్రపంచము తనకు శరీరముగను, తాను అందు

అంతర్యామిగను ఉండుటచే, విశ్వమూర్తి. లేక - విశ్వరూపుడు. ఇక, జగద్రక్షణగావించుటచే - జగన్నాథుడు. ఇందుకొఱకే అవతార ములను దాల్చువాడు కాపున - 'దశరూపభృత్' - అయ్యెను. ఇచట 'దశ' అనునది కేవలము ఉపలక్షణము మాత్రమే.

"బహూని మే వ్యతీతాని - జన్మాని...." - (భ : గీ : 4-50,)

నేను అనేక జన్మలను ధరించియున్నాను' అని - గీతాచార్యుడే పల్కియున్నాడు గదా ! ఇతని జన్మలు మన జన్మల వలె - కర్మ మూలకములై, హేయములుకావు. కేవల దయా మూలకములు. కావుననే -

"జన్మ కర్మ చ మే దివ్యం - ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పున ర్జన్మ - నైతి మా మేతి పాండవ ।"

(భ : గీ : 4-9)

నా జన్మము, కర్మమును అప్రాకృతేములు. ఇట్లు ఎవడు తత్త్వ మును తెలిసికొనుచున్నాడో, అతడు దేహమును వదలిన పిమ్మట, మఱల జన్మమును పొందడు. నన్నే పొందును' - అని - వక్కాణించి నాడు కృష్ణపరమాత్మ.

"పరిత్రాణాయ సాధూనాం - వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ - సంభవామి యుగే యుగే." (భ : గీ : 4-8)

సాధుపులను రక్షించుటకు, పాపులను నశింపజేయుటకు, ధర్మ మును స్థాపించుటకును, ప్రతి యుగమందును - నేను పుట్టుచున్నాను'- అని - తన అవతార ప్రయోజనమునుకూడ ప్రవచించియున్నాడు కృష్ణభగవానుడు.

పరమాత్మకు దివ్యాత్మగుణములు, దివ్యమంగళ విగ్రహము - లే వని కొందఱు తలంతురు. కాని, ఇది శ్రుతి విరుద్ధము.

"యథా పుండరీక మేవ మక్షిణీ"

"మహారజతం వాసః"

"ఆప్రణఖా త్సర్వ ఏవ హిరణ్మయ్."

"ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్."

మున్నగు శ్రుతివాక్యములు - అతడు పుండరీకాక్షు డనియు, బంగరు చేలము దాల్చినవాడనియు, నఖ శిఖ పర్యంతము - బంగారము పోత పోసినట్లు ఉండువాడనియు, ఆదిత్యుని వలె దేదీప్యమాన దివ్య మంగళ విగ్రహుడనియు తెలుపుచున్న విగదా ! వీనిని ప్రస్తుతించు నదియే పుండరీకాక్ష నామము. ఈ పుండరీకాక్షత్వము - పరవాసు దేవునియందువలె - అవతారములందును ప్రస్ఫుటముగ గోచరించు చుండును.

ఇతడు పురుషోత్తముడు. సర్వజ్ఞత్వ - సర్వశక్తిత్వ - సర్వాశ్రయత్వ - సర్వస్వామిత్వ - సర్వకారణత్వాది ఆశ్రయకార్యా పాదక గుణములతో బాటు, దయ, క్షాంతి, ఔదార్యము, ఆశ్రిత వాత్సల్యము - మున్నగు ఆశ్రయణ సౌకర్యాపాదక గుణములును గలవారలై, ఐహిక - ఆముష్మిక ఫలములతో మోక్షమును సైత మొసంగువా డగుటచేతనే పురుషోత్తము డయ్యెను.

"ఉత్తమః పురుష స్త్వన్యః - పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య - బిభ ర్త్యవ్యయ ఈశ్వరః."

(భ : గీ : 15-17)

మూడవు లోకములను అంతట ప్రవేశించి భరించుచున్న, వ్యయము లేని ప్రకృతిసంబంధ దోషము - 'పరమాత్మ' యని చెప్ప బడు ఉత్తమపురుషుడు - ఈ రెంటికంటెను విలక్షణుడు' - అను గీతాచార్యుని సూక్తి - ఇట స్మరింపదగియున్నది.

తాను గావించిన ఈ జగద్రచనకు అఘాతమును కలిగించు హిరణ్యాక్షాది దైత్యులకు ఇతడు మృత్యువు. కావుననే ఇతడు - 'దైత్యాది' అని ప్రసిద్ధి గాంచెను. 'దైత్య', 'అసుర' పదములు - పర్యాయములు. ఈ అసురులు - దైవకార్యమునకు విరోధులు. కావుననే దైవకార్యముల నారంభించునపుడు మనము -

"శుక్లాంబరధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయేత్ - సర్వ విఘ్నోపశాంతయే."

అని - విష్ణుప్రార్థన గావించుచున్నాము. దీనిని కొందఱు అల్పజ్ఞులు- వినాయక ప్రార్థనగా భ్రమించుచున్నారు, ఇది సరి కాదు. సర్వ శాస్త్రార్థకోవిదుడై, బహుగ్రంధకర్తయై, లబ్ధప్రతిష్ఠుడైన అప్పయ్య దీక్షితులు - తన వరదరాజ స్తోత్రమున ఒక శ్లోకమునందు -

"స్వామీ ! నీవు సహజముగ శుక్లవర్ణుడవు. అయినను, ఆశ్రితుల విషయమున దయారసభరితుడ వగుటచే, కాఱుమబ్బువలె మాకు దర్శనీయుడవగుచున్నావు"

అని వర్ణించి, తానే రచించిన ఆ స్తోత్ర వ్యాఖ్యానమునందు -

"విష్ణువు నీలమేఘవర్ణముగదా ! శుక్లవర్ణుడు ఎట్లగును ?"

అని పల్కించి -

"నిజమే అంతమాత్రమే కాదు. అతడు (వాస్తవమున) శుక్ల వర్ణుడుకూడ."

అని చెప్పి, అందుకు ప్రమాణముగా - పద్మపురాణాంతర్గత మగు శివ రాఘవ సంవాదమున గల "శుక్లాంబరధరం విష్ణుం" అను - శ్లోకమును ఉదహరించిరి. అకరమును కూడ వారే నిర్దేశించిరి. కావున, దైవ కార్యములకు విఘాతమును కలిగించు అసురులను వారించు వాడు - దైత్యారి అయిన విష్ణువే' అని - స్పష్ట మగుచున్నది.

ఇక 'జనార్థన' నామము - ప్రళయకారిత్వమును సూచించును. 'వటపత్రశాయి' అను నామము - ప్రళయానంతర దశను సూచించు చున్నది. ఇట్లే - 'ముకుందః' నామము - ఇతని మోక్షప్రదత్వమును స్పష్టము గావించుచున్నది.

"ముకుం = (మోక్షం), దదాతీతి ముకున్దః."

మోక్షము నొసంగువాడు కావున అతడు ముకుందు డనబడు చున్నాడు.

"మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్"

జనార్దనుని నుండి మోక్షము కోరదగినది' అను సూక్తియే ఇందు లకు పరమ ప్రమాణము.

'మోక్షాశ్రమము' అనబడు తురీయాశ్రమమును స్వీకరించిన యతివర్యులకు - 'నారాయణ స్మృతి' - సదా కర్తవ్యమైనది. ఈ విషయము లన్నియు — శిష్టగోష్ఠి యందేగాక, యావద్భారతమున,

ఆబాల గోపాలము - ప్రసిద్ధములై నవేగాని, ప్రాదేశికములు కావు గదా !

## విష్ణునామ స్మరణావశ్యము

ఇక మన నిజజీవితమున విష్ణువు ఎట్లు సాక్షాత్కరించుచుండెనో పరిశీలింతము :-

ఏదేని ఒక దైవ కార్యమును ప్రారంభించునపుడు - పాదములను, హస్తములను శోధించుకొని, ఆచమనము గావించుట - శిష్టాచారము. ఆచమించుచు చెప్పవలసిన మంత్రము :-

''అచ్యుతాయనమః (స్వాహా), అనన్తాయనమః (స్వాహా), గోవిన్దాయనమః (స్వాహా)."

అనునది. అపైన, కేశవాది ద్వాదశనామములతో ఇంద్రియశుద్ధి గావించుకొనవలెను. కొందఱు -

"కేశవాయస్వాహా । నారాయణాయస్వాహా । మాధవాయస్వాహా ॥"

అని ఆచమింతురు. పై ఆచమన మంత్రములో - అచ్యుతానన్త గోవింద నామములు - విష హరములు. పరమ శివుడు కాలకూట విషమును మూడు మాత్రలుగా జేసి, అచ్యుతాది మంత్రముల నుచ్చరించుచు - స్వీకరించెనట ! ఈ విషయమును - నీలకంఠదీక్షితుడను కవివరేణ్యుడు - తన 'నీలకంఠ విజయ' చంపూగ్రంథమునందు వివరించియున్నాడు. కావుననే కాబోలును - పెద్దలు ఔషధమును సేవించునపుడు -

"అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజాత్ ।
నశ్యంతి సకలా రోగాః - సత్యం సత్యం వదా మ్యహమ్."
అను శ్లోకమును అనుసంధించుచుందురు.

సంధ్యావందనారంభమున ఆచమించిన పిమ్మట -

"అపవిత్రః పవిత్రోవా - సర్వావస్థాంగతోఽపివా ।
యః స్మరేత్ పుండరీకాక్షం - స బాహ్యాభ్యంతర శ్శుచిః."
పుండరీకాక్షాయ నమః.

అను మంత్రమును పఠించుచు, శరీరశుద్ధి గావించుకొందురు. ఆపైన సంకల్పము. ఇందును -

"శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య । అద్య బ్రహ్మణః...."
అనుచు - విష్ణుభగవానుని సార్వభౌమత్వమును ప్రస్తుతింతురు.

సంకల్పము - "శుక్లాంబరధరం విష్ణుం" - అను శ్లోకముతో ప్రారంభమగును. ప్రారంభించి చేయు వైదిక కార్యములలో - ఏవేని పొరపాట్లు సంభవించినచో -

"విష్ణు ర్విష్ణు ర్విష్ణుః."
అని - విష్ణునామ స్మరణము గావింతురు. ఆ కార్యము పూర్తియైనంతనే -

"కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్ ।
కరోమి యద్య త్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి."
అని పఠించి, కర్మఫలమును భగవంతునకు సమర్పింతురు.

"యత్కరోషి యదశ్నాసి - యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ । తత్కురుష్వ మదర్పణమ్ "

— (భ : గీ : 27)

నీవు చేయునది ఏదో, నీవు భుజించునది యేదో, హోమము చేయున దేదో, దానము చేయున దేదో, నీవు తపము చేయుట ఏదో, వాని నన్నిటిని నా కర్పణము చేయుము' — అనిగదా గీతాచార్యుని ఆదేశము !

వేదపారాయణమును ప్రారంభించునపుడు -

"హరిః ఓమ్."

అనుచు, హరినామస్మరణముతో ప్రారంభింతురు. భోజన సమయమున - గోవింద నామ కీర్తనమును చేయుట - చూచుచుందుము,

శిష్ట స్మార్తులు పంచాయతన పూజ గావింతురు. కాని, సాలగ్రామస్పర్శ లేనివో, ఇతర దేవతల తీర్థ ప్రసాదములను స్వీకరింపరట ! 'ప్రబోధ చంద్రోదయము' అను అద్వైత వేదాంత నాటకమునందు - విష్ణుభక్తివలన ప్రబోధోదయము కలిగినట్లు వర్ణింపబడినవి.

భోజనము చేయుటకు వచ్చిన అతిథిని మనము - విష్ణు స్వరూపునిగా భావించి, భోజన మిడి ఆదరింపవలెను.

"అభ్యాగత స్స్వయం విష్ణుః."

అను వాక్యము - ఈ యర్థమునే బోధించుచున్నది.

"యతీనాం వ్రత వృద్ధానాం - స్వధర్మ మనువర్తినామ్ ।
విష్ణురూపేణ వై కుర్యాత్ - నమస్కారం విధానతః."

ఇత్యాది ప్రమాణములు - సన్న్యాసిని విష్ణువుగా భావించి - నమస్కరింపు మనుచున్నవి. కావుననే - యతులు భిక్షకు వచ్చినచో, వైశ్వదేవము కాకున్నను - భిక్ష నిడవచ్చునని - ధర్మశాస్త్రము బోధించుచున్నది.

బీదలకు వేయు పట్టె డన్నమును - 'మాధవ కబళము' అని యందురు. వారు — దరిద్రనారాయణులుగదా ! 'మానవ సేవయే మాధవ సేవ' - అను నానుడి - జగత్ప్రసిద్ధము.

"జామాతా విష్ణువత్ పూజ్యః."

అను వాక్యము - అల్లుని విష్ణువుగా భావింపు మనుచున్నది. అందు చేతనే వివాహమునందు అల్లుని -

"మహావిష్ణు స్వరూపాయ వరాయ"

అని - మహావిష్ణు స్వరూపునిగా సంభావించి, పాదములను శోధించి, కన్యాదానము చేయుదురు.

"గేయం గీతా - నామ సహస్రం
ధ్యేయం శ్రీపతి రూప మజస్రమ్."

అని శంకరాచార్యులు - అనుదినము భగవద్గీతను, శ్రీవిష్ణుసహస్ర నామ స్తోత్రమును పారాయణము గావించుచు, శ్రియఃపతిరూపమును అనవరతము ధ్యానింపవలెనని ఉద్బోధించియున్నారు. వారి మాతృమూర్తి — వైకుంఠమునే సాధించెనట !

"ప్రేతరూపీ జనార్దనః ప్రీయతామ్"

అని – ప్రేతము జనార్దనునిగా భావించుచుండురు. గయా శ్రాద్ధము అక్షయ నిధి చ్ఛాయలో - విష్ణుపాదమునందు పిండప్రదానము, పితరుల ఉత్తమ గతికై పుత్రులు చేయవలసిన కర్మలు.

"జీవతో ర్వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరి భోజనాత్ ।
గయాయాం పిండదానాచ్చ – త్రిభిః పుత్రస్య పుత్రతా"

అని - ధర్మశాస్త్ర ప్రమాణము. ఇవి యన్నియు - విష్ణు క్షేత్రములే.

'వారాణసి' సుప్రసిద్ధమైన శివక్షేత్రముగదా! అచట మరణించినవారికి - పరమ శివుడు - (రామ) తారక మంత్రమును ఉపదేశించునట! కావున, కాశీలో మరణించినవారికి మోక్షము లభించునని -

"కాశ్యాం తు మరణా న్ముక్తిః"

అను పురాణ వచనము స్పష్టము చేయును. ఇచట శవవాహకులు -

"రామ్‌నామ్ సత్యహై."

అనుచు - శవమును కాటికి చేర్తురట! ఇచట మోక్షము నొసంగునతడు - బిందు మాధవస్వామి. ఈ విషయమును - 'ప్రబోధ చంద్రోదయ' మను నాటకము వివరించుచున్నది.

వైకుంఠ సమారాధనము తెలిసినదేకదా!

"అయోధ్యా మధురా మాయా – కాశీ కాంచీ అవంతికా ।
పురీ ద్వారవతీ చైవ – సప్తైతే మోక్షదాయకాః."

మోక్షదాయకములుగా చెప్పబడిన ఈ నగరము లన్నియు - విష్ణు క్షేత్రములే.

సుప్రసిద్ధములైన రామాయణ - భారత - భాగవతములు మూడును మూడు వేదములవలె - విష్ణు మహిమను బోధించు చున్నవి.

"హరిం హరీతకీం చైవ - న కదాపి పరిత్యజేత్."

హరిని, హరీతకిని (కరక్కాయను) - ఎన్నడును విడువవలదను చున్నది ఆయుర్వేదము.

తీవ్ర వ్యాధులు శమించుటకై, విష్ణుసహస్రనామస్తోత్రమును పారాయణము చేయు మని - 'చరక సంహిత' అను - ఆయుర్వేద శాస్త్రము ఉద్బోధించుచున్నది. మహాకవి బాణభట్టు - తన కాదంబరిలో —

"అనవరత పరివర్త్యమాన నారాయణనామ సహస్రకమ్."

అనుచు, సూచికా గృహ ప్రాంగణమున - విష్ణుసహస్రనామస్తోత్రమును ఎడతెరపి లేక - పారాయణము గావించుచున్నట్లు వర్ణించెను.

నవ రసములలో - శృంగార, వీర, అద్భుత, శాంతరసములకు అధిదేవత 'విష్ణువు' అని - సాహిత్య శాస్త్రము వివరించుచున్నది.

శివునకు ఎదురుగ, దేవికి పార్శ్వములలో గృహ నిర్మాణము తగ దని తెలుపుచు వాస్తుశాస్త్రము - ముందు వైపున గాక, విష్ణువునకు వెనుకగా గృహములు నిర్మాణము చేయరాదని ఆదేశించినది.

విష్ణుభగవానుని యనుగ్రహామునకు అయ్యది అనుకూలము కాదని - దీని తాత్పర్యము.

గ్రామములోగాని, నగరములోగాని — మధ్యలో విష్ణ్వాలయమును నిర్మింపవలెననియు, ఈశాన్య దిశలో - గ్రామమునకు దూరముగా, శివ - శక్తుల ఆలయము లుండదగుననియు, విష్ణుమూర్తులను - సత్త్వగుణ ప్రధానమునుబట్టి, సౌమ్యరూపముగ నిర్మింపవలెననియు - వాస్తు శాస్త్రము వక్కాణించుచున్నది.

శ్రియఃపతిని స్మరించి ప్రారంభించిన కార్యము నిర్విఘ్నముగా నెరవేరగలదని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు వక్కాణింతురు.

"త దేవ లగ్నం సుదినం త దేవ
తారాబలం చంద్రబలం త దేవ ।
విద్యాబలం దైవబలం త దేవ
లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి."

ఈ శ్లోకమే జ్యోతిశ్శాస్త్రజ్ఞుల భావనకు - ప్రబల తార్కాణము.

ఈరీతిగా ఈ యజ్ఞనారాయణుని అద్వితీయమగు సాత్త్వికతను- ఆయుర్వేదశాస్త్రము, వాస్తుశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, అలంకార శాస్త్రము, సాహిత్యశాస్త్రము - మున్నగు తటస్థ శాస్త్రములు సైతము - వేనోళ్ళ చాటి చెప్పుచున్నవి.

ఐహికములైన పుత్ర - పశు - అన్నాది కామనలతో దేవతాంతరములను ఆరాధించినను, మనము ఆకాంక్షించునది విష్ణువునే. శిష్యుడు గురువుగారి పాదములకు గండ పెండెరమును తొడగినను, వారి హస్త

ములకు సింహతలాటములను అలంకరించినను, మెడలో ముత్యముల హారమును, పుష్పమాలికలను ధరింపజేసినను, చెవులకు కుండలములను ఆకర్షణీయముగ తగిలించినను - ఆనందించునది, ఆశీర్వదించునదియు ఆ గురుపర్యులేగదా !

## దేవతా వైవిధ్యము

హిందూమతమునందు దేవతా వైవిధ్యమునకు కొరత లేదు. కావున, హిందువులు బహు దేవతారాధకులని, భగవంతుడు ఒక్కడే అయియుండ, ఇంతమంది దేవత లేమి ? అని - ఇతర మతస్థులు విమర్శించుచుందురు. దీనికి వేదమే -

"ఏకం సత్. విప్రా బహుధా వదన్తి."

ఉన్నది ఒక్కడే. వానిని విప్రులు అనేక రూపములతో దర్శించుచు, అనేక నామములతో ప్రస్తుతించుచుందురని సమాధానము చెప్పినది. కావున, ఈ విషయమును విస్మరింపరాదు. రజస్తమో గుణముల వలన ఏర్పడుచుండు నామ రూపములు - ఆగంతుకములు, నశ్వరములును. సత్త్వ మొకటియే నిత్యమైనది. అట్టి సత్త్వమూర్తి శ్రీమన్నారాయణుడు. నదు లన్నియు సముద్రమునే చేరునట్లు - అన్ని పూజలు, అన్ని స్తోత్రములును - ఆ శ్రీమన్నారాయణునే చేరును.

''యథా నద్యః స్యందమానా స్సముద్రే
అస్తం గచ్ఛన్తి నామ రూపే విహాయ ।
తథా విద్వాన్ నామ రూపే విహాయ
పరాత్పరం పురుష ముపైతి విద్యమ్.''

అను ఉపనిషత్సూక్తి - ఇందులకు ప్రమాణము. ఈతడే పురుషోత్తముడు.

## అర్చావతారము

"న తే రూపం నచాకారో - నాయుధాని నచాస్పదమ్ ।
తథాఽపి పురుషాకారో - భక్తానాం త్వాం ప్రకాశసే."

- (జితంతాస్తోత్రము : 5 శ్లో.)

అను రీతి, చేతనాచేతన శరీరుడై, సర్వాంతర్యామియైయున్న ఈ దేవ దేవుడు - తనకు ఒక రూపమును, ఆకారము, నివాసము, ఆయుధములు లేకున్నను, భక్తుల నిమిత్తము రూపాదికములను కలిగి సాక్షాత్కరించి, వారి వాంఛలను సఫలము గావించుచుండును. ఈతని భౌతిక రూపమే అర్చావతారము. ఇయ్యది భౌతికమే యయ్యును - అవతారములవలె - దివ్యమైనది.

"జన్మ కర్మ చ మే దివ్యమ్." (భ . గీ . 4-9)

'నా జన్మమును, కర్మమును - అప్రాకృతములు' - అనిగదా గీతాచార్యుని శ్రీసూక్తి ! ఈ అర్చామూర్తుల ఆరాధనాదులను వైఖానస - పాంచరాత్రాగమములు విశదముగ బోధించుచున్నవి. పరవాసుదేవుని వైభవమును వేదములు; అంతర్యామి వైభవమును ఉపనిషత్తులు; అవతారవైభవమును ఇతిహాస - పురాణములు, ఆళ్వారుల దివ్యప్రబంధములును వేనోళ్ళ కొనియాడుచున్నవి.

## పుణ్యక్షేత్ర సందర్శనము

నేటి మనకు - అర్చావతారమే శరణ్యము. శ్రీరంగము, శ్రీవేంకటాద్రి, బదరికాశ్రమము, సాలగ్రామము - మున్నగు పుణ్య క్షేత్రములలో - స్వామి మన రక్షణకొఱకే ప్రతిష్ఠించుచున్నాడు. ఆ నారాయణుని కనులార దర్శించి, పూజించి, స్తుతింతము రండు.

## నారాయణ హృదయ స్తోత్రము

ఓమ్. అస్య శ్రీ నారాయణ హృదయ స్తోత్ర మహా మంత్రస్య । భార్గవ ఋషిః. అనుష్టుప్ ఛందః, శ్రీ లక్ష్మీనారాయణో దేవతా, శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థే జపే వినియోగః ॥

అథ కరన్యాసః ॥ ఓం నారాయణ పరంజ్యోతి రితి అంగుష్ఠాభ్యాం నమః । ఓం నారాయణ పరంబ్రహ్మేతి తర్జనీభ్యాం నమః । ఓం నారాయణపరో దేవేతి మధ్యమాభ్యాం నమః । ఓం నారాయణ పరంబ్రహ్మేతి అనామికాభ్యాం నమః । ఓం నారాయణపరోధర్మ ఇతి - కనిష్ఠికాభ్యాం నమః । ఓం విశ్వ నారాయణః పర ఇతి - కరతల కరపృష్ఠాభ్యాం నమః । ఏవం హృదయాదిన్యాసమ్ ॥ అథ ధ్యానమ్ ।

ఉద్యదాదిత్యసంకాశం - పీతవస్త్రసమచ్యుతమ్ ।
శంఖచక్రగదాపాణిం - ధ్యాయే ల్లక్ష్మీపతిం హరిమ్ ॥

ఓం నమో నారాయణాయ ఇతి మంత్రం జపేత్ ॥

శ్రీ వేదవ్యాస ఉవాచ :-

శ్రీమన్నారాయణో జ్యోతి రాత్మా నారాయణః పరః ।
నారాయణ పరంబ్రహ్మ - నారాయణ నమోఽస్తుతే ॥ ౧

నారాయణః పరో దేవో - ధాతా నారాయణః పరః ।
నారాయణపరోధ్యాతా - నారాయణ నమోఽస్తుతే ॥ ౨

నారాయణః పరంధామ - ధ్యాతా నారాయణః పరః ।
నారాయణః పరో ధర్మో - నారాయణ నమోఽస్తు తే ॥ ౩

నారాయణపరో బోధో – విద్యా నారాయణః పరః ।
విశ్వం నారాయణ స్సాక్షాత్ - నారాయణ నమోఽస్తు తే ॥ ౪

నారాయణా ద్విధి ర్జాతో - జాతో నారాయణా చ్ఛివః ।
జాతో నారాయణా దింద్రో - నారాయణ నమోఽస్తు తే ॥ ౫

రవి ర్నారాయణ స్తేజ శ్చంద్రో నారాయణో మహః ।
వహ్ని ర్నారాయణ స్సాక్షాత్ - నారాయణ నమోఽస్తు తే ॥ ౬

నారాయణ ఉపాస్య స్స్యాత్ - గురు ర్నారాయణః పరః ।
నారాయణః పరో బోధో - నారాయణ నమోఽస్తు తే ॥ ౭

నారాయణ ఫలం ముఖ్యం - సిద్ధి ర్నారాయణ స్సుఖమ్ ।
సర్వం నారాయణ శ్శుద్ధో - నారాయణ నమోఽస్తు తే ॥ ౮

నారాయణ స్త్వమేవాసి - నారాయణ హృది స్థితః ।
ప్రేరకః ప్రేర్యమాణానాం - త్వయా ప్రేరిత మానసః ॥ ౯

త్వ దాజ్ఞాం శిరసా ధృత్వా - జపామి జనపావనమ్ ।
నాదోపాపన మార్గాణాం - భావకృ ద్భావబోధకః ॥ ౧౦

భావార్థకృ ద్భవాతీతో - భవసౌఖ్యప్రదో మమ ।
త్వ న్మాయయా మోహితం విశ్వం - త్వ యైవ పరికల్పితమ్ ॥ ౧౧

త్వ దధిష్ఠానమాత్రేణ - సా వై సర్వార్థకారిణీ ।
త్వ మేతాం చ పురస్కృత్య - సర్వ కామాన్ ప్రదర్శయ ॥ ౧౨

న మే తదన్య స్త్రాతాఽస్తి - త్వదన్య న్నహి దైవతమ్ ।
త్వ దన్యం న హి జానామి - పాలకం పుణ్యవర్ధకమ్ ॥ ౧౩

యావ త్సాంసారికో భావో — మనస్థో భావనాత్మకః ।
తస్మా ద్భేదో భవే త్తావ త్సర్వదా సర్వదా విభో ! ౧౪

పాపీనా మహ మేకాగ్రో - దయాలూనాం త్వ మగ్రణీః ।
దయనీయో మ దన్యోఽస్తి - తవ కోఽత్ర జగత్రయే ॥ ౧౫

త్వయాఽహం నైవ సృష్టే శ్చే న్నసాశ్య త్తవ దయాలుతా ।
ఆమయో వానసృష్ట శ్చే దౌషధస్య వృథోదయః ॥ ౧౬

పాపసంఘ పరిక్రాంతః - పాపాత్మా పాపరూపధృత్ ।
త్వ దన్యః కోఽత్ర పాపేభ్య స్త్రాతాఽస్తి జగతీతలే ॥ ౧౭

త్వ మేవ మాతా చ పితా త్వ మేవ — త్వ మేవ బంధు శ్చ గురు
స్త్వ మేవ ।
త్వ మేవ సేవ్య శ్చ గురు స్త్వ మేవ - త్వ మేవ సర్వం మమ
దేవదేవ ! ॥ ౧౮

ప్రార్థనా దశకం చైవ మూలాష్టక మతః పరమ్ ।
యః పఠే చ్ఛృణుయా న్నిత్యం - తస్య లక్ష్మీ స్థిరా భవేత్ ॥ ౧౯

నారాయణస్య హృదయం - సర్వాభీష్ట ఫలప్రదమ్ ।
లక్ష్మీ హృదయకం స్తోత్రం - యది చైత ద్వినా కృతమ్ ॥ ౨౦

త త్సర్వం నిష్ఫలం ప్రోక్తం - లక్ష్మీః కృధ్యతి సర్వదా ।
ఏత త్సంకలితం స్తోత్రం - సర్వాభీష్టఫలప్రదమ్ ॥ ౨౧

జపే త్సంకలితం కృత్వా - సర్వాభీష్ట మవాప్నుయాత్ ।
నారాయణస్య హృదయ మాదౌ జప్త్వా తతః పరమ్ ॥ ౨౨

లక్ష్మీ హృదయకం స్తోత్రం - జపే న్నారాయణం పునః ।
పున ర్నారాయణం జప్త్వా - పున ర్లక్ష్మీనుతిం జపేత్ ॥ ౨౩

త ద్ధామాదికం కుర్యా దేత త్సంకలితం శుభమ్ ।
ఏవం మధ్యే ద్వివారేణ - జపే త్సంకలితం శుభమ్ ॥ ౨౪

లక్ష్మీ హృదయకే స్తోత్రే - సర్వ మన్య త్ప్రకాశితమ్ ।
సర్వా న్కామా నవాప్నోతి - ఆధివ్యాధిభయం హరేత్ ॥ ౨౫

గోప్య మేత త్సదా కుర్యా న్న సర్వత్ర ప్రకాశయేత్ ।
ఇతి గుహ్యతమం శాస్త్రం – ప్రోక్తం బ్రహ్మాదిభిః పురా ॥ ౨౬

ఇతి గుహ్యతమం శాస్త్ర ముక్తం బ్రహ్మాదిభిః పురా ।
తస్మా త్సర్వప్రయత్నేన - గోపయే త్సాధయే త్సుధీః ॥ ౨౭

యత్త్రైత త్పుస్తకం తిష్ఠన్ - లక్ష్మీనారాయణాత్మకమ్ ।
భూత ప్రేత పిశాశాం శ్చ - భేతాలా న్నాశయే త్సదా ॥ ౨౮

లక్ష్మీహృదయ ప్రోక్తేన - విధినా సాధయే త్సుధీః ।
భృగువారే చ రాత్రౌ తు - పూజయే త్పుస్తకద్వయమ్ ॥ ౨౯

సర్వదా సర్వధా సత్యం - గోపయే త్సాధయే త్సుధీః ।
గోపనా త్సాధనా ల్లోకే - ధన్యో భవతి తత్త్వవిత్ ॥ ౩౦

(ఇతి అధర్వణ రహస్యే - ఉత్తర భాగే - నారాయణ హృదయ స్తోత్రమ్.)

## మంగళాశాసనము

"శ్రీమన్ శ్రీరంగ శ్రియమనుపద్రవా మనుదినం సంవర్ధయ."



# మేలుకొలుపు

సమర్పణ :

## డా॥ శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు,

ఎం. ఏ, పిహెచ్. డి.



'మేల్కొ-వయ్య రామానుజా !' అను మకుటముతో నున్న యీ పద్య దశకము - శ్రీ రామానుజస్వామివారి మహత్త్వము, మంత్రోపదేశము, భక్తార్తియు - సరస రీతిగా ప్రవచితమైనది. పద్య రచన - మాధురీ ధురీణము. ధారాళమైన శయ్యాసౌభాగ్యములతో నొప్పారుచున్నది.

మా బాల్యమునుండి - భాగవతోత్తము లెందరో - అను దినము ప్రాతఃకాల సమయమున వీనిని అనుసంధానించుట - ఎరుగుదును. కొంతకాలముక్రితము (1977) నల్లగొండజిల్లా - 'పల్లాల' గ్రామ నివాసులైన పండితశ్రేష్ఠులు - పరమ భాగవతోత్తములు నగు శ్రీమాన్ కందాళ వేంకట నరసింహాచార్యులుగారు వీనిని వ్రాసి యిచ్చినారు. (వీరు 1994 లో పరమపదించినారు.)

లభించినంతవఱకు ఇవియే పద్యములు. కవిగారు 11 - వ పద్యమును ముగింపుగా చెప్పినారు. అయినవో. వీని కర్తృత్వ మెవరిదో ఎవ్వరును చెప్పలేదు... పద్యములలో కవిపేరు లేదు.

సుమారు ఒక శతాబ్దమునకు పూర్వము - వరంగల్లు జిల్లా - ఇనుగుర్తి నుండి వచ్చి, నల్లగొండజిల్లా 'దేవరకొండ' ప్రాంతములోని

'మేడారం' గ్రామములో స్థిరపడిన - కండ్లకుంట పరాంకుశాచార్యుల వారే వీనిని రచించినారను ప్రచారము గలదు. దీనికి మరియొక ఆధార మే మనగా:- వీరు - మారేపల్లి ఆండాళునుగూర్చి - నవరత్న సంఖ్యగా నొక పద్యస్తుతిని చెప్పినారు. ప్రస్తుత పద్య దశకము, ఆ స్తోత్రము - ఒకే శైలిలో గలవు. అవియు - అన్నియు మత్తేభములే! వాని చివర - కవి తమను గూర్చి తెల్పుకున్నాడు.

ఆ విధముగనే - 'మేల్కొలుపు' పద్యముల చివరలోను కవిగారు తమనుగూర్చి వ్రాసికొన్న పద్యము వ్యాప్తిలోనికి రానందున (కంఠపాఠముగా ఈ పద్యముల చదువువారు - దానిని అనవసర మని వదలివేసినారేమో !) ఈవిధమైన కర్తృత్వ సంశయ మేర్పడినది. ఇది యొక ఊహ మాత్రమే.

వీనిని పఠించినతర్వాత్, ఎవరికైన వీని రచయితపేరు తెలిసి యున్న చో - దయచేసి తెల్ప ప్రార్థన.

చాల కాలముతరువాత - 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' ద్వారా వీనిని ప్రకటించుచున్నందులకు సంతోషించుచున్నాను.

ఈ మేల్కొలుపు పద్యములు - అనుదిన ప్రాతఃకాల సమయ పఠనమునకే గాక, నిరంతరము మననము చేసికొనుటకు అన్ని విధముల - అనువుగా నున్నవి.

—శ్రీరంగాచార్య

## మేలుకొలుపు

1

కమలమ్ముల్ వికసించె, జక్కవల శోకల్ దీరె నక్షత్ర సం
ఘములున్ వెన్నెలతోన జారె, కృకవాకధ్వానముల్ మీఱె, సం
తమసం బంతయు విచ్చె, ప్రాగ్దిశను మార్తాండోదయం బయ్యె - ఆ
కుముదవ్రాతము నిద్రచేకొనియె మేల్కొవయ్య రామానుజా !

2

కమలద్వంద్వము మీఱు కన్నుగవ రాకాచంద్రబింబంబు చె
ల్వము చెన్నొందుముఖంబు - సింగుణుల రేవన్ మించుకన్బొమ్మ లం
దము మందస్మిత సుందరాధరము - ప్రోద్యద్దండ భాగంబులున్
కొమరొప్పన్ తగుసేవమాకొసగ మేల్కొవయ్య రామానుజా !

3

తిరుమంత్రంబున నుండు నారపదమున్ దీపించు వాక్యద్వయా
దరణీయంబున నోపు త చ్చరమ శబ్దం బర్థయుగ్మంబునన్
దిరమైయుండెడు యేకమంచను పదంబింపొందు మీామేన - నే
గురిగా నైక్యతజూపిబ్రోవవలె మేల్కొవయ్య రామానుజా !

4

గరిమన్ మంత్రపదత్రయంబు నమమన్ గాన్పించు నర్థంబునం
దు రచించెంతగజేసి నెమ్మదిని సంతోషంబు వాటిల్ల నా
దర మింపొందగ భక్తియందు ప్రతిపాద్యంబైన మేల్గూర్చి - నా
కొరతన్‌దీర్చిన దేశికాన్వయుడ ! మేల్కొవయ్య రామానుజా !

5

కరిశైలేశుడు వేంకటాద్రిపతి - రంగస్వామి - శ్రీ యాదవా
ద్రిరమాధీశుల కంతరంగు లట మీ దివ్యావతారప్రభా
గరిమం బంతయు మున్ను శారదయు మూకబ్రహ్మరక్షాదులున్
గురిగా దెల్పినతండ్రి నీవెకద! మేల్కొనవయ్య రామానుజా !

6

అర లేకన్ కరుణించి లోకులకు దేహాత్మాభిమానంబు దు
స్తరమంచున్ మెలగంగజేసి నిఖిలాత్మశ్రేణికిం గల్గు త
ద్భరమున్ గైకొని వారి నిర్భరముగా చాటించి రక్షించు స
ద్గురురాట్చంద్రుడ వీవె ప్రమొక్కెదను మేల్కొనవయ్య రామానుజా!

7

తెరువున్ గానక నుండు జీవతతి కద్వేషంబు ముఖ్యంబు లా
దరణీయంబుగ గల్గ జేసి యటసత్సాంగత్యమున్ కూర్చి మీ
చరణాబ్జమ్ములపై మరుల్ గొనగ నుత్సాహించు సంధించు - స
ద్గురురాట్చంద్రుడవీవె - ప్రమొక్కెదను మేల్కొనవయ్య రామానుజా!

8

ప్రమదం బొప్పగ బ్రహ్మసూత్రులకు తిప్పన్ భేదమట్లున్న 'త
త్త్వమసి'యంచును వాక్యసంగతికి నర్థం బేమి యూహించుమం
చమరన్ మాయగవచ్చినిల్చిట వాచ్యామ్నాయమందౌట - త
త్కుముద వ్రాతము త్రుళ్ళనుంచవలె మేల్కొనవయ్య రామానుజా!

## 9

కర ముప్పున్ భవదీయదాసు లతివేడ్కన్ వచ్చి, మీపాద పం
కరుహద్వంద్వము గాంచి మ్రొక్కుటకునై కాంక్షించియున్నారు - సా
దరలీలన్ కృపజేసి తత్త్వమును సంధానంబుచేతన్ గదే !
కొరతల్దీరగ వేగ బ్రోవవలె మేల్కొనవయ్య రామానుజా !

## 10

ధర లోనంగల బంధులన్ విరజలో స్నానంబుగావించి మీ
చరణాబ్జంబుల పొంత చేర్తునని యుత్సాహంబుదీపింప - శ్రీ
వరుతో పన్నిదమాడివచ్చి - కలి గర్వంబెల్ల మాయించు స
ద్గురురాజేంద్రుడ వీవె; మ్రొక్కెదను - మేల్కొనవయ్య రామానుజా!

### ఫలశ్రుతి

పరమోపాయ మటంచు మీదశకమున్ ప్రాతర్ముఖంబందు సు
స్థిరబుద్ధిన్ పరియించువారలకు సందేహంబు లేకుండు — మీ
చరణాబ్జంబుల భక్తి చేకురు, మహాసామ్రాజ్య సద్భోగ త
త్పరులై పిమ్మట నిత్యసూరు లన చెప్పన్ విందు రామానుజా !



# శ్రీమద్రామానుజులు - వేదాంత దీపము

'సాహిత్య విద్యా ప్రవీణ - ఉభయ వేదాంత విశారద'
డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు, ఎం. ఏ; పిహెచ్. డి.



## దీప ప్రకాశము

అనాది నిధనమైన వేదమునందు అంతర్లీనముగనుండి, శ్రుతి స్మృతీతిహాస పురాణముల ద్వారా ప్రవహించుచు, పూర్వాచార్యులచే పరంపరాగతముగ సిద్ధించినది విశిష్టాద్వైతము. ఇట్టి విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులైన శ్రీ రామానుజాచార్యులవారిచే, నవ నిధులనంటి నిక్షేపములుగ అనుగ్రహించిన నవ గ్రంథములలో - మహోన్నతమైన శ్రీభాష్యము - అనేక శాస్త్ర 'న్యాయ జటిల గ్రంథమైనందున, సామాన్యులు దానిని అధికరింపజాలరని తలంచి, పరమ కారుణికులైన వారలే, స్వయముగ - బ్రహ్మసూత్రములకు - 'వేదాంత దీపము', 'వేదాంత సారము', లఘు - లఘుతర వ్యాఖ్యానములను అనుగ్రహించినారు. వేదాంతసారమునందు సూత్రార్థములు సంగ్రహముగ వివరింపబడినవి. వేదాంత దీపమున ప్రతి అధికరణమునందును - శంక, పూర్వపక్షము, సిద్ధాంతము - అనునవి మూడును వివరింపబడినవి. కాని, శాస్త్ర చర్చలు అధికముగ జరుగలేదు.

## నామౌచిత్యము

వేదాంతము లనగా - ఉపనిషత్తులు. వేదసారములైన ఉపనిషత్తు లన్నింటి తత్త్వమును - సూత్రములుగ మార్చినాడు వ్యాసుడు.

వేదాంత సూత్రేము లన్నింటి యర్థమును - దీపము వలె దర్శింప జేయును గనుక, ఈ గ్రంథమునకు - 'వేదాంత దీపము' - అను నామము సార్థక మయ్యెను.

## వేదాంతదీప సారము

వేదాంతదీపమున - ప్రథమ ద్వితీయాధ్యాయములు - బ్రహ్మ స్వరూప బోధన పరములు. తృతీయాధ్యాయము - బ్రహ్మప్రాప్త్యుపాయ విచారపరము. చతుర్థాధ్యాయము - ప్రాప్యమైన ఫల స్వరూప కథనపరము.

ప్రథమాధ్యాయ — ప్రథమ పాదమున - పురుషుడే జగత్కారణ మని యాశంకించి, సర్వజ్ఞుడు - సత్యసంకల్పుడు - సమస్త కల్యాణ గుణాకరుడైన పరమాత్మయే జగత్కారణ మని ప్రతిపాదింప బడినది. ద్వితీయాధ్యాయమున - అస్పష్ట జీవాది లింగకములైన వాక్యములు - బ్రహ్మకారణత్వ ప్రతిపాదకము లని నిరూపింపబడినవి. చతుర్థపాదమున - ప్రధానాది ప్రతిపాదనచ్ఛాయ ననుసరించిన వాక్యములు నిరూపింపబడినవి. అందువలన, ప్రథమాధ్యాయములో - సకల విధమైన వేదాంతవాక్య సముదాయము పరబ్రహ్మయే జగత్కారణ మని స్థాపింపబడినది.

ద్వితీయాధ్యాయమున - పరబ్రహ్మకు జగత్కారణత్వరూపమైన యర్థము తొలగింప శక్యముకానిది యని - దృఢత్వము చెప్ప బడినది. వానిలో - ప్రథమ పాదమున - వేద బాహ్య పక్షములను ఖండించి, పరబ్రహ్మ కారణత్వమే, ఆదరణీయ మని నిర్ధారింపబడినది.

తత్త్వీయ - చతుర్థ పాదము లందలి - వేదాంత వాక్యములకు - పర స్పరము విరోధము మొదలైన దోషగంధము లేదని తెలుపుటకై, ఆకాశాదులకు బ్రహ్మాణ్యత్వప్రకారము వివరింపబడుచున్నది. చతుర్థా ధ్యాయమున - పరబ్రహ్మోపాసనకు ఫలముగను చేయబడుచున్నది. ప్రథమ పాదమున - ఉపాసన స్వరూప పూర్వకముగా - ఉపాసనాను ష్ఠాన ప్రకారము - విద్యామాహాత్మ్యము చెప్పబడుచున్నది. ద్వితీయ పాదమున - పరబ్రహ్మ నుపాసించినవారికి - బ్రహ్మప్రాప్తిని గుఱించి గమనమునకు ఉపక్రమ ప్రకారము చింతింపబడుచున్నది. తృతీయ పాదమున - అర్చిరాదిగమనముచేతనే పరబ్రహ్మప్రాప్తి యగు ననియు ప్రతిపాదింపబడినది. చతుర్థ పాదమున - ముక్తునకు బ్రహ్మానుభవ ప్రకారము చింతింపబడుచున్నది. అందువలన, ముముక్షువులు తెలిసి కొనదగినది, నిరస్త నిఖిల దోష గంధ యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణాకరమైన పరబ్రహ్మ జ్ఞానము - మోక్షసాధనము. అదియు, అసకృదావృత్తమైన - స్మృతి సంతానరూపమైన అనతిశ యానంద గుణ స్వరూపములను కలిగిన బ్రహ్మానుభవము నిత్య మని శారీర శాస్త్రముచే చెప్పబడినది.

## ప్రథమాధ్యాయ - ప్రథమపాదము

ఫలము అల్పము, అనిత్యము - అని యెఱింగి, నిత్యఫలసిద్ధికై బ్రహ్మవిచారము చేయవలెను. సిద్ధపరమైన బ్రహ్మయందు - వేదాంత వాక్యములకు ప్రామాణ్య ముండుటవలన, బ్రహ్మవిచార రూపమైన బ్రహ్మమీమాంస - ఆరంభింపదగినది. ఈ జగత్తునకు వేనివలన సృష్టి స్థితి లయములు కలుగుచున్నవో, అది బ్రహ్మము. బ్రహ్మము -

శాస్త్రైక ప్రమాణముకలది. పురుషార్థభూతమైన బ్రహ్మమునందే చక్కగా అన్వయించుటవలన, బ్రహ్మను ప్రతిపాదించు శాస్త్రమునకే సాక్షాత్పురుషార్థాన్వయము. సత్ శబ్దవాచ్యమైన తత్త్వము - అచేతనమైన ప్రకృతికాదు. మోక్షమునకు కారణమైన పరబ్రహ్మయే. ప్రకృతి - జగత్కారణము కాదు. ఆత్మను జగత్కారణముగ ఉపనిషత్తులు పేర్కొనుచున్నవి. కావున, 'సత్' శబ్దవాచ్యము - పరబ్రహ్మయే. జగత్కారణత్వముగా తెలియబడుచున్న ఆనందమయుడు - పరమాత్మయే. జీవాత్మకు ఎవనివలన ఆనందయోగమో, ఆ ఆనందమయుడు జీవాత్మకంటెను ఇతరమయిన పరమాత్మయే. ఆకాశమును గూర్చి చెప్పిన లక్షణములనియు పరమాత్మకు సంబంధించినవి గనుక, ఆకాశ శబ్దనిర్దిష్టము.

పరమాత్మయే నిఖిల జగదేక కారణమైన ప్రాణశబ్దముచే నిర్దేశింపబడినది – పరమాత్మయే. జగత్కారణమునకు వ్యాప్తమైన– నిరతిశయదీప్తితోకూడిన జ్యోతిశ్శబ్దముచే నిర్దేశింపబడినది పరబ్రహ్మమే. ఇంద్ర, ప్రాణ శబ్దములచే నిర్దేశింపబడిన వానికి ఆనందత్వము, అజరత్వము, అమృతత్వము మొదలగు ధర్మములు వినబడుటవలన, ఇంద్ర - ప్రాణశబ్దములచే నిర్దేశింపబడినవాడు - జీవునకంటెను వేరైన పరమాత్మయే.

## ప్రథమాధ్యాయ - ద్వితీయపాదము

ఈ చరాచరాత్మకమైన జగత్తంతయు బ్రహ్మయే ఆత్మగా గలది. 'సర్వ' శబ్దము - సర్వ శరీరకుడైన పరమాత్మయందే ప్రవర్తించుటవలన, సర్వాత్మకముగా నిర్దేశింపబడినది పరమాత్మయే.

జగత్సృష్టి స్థితిలయములు లీలలుగా కలిగిన పరమాత్మకు - జగదుప సంహారరూపమైన భోక్తృత్వము గావున, భోక్త యనగా - పరమాత్మయే. ఆ యాధార పురుషునకు సంబంధముగా వినబడుచున్న నిరుపాధిక ఆత్మత్వము, అమృతత్వము, అభయత్వము, బ్రహ్మత్వము మొదలైనవి - పరమాత్మయందే సరిపోవుచున్నవి. అందువలన, అక్ష్యాధారుడైన పురుషుడు పరమాత్మయే. ఏపరమాత్మ - జీవాత్మ యందున్నవాడే యని, ఆశ్రయ - ఆశ్రయాభావముచేత జీవాత్మ కంటె, పరమైన పురుషునికంటె పరమైనవాడని, పరశబ్దముచే చెప్ప బడుచున్న భూతయోన్యక్షర శబ్దవాచ్యుడు పరమాత్మయే. బ్రహ్మ శబ్ద స్థానమున వైశ్వానర శబ్దము ప్రయోగించుటవలన వైశ్వానరాత్మ - సకల జీవాత్మలకు ఆత్మయైన పరమాత్మయే.

## ప్రథమాధ్యాయ - తృతీయపాదము

నిరుపాధికాత్మత్వము, అమృతసేతుత్వములను పరమాత్మ ధర్మములు వినబడుటవలన, నియంతగా - సర్వవ్యాపిగా ఆత్మయనబడును. కావున, ఆత్మత్వము పరమాత్మధర్మము. కర్మఫలసంబంధమైనజన్మము లేనివాడైనను, ఆ పరమాత్మ అనేకములుగా అవతరించుచున్నాడు. తన అప్రాకృత స్వభావమును వదలకయే పుట్టుట - పరమాత్మకు కను బడుచున్నది. కావున, పంచభూతములకును ఆధారభూతుడు పరమాత్మయే. స్వాభావికమైన అమృతత్వము, సర్వాత్మత్వము, సర్వోత్పత్తి హేతుత్వము మొదలగు ధర్మములు - 'భూమ' శబ్దవాచ్యమైన పరమాత్మయందు సరిపోవుటవలన, 'భూమ' శబ్దవాచ్యమైన నిరతి

శయ - వైపుల్య - విశిష్టస్వరూపుడు పరమాత్మయే. అప్రతిహతమైన ఆజ్ఞచే చిదచిదాత్మకమైన సకల జగత్తును ధరించుటచేత, పరమాత్మయే అక్షరశబ్దవాచ్యుడు. నిరుపాధికమైన శాంతత్వము, అమృతత్వము మొదలగునవి చెప్పుటవలన, ఈక్షణమునకు కర్మగా ప్రతిపాదింపబడినవాడు పరమాత్మయే. జగద్విధరణత్వము, చిదచిద్విశిష్టమైన నియమనము మొదలగు అనంత గుణములు కలదిగా స్వీకరింపబడిన ఈ దహరాకాశము - పరమాత్మయే త్రికాలవర్తియైన పరమాత్మకు - ఈ శితృత్వముండుటవలన, అంగుష్ఠప్రమితుడు పరమాత్మయే. ఉపాసన నిర్వాహణ సామర్థ్యముండుటవలన దేవాదులకు పరబ్రహ్మోపాసనయందు అధికారమున్నది. మధువిద్యయందు వస్వాదులకు అధికారము కలదు. ఉపాసనము మనోవృత్తిమాత్ర పరమైనను, వేదాధ్యయనము చేయని శూద్రునకు - ఉపాసనకు ఉపాయమైన జ్ఞానము సంభవింపనందున, సామర్థ్యము సిద్ధింపదు. కావున, శూద్రునకు బ్రహ్మవిద్యయందు. అధికారము లేదు. ఆకాశశబ్దముచే నిర్దేశింపబడినవాడు పరమాత్మయే.

## ప్రథమాధ్యాయ - చతుర్థపాదము

అవ్యక్తశబ్దముచే సాంఖ్య తంత్రసిద్ధమైన ప్రధానము గ్రహింపబడదు. బ్రహ్మాత్మకమైన ప్రకృతియే ప్రత్యభిజ్ఞాత మగుటవలన, 'అజా' శబ్దముచేత బ్రహ్మాత్మక ప్రకృతియే చెప్పబడుచున్నది. యచ్ఛబ్దముచే నిర్దేశింపబడి దానిని - తచ్ఛబ్దముచే పరామర్శించుటవలన, బ్రహ్మయనుట నిశ్చయము. అందువలన, సాంఖ్య తాంత్రిక తత్త్వ ప్రసంగము లేదు. జగత్కారణత్వ బోధకములగు వేదాంత వాక్య

ములు — పరబ్రహ్మ కారణత్వ ప్రతిపాదకములు. జగద్వాచక మగుట వలన, సకలజగత్తు ఎవనికి కార్యమో, ఆ పరమపురుషుడు తెలిసి కొనదగినవాడు. జీవాత్మయందు అంతరాత్మగా పరమాత్మ ఉండుట వలన, అంతరాత్మ పరమాత్మయే. జగత్తునకు పరమాత్మ ఉపాదాన కారణుడు, నిమిత్త కారణభూతుడుకూడ. కారణత్వ బోధకములైన వేదాంతవాక్యము లన్నియు పరబ్రహ్మ పరములుగా వ్యాఖ్యానింప బడినవి.

## ద్వితీయాధ్యాయ - ప్రథమపాదము

మంత్రద్రష్టలైన మందాదులచే - ప్రధాన కారణత్వము గ్రహింపబడకపోవుటవలన, పరబ్రహ్మకారణత్వమే గ్రహింపబడుట వలన, కపిలస్మృతి వేదాంత విరుద్ధమగుటవలన - ఆదరణీయముకాదు. పరబ్రహ్మముకంటె విలక్షణమైన జగత్తునకు - పరబ్రహ్మకార్యమగుట సంభవించును. సాంఖ్యాది మత నిరాకరణముచేత, వైదికులచే పరిగ్రహింపబడని కణాద - గౌతమ మతములుకూడ - కేవల తర్కమూల ములగుటచే, నిరాకరణీయములు. పరమాత్మ కర్మవశ్యుడు కానందున, కర్మవశ్యుడైన జీవాత్మకంటెను వైలక్షణ్యము కలిగియుండును. కార్యదశయందు కారణద్రవ్యము కనబడుచున్నందున, కార్యము తన కారణమునందుండుట వలన, కార్యకారణములు అభిన్నములు. ఒకే వాయువు — శరీరమందు వివిధభాగములలో సంచరించుచు, వివిధ నామములతో వ్యవహరింపబడునట్లు, ఒకే బ్రహ్మము - నామరూప విభేదరూపముతో భాసిల్లుచు, జగద్రూప కార్య మగుచున్నది. సూక్ష్మచిదచిచ్ఛరీరకమైన బ్రహ్మము - కార

ణము కలది. స్థూలచిదచిచ్ఛరీరమైన బ్రహ్మము కారణావస్థ కలది. స్థూలచిదచిచ్ఛరీరకమైన బ్రహ్మము – కార్యావస్థ గలది. కనుక, బ్రహ్మకు జగత్కారణత్వము సంభవించుచున్నది. క్షీరము దధిగా మారుటకు ఇతర సాహాయ్యాపేక్ష లేకుండునట్లు, రెండవ సామగ్రి అపేక్షలేని పరబ్రహ్మకారణత్వము సిద్ధించుచున్నది. సకలేతర కారణములకంటె విలక్షణమైన, సర్వశక్తియుక్తమైన బ్రహ్మము కారణము, కార్యము - అగుచు, వేరుగానుండును. విచిత్ర శక్తియుక్తులు గల బ్రహ్మము - జగత్కారణమని వేదప్రమాణము. పరమాత్మకు లీలాప్రయోజనము కొఱకు జగత్సృష్ట్యారంభము సంభవించుచున్నది.

## ద్వితీయాధ్యాయ - ద్వితీయపాదము

కేవల ప్రధానము - జగత్కారణము కాదు. చేతనులచే అధిష్ఠింపబడిన, విచిత్రమైన జగత్తు సృజించుటయందు సమర్థముకాదు. కారణగుణములు కార్యమందు సంక్రమించును - అను సిద్ధాంతమునకు విరుద్ధము కావున, కాణాదుని వైశేషిక సిద్ధాంతము అసమంజసము. సంస్కారాశ్రయముగ ఒక్క పదార్థముకూడ స్థిరముగా నంగీకరింపబడనందున, జగదుత్పత్తి, లోకవ్యవహారము - ఉపపాదింపనాధ్యముకాదు. జ్ఞానమువలె జ్ఞాతృజ్ఞేయములు గలవని అంగీకరింపవలయును. దీనివలనను శూన్యత్వము సిద్ధింపదు. సరసద్భావములున్న వస్తువుయొక్క ధర్మములుగా అంగీకరించుట సంభవించనందున, జైనమతము యుక్తిమతము కాదు. అనాది నిధనమైన, అపరిచ్ఛిన్నమైన వార సంప్రదాయము కలిగిన వేదముచే సిద్ధమైన పరావరత్త్వములకు వ్యత్యాసములుగా ప్రవర్తించుటవలన, నిమిత్త - ఉపాదానకారణము

లగు భేదములను ప్రతిపాదించుటవలన, వేదవిరుద్ధమైన ఆచారము ప్రతిపాదించుట వలన, పాశుపతమతము ఆచరణీయము కాదు. కర్మ కృతజన్మ లేనివా డయిన పరమాత్మ — అనేక అవతారములను ధరిం చును' - అని శ్రుతి సిద్ధమైనందువలన, పరబ్రహ్మ ఉపాసనమును విధించుటవలన, వేదవిరుద్ధముగాని భగవదర్చనను విధించుటవలన, పాంచరాత్రతంత్రము - ప్రమాణము.

## ద్వితీయాధ్యాయ - తృతీయపాదము

ఆత్మకు అనుత్పత్తిశ్రుతి వలననే నిత్యత్వము - నిశావయ త్వాదులచే కాదు. అన్నింటికిని - పరమాత్మ శరీరత్వము శ్రుతి యందు వినబడుటవలన, ఆయా శబ్దవాచ్యుడైన పరమాత్మ వలననే తేజస్సు మొదలగు వానికి ఉత్పత్తి సంభవించుచున్నది. జీవాత్మకు నిత్యత్వము శ్రుతులవలన తెలియుటచే, జీవాత్మ పుట్టును, మరణిం పను - అని తెలియుచున్నందున ఆత్మకు ఉత్పత్తి లేదు. ఆత్మస్వరూ పము జ్ఞానమువలె - స్వప్రకాశము. సర్వగతత్వము, అణుత్వము ఉత్క్రాంతిగతి ఆగమము శ్రుతిచే వినబడుట వలన, జీవాత్మ అణు స్వరూపుడు. ఆత్మయే కర్త. జ్ఞానముగలవానికే శాసనము. ప్రచేతన మైన ప్రధానమునకు జ్ఞానముండదు గావున, జ్ఞాతయైన ఆత్మకే కర్తృత్వమని సిద్ధాంతము. జనులలోపల ప్రవేశించినవాడై నియ మించువాడు సర్వాత్మయగు పరమాత్మ. స్మృతిప్రమాణము వలన జీవాత్మ కర్తృత్వము పరమాత్మకు స్వాధీనము, అందువలన, జీవాత్మ- నిగ్రహానుగ్రహాస్పదముగను, జీవశబ్దముచే జీవశరీరక పరమాత్మ వాచక మగుటచేత, ఈ ఆత్మ - బ్రహ్మ అని సామానాధికరణ్యము

ముఖ్య మగుటవలన, విశేషణ - విశేష్యములైన శరీరమునకు, శరీరికి - స్వరూప స్వభావములు వేరగుటచేత, విశిష్టమైన వస్తువులో విశేషణ మొక భాగమగుటచేత, పరమాత్మాంశము జీవాత్మ. పరమాత్మకు జీవాత్మ శరీరమైయుండుట - సిద్ధము.

## ద్వితీయాధ్యాయ - చతుర్థపాదము

సృష్టికి ముందు - ప్రాణ శబ్దవాచ్యములైన ఇంద్రియములు లేవు కావున, 'ప్రాణ' శబ్దము - పరమాత్మను బోధించును. జ్ఞానేంద్రియములు ఐదు, కర్మేంద్రియములు ఐదు, మనస్సుతో కలిసి - పదునొకండు పురుషునియందు గలవని - శ్రుతి సిద్ధము. జ్ఞానేంద్రియములు జీవునితో కలిసి, శరీరాంతరమును పొందుచున్నది. కర్మేంద్రియములు ఆ యా శరీరములతో, ఉత్పత్తి వినాశములను అందించుచున్నవి - జీవాత్మ వెడలుచుండగా - 'ఇంద్రియములు శరీరమునుండి వెడలి పోవును' - అను శ్రుతివలన, కనుబడనందున - అణు పరిమాణము కలదు. తదుపరి, ఎవడు ఆ యింద్రియములను అనంతములుగా ఉపాసించునో - అని విధింపబడుటవలన, బాహ్యత్వము స్పష్టము. వాయువుకంటె భిన్నముగా ప్రాణమును పేర్కొనుటచేత, కేవల వాయువు మాత్రము ప్రాణము కాదు. వాయుక్రియ ప్రాణమనుట అసంగతము. దేహధారణ సమర్థమైన వాయువే ప్రాణమని భావము. "శరీరము నుండి వెడలుచున్న జీవాత్మ ననుసరించి - ప్రాణము వెడలుచుండును' - అను శ్రుతి వలన, ఇంద్రియములవలె ప్రాణము అణు మానముగలది. 'జీవునితోకూడ అగ్న్యాది దేవతలకు వాగాది ఇంద్రియాధిష్ఠానము - ఆ పరమాత్మయొక్క సంకల్పము వలననే

జరుగును' - అను ప్రమాణము వలన, పరమాత్మ అగ్నిలో నుండి నియమించుచున్నాడను శ్రుతివలన, పరమాత్మాయత్త్వము వాగాది ఏకాదశేంద్రియములకు ప్రాణములని నిర్దేశించుట - ప్రాణమునకధీన మైన వృత్తి కలవగుటచేత. అందు వలన, ముఖ్యప్రాణ వ్యతిరిక్తమైన ప్రాణశబ్ద నిర్దిష్టముల యింద్రియములు. త్రివృత్కరణ మొనర్చిన పరమాత్మకు - ఈ నామరూప వ్యాకరణమైన వ్యష్టిసృష్టి సంభవము. త్రివృత్కరణము చతుర్ముఖునిచే చేయ సమర్థముకాదు.

## తృతీయాధ్యాయ - ప్రథమపాదము

శరీరాంత ప్రదేశమందు జీవాత్మ - భూతసూక్ష్మములతో కూడుకొనియే పోవుచున్నాడు. 'పుణ్యమొనర్చినవారు - బ్రాహ్మ ణాది జన్మలను, పాపమొనర్చినవారు - హీన జన్మలను పొందుదురు' అను శ్రుతివలన, పరలోకమున ఫలమిచ్చుటకు సిద్ధమైన కర్మ విషయ మని కర్మశేషము కలవాడై, భూలోకమునకు వచ్చును. బ్రహ్మవిద్యా నిష్ఠులకు అర్చిరాది మార్గము. కర్మ నిష్ఠులకు ధూమాది మార్గము- అని ప్రస్తావింపబడుట వలన, వీరికంటె భిన్నులైన పాపిష్ఠులకు చంద్రి లోక గమనము సంభవింపదు. సుఖదుఃఖానుభవము కొఱకు శరీర త్వము సిద్ధించును. ఆకాశాదులందు గాని, మఱి యెచటను గాని, జీవుడు చిరకాలము ఉండడు. జీవుడు దేహధారణకు దిగివచ్చినపుడు, ఆకాశము మొదలు - వ్రీహ్యాదుల వఱకు వాని యందు కావలసి యుండునే గాని, ఆ రూపమున జన్మింపడు. వ్రీహిలో చేరిన పిదప, శుక్రమును సేచన మొనర్చు పురుషునిలో అతడు భుజించిన అన్నము

ద్వారా వచ్చిచేరును. అనంతరము - స్త్రీ యొక్క గర్భాశయమున ప్రవేశించి, జీవుడు శరీరమును ధరించును.

## తృతీయాధ్యాయ - ద్వితీయపాదము

పరమపురుషుడే సకలేతర పురుషానుభవమునకు విషయము. కాని, ఆ యా పురుష మాత్రునకు అనుభవింపదగిన ఆ కాలమందే - అంతము గల స్వప్నసంబంధములైన పదార్థముల సృజించుచున్నాడు. సాక్షాత్తుగా సుషుప్తిస్థానము పరమాత్మ యని, వాని పురీత పర్యంకముల సముచ్చయమని సిద్ధాంతము. సుషుప్తుడైనవాడు - శారీరక ప్రాయ సంబంధ విముక్తుడు కాడు. కరణకళేబరములు మఱల కార్యములందు ప్రవర్తించుటకై, ఆయాసము తగ్గుటకై పరబ్రహ్మ యందు లయము నొంది, ఆయాస శాంతి నొందినవాడై, కార్యము లందు ప్రవర్తించుటకు లేచుచున్నాడు. మరణముకంటె ఆకారము వేఱుగా నుండుటవలన, మూర్ఛ - మరణమునందు అర్ధభాగము. సకల దోషములు నశించినవాడు, సర్వజ్ఞుడు, సత్యసంకల్పాది కల్యాణ గుణములు కలవాడు – అని, పరమాత్మకు లక్షణములు చెప్పబడుట వలన, సర్వాంతర్యామి యైనను - పరమాత్మకు దోషసంబంధము సంభవింపదు. సర్వనియమనరూపమైన లీలారసమేగలదు. జీవాత్మవలె పరబ్రహ్మకు శరీరమగుటచేత, పరబ్రహ్మ విశేషముగా అచిద్వస్తువు నకు పరబ్రహ్మాశ్రితము సిద్ధించును. పురుషశబ్దవాచ్యుడైన పరమాత్మ కంటె, రెండవవానికి పరత్వమును చెప్పుటలేదు. సకల దేవతలకు అంతర్యామియైన పరమాత్మయే ఆ యా దేవతలద్వారా ఫలమును ప్రసాదించును. సర్వయజ్ఞములను అనుభవించువాడు పరమాత్మయే.

మానవుడు తన కర్మచేత పరమాత్మ నర్చించి, ఫలసిద్ధి నొందును. ఆ పరమాత్మ యనుగ్రహము వలననే శాంతిని, శాశ్వతమైన మోక్షమును పొందును' - అని - శ్రుతి స్మృతులచే తెలియజేయబడుట వలన, పరమపురుషుడే ఫలము నొసంగువాడు.

## తృతీయాధ్యాయ - తృతీయపాదము

ఛాందోగ్యమందు ఉద్గాకర్మమైన, ఉద్గీతావయవమైన ప్రణవమందు ప్రాణదృష్టిని విధించుటవలన, బృహదారణ్యకమందు సంపూర్ణోద్గీత కర్తయందు ప్రాణదృష్టిని విధించుటవలన, రెండు స్థలములలో- ఉపాస్య స్వరూపభేదము వలన విద్యాభేదము. కౌషీతకీ ప్రాణ విద్యయందును, వాగాది వశిష్టత్వాది సంబంధముగల ప్రాణమే ఉపాస్యమని, రూపభేదము లేనందున - విద్యైక్యము. జ్ఞానానందాది గుణములు బ్రహ్మ స్వరూపమును నిరూపించు గుణములగుటచేత, ఆ గుణములులేక, బ్రహ్మస్వరూపాను సంధానము ఉపపన్నమగుట వలన, సకల బ్రహ్మవిద్యలందును ఉపసంహరింపదగినవి. భోజనమునకు పూర్వము, తరువాత - ఆచమనము ప్రాణవిద్యాంగముగా విధించ నవసరము లేనందున, స్మృతిప్రాప్తమైన ఆచమనమునకు శాస్త్రాంతర ప్రాప్తముగాని ప్రాణవాసత్వము విధింపబడుచున్నది. మంత్రసామర్థ్యమువలన, మహావ్రతాది కర్మల శ్రుతి మొదలైనవానిచేతను, అవిచారను, ద్వాదశాహము మొదలైనవాని యందు వినియోగమువలె, మంత్రములు - అధ్యయనమందు వినియోగమని, విద్యాంగము కాదని - సిద్ధాంతము. దేహవియోగ కాలమందే, సుకృత -

దుష్కృతముల చింతనము - సర్వకర్మ క్షయమైనను, విద్యాసామర్థ్య మువలననే అర్చించి మార్గముగ గమనము సైతము సరిపోవుచున్నది. అస్థూలత్వాది గుణములు - పరబ్రహ్మ స్వరూపానుసంధానము కొఱకును, సకల బ్రహ్మవిద్యలయందును అనుసంధేయములు.

ఛాందోగ్యమందు, వాజసనేయమందును చెప్పబడిన దహర విద్య యొక్కటే. దహరవిద్యయందు పరమాత్మను గుణములతో ప్రత్యేకముగ ఉపాసింపవలెను. పరబ్రహ్మ, పరతత్త్వ, పరంజ్యోతి, పరమాత్మ, అక్షర, శివ, శంభు శబ్దములచేత, సర్వపద విద్యోపాసనలను వచించి, వాక్యప్రమాణముచేత, వానికి నారాయణత్వమును విధించుట వలన, వాక్యము ప్రకరణముకంటె బలీయమగుటచేత, సర్వవిద్యోపాస్యముయొక్క నిర్ధారణార్థమని - నిశ్చయింపబడుచున్నది. అవిద్యామయ ప్రత్యంగ భరితములే మనశ్చిత్తాదులు ప్రత్యగాత్మకు ఆత్మయైన పరమాత్మోపాస్య విషయమని ప్రజాపతి వాక్యమందు చెప్పబడిన ప్రత్యగాత్మయొక్క నిజస్వరూపమే అనుసంధేయము. ఉద్గీథ - వ్యక్తి భేదమున్నను, అచ్చటచట ఉద్గీథజాతీయత్వ సంబంధములన్నిటికి, ఉద్గీథ జాతీయత్వము సమానమగుటవలన, శ్రుతిచేత సర్వసంబంధమని సర్వశాఖలయందు సంబంధింపబడుచున్నది. వైశ్వానరాత్మకు స్వర్లోకము మొదలుకొని, పృథివీపర్యంతము, శిరస్సు మొదలుకొని పాదపర్యంతము అవయవములగుటను చెప్పబడిన వైశ్వానరాత్మ యగు త్రైలోక్య శరీరకుడగు పరబ్రహ్మయొక్క ఉపాసనను విధించి, ఫలమును చెప్పుటవలన, సమస్తోపాసనము చేయదగినది. పరబ్రహ్మ ఒకడైనను, జగదేక కారణత్వము, అపహత పాప్మత్వము అనుబంధ హేతువులచేత, పూర్వకాండయందు చెప్ప

బడిన అభ్యాస సంఖ్యాద్యను బంధహేతువులచేతను — వేరు వేరయి నవి. దేశము వలన, కాలము వలన, స్వరూపము వలన అపరిచ్ఛిన్న మైన ఆనందస్వరూపముగల పరబ్రహ్మానుభవము సమస్తమైన పరవిద్య లకు ఫలము. అదియొక విద్యచేతనే పొందబడినది యని, ఒక పురు షునియందు విద్యాంతర సముచ్చయము ప్రయోజనము లేనందున సంభవింపదు గనుక, సకల విద్యలకు వికల్పము. ఉపాసనకు క్రత్వం గత్వము సిద్ధింపదు. ఫలాంతరసాధనమైన ఉద్గీథాపాసనము క్రత్వం గము కాజాలదు.

## తృతీయాధ్యాయ - చతుర్థపాదము

స్వసంకల్పముచే చేయబడిన జగదుదయ విభవలయములు కలి గిన సకల హేయ ప్రత్యనీకమైన కల్యాణగుణములు కలిగిన జ్ఞానా నంద స్వరూపుడైన, సత్యసంకల్పుడైన, కర్మాధిపుడైన, ప్రత్యగాత్మ కధికుడైన, నిత్యుడైన సర్వేశ్వరునియొక్క వేదనరూపమైన విద్యకు బ్రహ్మ అవాప్తియైన ఫలమును ఉపదేశించుట వలన, విద్యవలననే పురుషార్థఫలము. ప్రతీకాదానముల వృత్తాంతములు - ఉపాసనార్థముగ ఉపనిషత్తులలో వర్ణింపబడినవి. ఇవి - పారిప్లవార్థములు అనుట తగదు. అనన్న ఆయువు అమృతమని ఉపాసింపుము" అని విధివాక్య ముతో ఏకవాక్యముగ చేరియున్నందున, అవి విద్యకొఱకు ఏర్పడిన వియే. పరబ్రహ్మమును కోరి, బ్రహ్మచర్యము నాచరించుచున్నారు. బ్రహ్మలోకమును కోరుచున్నవారై, సన్యాసము నందుచున్నారు' - అను శ్రుతి వలన, ఊర్ధ్వరేతస్కులకు బ్రహ్మవిద్య సంభవించును. ఊర్ధ్వరేతస్కులందు - తమ యాశ్రమములకు విధింపబడిన కర్మయే

యంగమగునని, వారియందును విద్యాసంబంధమును తెలుపు శాస్త్రమువలన, తెలియుచున్నది. శాస్త్రముచేతనే తెలియదగిన విషయమందు - శాస్త్రానుసారము స్వీకరింపవలయును. శమదమాదుల వినియోగము - యజ్ఞాది వినియోగమువలె, సంకోచమునకు తగదు. గొప్ప శక్తి కల్గిన బ్రహ్మవేత్త యగు ఉషద్థికిని - ఉచ్ఛిష్ట పరిగ్రహణము, భక్షణము - ప్రాణాత్యయాపత్తియందే కనబడుటవలన, అల్పవేత్తయైన ప్రాణవిద్యానిష్ఠునకు ప్రాణాత్యయాపత్తు అంశీ సర్వాన్నానుమతియని, కైముత్తిక న్యాయసిద్ధము. ఊర్ధ్వరేతస్కులందువలె ఆశ్రమములేని రైక్వాదులయందు బ్రహ్మవిద్యానిష్ఠత్వ మగుపడుట వలన, ఆశ్రమ నియతములు కాని జోపోసనాదులచేతనే వారికి విద్యానుగ్రహత్వము సంభవించుట వలన, విదురాదులకు బ్రహ్మవిద్యయందు అధికారముగలదు. స్వాశ్రమభ్రష్టులైన నైష్ఠిక బ్రహ్మచారి మొదలైనవారికి ప్రాయశ్చిత్తము లేదని స్మృతులనుటవలన, వారు శిష్టులచే తిరస్కరింపబడుటవలనను, వారికి బ్రహ్మవిద్యయందధికారము లేదు. ఉద్గీథోపాసన - కర్మాంగాశ్రయ మగుటవలన, కర్మబుత్త్విజునిచే అనుష్ఠింపబడుచున్నది గనుక, గోదోహనాదులవలె, ఇదియు - బుత్త్విజునిచే అనుష్ఠింపదగినవని సిద్ధాంతము. 'ముని' శబ్దము - ప్రకృష్టమననాదులయందు ప్రసిద్ధ మగుటవలన, ప్రకృష్టమగు ఉపాస్య విషయాభ్యాసరూపము - విద్యసిద్ధికొఱకు విధింపబడుచున్నది. విద్యావంతుడు తన మాహాత్మ్యమును ప్రకటింపకుండుటయే యుక్తము. ఉద్గీథోపాసనము క్రతువునకు కర్మాంతరముచేత ఫలము ప్రతిబంధకముగా నుండుటయే ఫలమని అంగీకరింపవలయును.

## చతుర్థాధ్యాయ - ప్రథమపాదము

పరమాత్మయే దర్శింపదగినది, వినదగినది. మననము చేయదగినది, ధ్యానము చేయదగినది — మొదలైన శబ్దములందు వ్యతిరేకమగపడుటవలన, ధ్యానోపాసనాది శబ్దవాచ్యమైన, స్మృతి సంతానరూపమైన వేదనమే శాస్త్రార్థ మని నిశ్చయింపబడుచున్నది. ఈ ప్రపంచమంతయు పరమాత్మయే ఆత్మగా గల దానికి పరబ్రహ్మకు స్వాధీనమైన స్వరూప స్థితి ప్రవృత్తులు కలిగియుండుట ప్రతిపాదింపబడుటచేత, ఇట్లు ఉపాసించువారికి, తన యాత్మకు ఆత్మయగుటవలన, పరబ్రహ్మయొక్క యథావస్థితరూపమైన తన యాత్మ - శరీరవిశిష్ట పరబ్రహ్మ సంధానముచేత ఆత్మగానే అనుసంధింపదగినది. ఆదిత్యాది దృష్టి - కర్మాంగమైన ఉద్గీథాదియందు ఉపాసన చేయవలయును. కూర్చున్నవారికే ఏకాగ్రత సంభవించుటవలన, ఉపాసన - మానసిక ఏకాగ్రతానముకలది యగుటవలన, కూర్చుండియే ఉపాసింపవలయును. మోక్షసాధనమైన యుపాసనము - ఆయుష్యమున్నంతవఱకు అనువర్తింపవలయును. ఉపాసించువారియందు ప్రామాదికముగా చేసిన కర్మ యంటదు. ఉపాసకుని సకలపాపములు నశించుచున్నవి. విద్యోపయుక్తమైన పుణ్యకర్మను - శరీరపాతానంతరము అశ్లేషమగును. విద్యోత్పత్తికి పూర్వము చేయబడిన పుణ్యపాప కర్మలు అన్నింటికి - వినాశము కలదు. ఆశ్రమ ధర్మములకు విద్యోత్పత్తియే కార్యము గనుక, విద్యాకార్యము కొఱకు అనుష్ఠింపదగినది. ఆ పరమాత్మను వేదాధ్యయనముచేత బ్రహ్మనిష్ఠులు ధ్యానమొనర్చుచున్నారు' - అను శ్రుతి ప్రమాణము - బంధమోక్షములు కర్మ విషయములు కావున, ప్రారబ్ధఫలముగల పుణ్యపాపములు - ఎన్ని శరీరములచేత

సమాప్తి చేయదగినదో, అన్నిటిని నశింపజేసి, తర్వాత బ్రహ్మను పొందుననునది - అనియమమే.

## చతుర్థాధ్యాయ - ద్వితీయపాదము

సర్వేంద్రియ సంయుక్తమైన మనస్సు - ప్రాణముతో కలియును. ప్రాణము కరణాధ్యక్షుడైన జీవాత్మయందు సంయుక్తమగుచున్నది. అనంతరము తేజస్సద యోగము నొందుచున్నది. విద్యానిష్ఠునకు అర్చిరాది మార్గముచేతనే బ్రహ్మప్రాప్తి కలుగును. అర్చిరాది గత్యారంభమునకు ముందు ఈ ఉత్క్రాంతి విద్యానిష్ఠునకు విద్యానిష్ఠ లేనివాని సమానము. హృదయమందున్న కామములు ఎప్పుడు వదలబడుచున్నవో, అపుడే ఉపాసనారంభమువలన మనుష్యుడు అమృతుడగుచున్నాడని కామవిమోచన పూర్వకముగా ఉపాసనయందున్నవాడై అర్చిరాది మార్గముతో బ్రహ్మను పొందుచున్నాడు. 'తేజ' శబ్దముచే నిర్దేశింపబడిన భూత సూక్ష్మములు — పరబ్రహ్మయందు సంయుక్తము లగుచున్నవి, 'వాగింద్రియము మనస్సునందు సంసక్తమగుచున్నది' - అను శ్రుతిచే చెప్పబడిన సంపత్తి వచనము అంతటను అనుషక్తమగుట వలన, వాఙ్మనస్సంయోగమువలె — భూత సూక్ష్మ పరమాత్మలకు సంయోగ రూపమే పరమపురుషారాధన రూపమైన విద్యచేత, దాని కంగమైన అర్చిరాది గతి చింతనచేతను ప్రీతుడైన పరమపురుషునిచేత అనుగ్రహింపబడిన జీవాత్మ - పరమపురుషునిచేత ప్రకాశింపబడిన ద్వారము కలవాడై, ఆ మూర్ధన్యనాడి ద్వారా వెళ్ళుచున్నాడు. వేసవికాలమున రాత్రి యందును వేడిమి లభించుచుండుట వలన,

సూక్ష్మకిరణము లుండియే యుండును. కావున, విద్యానిష్ఠులు సూర్య కిరణములద్వారా వెడలును - అను నియమము సంభవించును. విద్యా మాహాత్మ్యమువలన ప్రారబ్ధ కర్మ - దేహావసానమువఱకే యుంచుట వలన, బంధమునకు కారణము లేనందున, రాత్రి మరణించినను, విద్యా నిష్ఠునకు బ్రహ్మప్రాప్తి గలదు. రాత్రి మరణ నింద - విద్యానిష్ఠులు కానివాని విషయము - బంధహేతువు లేనందున, విద్యానిష్ఠునకు చంద్రుని పొందినను, పునరావృత్తి సంభవించదు. చంద్రసాయుజ్య వచనము విద్యానిష్ఠునకు విశ్రమస్థాన విషయము. ఆవృత్తి వచనము- విద్యానిష్ఠులు కానివారికి మాత్రమే.

## చతుర్థాధ్యాయ - తృతీయపాదము

విద్యానిష్ఠుడు - అర్చిరాది మార్గముననే వెడలుచున్నాడు. వాయువునకు విశేషముగ దేవతలకు వాసస్థానముగ స్మృతియందు చెప్పబడుటవలన, దేవలోకము వాయులోకమే యని నిశ్చయమగు చున్నది. అర్చిరాదులు విద్యానిష్ఠులై, పరబ్రహ్మమును పొందవలె నన్న యిచ్ఛగలవానికి - ఆదివాహికులు పరబ్రహ్మ నుపాసించిన వారిని, ఇతరులను - ఆదివాహిక గణము పొందించును. ఎవరు జీవాత్మ స్వరూపమును - ప్రకృతి నియుక్తమై పరమాత్మాత్మకముగ ఉపాసించుచున్నారో, వారు - అర్చిలోకమును పొందుచున్నారు. పంచాగ్ని విద్యానిష్ఠులకు, పరబ్రహ్మోపాసకులకును - అర్చిరాదిగతి శ్రుతి వలన పరమాత్మను పొందినవారు - తిరిగిరారు.

## చతుర్థాధ్యాయ - చతుర్థపాదము

ఈ జీవాత్మ - కర్మ వలన కలిగిన దేహసంబంధము, దానివలన కలిగిన తిరోధానము - పరంజ్యోతిని పొందుటచేత సంకోచము లేని జ్ఞానానందాది గుణములుగల స్వరూప మావిర్భవించుటవలన, తన యాథాత్మ్యానుభవ పూర్వకముగా అనవధికాతిశయమైన ఆనంద బ్రహ్మానుభవమును పొందుచున్నాడు. సకలమైన చిదచిద్వస్తువులు బ్రహ్మశరీరరూపమై, బ్రహ్మ ప్రకాశమగుటచేత - సర్వము పరమాత్మ పర్యంతములని యెఱింగి, తన యాత్మకు ఆత్మగా "అహం బ్రహ్మాఽస్మి" అని యుపాసనచేత, నిజమైన - భగవాత్మకమైన తనయాత్మ చూడబడునివలన, ముక్తుడు తన యాత్మకు ఆత్మయైన పరమాత్మను భేదము లేకుండగనే అనుభవించుచున్నాడు. జ్ఞాన స్వరూపముగల జీవాత్మను అపహతపాప్మత్వాది గుణములు కలుగుటను ప్రతిపాదించుట వలన, విరోధము లేనందున ఉభయవిధమైన స్వరూపము గలదు. అచిద్వస్తువై లక్షణ్యముచేత తన స్వభావము గుణ సహితమైనను - స్వప్రకాశత్వ నిశ్చయము విజ్ఞానఘనమే ముక్తునియొక్క సంకల్పము వలననే పితృదేవతలు లేచివచ్చుచున్నారని అవధారణము వలన ప్రయత్నాంతరాపేక్ష యందు ప్రమాణములేదు. లోకమందు సత్యసంకల్పత్వము లేనందున, ఆ ప్రయత్నాపేక్షగలదు. పరమపురుష వ్యతిరిక్తుడైన సత్యసంకల్పుడు లేడు, ముక్తుడు పరమ పురుషుని యనుగ్రహము వలన, అతని సామ్యమును పొందినవాడై,

సత్యసంకల్పము కలవా డగును, శరీరము లేనివానిగను ఉండును. అనేక శ్రుతులందు - పరబ్రహ్మను స్తుతించియే జగద్వ్యాపారము వినబడు చున్నది. అయినా ఈ ప్రకరణములలో - ముక్తుని సాన్నిధ్యము కూడ లేదు. అందువలన, జగన్నియమన రూపమైన భారము లేకయే - ఆ ముక్తుడు సర్వజ్ఞుడైన పరబ్రహ్మతో కూడ సకల కల్యాణ గుణముల నొందుచున్నాడు. కావున, అనవధికాతిశయ బ్రహ్మానుభవమునందు ముక్తునకు సామ్యము పరమపురుషునకు ఉత్పత్త్యాది జగన్నియమనము స్పష్టము.



# భగవద్రామానుజుల శేషాద్రి సందర్శనము

'మధురకవిశేఖర - వైష్ణవ దర్శన సార్వభౌమ'
శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు



ఆహ్లాదమడ వెడల్పు నమరు నే యద్రికి
ముప్ప దామడ చాఁపు దప్పకుండ
వేంకటశైలంబు — వృషభాద్రి - నారాయ
ణాద్రి - సింహాద్రి - శేషాద్రి - యంజ
నాద్రియు - శ్రీశైలమట్లు, తీర్థాద్రి - యీ
నామధేయముల నే నగము దాల్చు
ఏ యద్రిశిఖరము వీక్షించువారికి
పాతకములఁ బాపి భాగ్య మిచ్చు

ఎందు వసియించు హరి తన యిల్లు విడచి
యెద్ది కలియుగవైకుంఠ మీ ధరిత్రి
అట్టి శేషాద్రి కరిగె న య్యార్యు డనుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 1

కపిల పంచాయుధ ఘన శేషస త్తర్షి
గోగర్భ వైకుంఠ కులిశ తీర్థ
గరుడ సుదర్శనాకాశగంగా - పాప
నాశన సనక సనంద నాజ

కాయ రసాయన స్కంద విష్వక్సేన
వామన తుంబురు వరవృషాది
గురునామములు షష్టి కోటితీర్థము లెందు
విలసిల్లు సంతత వృద్ధిఁ జెంది
స్వామిపుష్కరిణీతీర్థ చక్రవర్తి
స్నానపానార్హమై యుండు సతత మెందు
అట్టి శేషాద్రి కరిగె న య్యార్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డని మోద మలర ॥ 2

బ్రహ్మాది దేవతా పరమర్షి సంఘము
లేప్రొద్దు హరిఁ గొల్చు నెందు నిల్చి
శేష శేషాశనాశీవిషాశన ముఖ్య
సూరు లెం దుందురు సుఖముఁ జెంది
పదుగురు సూరులు* - పాడి రే యద్రిని
కులశేఖరుం డెందుఁ గోరె జన్మ
ఉరుపరస్పర వైర ముడిగి జంతువు లెందు
మురరిపు భజియించి ముక్తిఁ జెందు
చెలఁగి యే యద్రి ప్రత్యక్ష శేషుఁ డయ్యె
చర్మచక్షుష్కులకుఁ దోచు శైల మట్టు
అట్టి శేషాద్రి కరిగె న య్యార్యుఁ డనుచు
వాదిభీకరగురుఁ డని మోద మలర ॥ 3

* తొమ్మండ్రు సూరులే పాడని - గ్రంథాంతరమున నున్నది.
— సంపాదకుఁడు.

తిరుమలపై నెక్కి దేవాదిదేవుని
తిరువీథులను నాల్గు తిరిగివచ్చి
ధవళ ధనుర్గత ద్వాదశి యరుణోద
యపువేళ సకల గంగాది తీర్థ
ములు తమ పాపవిమోచన మొనరింప
అం డవగాహన మొందుచుండు
బంగారుమేడలు - ఫల వృక్షములు కొన్ని
యే పుష్కరిణిచుట్టు హెచ్చియుండు

అట్టి పుష్కరిణీస్వామి నాశ్రయించి
యతికులస్వామి సీరాడ నవధరించి
శ్రీకిటిస్వామి కోవెలఁ జెందె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 4

మహితవరాహాగ్ర మంటపమందు - సు
ఖాసనాసీనుఁ డౌ యతివరుండు
కేశవాదికనామ కీలిత శరరిపు
ద్వాదశ గాథలఁ దగఁ బఠించు
చును బదిరెండును శుద్ధోర్ధ్వపుండ్రము
లను దత్త దర్హాస్థలములఁ దాల్చి
తులసీనలినబీజ వలయముల్ ధరియించి
తిరుచుట్టుమాలెలోఁ దిరిగివచ్చి

యజ్ఞవారాహదేవుని హరిని గాంచి
మ్రొక్కి వినుతించి యతని క్రన్నోర్మిల నిలిచి

అతుల తీర్థప్రసాదము లందె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 5

ఆ హరి వీడ్కొని యతిరాజు వెల్వడి
మహనీయ రథమాన మంటపములు
మణి సహస్రస్తంభ మంటప గోపుర
ద్వారదేహళులను దగ భజించి
వేంకటేశుం డెట్టి సంకటములకైన
దుర్గాధిపతిగానఁ దొలఁగఁ డింట
అన్యులు రంగరాజాదు లీతని పంచఁ
జెందుదు రిడుమలఁ జెందినపుడు

గాన, ముందొకసారి రంగప్రభుండు
వచ్చి యెం దుండె – పండ్రెండు వత్సరములు
అట్టి శ్రీరంగమంటప మందె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 6

స్వర్ణగారుత్మత స్తంభము, మణిమయ
బలిపీఠమును గాంచి ప్రణతిఁ జేసి
అల రంగమంటప మాస్థానమంటప
మతిభక్తితోఁ మ్రొక్కి యతివరుండు
కోశభాండాగార గురుధాన్యశాలలు
తైలాజ్యముఖ రసద్రవ్యపూర్ణ
శుభగృహంబులఁ గొన్ని చూచుచు రెండవ
ప్రాకారమున కొక్క ప్రక్రమంబు

సల్పి, యామునతటవాసి శౌరికడను
పుష్పమాల్యంబులనుజేర్చు పుణ్యవిధుల
వినతులను జూచి కరుణించి వెడలె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 7

తొండమా ననియెడు దొడ్డరా జొక్కఁడు
సగతురచే బలుబాధఁ జెంది
శరణోపతీర్థంబు సన్నిధిగుహా త్రోవ
అర్ధరాత్రపువేళ నరుగుదెంచి
అందంపుఁ దూగుటు య్యాలలోఁ బవళించి
శ్రీ భూమి నీళలు - చేరి కొల్వ
విలసనశీలుఁ డా వేంకటేశుని జూచి
వినుతించి తన యార్తి విన్నవింప

భక్తవత్సలుఁ డతనికి భయముఁబాప
శంఖచక్రము లిచ్చెను శత్రుహతికి
నృపతి యహితులఁ దెగటార్చి నెగ్గె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 8

శ్రీ భూమి నీళలు శ్రీ వేంకటేశుని
మంతనమందున మరులుకొల్పు
సమయమందున వేచ్చు చక్రవర్తినిఁ జూచి
వ్రీడను జెందీ యా క్రీడ విడిచి
వక్షస్థ్సలమునందు వాపీనిలయమందు
శ్రీమహాసనమునఁ జెంచుకతన

తాను ధరియించు పూదండ లా హరియు నా
బావిలో విలసిల్లు భార్య కొసఁగు
గాన, పూలియ్యకేరి కే కాల మచట
అట్టి తోమాలై బావికి యతివరేణ్యుఁ
డంజలి యొనర్చి, ముందటి కరిగె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 9

ముం చటి మంటపమున కేఁగి యట నిల్చి
సౌమ్యనారాయణాచల శిఖరము
గనుఁగొని ప్రణమిల్లి, గారుడ స్తంభ స
ద్బలిపీఠములకు ప్రదక్షిణముగ
వచ్చి, చాంపేయకద్వార దేహళి మ్రొక్కి,
దాఁటి విమానప్రదక్షిణమున
కరుఁగదలంచి - 'మేయాన్' సన్నిధిని గాంచి
ఆ స్వామిసేవించి, యచటనుండి
వచ్చి, బంగారు తలుపుల బావిఁ జూచి
భాష్యకారుండు తిరుమట్టపళ్ళిఁ జెంది,
విష్ణుపత్నిని గని మ్రొక్కి వెడలె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 10

కల్యాణ మణిమయ కల్యాణమంటపా
స్థానము వలగొని బరగవచ్చి
అన్వర్థనామక మానందనిలయాఖ్య
దివ్యవిమానంబు దేఱిచూచి

'దివ్యవిమానాయ తే నమో' యని మ్రొక్కి
పరిమళాంచ న్మంటపంబుఁ జూచి
బ్రహ్మరుద్రేంద్రాది బహుసురార్చిత దివ్య
మణిభూషణము లున్న మఱుఁగు లెఱిఁగి

మాన్య - సూత్రవతీశు నమస్కరించి
తొట్టితీర్థపుశంకలు దొలఁగఁద్రోచి
సూరితిలకుండు తన వోటిఁ జూచె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 11

నాథు యోగానంద నరకేసరిని గాంచి
యాడి యాడీత్యాదిమార్యసూక్తి
వినిపించి మణిమయ విహగేంద్రనిలయము
వలగొని ముఖమంటపంబునడుమ
నయ మొప్ప దండప్రణామముల్ గాంచి
జయవిజయుల కనుసంజ్ఞఁబడసి
పలుగాడితలుపుల బంగారువాకిటి
గడపను గని మ్రొక్కి కదలి యచట

శేష శేషాశనాదుల సేవఁజేసి
అంజనాద్రీశు దివ్య శయ్యాదికంబు
సంయమీంద్రుండు గని మ్రొక్కి సాగె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 12

గడపఁగా బడియుండి కనియెద నీ దొండ
పండుఁబో లధరముఁ బరమపురుష !
కోనేట సుఖయించు కోకాదిపక్షులం
దొక సక్షి నయ్యెద నుర్వినాథ !
నీ పైఁడికొండపై నే నొక్కటైయుండు
స్థిరచరాదులయందు దేవదేవ !
ఇట్లు ప్రార్థించె ముం దే కులశేఖరుం
డతని నామాంకితమైన గడప

దాఁటరాదని నా ధార్మికుండు తలఁచె
గనుక, నిత్యకింకరులే తక్క నేటికైన
దాట రా వెండిగడపను దాసు లనుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 13

ధృవకౌతుకోత్సవ దీస్నపన చక్ర
బేరాది భేదముల్ పెక్కు గలుగు
వేంకటేశుని పాదపంకజయుగళము
నక్షత్రములఁ గేరు నఖరములను
పలు కూర్మములఁబోలు ప్రపదనములను బూను
శింజాన మంజుమంజీరములను
దాసుల రక్షింపఁ ద్వరపడ హరినీల
కాహళాకార జంఘాయుగంబు

కదళీకా స్తంభ గంభీర కనకచేల
పరివృతోరుద్వయంబు నావర్తనాభిఁ
గాంచి హర్షించె నా యతికాంతుఁ డనుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 14

సూర్యకటారంపు సొంపుతోఁ గీల్కొన్న
కాంచీగుణావృత కటితటంబు
సర్వలోకములకు సదనమౌ నుదరము
నతి సుందరవళిత్రయాతిశయము
తారాదళులయందు తారాధిపతిఁబోలు
ఘనహారములయందు కౌస్తుభంబు
శ్రీవత్స లాంఛనాంచితమౌ నురస్థల
మలమేలుమంగతాయూదు నచట

కలితభూషణ కల్పశాఖాసమాన
శంఖచక్ర గదా ఖడ్గ శార్ఙ్గ సహిత
భుజములను జూచి యతిరాజు పొంగె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 15

కంబుకందర దివ్యకంఠరమున్నత పీన
చార్వంసములు గూఢ శత్రువులును
వైజయంతీపుష్ప వరతులసీదళ
మహిత సాలగ్రామ మాలికలును

బింబప్రవాళాధరంబు సుందర మంద
హాసము పుండరీకాక్షియుగము
మకరకుండల దీప్తి – మహిత గండ యుగంబు
శ్రీకారములఁ బోలు చెవులు, భవ్య
నవ్య చాంపేయ కలికాభ నాసికయును
విలసిత భ్రూలతా దివ్య విభ్రమములు
గాంచి యతిరాజు మిగుల హర్షించె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 16

రమణీయ కర్పూర రచితోర్ధ్వపుండ్రంబు
నీలాలకావృత నిటల తటము
శారదపూర్ణిమా చంద్రమండలముతో
సాటి మీఱిన ముఖ సరసిజంబు
నీలాద్రి శిఖరస్థ బాలసూర్యునిఁ బోలు
తపనీయ మకుటము తలను జూచి
వేంకటేశుని దివ్య విగ్రహ మీరీతి
ఆపాదమ స్తక మనుభవించి
సంతసించి యతీంద్రుండు సంతసించి
జైత్రయాత్రాక్రమం బెల్ల జాఱవిడిచి
పేదపెన్నిధిఁ గన్నట్లు పెరిఁగె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 17

శ్రీపాద మాదిగా శిరము పర్యంతంబు
శ్రీపాణముని భంగి సేవఁ జేసి
భట్టనాథోక్తమహా పల్లాండు పాడి, యా
శౌరికి మంగళాశాసనంబు

జేసి, కేల్గవ మోడ్చి సేవించు యతిపతి
కంజనాద్రీశుఁ డిట్లనుచుఁ బలికె
భాష్యంబు రచియించి - భారతి మెప్పించి
ప్రతివాదుల జయించి, భవులు దీర్చి
మంచి మా కొనరించు సన్మంత్రి వీవె
కనుక నిచ్చితి భూతి యుగంబు నీకు
శయనగృహమందు నని పల్కె శౌరి యనుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 18

శ్రీశఠకోపంబు చెలువొందు తీర్థ ప్ర
సాదాదులను గొని సంయమీంద్రుఁ
డంజనాద్రీశుని, అలమేలుమంగను,
స్వగురుని వీడ్కొని జరగి వచ్చి
తిల్లగోవిందుని 'తిరువడి' సేవించి
ఆత్మీయులను గూడి యచటఁ గదలి
చోళసింహపురంబు జొచ్చి యతీంద్రుండు
ఘటికాద్రినృహరిని గాంచి మించి
గృధ్ర పుష్కరిణీ తీర గృహ నివాసు
నిజయరాఘవుఁ గని మ్రొక్కి వెడలి విభవ
యుక్త సత్యవ్రత క్షేత్ర మొందె ననుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర ॥ 19



# భగవద్రామానుజులు - కవితా వైశిష్ట్యము

'విద్యాప్రవీణ - భాషాప్రవీణ - ఉభయ వేదాంత శిరోమణి'

శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, ఎం. ఏ.



## 1. శ్రీ యతిరాజ స్తుతి

శ్లో॥ కాషాయ శోభి కమనీయ శిఖా నివేశం
దండత్రయోజ్జ్వలకరం - విమలోపవీతమ్ ।
ఉద్య ద్దినేశ నిభ ముల్లస మూర్ధ్వపుండ్రం
రూపం తవాఽస్తు యతిరాజదృశో మమాగ్రే ॥

## 2. ప్రవేశిక

ద్వైతాద్వైత విశిష్టాద్వైత మత ప్రవర్తకులైన శ్రీ మధ్వ - శంకర - రామానుజులు ముప్వురును - పండితైక సమధీ గమ్యములైన భాష్య గ్రంథములనే గాక, సామాన్యులు సైతము అనుసంధించి తరించుటకు వీలుగా, రసవత్తర శైలిలో - స్తోత్రముల ననేకముల ననుగ్రహించినారు.

శ్రీ శంకరాచార్యుల పేరుతో నేడు - వివిధ దేవతాస్తోత్రములు ప్రచారములో నున్నవి. కాని, అవి యన్నియు - ఆదిశంకరులవి కావని, కొన్ని మాత్రమే వారి రచనలని, నేటి చారిత్రకులు భావించుచుండగా, సంప్రదాయవాదులు - 'అవి యన్నియు వారి రచనలే' - అని విశ్వసించుచున్నారు. ప్రస్థానత్రయ భాష్యకారు

త్రైన శ్రీ ఆదిశంకరాచార్యులవారు - వాసుదేవ పరాయణు లని - వారి గ్రంథములను నిష్పక్షపాతముగ పరిశీలించినవారి ఆశయము. ఈ దృష్టితో చూచినపుడు - భజగోవిందస్తోత్రమువంటి విష్ణుస్తోత్రములు - వారి రచన లనుటలో విప్రతిపత్తి యుండదు. * కాని, 'తక్కిన అన్ని స్తోత్రములు వారివే' యనుట - అనుగతము కాదేమో!

భగవద్రామానుజుల గ్రంథముల విషయమున - ఇట్టి గందరగోళము ఏర్పడలేదు. వారు రచించిన గ్రంథరత్నములు తొమ్మిది. (1) వేదార్థ సంగ్రహము (2) శ్రీభాష్యము (3) వేదాంత దీపము (4) వేదాంత సారము (5) గీతాభాష్యము (6) శరణాగతి గద్యము (7) శ్రీరంగనాథ గద్యము (8) వైకుంఠ గద్యము (9) నిత్య గ్రంథము. ఈ నవ (9) గ్రంథములలో - మూడు గద్య గ్రంథములను - 'గద్యత్రయము' - అని వ్యవహరింతురు. భగవద్రామానుజులవారికి ముందు - వెనుక ఉండిన ఆచార్యులు – పద్య కవితలో - స్తోత్రముల ననుగ్రహించియుండగా, వీరుమాత్రము - గద్య రూపమున స్తోత్రముల ననుగ్రహించినారు. వీరి గ్రంథముల ప్రారంభమునందు మంగళశ్లోకములలో - వీరి విశిష్ట పద్య కవితా మధురిమ నాస్వాదింపవచ్చును. ఇట్టి పద్యముల సంఖ్య స్వల్పమే అయినను, వానియందలి కవితాగరిమ యనల్పము.

---

* చేతోభృంగ ! భ్రమసి వృథాభవ మరుభూమౌ విరసాయామ్
భజ భజ లక్ష్మీ నరసింహానఘ పదసరసిజ మకరందమ్ ॥

అను - శంకరాచార్యుల షట్పదీస్తోత్రమునందలి సొకమునుబట్టియు, శంకరాచార్యులు - వాసుదేవ భక్తు లనుటలో విప్రతిపత్తి లేదు

— సంపాదకుడు.

# 3. గద్యము - పద్యము

సంస్కృతభాషయందు కవిత్వము - పద్య గద్య భేదమున రెండు విధములుగ నున్నది. గణ నియమము గలది పద్యము కాగా, ఆ నియమము లేనిది — గద్యము. ప్రతి భాషయందును - పద్య కవితయే ప్రాచీనమైన దని - విమర్శకుల యాశయము. వేదములు ఛందోబద్ధములు. అనగా, గణ నియమము గల 'గాయత్రి' మున్నగు ఛందస్సులలో నిబంధింపబడినవి కావుననే, వానికి - 'ఛందస్సు' - అనియు - నామము. కాని, యజుర్వేదమున - అధికభాగము - గద్యమయము. కావున, గద్య పద్యాత్మకమైన ద్వివిధ కవితలను వేద వాఙ్మయముననే చూడవచ్చును. పద్యము - కంఠస్థ మెలనచ్చుటకు సులభమగుటచే, లిపి లేని అతి ప్రాచీనకాలమున - పద్య రచనకే ప్రచుర ప్రచారము ఉండెడిది.

పద్య రచన - కష్టసాధ్య మని, గద్య రచన - సులభ మని, సామాన్యులు తలతురు. కాని, అనుభవజ్ఞులు - "గద్యం కవీనాం నికషం వద న్తి" - 'కవి శ క్తి కి — గద్య రచన - పరీక్ష' - అని తేల్చినారు. ఇది నిజమే. గద్యమునకు ఓజోగుణము జీవిత మన్నారు. ఆలంకారికులు. 'ఓజస్సు'. అనగా, దీర్ఘ సమాస ప్రాచుర్యము కలిగి యుండుట. మహాకవి బాణభట్టు - కాదంబరియందు గల గద్య రచనా శిల్పము - తరువాతి కవులకు ఆదర్శమైనది. ఆ ప్రభావము - భగవద్రామానుజుల గద్య రచనయందును - ప్రస్ఫుటముగ గోచరించుచున్నది. మఱియు, గద్యము - (1) వృ త్తగంధి (2) చూర్ణము (3) ఉత్కలికాప్రాయము - అని, మూడు విధములు. పద్యముగ

చదువదగిన పద బంధము - 'వృత్తగంధి'. విడివిడి పదములతో కూర్చబడిన గద్యము - 'చూర్ణము' క్లిష్టవర్ణములతోను, దీర్ఘ సమాసములతోను కూర్చబడినది - 'ఉత్కళికా ప్రాయము'. ఈ మూడు విధములైన గద్యములను - భగవద్రామానుజుల గద్యత్రయమున - మనము చూడవచ్చును. చూడుడు :-

౧. పద్యగంధి గద్యము :-

"నానాపుష్పాసనా స్వాదమత్త భృంగావలీభిః" - "చందనాగురు కర్పూర దివ్య పుష్పావగాహి."

పై రెండు సమస్త పదములు - అనుష్టుప్ ఛందోరూపమున చూపట్టుచున్నవి. ఇట్లే,

"ఉదగ్ర పీనాంస విలంబి కుండలాల కావళీ బంధుర కమ్బు కంధరమ్".
"ప్రియావతంస సోత్పల కర్ణభూషణ శ్లథాలకాబద్ధ విమర్ద శంసిభిః.

అను సమస్త పదములయందు - వంశస్థ వృత్త లక్షణము చూపట్టుచున్నది. వాస్తవమున - ఈ రెండు సమస్త పదములు - ఆళ్వారులు, యామునాచార్యులు అనుగ్రహించిన స్తోత్ర రత్నములోనివి పరమాచార్యులమీది, భక్త్యతిశయమువలన, స్వామి రామానుజులు ఆ పద్య భాగములను తమ గద్యమున నిబంధించినారు.

౨. చూర్ణ గద్యము :-

"సత్యకామ !, సత్యసంకల్ప !, ఆపత్సఖ!, కాకుత్స్థ!, శ్రీమన్నారాయణ!, పురుషోత్తమ!, శ్రీరంగనాథ!, మమనాథ!, నమోఽస్తుతే. కదాహం భగవన్తం, మమ

కులధనం, మమ భోగ్యం, మమ మాతరం, మమ పితరం, మమ సర్వం సాక్షాత్కరవాణి చక్షుషా"కదాహం భగవత్పాదాంబుజద్వయం - శిరసా ధారయష్యామి."

ఈ పై వాక్యములు - అలతి యలతి పదములతో కూర్చబడి, ప్రసాదగుణ శోభితములై యున్నవి.

౩. ఉత్కలికాప్రాయ గద్యము :-

"పారమార్థిక భగవచ్చరణారవింద యుగళైకాన్తి కాత్యన్తిక - పరభక్తి-పరజ్ఞాన - పరమభక్తి కృత పరిపూర్ణానవరక - నిత్యవిశదమానత్య ! ప్రయోజనానవధి కాతిశయ ప్రీతికారితాశేషావస్థానచితాశేష! శేషతైక రతిరూప ! నిత్యకైంకర్య ప్రాప్త్యపేక్షయా !"

"స్వాభావికానవధి కాతిశయ - జ్ఞాన బలైశ్వర్య వీర్యశక్తి తేజ స్సౌశీల్య వాత్సల్య మార్దవార్జవ, సౌహార్ద్ర సామ్య కారుణ్య మాధుర్య గాంభీ ర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ ! సత్యకామ ! సత్య సంకల్ప కృతిత్వ కృతజ్ఞతా ద్యసంఖ్యేయ కల్యాణ గుణ గణౌఘ మహార్ణవ !"

ఈ గద్య భాగములు - దీర్ఘ సమాస జటిలములై, పరితల మనస్సును ఆకట్టుకొనుచున్నవి.

## 4. గద్యత్రయ రచనలో - పద విన్యాసము

మీనమాసమునందలి ఉత్తరఫల్గునీ నక్షత్రమునాడు - శ్రీరంగమున శ్రీరంగనాథుడు - శ్రీరంగనాయకీదేవితో - ఏకాసనమున వేంచేసియున్న సమయమున, స్వాశ్రిత చేతనోజ్జీవనార్థముగా

శ్రీభాష్యకారులు ఆ దివ్యదంపతుల చరణారవిందములయందు శరణాగతి చేసి, ఈ గద్యత్రయమును విన్నవించినారుట. కావుననే, మొదటి గద్యకు – 'శరణాగతి గద్యము' అని పేరు. ఈ గద్యత్రయ ప్రారంభమున - పురుషకార భూతురాలైన లక్ష్మీదేవి సన్నిధిలో–

"అఖిలజగ న్మాతరం, అస్మ న్మాతరం, అశరణ్య శరణ్యాం, అనన్య శరణః, శరణ మహం ప్రపద్యే."

అనుచు - శరణాగతి చేసిరి. ఆపైన,

"నిత్య కైంకర్య ప్రాప్త్యపేక్షయా, పారమార్థిక భగవచ్చరణారవింద శరణాగతిః, యథావస్థితా - అవిరతాఽస్తు మే."

అమ్మా ! దివ్యదంపతులైన మీ ఉభయుల పాదపద్మములలో, నిత్య కైంకర్యము లభించవలయునను కోరికతో, నేను భగవచ్చరణారవింద ములయందు సమగ్రము ఫలప్రదాన సమర్థము అగుగాక' అని - శ్రీరంగనాయకిని ప్రార్థించి. ఆమెచే -

"అస్తుతే - తయైవ సర్వం సంపద్యతే."

అట్లే యగుగాక ! నీవుచేసిన శరణాగతి చేతనే నీవు కోరినట్లు - సర్వము - అనగా, నీ ఆశ్రితుల రక్షణము సైతము సిద్ధింపగలదు' - అని అనుమతింపబడి.

"శ్రీమన్నారాయణ ! అనన్య శరణం, త్వత్పాదారవింద యుగళం - శరణ మహం ప్రపద్యే."

అనుచు - శ్రీమన్నారాయణుని సన్నిధిలో శరణాగతి చేసి,

"పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తి యుక్తం - మాం కురుష్వ; నిత్యకింకరో భవాని."

పరభక్త్యాదులు కలుగునట్లును, భగవత్సన్నిధిలో నిత్య కైంకర్యము లభించునట్లును ప్రార్థించినారు. శ్రీరంగనాథుడును -

"ద్వయం అర్థాను సంధానేన సదా ఏవం వక్తా - యావచ్ఛరీరపాతం, అత్రైవ శ్రీరంగే సుఖ మాస్వ; నిత్య కింకరో భవిష్యసి మా తేభూదత్రసంశయః."

రామానుజా ! నీవు సర్వదా ద్వయ మంత్రమును అనుసంధించు దాని అర్థమును భావించుచు, శరీరావసాన పర్యంతము ఈ శ్రీరంగముననే సుఖముగ నుండుము. నీకు తప్పక - నిత్య కైంకర్య ప్రాప్తి కలుగ గలదు. నీకు సంశయము వలదు' - అని పలికి, అనుగ్రహించినాడు... ఈ శ్రీరంగ గద్యమునకు - 'పృథుగద్యము' - అనియు నామ ధేయము. శ్రీ వైకుంఠ గద్యము - గతి చింతనా ప్రకార బోధనము. ప్రపన్నుడు - శరీరావసానానంతరము - అర్చిరాది మార్గమున పరమ పదమును చేరి, అచట పరమ పదనాథుని సన్నిధిలో - నిత్య కైంక ర్యము గావించుచు, నిరతిశయానందమును అనుభవించును గదా ! ఆ విషయమును ప్రతిదినము మననము చేయుచుండ వలయును. కావున, గతిచింతనా ప్రకారమును స్వామి రామానుజులు - శ్రీ వైకుంఠ గద్య ద్వారా మనకు అనుగ్రహించినారు. ఈవిధముగా గద్యత్రయము - ప్రపన్నులను నిత్యానుసంధేయమై యున్నది. గద్యమునందు వివక్షితాంశమును మరింత స్పష్టముగా ప్రతిపాదించగల అవకాశ ముందుటచే, స్వామి — ద్వయమంత్రమును, గతి చింతనా ప్రకారమును గద్యలోనే అనుగ్రహించినారు. గద్యత్రయమునందలి

శబ్దార్థములు శ్రవణపేయములు, హృదయంగమములునై శోభిల్లుచున్నవి. గద్యత్రయమునందేకాక, శ్రీభాష్యాది గ్రంథములందును - భగవద్రామానుజుల వాక్య రచన - ఉత్తమ గద్య లక్షణ లక్షితమై, పఠితలను ఉజ్జ్వాత లూగించుచుండును.

## 5. గద్య రచనలలో - పదవిన్యాసము

శ్రీభాష్యకారుల గద్యరచనవలె పద్యరచనము - రమణీయ శబ్దార్థగుంఫితమై, మాధుర్యోజ ప్రసాదగుణములు కలిగి, రమ్యమై యుండును. వీరి పద్యములు కావ్యరూపమున నిబద్ధములు కావు. శ్రీభాష్యాది గ్రంథముల ఆద్యంతములలో - ప్రార్థనారూపమున అనుగ్రహింపబడినవి. వీరు అనుగ్రహించిన పద్యరచనలు ఇవిగో :-

శ్రీభాష్య ప్రారంభమున :-

శ్లో॥ అఖిల భువన జన్మ స్థేమ భంగాదిలీలే
వినత వివిధ భూతవ్రాత రక్షైకదీక్షే ।
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా ॥

పారాశర్య వచస్సుధా ముపనిషద్దుగ్ధాబ్ధి మధ్యాధృతామ్
సంసారాగ్ని విదీపన వ్యపగతప్రాణాత్మ సంజీవనమ్ ।
పూర్వాచార్య సురక్షితాం బహుమతి వ్యాఖ్యాత దూరస్థితామ్
సంసారాగ్ని విదీపన వ్యపగత ప్రాణాత్మ సంజీవనీమ్ ॥

వేదాంత దీప ప్రారంభమున :-

శ్లో॥ శ్రియః కాంతోనన్తో వరగుణ గణై రాస్పదవపుః
హతాశేషా వద్యః పరమఖపదో వాఙ్మనసయోః ।
అభూమి ర్భూమిర్యా నతజన దృశామాది పురుషః
మన స్త త్పాదాబ్జే పరిచరణ స క్తం భవతు మే ॥

ప్రణమ్య శిరసాచార్యాన్ తదాదిష్టేన వర్త్మనా
బ్రహ్మసూత్ర పదా న్త స్థ వేదాన్తార్థః ప్రకాశ్యతే ॥

వేదాంత సార ప్రారంభమున :-

శ్లో॥ సమ స్త చిదచిద్వస్తు శరీరాయాఖిలాత్మనే
శ్రీమతే నిర్మలానన్దో దన్వతే విష్ణవేనమః ॥

వేదార్థ సంగ్రహ ప్రారంభమున :-

శ్లో॥ అశేషచిదచిద్వస్తు శేషిణే శేషశాయినే
నిర్మలాన న్త కల్యాణ నిధయే విష్ణవే నమః ॥

పరంబ్రహ్మైవాజ్ఞం భ్రమపరిగతం సంసరతి తత్
పరోపాధ్యాలీఢం వివశ మశుభస్యాస్పద మితి
శ్రుతి న్యాయోపేతం జగతి వితతం మోహన మిదం
తమో యేనా పా స్తం న హి విజయతే యామునమునిః ॥

వేదార్థ సంగ్రహము చివర :-

శ్లో॥ సారాసార వివేకజ్ఞాః । గరీయాంసో విమత్సరాః
ప్రమాణ తంత్రా స్సన్తీతి । కృతో వేదార్థ సంగ్రహః ॥

భగవద్గీతా భాష్య ప్రారంభమున :-

శ్లో॥ యత్పదాం భోరుహధ్యాన విధ్వస్తా శేషకల్మషః
వస్తుతా ముపయాతో౽హం । యామునేయం నమామి తమ్ ॥

శరణాగతి గద్యము చివర :-

శ్లో॥ అన్త్యకాలే స్మృతిర్యాతు । తవకైంకర్యకారితా
తా నాం మే భగవన్నద్య । క్రియమాణం కురుష్వ మే ॥

శ్రీరంగ గద్యమున :-

శ్లో॥ తవానుభూత సంభూత । ప్రీతికారిత దాసతామ్
దేహి మే కృపయానాథ । న జానే గతి రన్యథా ॥
సర్వావస్థోచితాశేష శేషైకరతి స్తవ
భవేయం పుండరీకాక్ష । త్వమే వైవం కురుష్వ మామ్ ॥

శ్రీవైకుంఠ గద్యారంభమున :-

శ్లో॥ యామునార్య సుధాంబోధిం । అవగాహ్య యథామతిః
ఆదాయ భక్తియోగాఖ్యం । రత్నం సందర్శయా మ్యహమ్ ॥

ఈ శ్లోకమునే కాక, శ్రీభాష్యమునందు - మహాసిద్ధాంతమున వీరి కారికలు కొన్ని చూపట్టుచున్నవి :-

శ్లో॥ అహ మర్థో నచేదాత్మా । ప్రత్యక్త్వం నాఽత్మనో భవేత్
అహం బుద్ధ్యాపరాగర్థాత్ । ప్రత్యగర్థో హిభిద్యతే ॥
నిరస్తా౽ఖిల దుఃఖో౽హం । అనన్తం నన్దభాక్ స్వరాట్
భవేయ మితి మోక్షార్థీ । శ్రవణాదౌ ప్రవర్తతే ॥

శ్లో॥ అహమర్థ వినాశశ్చే న్మోక్ష ఇత్యధ్యవస్యతి
అపసర్పేదసౌ మోక్ష కథా ప్రస్తావ గంధతః ॥

మయినష్టేఽపి మత్తోఽన్యా । కాచిత్ జ్ఞప్తిరవస్థితా
ఇతి తత్ప్రాప్తయే యత్నః । కస్యాపి నభవిష్యతి ॥

స్వ సంబంధే వియోగేపి జ్ఞప్తిరేవ న నిర్వృతి ॥

శృత్రు శ్చేద్య స్పదాఽభావే । ఛేదనా దే రసిద్ధివత్
అతోఽహమర్థో జ్ఞాతైవ । ప్రత్యగాత్మేతి నిశ్చితమ్ ॥

'విజ్ఞాతారమరే కేన' । జనాత్యేవేతి చ స్మృ శ్రుతిః
ఏత ద్యోవే_త్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి చ స్మృతిః ॥

నా త్మా శ్రుతేరితి వ్యాకర్తు । సూత్రకారోఽపి కక్ష్యతి
జ్ఞోఽత ఏవే త్యతోహ్యాత్మా । జ్ఞప్తి మాత్ర మితిస్థితమ్ ॥

అనియు, ఇట్లే - ఆపైన -

శ్లో॥ యధార్థ సర్వవిజ్ఞానం । ఇతి వేద విదాం మతమ్
శ్రుతి స్మృతిభ్య స్సద్యస్య । సర్వాత్మత్వ ప్రతీతితః ॥

బహుస్యామితి సంకల్ప పూర్వ సృష్ట్యాద్యుపక్రమే
తాసాం త్రివృత త్రివృతమేకైకాం । ఇతి శ్రుత్యైవ బోధితమ్ ॥

త్రివృత్కరణ మేవం హి ప్రత్యక్షేణోపలభ్యతే
యగ్నే రోహితం రూపం । తేజస స్త దపామపి ।
శుక్లం కృష్ణం పృథివ్యాశ్చేగ్నా వేవ త్రిరూపతా
శ్రుత్యైవ దర్శితా త్తస్మాత్ । సర్వే సర్వత్ర సంగతాః ॥

పురాణేచైవ మే ప్రోక్తం । వైష్ణవే సృష్ట్యుపక్రమే
నానాశీర్యాః పృథగ్భూతాః । తతస్తే సంహతిం వినా ॥

నాఽశక్నువన్ ప్రజాస్స్రష్టుం । అసమాగమ్య కృత్స్నశః
సమేత్యాన్యోన్య సంయోగం । పరస్పర సమాశ్రయాః ॥

మహదాద్యాః విశేషాన్తాః । రాహ్యం కరోత్యాదినా తతః
సూత్రకారోఽపి భూతానాం । త్రిరూపత్వం తథాఽవదత్ ॥

త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్ । ఇతితే నాభిధాభిదా
వోమాభావేత పూతీక గ్రహణం శ్రుతిచోదితమ్
వ్రీహ్యభావే చ నీవార గ్రహణం వ్రీహి భావతః ॥

తదేవ సదృశం తస్య । యత్తద్ద్రవ్యైకదేశభాక్
శుక్త్యాదౌ రజతాదేశ్చ । భావః శ్రుత్యైవబోధితః ॥

రూపవ్య శుక్త్యాది నిర్దేశ భేదో భూయస్త్వహేతుకః
రూప్యాది సదృశశ్చాతుం । శుక్త్యాది మపలభ్యతే ॥

అతస్తస్యాత్ర సద్భావః । ప్రతీతేరపి నిశ్చితః
కదాచిచ్చక్షురాదేస్తు । దోషాత్ శుక్త్యం దవర్జితః
రజత్వాంశోగృహీతోఽతః । కజీతార్థీ ప్రవర్తతే
దోషహానౌతు శుక్త్యంశే । గృహీతే, తన్నివర్తతే ॥

అతోయథార్థం రూప్యాది విజ్ఞానం శుక్తికాదిషు
బాధ్యతా బాధకో భావోఽపి భూయస్త్వేనోప పద్యతే ॥

శుక్తి భూయస్త్వవైకల్య । సాకల్య గ్రహరూపతః
నాతో మిథ్యార్థ సత్యార్థ విషయత్వ నిబంధనః
ఏవం సర్వస్య సర్వత్వే । వ్యవహార వ్యవస్థితః ॥

అనియూ - కారికలు కలవు.

ఇట్లే, శ్రీవైష్ణవులు శ్రీవైష్ణవదేవాలయములయందును, గృహారాధనముల యందును - అనుదిన భక్తిప్రపత్తులతో -

"శ్రీమన్ శ్రీరంగ శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ
శ్రీమన్ శ్రీరంగ శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ."

అని - రెండు పర్యాయములు - అనుసంధించు వాక్యరత్నము - భగవద్రామానుజులు - తిరునారాయణపురములో వేంచేసియున్న తరుణములో, 'తిరునారణన్' స్వామిసన్నిధియందు విన్నవించుచున్నదియట! కొందరు ఈ వాక్యమును - "శ్రీమన్న శ్రీరంగ" - అనియు పఠించున్నారు. పద్యముల మధ్యనున్న ఈ వాక్యము - పద్యచ్ఛాయను సంతరించుకొన్నది.

ఇక - ఈపైన పేర్కొనబడిన శ్లోకములతో - భగవద్రామానుజుల కవిత ఎంతటి ప్రసన్న గంభీరమో - పాఠకులు గ్రహించియే యుందురు.

శ్రీభాష్యప్రారంభమున గల - "అఖిల భువన జన్మస్థేమ భంగాదిలీలే" - అను మంగళశ్లోకము యొక్క నాల్గవ పాదము - శ్రీ యామునాచార్యులవారి సిద్ధిత్రయమున గల మంగళ శ్లోకము యొక్క నాల్గవ పాదమును జ్ఞప్తికి తెచ్చును, శ్రీభాష్యకారులకు తమ పరమాచార్యులయందలి భక్త్యతిశయమును సూచించుచున్నది. చూడుడు :-

శ్లో॥ ప్రకృతి పురుషకాలం వ్యక్తముక్తా య దిచ్ఛా
మనువిదధి నిత్యం నిత్యసిద్ధై రనేకైః
స్వపరిచరణ భోగై శ్శ్రీమతి ప్రీయమాణే
భవతు మమ పరస్మిన్ - శేముషీ భక్తి భూమా ॥" (సిద్ధిత్రయము)

"భవతు మమ పరస్మిన్ శేముషి భక్తిరూపా." (శ్రీభాష్యము)

ఈ రెండు శ్లోకములు - మాలినీ వృత్తమునందు ప్రసాద - మాధుర్య గుణములు గలిగి, సూచ్యార్థ సూచకములై యున్నవి. శ్రీభాష్య ప్రారంభమున రెండవ శ్లోకము - "పారాశర్య వచస్సుధామ్" - అనునది. ఇందు - పారాశర్యుని సూక్తులను సుధగా రూపించినారు శ్రీభాష్యకారులు. ఆ సుధ ఉపనిషద్దుగ్ధాబ్ధి మధ్యనుండి ఉద్ధరించబడినదట 'అది - పూర్వాచార్య సంరక్షిత మట. ఇంతే కాదు. సంసారాగ్ని విదీపనచే వ్యపగత ప్రాణులైన ఆత్మలను ఉజ్జీవింపచేయునదట. బహు వ్యాఘాతములకు దూరముగ నున్న ఆ సుధ - నిజాక్షరములచే కొనిరాబడినదిట. ఇక, ఆలస్యమెందులకు? భూసురులు అద్దానిని ఆస్వాదింతురుగాక ! అని ఆశాసించుచున్నారు స్వామి రామానుజులు. అమృతము - క్షీరసముద్రమునుండి ఉద్భవించినది. దానిని దేవతలు స్వర్గలోకమున మిక్కిలి జాగ్రత్తగా సంరక్షించుచుందురు. అమృతమును త్రావినవారికి - మరణము ఉండదు. కద్రువు, సుపర్ణి - అను ఇరువురు వనితలు - పందెము కాచిరి. అందు — 'సుపర్ణి' పరాజితురాలైనది. 'దేవలోకమున సోమలతారూపముననున్న అమృతమును నాకు తెచ్చియిచ్చినచో, నిన్ను విడిచి వేయగల' నని కద్రువు పలికినది. అంతట సుపర్ణి, తన సంతానమైన ఛందస్సులను - సోమలతారూపముననున్న అమృతమును తెచ్చుటకు

ప్రోత్సహించినది. అంతట చతుర్దశాక్షరములుగల జగతీ ఛందస్సు, మూడు అక్షరములుగల త్రిష్టుప్ ఛందస్సు - ప్రయత్నించి, విఫలములై, తమకున్న అక్షరములలో రెండేసి అక్షరములను కోల్పోయి నవి. అపైన, గాయత్రీ ఛందస్సు - దేవలోకమునకు బోయి, ఆ సోమలతను గొనివచ్చినది. అందువలన, చదురక్షరగా ఉండిన గాయత్రీ ఛందస్సు - జగతీ త్రిష్టుప్పులు పోగొట్టుకొనిన నాలుగు అక్షరములను తాను జయించి తీసికొనగా-'అష్టాక్షర' - అయినది'-అని, తైత్తిరీయ సంహిత (6 - - 1. 6 – 1)లో కలదు. "ఆ సీయాంతు నిజాక్షరైః" అనునెడ - ఈ ఐతిహ్యమును స్మరింపవలెనని - వ్యాఖ్యాతలు తెలిపినారు.

ఈ శ్లోకమునే - సమస్తరూపకాలంకారము ఇట్లు అత్యంత మనోజ్ఞముగ నిర్వహింపబడినది. వచస్సుధను మనకు అందించుచున్న భగవద్రామానుజులు - అమృతాంశులైన చంద్రుడు ఈ విషయమును తత్త్వటీకతో శ్రీ వేదాంతదేశికులు -

శ్లో॥ సుధేయం సూత్రకారేణ । హరిణేవ సముద్ధృతా ।
ఆనీతా భాష్యకారేణ ద్విజేంద్రదేశికాశయః"

అని - స్పష్టముగావించినారు.

శంకరాచార్యులు మాండూక్య కారికాభాష్యము చివర - పరబ్రహ్మమును, పరమాచార్యుడగు గౌడపాదుని స్తుతించుచు, రెండు శ్లోకములను రచించియున్నారు.

శ్లో॥ అజ మపి జనియోగం ప్రాపదైశ్వర్యయోగాత్
అగతిచ గతిమత్తాం ప్రాపదేకం హ్యనేకమ్ ।
వివిధ విషయధర్మగ్రాహి ముగ్ధేక్షణానాం
ప్రణతభయనిహన్తృ బ్రహ్మయత్తన్నతోస్మి ॥

శ్లో॥ ప్రజ్ఞా వైశాఖ వేద క్షుభిత జలనిధే ర్వేదనామ్నోఽంతరస్థం
భూతాన్యాలోక్య మగ్నాన్య విరత జననగ్రాహ ఘోరే సముద్రే ।
కారుణ్యా ద్దుగ్ధ ధారాఽమృత మిదుమమరై ర్లభం భూతహేతోః
యస్తం పూజ్యాభిపూజ్యం పరమగురు మముం పాదపాతైర్నతోఽస్మి ॥

ఈ రెండు శ్లోకములు - శ్రీభాష్య ప్రారంభమున గల - పై రెండు శ్లోకములను బోలియున్నవి. రెండు గ్రంథములయందును మొదటి శ్లోకము మాలినీ వృత్తములోను, రెండవ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్తములోను ఉండుట, మొదటి శ్లోకము అకార ముతో ప్రారంభమగుట, 'వినత - వివిధ - భూత' పదముల ప్రయోగము, ఇవి యాదృచ్ఛికములు కావేమో ! గ్రంధారంభమున నుండ వలసిన ఈ శ్లోకములు గ్రంథాంతముననుండుటయు విచిత్రముగ నున్నది. మతద్వయాచార్యుల ఈ శ్లోకములలో గల కవితాగుణము లను సహృదయులు పరిశీలింతురుగాక !

వేదాంత దీప, వేదార్థ సంగ్రహగ్రంధముల ప్రారంభమునగల

''శ్రియః కాన్తోనన్తో వరగుణ గణై రాస్పదవపుః"

"పరబ్రహ్మైవాజ్ఞం భ్రమపరిగతం సంసరతి తమ్."

అను ప్రార్థనాశ్లోకములు – శిఖరిణీ వృత్తమున నిబంధింపబడినవి. "భవభూతే శ్శిఖరిణీ" రిన్నాడు క్షేమేంద్ర మహాకవి. ఆ శిఖరిణులకు

దీక్షైసవి ఈ శిఖరిణులు. ఈ శ్లోకములలో మొదటిది - భగవత్ప్రార్థన కాగా, రెండవది - పరమాచార్య ప్రార్థన గావించు శ్లోకము సుప్రసిద్ధమైనది.

"యత్పాదాంభోరుహ ధ్యాన - విధ్వస్తాశేషకల్మషః"

అని కలదు. స్వామి శ్రీ యామునాచార్యులకు ఏకలవ్యప్రాయులు శ్రీ రామానుజాచార్యులు. ఈ రెండు శ్లోకములు - ఆ విషయమును స్పష్టము గావించుచున్నవి. అనుష్టుప్ శ్లోకములయందును ఉత్తమ కవితా గుణములు ప్రస్ఫుటము లగుచుండును.

"అశేష చిదచి ద్వస్తు - శేషిణే శేషశాయినే."

ఇత్యాది పద్యమున — శబ్దాలంకార కుంభనమునందలి మసృణత్వము దర్శింపనగును.

వేదార్థసంగ్రహము చివర గల — "సారాసారవివేకజ్ఞాః" - ఇత్యాది శ్లోకము - స్వామియొక్క ఆత్మవిశ్వాసమును, ప్రాజ్ఞవిధేయతను - వేనోళ్ళ చాటుచున్నది.

శాస్త్రీయ చర్చల నడుమ నిబంధింపబడిన అనుష్టుప్ శ్లోకముల యందును చక్కని పదబంధము - పాఠకుల మనస్సులను ఆకట్టుచుండును చూడుడు :-

శ్లో॥ నిరస్తాఖిల దుఃఖోఽహం । అనన్తానన్దభాక్ స్వరాట్
భవేయ మితి మోక్షార్థీ। శ్రవణాదౌ ప్రవర్తతే ॥

ఇత్యాది శ్లోకములయందలి శబ్దార్థములు - సరసములై, పఠితయొక్క శాస్త్ర చర్చాజన్యమైన క్లేశమును అపహరించి, ఉల్లాసమును కలిగించు చున్నవి.

ఇట్లే శ్రీరంగగద్యమునందలి -

శ్లో॥ తవానుభూతి సంభూత ప్రీతికాంత దాసతామ్
దేహిమే కృపయానాథ ! న జానే గతి మన్యథా ॥

శ్లో॥ సర్వావస్థోచితా శేష - శేషతైక రతి స్తవ
భవేయం పుండరీకాక్ష ! త్వమే వైవం కురుష్వ మామ్ ॥

అను శ్లోకములలో - శ్రీమద్రామానుజులు - శ్రీరంగనాథుని ముందు - తమ అకించన్య - అనన్యగతిత్వములను విన్నవించు కొనుట -

"యమేవైష వృణుతే తేన లభ్యః । తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్."

అను కఠోపనిషత్ ప్రతిపాదితార్థమును ప్రతిబింబింపజేయుచున్నది.

భగవద్రామానుజులు సంస్కృతమునందే కాక, తమిళము నందును కొన్ని పాశురములను అనుగ్రహించినట్లు - సంప్రదాయ గ్రంథములవలన తెలియుచున్నది. వీరి ప్రపన్న జనకూటస్థులైన శ్రీ నమ్మాళ్వారులను గురించి —

"ముందత్తు ముయత్తు తరిత్తురైత్త
మావిత్తు వాయార వాళ్తి - కంద -
ముఱు కూఱుం కోలై కూళ్ మెయ్ పూం పొరునల్
కురుకూరన్ కూరన్ పేర్ కూఱు."

అనియు, చతుష్క విశిఖామణి యగు తిరుమాంగై యాళ్వారులను గురించి -

"వాళివరకాలన్ - వాళి కలినన్ఱి
వాళికురై యలూర్ వాళివేన్దన్ - వాళియరో
మాయోనై వాళ్వలి యాళ్ మందిరంగోళ్ - మంగై యర్కోన్
మాయోన్ శుడర్ మానవేల్."

అనియు - రెండు తనియన్ పాశురములను అనుగ్రహించినారు. వీనిలో - "ముందుత్తు నెంజే" - అను తనియన్ (ప్రార్థనా పాశురము)- నమ్మాళ్వారుల 'పెరియ తిరువన్దాది' - అను ప్రబంధమును అనుసంధించునపుడును, "వాళి పరకాలన్" - అను రెండవ తనియన్ - 'పరకాల సూరి' - అనుగ్రహించిన 'పెరియ తిరుమొళి' - అనుదివ్య ప్రబంధమును - పఠింపబడుచున్నది. ఈ రెండు పాశురములు - 'వెణ్బా' ఛందస్సులో నున్నవి.

## 6. ముగింపు

ఈరీతిగా భగవద్రామానుజాచార్యులవారు - శ్రీభాష్య కారులే గాక, రసవత్తర కవితాశిల్పియు, మూర్తీభూత భక్తితత్త్వమునై, ఆజ్ఞప్రాజ్ఞ విభాగము లేక, ఆశ్రితులగువారి కెల్లరకు - భగవదనుగ్రహము కలుగు లాగున భగవత్సన్నిధిలో శరణాగతి చేసి, భగవంతునిచే 'అట్లే' - అనిపించుకొనిన పరార్థప్రపణులు. భక్తుల ఆశాజ్యోతి వారు. కావుననే శ్రీవత్సాంకమిశ్రులు —

శ్లో॥ యో నిత్య మచ్యుత పదాంబుజయుగ్మ రుక్మ
వ్యామోహిత స్తదితరాణి తృణాయమేనే ।
అస్మ ద్గురో ర్భగవతో౽స్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥"

అని - వారిని ప్రస్తుతించినారు.

జయ రామానుజ ! - జయ రామానుజ !

జయ రామానుజ !



# భగవద్రామానుజ మత ప్రభావము

'సుధీమణి'

శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు,

ఎం. ఏ; యం. యిడి.



## శ్రీ రామానుజ స్తుతి

"యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహిత స్తదితరాణి తృణాయమేనే।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే."

## మతము - సంప్రదాయము

'మతము' అనునది - ఒక వైయక్తిక విశ్వాసము. ఇయ్యది - ఆత్మకు, పరమాత్మకు సంబంధించినది. జీవాత్మ పరమాత్మల మధ్య గల సంబంధమును విలక్షణ లక్షితమైన తార్కికబలముతో ఆవిష్కరించి విశ్లేషించగల్గిననాడు - అది మాన్యులచేతను, సామాన్యులచేతను - ఆదరింపబడగలదు.

మన భారత దేశములో - అనేక మతములు పుట్టినవి. మరి యింకను పుట్టుచునే ఉన్నవి. పుట్టినవానిలో కొన్ని గిట్టినవి. ఇది యంతయు ఒక ఆధ్యాత్మిక పరంపరకు, పరవడికి, మనుగడకును -

తగిన మార్గమును దర్శింపజేసినట్లు మనము భావింపవచ్చును. సనాతన మైన వేదధర్మమును ప్రాతిపదికగా గొని ఉదయించి, భారతదేశమం దంతటను విస్తరించినది హిందూమతము. ఈ మతమునకు - సంస్కృతీ సంప్రదాయములు ఆలంబనములు కాగా, అయ్యది — ఒక మహా వటవృక్షముగ రూపొంది, శాఖోపశాఖలుగా విస్తరిల్లినది ఆ శాఖలలో ఫలములు - ఆ యా సమయములలో ఆస్వాదితములైనవి. భారతదేశ సమైక్యతకు హిందూమతము దోహదకారి కాగా, మహత్తరమైన భారతీయ సంస్కృతీ ప్రభావము - ఈనాటికిని భద్రముగా, సమైక్యతా స్ఫూర్తులతో సముల్లసించుచున్నది.

ఏదేశ చరిత్రయేని - విశేషించి ఆదేశములో ఆవిర్భవించిన మహానుభావులయొక్కయు, తాత్త్వికులయొక్కయు - సామాజిక సంస్కరణశీలుర చరిత్రయె కాగలదు. ఆ దేశము పొందిన పరిణామ ప్రగతులను అవగాహముగావించుకొనుటకు - ఆ మహనీయుల జీవిత చరిత్రలను, వారు సాధించిన ఫలితములను గ్రహించుట - ఎంతేని యవసరము. ఈ దృష్టితో పరిశీలించినచో, శేషాంశా సంభూతులైన భగవద్రామానుజులు - అగ్రస్థానమున కానరాగలరు.

## శ్రీ రామానుజులపై - ఆళ్వారాచార్య ప్రభావము

శ్రీవైష్ణవ సిద్ధాంతము - రామానుజులవారి సృష్టికాదు. ఇది అనాది సిద్ధము. శ్రీవైష్ణవ సిద్ధాంతమును యథారూపములో ఆవిష్కరించినది విశిష్టాద్వైతము.

"అనాది సిద్ధం సుమహ దేశద్వైష్ణవ దర్శనమ్
తథా జగత్యాం మధురకవినా వర్ధితం మునే ।
కేనచి త్కారణే నాద చైతద్వైష్ణవ దర్శనం
కంచిత్కాలం తు వేదాంతిన్ న ప్రకాశ మిపస్థితమ్."
— (ప్రపన్నామృతము)

అనాది సిద్ధమైన విశిష్టాద్వైతము మహా విశిష్టమైనది. మధుర కవులచే ఇది లోకమున వర్ధిల్లజేయబడినది. ఏదియో యొక కారణము వలన ఈ వైష్ణవ దర్శనము కొలది కాలము మరుగున పడియున్నది. మధురకవులు - శ్రీ వైష్ణవసిద్ధాంతమునకు మూలస్తంబ సదృశులైన నమ్మాళ్వారుల ప్రధాన శిష్యులు.

"శ్రీవైష్ణవమతం సమ్యక్ - అనేనైవ ప్రకాశితమ్ ।
శ్రీవైష్ణవ మతస్యాస్య ముఖ్యోఽయం శఠజిత్తత్ ॥
— (ప్రసన్నామృతము)

శ్రీవైష్ణవ మతమునకు ఆదిముఖ్యులు - నమ్మాళ్వారులు. వీరినే - పరాంకుశు లనియు, వకుళాభరణు లనియు, శఠకోపు లనియు - వ్యవహరింతురు. వీరు తింత్రిణీవృక్ష మూలములో (చింత చెట్టు తొఱ్ఱలో) — నిద్రాహారములు లేక, పదునాఱు (16) సంవత్సరములు మౌనముద్ర ధరించి వేంచేసియుండి, చతుర్వేదసారమును తమ ద్రావిడ ప్రబంధములో నిబంధించి, మధురకవి యాళ్వారులను తను అంతరంగిక శిష్యులనుగా కటాక్షించి, ముప్పదియైదు (35) సంవత్సరముల ప్రాయములోనే పరమపదించిరి. శ్రీవైష్ణవ మతము వీరి మూలముననే ప్రధానముగ ప్రాచుర్యమును పొందినది. ఈ మహా

నీయుల యనంతరము వీరి శిష్యులైన మధురకవి యాళ్వారులు - శ్రీవైష్ణవ మత వ్యాప్తికి విశేష కృషిగావించిరి.

భగవద్రామానుజులపై - వారి పూర్వాచార్యుల ప్రభావము స్పష్టముగా కానవచ్చును. శ్రీవైష్ణవమతమునకు పన్నిద్దరాళ్వారులు మూలపురుషులు. వారు రచించిన ద్రావిడప్రబంధములు - ఈ మత సంప్రదాయమునకు రూపురేఖలను సమకూర్చినవి.

''భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ ।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్.''

ఈ ఆళ్వారు లందఱు - ఒక్క తావున, ఒకే కాలమున జన్మించిన వారు కారు. వారి అవతార కాలాదులకు సంబంధించి - స్పష్టమైన ఏకాభిప్రాయముకూడ లేదు. ఐనను, ఆచార్య పరంపరనుబట్టి, ఈ పన్నిద్దరాళ్వారుల జనన కాలాదులను సూచ్యాసూచ్యముగ చెప్పుదురు. కులశేఖరాళ్వారులు కేరళరాష్ట్రమునకు, మిగిన పదునొకండుగురు ఆళ్వారులును - తమిళదేశమునకు చెందినవారు. ఈ పన్నిద్దరాళ్వారులు - వివిధ ప్రాంతములకు, వివిధ వర్ణములకు, వివిధ కాలములకు చెందినవారు. భగవంతుడైన శ్రీమన్నారాయణుని దివ్యాంశ సంభూతులుగా వీరిని ప్రస్తుతింతురు. అనంత, గరుడ, విష్వక్సేనాదులను నిత్యసూరులుగ సంభావింపగా, ఆళ్వారాచార్యాదులను ముక్తసూరులుగా ఆదరింతురు. వీ రందరి ప్రభావము - రామానుజులపై గలదు. ఆళ్వారులు ముఖ్యముగ - అర్చావతార ప్రభావమును -

వారి దివ్యప్రబంధములద్వారా - ప్రచారము గావించిరి. శ్రియఃపతిని కీర్తించుచు వారు పాడిన పాటలనే – 'పాశురములు' అని వ్యవహరింతురు. ద్రవిడదేశములోగల దివ్యక్షేత్రములను దర్శించి, ఆ యా ప్రదేశములలో వేంచేసియున్న క్షేత్రనాథులను - ద్రవిడభాష యందే - స్తోత్రము చేసిరి. అట్టి పాశురములు నాలుగువేలు (4000) కాగా, ఈ పాశుర సముదాయమును -'నాలాయిర దివ్యప్రబంధము'- అనుపేర వ్యవహరించుచు, ఈ సముదాయమునకు వేదప్రామాణ్యమును సంతరింపజేసిరి. ఈ పన్నిద్దరాళ్వారులు - రామానుజులవారికి-స్ఫూర్తిప్రదాతలుగా పేర్కొనవచ్చును. వీరు - (1) పొయిగై ఆళ్వారు (2) పూదత్తాళ్వారు, (3) పేయాళ్వారు, (4) తిరుమొళిశై యాళ్వారు (భక్తిసారులు), (5) నమ్మాళ్వారు (శఠకోపులు), (6) మధురకవి యాళ్వారు, (7) కులశేఖరాళ్వారు, (8) పెరియాళ్వారు (విష్ణు చిత్తులు), (9) ఆండాళ్ (గోదాదేవి), (10) తొండరడిప్పొడి యాళ్వారు (విప్రనారాయణులు, భక్తాంఘ్రిరేణులు), (11) తిరుప్పాణాళ్వారు (మునివాహనులు, యోగివాహనులు), (12) తిరుమంగై ఆళ్వారు (పరకాలముని) - అను మహనీయులు. వీరెల్లరును - భగవంతునియందు – అచంచలమైన, పరిపూర్ణమైన భక్తిభావము గలవారు. వీరి మహత్వము - వర్ణనాతీతము.

## శ్రీ రామానుజుల ఆచార్యులు

ఆళ్వారుల యుగమునకు పిమ్మట - ఆచార్య యుగారంభము కాగా, మొదట - నాథమునులు (క్రీ. శ. 818) ఆచార్యపీఠము నలంకరించి, శ్రీవైష్ణవ ధర్మ వ్యాప్తికి విశేషముగ కృషిసల్పిరి, వీరి

యనంతరము వీరి దౌహిత్రు లగు యామునాచార్యులవారు(ఆళవందా రులు) శ్రీవైష్ణవమత వికాసమునకు విశ్రమించిరి. శ్రీ రామానుజుల భవిష్యదాగమనమును ముందుగా సూచించినవారు ఈ యామునాచార్యులవారు కాగా, తిరుమలలో వేంచేసియున్న తమ మేనమామ యగు శ్రీశైలపూర్ణులవద్ద - శ్రీ రామాయణ విశేషార్థములను, మహాపూర్ణుల వద్ద ద్వయ మంత్రార్థమును, వర రంగాచార్యుల వద్ద - ఆళ్వారుల ద్రావిడ పాశురములను మార్గపద్ధతిలో గానము చేయు విధానమును రామానుజులు అభ్యసించిరి. యామునాచార్యులవారి 'చతుశ్శ్లోకి', స్తోత్రరత్నము' - అను స్తోత్రముల రెంటిని రామానుజులు కంఠస్థముగావించిరి. పదునెనిమిది పర్యాయములు తిరిగి తిరిగి, గోష్ఠీపూర్ణులవద్ద 'తిరుమంత్రము'ను, మంత్రార్థమును పొందిరి. వారి వద్దనే చరమశ్లోకార్థమునుకూడ పొందిరి. గోష్ఠీపూర్ణులే రామానుజులవారిని - 'ఎంబెరుమానార్' - అని సంభావించి, శిష్యుని శ్రీచరణములనే తదుపరి ఆశ్రయించిరి. "ఇంతవరకు 'శ్రీవైష్ణవ సిద్ధాంతము'గా వ్యవహరింపబడిన ఈ ప్రబోధశాఖ - ఇకపై - 'రామానుజ సిద్ధాంతము'గా ప్రసిద్ధి గాంచుగాక !" యని - గోష్ఠీ పూర్ణులు (తిరుకోట్టియూర్ నంబి) మంగళాశాసనము చేసిరి. పూర్వాచార్యులలో కొందఱు - శ్రీరంగనాథుడే సాక్షాత్తు రామానుజ స్వామికి - పూర్వోక్త సముద్ధరణ కర్తవ్యమున బద్ధకంకణుని గావించి నట్లును, తదుపరి శ్రీరంగనాథునకు, రామానుజులకును మధ్య - సన్నిహిత సంబంధ మేర్పడె ననియు - కొన్ని వైష్ణవ గ్రంథములలో తెలుపబడినది. శ్రీ యామునాచార్యులవారి చరణోపాంతము జీవించి యుండి, వారి ప్రవచనామృతమును గ్రోలు భాగ్యము రామానుజు

లకు కలుగకున్నను, ఆ స్వామి యాజ్ఞను శిరసావహించిన మహా పూర్ణ, శ్రీశైలపూర్ణ, మాలాధర, వరరంగనాయక ప్రభృతుల ప్రబోధ ప్రభావమువలన, బహుళమత రహస్యములు రామానుజులకు అవగత మయ్యెను. కాంచీపురమున నుండు యాదవప్రకాశునివద్ద రామానుజులు — అద్వైత వేదాంతమును అభ్యసించిరి. సాక్షాత్తు వరదరాజస్వామి - తిరుకచ్చినంబి ముఖమునుండి షడ్వార్థలను రామానుజులకు తెలియజేయుట - ఒక విశేష విషయము. (షడ్వార్థలు స్థూలముగా ఇవి :- (౧) పరతత్త్వము నేనే, (౨) జీవ - ఈశ్వర విభేదము నిత్యము, (3) శరణాగతియే నన్ను పొందించు సుల భోపాయము, (౪) శరణాగతునకు అంతిమస్మృతి అవసరము కాదు, (౫) ప్రపన్నునకు శరీరావసానమున మోక్షప్రాప్తియే, (౬) పెరియ నంబి శ్రీచరణములనే ఆశ్రయింపుము.)

శ్రీ రామానుజుల విషయములో - స్వయముగా ఆచార్య సన్నిధానములయందు గ్రహించిన వేదాంతార్థములకంటెను - విశేష ముగ భగవ దనుగ్రహ ప్రభావము వలన పొందిన ప్రేరణలే కాన వచ్చును.

## శ్రీరామానుజ వాఙ్మయ ప్రభావము

శ్రీసంప్రదాయ సాహితీ వినీలాకాశమున మహోజ్జ్వల కాంతి కిరణము రామానుజ వాఙ్మయము. శ్రీమద్రామానుజులు లోకమునకు అనుగ్రహించిన భక్తి తత్త్వసాహిత్యము - అజరామరమై, ఆచంద్ర తారార్కము విరాజమానము కాగల ఆలోచనామృతము - ఆర్ష భారతికి అక్షర నీరాజనము, ఆస్వాదయోగ్యము.

శ్రీ రామానుజ వాఙ్మయము - నవరత్న సంచయముగ సంశోభించుచున్నది. వానిలో మొదటి రత్నము - వేదార్థ సంగ్రహము. ఇది - తిరుమల శ్రీనివాసభగవానునకు అంకితముగా సమర్పింపబడినది. ఇయ్యది - వేదములయొక్క అర్థవివరణాత్మకమైన ఉపనిషత్సారము. రెండవ రత్నము - శ్రీభాష్యము. శ్రీరామానుజ యతిసార్వభౌములకు జగదాచార్యత్వమును, ఖండాంతర కీర్తి ప్రతిష్ఠలను సముపార్జించిన మహోన్నత గ్రంథరాజము. బ్రహ్మసూత్రములకు బోధాయనమహర్షి రచించిన వృత్తిగ్రంథమును అతి ప్రయాసచే సాధించి, దానిచే లభించిన సమన్వయమును ఈ శ్రీభాష్యమున భగవద్రామానుజులు పొందుపరచియున్నారు. మూడవరత్నము - వేదాంత దీపము. ఇయ్యది- శ్రీభాష్యమునకు సన్నిహితమైన బ్రహ్మసూత్ర వ్యాఖ్యాన సంగ్రహమే. నాల్గవ రత్నము- వేదాంత సారము. ఇదియు - బ్రహ్మసూత్ర వ్యాఖ్యానసార సర్వస్వమే. ఐదవ రత్నము శ్రీ భగవద్గీతాభాష్యము. భక్తి యొక్కటియే ముక్తికి సులభమార్గమనియు, కర్మ - జ్ఞానములు ఈ భక్తిమార్గమునకు అంగభూతములనియు, భగవత్ప్రపన్నులకు మోక్షము కరతలామలక మనియు - ఇందు వివరింపబడినది. ఆఱవ రత్నము - శరణాగతి గద్యము. ఏడవ రత్నము - శ్రీరంగ గద్యము. ఎనిమిదవ రత్నము - వైకుంఠ గద్యము. ఈ గద్యత్రయము - ఒక స్తోత్ర సంచయము. ఇందలి శరణాగతి గద్యము-ప్రపత్తి యనబడు సర్వాత్మ సమర్పణమును శ్రియఃపతి శ్రీచరణ కమలముల ప్రోల చేయు తత్త్వమును ప్రబోధించును. శ్రీరంగ గద్యము - శ్రీరంగమున వేంచేసియున్న శ్రీరంగనాథుని చరణ సన్నిధిలో-శ్రీమద్రామానుజులు ప్రపత్తి చేసి, తమను నిత్య

కింకరులుగ తలంచుకొనుచు, తమను కటాక్షింపవలసిన దని స్వామికి చేసిన విజ్ఞాపన స్తోత్ర మిది. వైకుంఠ గద్యములో ముఖ్యముగ వైకుంఠపుర వర్ణనము కాక, భక్తుడు తనకు భగవంతునకు సమర్పించుకొనినపిమ్మట, శ్రియఃపతి నిత్యనివాసస్థానమైన శ్రీ వైకుంఠమునకు చేరి, భగవత్కటాక్షమును ఆకాంక్షించి చేయు నిత్యకైంకర్య విధానము వివరింపబడినది. ఈ గద్యత్రయము - శ్రీవైష్ణవులకు నిత్యానుసంధానయోగ్యమై నెగడుచున్నది. తొమ్మిదవ రత్నము - నిత్యగ్రంథము. భక్తప్రపన్నజన కూటస్థులకు - తిరువారాధన విధానమును బోధించు గ్రంథ మిది.

## శ్రీ రామానుజ సిద్ధాంత విశేషములు

1. అర్చనావిధానములు అర్చామూర్తి నిబట్టి మార్పుచెందుచుండును. కాగా, శ్రీవిష్ణువును అర్చామూర్తిగా ఆరాధించుటలో - ఆనాడు భిన్న పద్ధతులను అనుసరించుచుండెడివారు. ఇది - సనాతన పాంచరాత్ర అర్చావిధానమునకు విరుద్ధ మగు పద్ధతి యగుటచే, శ్రీ రామానుజులవారు - అర్చావిధానమును సరియైన రీతిలో సంస్కరించిరి. ఈనాటి అర్చావిధానమునకు దిగ్దర్శకులు, మార్గదర్శకులు - భగవద్రామానుజులే. అనేక దేవాలయములను సందర్శించి, ఆయా క్షేత్ర సంప్రదాయములను సవరించియున్నారు.

2. విశిష్టాద్వైత సిద్ధాంతమునకు మకుటాయమానమైన భావన - దాస్యము. ఈ 'దాసోఽహమ్' అనెడి భావన - వ్యక్తిలో

అంతర్గతముగ పొంగిపొరలివచ్చు అహంకారమును అణచివైచి, విధేయతను, వినయశీలతను - పెంపొందించును.

"మమైవాంశో జీవలోకే - జీవభూత స్సనాతనః" – (గీత . 15-7.)

అని కదా భగవానుని ప్రవచనము! మానవుని ఆటవిక ప్రవృత్తి నుండి - మానవ ప్రవృత్తిలోనికి మరల్చిన మతము - రామానుజ మతము. ప్రకృతిలోని సర్వప్రాణులు పరమాత్మ అంశలే కనుక, సర్వప్రాణులయందును సమహిత భావనను, దివ్యత్వ భావనను కలిగియుండుటయు, భగవంతునియందువలె,ఆ భగవానుని యంశలైన సర్వభూతములయందును - దాసభావమును కలిగియుండుట - వ్యక్తిని దివ్యత్వమునకు అనుసంధించెడి పథమగును. ఎదుటి వ్యక్తిని స్వామిగను, తాను దాసునిగను భావించుటవలన, సామాజిక జీవనము అనురాగరంజిత మగును. పరస్పర కలహములు, వైషమ్యములు-నశించును. విశేషించి - ఆత్మ పరిశీలన జరిగి, పరస్పర ప్రేమాదరములు వృద్ధి జెంది, సుఖజీవనమునకు దాసభావము ప్రోది చేయును. ఇరువురు శ్రీవైష్ణవులు కలిసినపుడు - 'అడియేన్' అనియు, 'రామానుజదాసః అనియు, 'దేవరవారి ఆజ్ఞ అనియు, 'సర్వాపరాధినిని' - అనియు, పరస్పరము అభివాదములు చేసికొనుటయు - తెలిసినదేకదా !

"త్వ ద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథః"

అనెడి కులశేఖరాళ్వారుల ముకుందమాలలోని ప్రబోధమే శ్రీ రామానుజ మతమునకు తారకమంత్ర మయ్యెను.

3. శ్రీ రామానుజులవారు అవతరించియుండనియెడల, ఈనాడు హిందూమతముయొక్క ఉనికి - ప్రశ్నార్థకమైయుండెడి దని - కొందరు పెద్దల అభిప్రాయము. బౌద్ధమతము నిరీశ్వరవాదమును ప్రతిపాదించి, జనసామాన్యమున నిలబడియున్న పరిస్థితులలో, ఆదిశంకరాచార్యు లవతరించి, ఆ నిరీశ్వరవాదమును ఖండించి, ఈశ్వరవాదమును, వేదప్రామాణ్యమును - ప్రచారము చేసి, నిర్వీర్య మగుచున్న హిందూమతమునకు మరల జవసత్త్వము లిడియు, నిర్గుణ బ్రహ్మతత్త్వమును, అద్వైత మత సిద్ధాంతమును ప్రతిపాదించి, ప్రచ్ఛన్న బౌద్ధమునకు ప్రోది చేసెను. ఈకారణమున, ఒక విషాద పరిస్థితి యేర్పడగా, అప్పుడు - ఆ తరుణమున శ్రీమద్రామానుజులు అవతరించి, అద్వైత సిద్ధాంతమును ఖండించి, విశిష్టాద్వైత సిద్ధాంతమును రూపొందించి, మానవ భవసాగర తరణమునకు సులభమార్గమును సృజించి. లోకమునకు మేలు చేకూర్చిరి.

4) వేదప్రమాణమును లోకమునందు సముద్ధరించిన రామానుజులు - భగవ దవతారు లనుటలో - లేశమాత్రమేని సంశయము లేదు. సగుణ - నిర్గుణ వాదోపవాద ప్రభంజనమును తట్టుకొని నిలిచిన శ్రీ రామానుజ సిద్ధాంతము — భావ సమైక్యతకు దోహదకారి యయ్యెను.

5. యథార్థమైన మత సహనమునకు, లౌకిక వాదమునకు, సర్వమత సమాదరణభావమునకు - శ్రీ రామానుజులు సర్వదా సంస్మరణీయులు. అసూయా ద్వేషములకు శ్రీ రామానుజ సిద్ధాంతమున తావు లేదు.

6. గాంధీమహాత్ముడు - హరిజనోద్ధరణ మహోద్యమము 20 వ శతాబ్దములో కొనసాగింప, భగవద్రామానుజులు 11 వ శతాబ్దమునందే హరిజన సముద్ధరణము గావించి, 'తిరునారాయణపురము' అనబడు మేల్కోట దివ్యక్షేత్రములో - హరిజనులకు ప్రవేశమును కల్పించుటే గాక, హిందూ మహమ్మదీయుల సఖమ - భావసారూప్యతను సైతము సాధించి, సర్వ మానవ సమత్వమును, సహిష్ణుతను ప్రతిపాదించి, జగద్విఖ్యాతి గాంచియున్నారు.

7. ఆచార్య నిష్ఠ - చరమోపాయ నిష్ఠలకు ప్రత్యేక స్థానమును కల్పించి, గురు — శిష్య సంబంధములకు ఒక మహత్తర ప్రశస్తిని, ఖ్యాపదీప్తిని ప్రసాదించిన జగదాచార్యులు - భగవద్రామానుజులు. ఆచార్య సమాశ్రయణమే చరమోపాయమనియు, సులభ మోక్షోపాయ మనియు, అంతిమ ఉపాయమనియు - శ్రీ రామానుజ మత సిద్ధాంతము.

8. భగవదారాధనలో-లక్ష్మీకారుణ్య విశేషమును, పురుషకారతత్త్వమును ప్రతిపాదించిన శ్రీమద్రామానుజులు - పరోక్షముగ - స్త్రీ తత్త్వమునకు అపారమైన గౌరవ మర్యాదలను చేకూర్చియున్నారు. శ్రీసంప్రదాయ మను పేర విశిష్టాద్వై

తమ విఖ్యాతమైయుండుటకు - భగవద్రామానుజులకు - పిరాట్టియందు గల భక్తివిశేషమే కారణము. కనుకనే శ్రీ రామానుజులు తమ శరణాగతి గద్యలో మొట్టమొదట శ్రీలక్ష్మీదేవిని ప్రస్తుతించియున్నారు.

## ముగింపు

మూఢవిశ్వాసములను తొలగించి, సంకుచిత భావములను పరిహరించి, హిందూమతోద్ధరణము గావించి, దేవాలయములను సర్వజన కల్యాణవేదికలుగా సంభావించి సముద్ధరించి, సంఘసంస్కర్తలుగా, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులుగా, సమసమాజ స్థాపకులుగా, సర్వజనశ్రేయోమార్గ తత్త్వవేత్తలుగా విశ్వవిఖ్యాతి గాంచిన జగదాచార్యు లగు భగవద్రామానుజ ప్రభావము - నిరుపమానము.

"పాషండ సాగర మహాబడబాముఖాగ్నిః
శ్రీరంగరాజ చరణాంబుజ మూలదాసః
శ్రీవిష్ణులోక మణిమండప మార్గదాయీ
రామానుజో విజయతే యతిరాజరాజః."



# యతిరాజ వైభవము

సంస్కృత మూలము

## శ్రీ ఆంధ్రపూర్ణులు (వటుకనంబి)

ఆంధ్ర వ్యాఖ్యానము


## డాక్టర్ : చించాపట్టణం శ్రీరంగాచార్యులు,

ఎం. ఏ. పిహెచ్. డి.




## 1. అంజలి

"ఏతాని తాని భువనత్రయ పావనాని
సంసార రోగ శకలీకరణౌషధాని
జిహ్వాతలే మమ లిఖాని యథా శిలాయాం
రామానుజేతి చతురా ణ్యమృతాక్షరాణి"

## 2. ప్రవేశిక

శ్రీవైకుంఠనాథుడు, పరబ్రహ్మము, పరమాత్ముడు, వాసుదేవుడు, పురుషోత్తముడు నైన శ్రీమన్నారాయణుని నియమనానుసారముగ శ్రీ అనంతాళ్వారులు - లోకోద్ధరణార్థమై భూమండలములో మానవరూపమున అవతరించి, ఇతర మతములను ఖండించి, శ్రీ విశిష్టాద్వైత దర్శన స్థాపనాచార్యులై, జగదాచార్యులై, శ్రీ రామానుజ యతి సార్వభౌములుగ విలసిల్లిరి. వారి ప్రధాన శిష్యులలో - శ్రీ కూరేశ, గోవింద, దాశరథి, కురుకేశాది ముఖ్యులెందరో ప్రసిద్ధి నందినవారు కలరు. అట్టివారిలో - 'వటుకనంబి' అను

నామాంతరము గల 'ఆంధ్ర పూర్ణులు' అనువారు - పేర్కొనదగిన వారు. ఈ మహనీయులు - పరమైకాంతులు. * వీరు ఆచార్యాభిమాననిష్ఠ గలవారై, సర్వదా - శ్రీ రామానుజ యతీంద్రుల నంటి యుండెడివారు. ఈ ఆంధ్రపూర్ణులు - తమకు ఇతర మేదియు తెలియదనియు, శ్రీ రామానుజ సంయమీంద్రుల పాదపద్మములె ప్రాప్య ప్రాపకము లనియు - దృఢముగ విశ్వసించి, వారి శ్రీపాదుకలనే ఆరాధించుచుండి రని తెలియుచున్నది. అదియును గాక, ఆంధ్ర పూర్ణులు - శ్రీరామానుజ యతిచంద్రులకు అత్యంత సమీప వర్తనులై యుండి, పరిపూర్ణ భక్తిప్రపత్తులతో నిత్యకైంకర్య మొనర్చుచు, ప్రతిదినమును - శ్రీ రామానుజ యతిశేఖరు లారగించు నిమిత్తమై, క్షీరమును సంసిద్ధ మొనర్చుచుండెడివారు.[1]

ఆంధ్రపూర్ణులనుగూర్చి - పిన్బళగియ పెరుమాళ్ జీయరు వారు కృపచేసిన 'గురుపరంపరా ప్రభావమ్' అను గ్రంథమునందును,[2] అనంతాచార్యులవారు రచించిన 'ప్రపన్నామృతము'నందును, నంబూరి కేశవాచార్య విరచితమైన 'ఆచార్య సూక్తిముక్తావళి' - అను గ్రంథమునందును - ఉదాహరింపబడియున్నది.[3] ఆంధ్రపూర్ణుల

---

* పరమైకాంతి లక్షణములు - శ్రీరామానుజ కీర్తి కౌముది - రెండవ భాగములో - 75, 76 పుటలలో వివరింపబడియున్నవి.

— సంపాదకుడు.

1. తనియన్ :- రామానుజార్య చరణ ప్రవణం వరదేవతమ్ ।
   వటుకపూర్ణ మహం వన్దే - వరజ్ఞాన పయోనిధిమ్ ॥

2. గురుపరంపరాప్రభావము : 364, 367, 369 పుటలు.

3. ఆచార్య సూక్తిముక్తావళి : ఉత్తర భాగము : పుట సంఖ్య 4.

జన్మస్థానము - మైసూరు దేశమున - సాలగ్రామక్షేత్ర మని,[4] తమ ఆచార్యవర్యులయందు ఆంధ్రపూర్ణులకు భక్త్యతిశయమును తెలియజేయు విచిత్ర సంఘటనలు కొన్ని తెలియవచ్చుచున్నవి.

## 3. ఆచార్యాభిమానము

ఒకనాడు ఆంధ్రపూర్ణులు శ్రీ రామానుజులవెంట పయనమై పోవుచుండ, మార్గమధ్యమున నొక ఏరు దాటవలసివచ్చినది. ఆంధ్రపూర్ణులు కంఠప్రమాణ జలమున ముందునకు సాగిపోవుచు, తమ శిరమునన్న పెరుమాళ్ళ పెట్టెపై-యతీంద్రుల దివ్యపాదుకాద్వయము నుంచి, దరికి జేరిరి. అప్పు డది గాంచిన శ్రీమద్రామానుజులు - 'వటుకా ! ఇదేమి ? ఇట్లొనర్చితివి ?' అని యడుగ, "స్వామీ ! తమ స్వామి - నా తలపై నిలిచియుండ, నా ఇష్టదేవత-ఎచటికేగును ?" - అని, సమాధాన మిచ్చిరి. అది తమ శిష్యుని ప్రధాన కర్తవ్య మని యెంచి, మందస్మితముఖారవిందులై శ్రీభాష్యకారులు - ముందునకు సాగిపోయిరి.

మఱియొకరోజున - శ్రీమద్రామానుజులు - దయతో తమ తళిగప్రసాదమును ఆంధ్రపూర్ణుల కొసంగ, రెండు చేతులతో స్వీకరించి, పరిపూర్ణ భక్తితో ఆరగించి, చేతులను తమ తలకు తుడిచికొనిరి. శ్రీభాష్యకారు లది గాంచి, చేతులు కడిగికొమ్మని ఆజ్ఞా

---

4. శ్రీ రామానుజ కీర్తి కౌముది - 7వ భాగము - పుట సంఖ్య 10. అనంతాచార్యులు - ఆంధ్రపూర్ణుల వంశీయులు : శ్రీ రామానుజ కీర్తి కౌముది - 6 భా. 180 పుట.

పింప, అట్లే కడిగికొనిరి. మరునాడు పెరుమాళ్ళ కోవెల కరిగినపుడు - శ్రీ రామానుజులు భగవత్ప్రసాద మొసగిరి. ఆంధ్రపూర్ణు లద్దానిని భుజించి, చేతులు కడిగికొనగ జూచి, శ్రీరామానుజులు - 'వటుకా! ఏ మిది !' - అని యడుగ, 'మీ ఆజ్ఞ' అను సమాధానమును విని, ఆంధ్రపూర్ణుల గురునిష్ఠకు మిక్కిలి సంతసించిరి.

ఇంకొక రోజున - పెరుమాళ్ళ తిరువీథిఉత్సవము నేత్రపర్వముగ నిర్వహింపబడుచుండ, శ్రీమద్రామానుజు లది గాంచి, సేవకై రమ్మని ఆంధ్రపూర్ణులను బిలిచిరి. అపుడు ఆంధ్రపూర్ణు లేతెంచి, 'మీ స్వామిని సేవింప నేగినచో, నాస్వామికై కాచు పాలు - పొంగి పోవా స్వామీ !' అని పలుక, విని - శ్రీభాష్యకారులు తమ దివ్య శిష్యుని గురుభక్తిపరాయణత కెంతయు ఆశ్చర్య మందిరి.

తమ అవసాన సమయమున శ్రీమద్రామానుజులు - ఎంబారు తొడపై శిరము నుంచి, ఆంధ్రపూర్ణుల ఒడిలో పాదపద్మములను చాపి శయనించి రని తెలియుచున్నది. అంతటి గురుశుశ్రూషాపరాయణులైన మహోదయులు - ఆంధ్రపూర్ణులు. వారు - శ్రీ రామానుజుల మహా మహిమాన్వితమైన జీవిత వైభవాతిశయమును కీర్తించుచు, సంస్కృతమున 114 శ్లోకములలో - 'యతిరాజ వైభవము' - అను గ్రంథమును రచించియున్నారు. కవితాచమత్కృతి కిందు తావులేకున్నను - భగవద్రామానుజుల జీవిత చరిత్ర నుగ్గడించు ప్రామాణిక గ్రంథరాజములలో నొక్కటిగ నిది ఎన్నదగియున్నది.

"శ్రీరామానుజ యోగీంద్ర శిరకైంకర్య శాలినే
నమ స్స్వాంధ్ర పూర్ణాయ మహనీయ గుణాయ చ."

ఆదరణీయ - మహోన్నత గుణయుతు లగు శ్రీ రామానుజ యోగీంద్రులకు క్షీర కైంకర్యశాలినులైన ఆంధ్రపూర్ణ లగు మీ కిదే నమస్కారము.

## 4. యతిరాజ వైభవ వివరణము

1. శ్రీమద్యామున దేశికాదధిగత శ్రుత్యన్త యుగ్మాశయః
తత్సన్దేశ చికీర్షయా నియతధీః శ్రీశైల పూర్ణో గురుః
అన్విష్యన్ అనుజాద్వయో ర్జితవరౌ శ్రీవేంకటాద్రౌ హరేః
తీర్థం పుష్ప మపీతరా ణ్యుపహర న్నాస్తేస్మ సద్వృద్ధయే ॥

శ్రీ యామునమునుల ప్రబోధమువలన - ఉభయ వేదాంత విశేషార్థములను గ్రహించినవారును, వారి ఆదేశమును పరిపాలింపవలయు ననెడి కోరికయందు నియమబుద్ధి గలవారును, తమ సోదరీమణుల పాణిగ్రహణ విషయమున - యోగ్యులైన వరులనుగూర్చి అన్వేషించుచున్నవారును నైన శ్రీశైలపూర్ణులు - శ్రీనివాసుని నిత్య నిరవద్యమైన శోభ నుద్దీపింపజేయు తీర్థకైంకర్యమును, పుష్పకైంకర్యమును, తదితరములైన నిత్యకైంకర్యము లొనర్చుచు, శ్రీ వేంకటాద్రిపై నివసించుచుండిరి.

2. తత్రాన్తరే మధుర మంగల భూతపూర్యో
ర్నిత్యస్థితి శ్రుతి తదంగవిదౌ కులీనౌ ।
ద్వావప్యురుజ్ఞయన కేశవ సోమయాజి
నామాన్వితావభజతాం పరిణేతుకామౌ ॥

ఈ మధ్యకాలమున - 'మధుర మంగలము' అను గ్రామమును, 'భూతపురి' అను నామాంతరము గల 'శ్రీ పెరుంబూదూరు' అను

గ్రామమును స్థిర నివాసముగ నేర్పరచుకొనియున్నవారును, సద్వంశ సంజాతులును, వేద వేదాంగవిదులును, 'కమల నయనుడు', 'కేశవ సోమయాజి' అను నామములు గల యువకు లిరువురు - శ్రీశైల పూర్ణుల [౬] సోదరీమణుల పాణిగ్రహణ మొనర్చుట కేతెంచిరి.

౩. శ్రీశైల పూర్ణ స్స సమీక్ష్య వరౌ
వరౌ వినిశ్చిత్య చ తౌ ప్రహృష్టః
త ప్తార్దిత శ్శంఖ రథాంగచిహ్న
మంత్రప్రదోఽభూ న్నతయో స్తయో శ్చ ॥

శ్రీశైలపూర్ణులు ఆ యంశమును సమీక్షించి, మిగుల సంత సముతో - వారు తగిన వరులను నిశ్చయించిరి. వారి ప్రార్థన ననుస రించి - తప్తములైన శంఖచక్ర ముద్రలతో సంస్కార సంపన్నుల గావించి,వినయ వినమ్రములతో ప్రణమిల్లిన వారలకు మంత్రోపదేశ మొనర్చిరి. (శ్రీశైలపూర్ణులు వా రిరువురిని - పంచసంస్కార సంపన్నుల గావించి రని తాత్పర్యము.)

౪ తా మగ్రహీదగ్రజ భూమిదేవీం
హృష్టన్మనాః కేశవసోమయాజీ
తాం చానుజాతాం కమలాక్షభట్టో
శ్రీదేవికాం తౌ చ తుతోషపూర్ణః ॥

---

౬. శ్రీమద్రామానుజుల మేనమామగారు - తిరుమల వంశమునకు మూలపురు షులు. తిరుపతి - జన్మస్థానము శ్రీ వేంకటేశ్వర వరప్రసాదమున జన్మించిరి. యామునాచార్యులవారి శిష్యులు, 'తిరుమల నంబి' అని - నామాంతరము కలదు

సంప్రీత మనస్కులైన కేశవసోమయాజి – సోదరీమణులలో అగ్రజ యైన భూదేవిని కేశవసోమయాజియు, కమలనయనభట్టు – అనుజ యైన శ్రీదేవిని – వివాహ మాడిరి. శ్రీశైలపూర్ణులు వారిని గని – సంతుష్టులైరి.

5. తత స్స భార్యో త దనుజ్ఞయా తౌ
స్వం వా సమాగమ్య చిరం సుశీలౌ ।
శ్రీశం సమారాధ్య తదీయ భక్తౌ
సహప్రియాభ్యాం ముదితౌ త దాస్తామ్ ॥

అప్పుడా వారు లిర్వురు శ్రీశైలపూర్ణుల అనుమతితో, తమ భార్య లను వెంట నిడుకొని, స్వస్థలముల కేగెంచిరి. చక్కని శీలసంపదగలిగి, శ్రియఃపతిని బాగుగ ఆరాధించుచు – భగవద్భక్తులయెడ మిగుల భక్తికలిగి వర్తించుచు, చిరకాలము తమ ప్రియభార్యలతో ఆనం దించిరి.

6. తతో జగ న్మంగళ పింగలాబ్దే
చైత్రాఖ్య శుక్ల చ్ఛద పంచమీకే
ఆర్ద్రాభిదర్క్షేణ యుతే చ వారే
బృహస్పతే స్స న్మృగరాజలగ్నే ॥

7 వేదాన్త సిద్ధాన్త సమర్థనాయ
బాహ్యాంతర ధ్వాంత మహాపనుత్త్యై
శేషాంశకః కేశవయజ్వదేవ్యాం
తేజోనిధిః కశ్చిది హావ రాసీత్ ॥

పిమ్మట, జగన్మంగళకరమైన శ్రీ పింగళ నామసంవత్సర – చైత్ర శుక్ల పంచమీ బృహస్పతివారమున, ఆర్ద్రానక్షత్రయుక్త సింహ

లగ్నమున - జైన బౌద్ధాది వేదబాహ్య మతములను, శంకర - భాస్క రాది అంతర మతములను ఖండించి, శ్రీ విశిష్టాద్వైత వేదాంత సిద్ధాంత స్థాపనమునకుగాను - ఆదిశేషుని అంశమున, కేశవయజ్వ పత్నిగర్భమున, తేజోనిధియైన మహామహుఁ డుద్భవించెను. (ఈ పింగల నామసంవత్సరము - క్రీ : శ 1017 - సరియైనది.)

8. శ్రీశైలపూర్ణో ప్యథ భూతపుర్యా
మాగమ్య వీక్ష్యాద్భుత భాగినేయమ్ ।
చకార రక్షార్థ రథాంగ శంఖ
చిహ్నం చ రామానుజ నామకం చ ॥

అంత శ్రీశైలపూర్ణులు - హర్షాతిరేకముతో భూతపురి కేతెంచి, అపూర్వ తేజోరాశియైన తమ మేనల్లుని గాంచిరి. రక్షార్థమై, శిశు భుజములపై - శంఖచక్ర చిహ్నము లుంచి, 'రామానుజ' అని - నామమిడిరి.

9. తతోఽభివృద్ధిస్య చ తత్కటాక్షైః
పితాపి తస్యాత్మభువోఽబ్దపూర్తిమ్ ।
చౌలం తథాఽన్నాశనమక్షరాణాం
చకార సత్సోత్తర పంచమాబ్దే ॥

శ్రీశైలపూర్ణుల దయార్ద్ర దృక్కులతో - దినదిన ప్రవర్ధమానుడైన తన తనయునకు తండ్రి (కేశవయజ్వ) - ప్రథమ జన్మదిన మహోత్సవము నాచరించి, పిమ్మట - చౌలము, అన్నప్రాశనము నొన రించి, సత్త్వగుణప్రధానుడై ఒప్పారుచున్న అతనికి - అయిదవ యేట - అక్షరాభ్యాసమును జరిపించెను.

10. కృతోపనీతస్తు తత స్వపిత్రా -
సమభ్యసన్ వేద తదంగ శాస్త్రమ్ ।
రామానుజార్యోఽభవ దగ్ర్యతేజా
మహద్భి రానందిత సత్యశీలః ॥

తండ్రిచేత ఉపనీతుడైన రామానుజార్యుడు వేద వేదాంగాది శాస్త్రాధ్యయన సంపన్నుడై ప్రకాశించుచుండ, మహాత్ము లాయన ధార్మిక ప్రవర్తన నెంతయు ప్రశంసించుచుండిరి.

11. తత స్తు కాంచిత్ పరిణీయ కన్యాం
గృహస్థ ధర్మస్థితి రాపకాంచ్యామ్ ।
స్వపూర్వ పక్షా భ్యసనాయ మాయి
సన్యాసినం యాదవ సత్ప్రకాశమ్ ॥

అప్పు డొక కన్యకామణిని వివాహ మాడి, ఆయన - గృహస్థాశ్రమ ధర్మమును పాటించెను. పిమ్మట రామానుజార్యుడు - స్వపూర్వ పక్షాభ్యసనమునకై (స్వదర్శన పూర్వ పక్షాభ్యసనమునకై) కాంచీ పట్టణములోని 'యాదవప్రకాశు' డను అద్వైత సంన్యాసి కడ కరిగెను.

12. తతః కదాచిద్గురి 'యాదవేన' -
'సర్వం ఖలు శ్రుత్యవిశారదేన ।
అపార్థ ఉక్తే స మహార్థ ముక్త్వా
రామానుజోఽవర్ధయ దర్థసారమ్ ॥

ఒకరోజున యాదవప్రకాశుడు - 'సర్వం ఖ ల్విదం బ్రహ్మ' - అను ఛాందోగ్యోపనిష ద్వాక్యమును ప్రక్రమముగ అర్థముచేసికొననందున, విపరీతార్థమును కల్పించి చెప్పగ, రామానుజు డద్దానికి - సముచి

తార్థమును ప్రకటించుటే గాక, అందలి యంతరార్థమును సహితము విశదీకరించెను.

13. శ్రీరంగవాసీ స తు యామునార్యో
నిశమ్య రామానుజదర్శనార్థమ్ ।
ఆగమ్య కాంచ్యాం వరదం మహాత్మా
దేవ్యాయుతం ప్రాణ మదంతరంగే ॥

ఆ కాలమున శ్రీరంగక్షేత్రములో నివసించియున్న శ్రీ యామునాచార్య లను మహాప్రాజ్ఞులు - రామానుజార్యునిచేత వివరింపబడిన ఉపనిషద్వాక్య సముచితార్థమును విని, కాంచీపురమునకు వచ్చి, దేవీయుతుడై విలసిల్లియున్న శ్రీ వరదరాజస్వామికి తమ అంతరంగముననే ప్రణామాంజలిని సమర్పించిరి.

14. తత స్స శిష్యావృత యాదవం తం
రామానుజం మధ్యగతం చ శాన్తమ్ ।
సమీక్ష్య రామానుజ శిష్య ఏవ
చేద్యాదనో యుక్త మితీవ దధ్యౌ ॥

అంత యామునమునులు - శిష్యజనపరివృతుడై యున్న యాదవప్రకాశుని, వారి నడుమ అమిత తేజస్కుడై యున్న రామానుజార్యు లను గాంచి, యాదవ ప్రకాశుడు రామానుజుల శిష్యుడై యుండిన, సముచితముగా నుండెడి దని తలంచిరి.

15. శ్రీవైష్ణవర్ధ్యర్థ మతీవ భక్త్యా
స్వస్య ప్రపేదేతి స యామునార్యః ।
శాన్తం మహాదేవికయా శరణ్యం
శ్రీదేవరాజం శరణం ప్రపద్యే ॥

మహాదేవితో ప్రకాశించువాడును, నిఖిలలోకైక శరణ్యుడు నైన శ్రీ వరదరాజస్వామిని శ్రీవైష్ణవుల అభివృద్ధికై యామునాచార్యులు ప్రార్థించుచు - 'ప్రసన్నుడవు కమ్ము' - అని అత్యంత భక్తితో శరణువేడిరి.

16. సంభాషితశ్చే దిహ పాత భంగ
ప్స్వౌచిత్య సంభాష్య స యామునార్యః
శ్రీరంగ మేవాప స శిష్యవర్గో
రామానుజార్య శ్చ పపాఠ పశ్చాత్ ॥

సంభాషించుటకు పూనుకొనినచో - రామానుజాచార్యులకు పాఠ భంగ మేర్పడునని తలంచి, యామునాచార్యులు సంభాషింపకయే తమ శిష్యవర్గమునుకూడ శ్రీరంగమునకు తిరిగివచ్చిరి. రామానుజాచార్యుల అధ్యయనము - నిరాటంకముగ కొనసాగెను.

17. తద్దేశ భూపస్య సుతే పిశాచ
గ్రస్తేఽన్య మంత్రై రఖిలై రసాధ్యే ।
భూపస్తదా యాదవ మంత్రమోచ్య
ఇత్యేవ మాకర్ణ్య తమానినాయ ॥

ఆ దేశభూపతి సుత - పిశాచగ్రస్తయై, ఇతర మంత్రము లన్నిటిచేత విడిపింప నసాధ్యమైయుండ, యాదవప్రకాశుని మంత్రమువలన విడిపింప సాధ్యమగు నని, రాజు ఆతనిని రప్పించెను.

18. దృష్టాన్తరంగాన్నృద యాదవం తం
స్మృత్వా పిశాచః పరిభావ్య భూరిః
రామానుజార్యం శరణం ప్రపద్య
రజాత్మజం స్వం చ జహౌ సహోమమ్ ॥

శిష్యగణపరివృతుడైయున్న ఆ యాదవప్రకాశుని గని, పిశాచము అపహాస్యమొనర్చి, మిగుల అవమానించి దూషించెను. పిదప రామానుజాచార్యుని శరణు పొంది, రాజాత్మజను వదలి, తాను స్వయముగ తన పాపమునుండి విముక్తి నొందెను.

19. త ద్వృత్త మత్యద్భుత మైక్ష్య భూపో
రామానుజార్యే కృత సంమతిం సః
తేనార్పితై స్తద్గురు యాదవాయ
సమ్మాన మత్యన్త వినీతిపూర్వమ్ ॥

అత్యద్భుతమైన ఆ సంఘటనమును గని, రాజు సంతసమున రామానుజార్యుని పారితోషపూర్వకముగ సన్మానించెను. రాజు తనకు బహూకరించిన పారితోషికములను రామానుజాచార్యులు - అత్యంత వినయపూర్వకముగ - తన గురువైన యాదవప్రకాశునకే అర్పించెను.

20. గత్వా స కాంచీ మథ యాదవోఽపి
రామానుజే ప్రీత ఇవా స్తదేర్ష్యః ।
తదాది తన్మానస శోధనేచ్ఛుః
వేదాన్త వాక్యార్థ విచారకోఽభూత్ ॥

పిదప యాదవప్రకాశుడు - కాంచీపురికి వెళ్ళి, బాహిరముగ రామానుజార్యునియందు ప్రీతి గనబరచుచున్నను, అంతరంగమున ఈర్ష్య వహించియుండెను. నాటినుండి రామానుజార్యుని మనస్సును పరిశీలింప వలయు ననెడి దృష్టితో - వేదాంత వాక్యార్థ చర్చకు పూనుకొనెను.

21. కప్యాస శబ్దస్య వద త్యపార్థం
తస్మిం స్తదభ్యంగకృతః కదాచిత్ ।
రామానుజస్యాశ్రు తదూరుదాహి
దృష్ట్వాశు సోఽప్యున్ముఖసంభ్రమోఽభూత్ ॥

ఒకప్పుడు యాదవప్రకాశుడు - ఛాందోగ్యోపనిషత్తులోని 'కప్యాసం పుండరీకమేవ మక్షిణీ' - అను పదమునకు అపార్థమును వర్ణించి చెప్పుచుండ, గురువు శరీరమునకు తైలాభ్యంగన మొనర్చుచు - వినుచున్న రామానుజుని మనస్సు - చివుక్కున బాధ నొంది, అశ్రుబిందువులు జార, గురువుతొడపై బడి, కందింపజేసెను. దీనిని గని సంభ్రమచిత్తుడైన యాదవప్రకాశుడు - ముఖమును పైకెత్తెను.

22. ఇదం కి మిత్యుక్తవతేఽథ తస్మై
కప్యాస వాక్యస్య యథార్థ ముక్త్వా ।
జైమిన్యుపాఖ్యాన మపి బ్రువన్తం
రామానుజం నాత్ర తరే త్యవోచత్ ॥

'ఇదేమి ?' - అని గురువు ప్రశ్నింప, రామానుజాచార్యుడు కప్యాస వాక్యమునకు గల సముచితార్థము తెలిపి, జైమినిఉపాఖ్యానమును కూడ విశదీకరించి చెప్పెను. అప్పుడు యాదవప్రకాశకుడు - తన వద్ద చదువవలదని రామానుజునితో పలికెను.

23. తత స్సమాలోచ్య సహాన్తరంగైః
ప్రలోభ్య రామానుజమ ప్యుపాయైః ।
సజాహ్నవీ స్నాననిమిత్తయాత్రా
వ్యాజేన హన్తుం కుమతిః ప్రతస్థే ॥

తరువాత, తన కాత్మీయులైన శిష్యులతో సమాలోచన మొనర్చి, కపటోపాయములతో రామానుజార్యుని ప్రలోభపరచి, దుష్టచిత్తుడైన యాదవప్రకాశుడు - పవిత్ర గంగాస్నాన నిమిత్త యాత్రా వ్యాజమున,రామానుజార్యుని అంత మొందించుటకు పయనమైపోయిరి.

24 గోవిందభట్టశ్చ సుత స్స్వమాతృ
ష్వసుస్సుశీల స్సహపారమిత్రమ్ ।
మధ్యేవనం ప్రోచ్య స దుష్టచిన్తాం
రామానుజాయ స్వయ మన్వగా త్తాన్ ॥

తన పినతల్లి కుమారుడు, సహాధ్యాయుడునైన గోవిందభట్టు[6] - మహారణ్యమధ్యమున పయనించుచుండ, యాదవప్రకాశుని దురా లోచననుగూర్చి రామానుజార్యునకు తెలియజెప్పి, తాను వారి ననుస రించివెళ్ళెను.

25. మహాటవీమధ్యగత స్స రాత్రౌ
రామానుజోఽచిన్తయ దార్తచేతాః ।
దేవ్యా మహత్యా సహ శాసకానం
దీనావన స్తం వరదం శరణ్యమ్ ॥

రాత్రిసమయమున — మహాటవీమధ్యములో - ఒంటరిగ నున్న రామానుజార్యుడు - బాధ నొందిన మనస్సుకలవాడై, ప్రణతార్తి

6. రామానుజుల పినతల్లిగారి కుమారులు. వీరికి - గోవింద మిత్రు లనియు నామాంతరము కలదు. రామానుజులు వారికి సన్యాసాశ్రమమును ప్రసా దించి, 'ఎంబార్' అను నామ మొసంచిరి.

హారుడు, సర్వరక్షకుడు, సర్వశరణ్యుడు, మహాదేవితో నిరంతరము విరాజిల్లువాడైన వరదరాజస్వామిని శరణువేడి ప్రార్థించెను.

26 కిరాత రూప వరదోఽథదేవ్యా
గచ్ఛేమ రామానుజ సాధు కాంచీమ్ ।
ఇత్యగ్రగామీ ప్రియయా స పీత్వా
తద్దత్త కూపోదక మన్త రాసీత్ ॥

అప్పుడు - పెరుందేవీతాయారును, వరదరాజస్వామియు - కిరాత దంపతుల రూపమున కనుపించి, 'రామానుజా ! మంచిది. మేమును కాంచీపురమునకు పోవుచున్నాము. పోవుదము రమ్ము' - అని మార్గమును నిర్దేశించుచు – ముందు నడచిరి. కొంతదూర మేగినపిదప, భిల్ల దంపతులు దప్పికతీర్చుకొనుటకై రామానుజార్యుడు తెచ్చి యిచ్చిన బావినీటిని త్రావి, అదృశ్యులైరి.

27 దృష్ట్వా ప్రభాతేఽథ స పుణ్యకోటి
విమాన మత్యన్త సమీపవృత్తి ।
పీతోదకం తం వరదం విచిన్త్య
రామానుజార్యోఽప్యతి విస్మితోఽభూత్ ॥

అంత ప్రాతఃకాలమున - తన కత్యంత సమీపమున - పుణ్యకోటీ విమానమును [7] గాంచి, తాను తెచ్చిన బావినీటిని త్రావినది వరద రాజస్వామియే యని తలంచి, రామానుజార్యుడు ఆశ్చర్య మందెను.

7. కంచి వరదరాజస్వామివారి ఆలయ విమానము.

28. సన్ధ్యా ముపాస్యాన్తిక స త్తటాకే
సంసేవ్య దేవీం వరదం చ హృష్టః ।
నిత్యం తదంగీకృత మూపతీర్థై
రామానుజార్య స్త మతోషయచ్ఛ ॥

సమీపమున నున్న - స్వచ్ఛమైన జలము గల తటాకమున సంధ్య వార్చుకొని, దేవీసమేతుడైన వరదరాజస్వామిని సేవించి, రామానుజార్యుడు పరమానంద మందెను. నాటినుండి - ప్రతిదినమును — ఆ దేవాదిదేవు డంగీకరించిన జలమునే తెచ్చి సమర్పించి, స్వామిని సంతోషింపజేయుచుండెను.

29. గంగాతటా ద్యాదవమంత్రవశ్యో
గోవిందభట్టః స్వ కరస్థ లింగః ।
స్వగ్రామ మాగమ్య చ కాలహస్తి
మ్యవా స్త తస్థానవిదార కస్సన్ ॥

యాదవ ప్రకాశుని కుట్రకు లోనైన గోవిందభట్టు-చేత శివలింగమును వహించి, గంగాతటమునుండి నేరుగ తన గ్రామమునకు వచ్చి, అట నుండి కాలహస్తికి చేరి, ఆ స్థానమునుగూర్చి ఆలోచించుచుండెను.

30. కాంచ్యా మథాగమ్య స యాదవోఽపి
రామానుజం వీక్ష్య తదాగమం చ ।
శ్రుత్వా త మాహూయ విలోభయాన
స్తత స్స్వశిష్యే స్సమపాదయచ్ఛ ॥

కంచికి తిరిగివచ్చి రామానుజుని యాదవప్రకాశుడు చూచి, అతడు తిరిగివచ్చిన విషయమును తెలిసికొనెను. అతని ఆలోచనామార్గ

మును తప్పించుటకుగాను - అతనిని రావించి, ఇతర శిష్యులతో పాటు అధ్యాపన మొనర్చుచుండెను.

31. విరుద్ధ మర్థం తు కదాచి దుక్తం
'స దేవ సోమ్యేద' మితి శ్రుతేస్స ।
ఆశిక్షయ త్సంగత మర్థ ముక్త్వా
రామానుజార్యోఽథ త మత్యజత్ సః ॥

యాదవ ప్రకాశుడు - 'సదేవసౌమ్యే ఇద మగ్ర ఆసీత్' - అను ఛాందోగ్యోపనిషద్వాక్యమునకు - వ్యతిరేకార్థమును చెప్పినపుడు - రామానుజాచార్యులు దానికి సముచితార్థమును వివరించెను. అనంతరము యాదవప్రకాశుడు - రామానుజార్యుని బహిష్కరించెను.

32. త్యక్త స్తదా యాదవమర్కటేన
రామానురాఖ్యో మణి రద్భుతశ్రీః ।
హృద్యః కరీన్ద్రస్య హరే రభూది
త్యాకర్ణ్య హృష్ట స్స చ యాము నార్యః ॥

యాదవ ప్రకాశు డను మర్కటమువలన, రామానుజు డను పేరు గల అత్యద్భుత ప్రభాసంపత్తి గల మణి - వదలివేయబడినదని, అట్టి మణియైన రామానుజార్యుడు - కరిగిరి వరదునకు మిక్కిలి ప్రియమైనవాడయ్యెనని యామునాచార్యులు విని, ఎంతయు సంతసించిరి.

33. రామానుజార్య నయనాయ సోఽపి
శిష్యం మహాపూర్ణ మథాదిదేశ ।
గత్వాఽథ కాంచీం స చ తోషయిత్వా
తం స్తోత్రరత్నేన తుతోష భూయః ॥

అంత యామునాచార్యులు - తమ శిష్యుడైన మహాపూర్ణులను,[8] రామానుజార్యుని - తమవద్దకు తీసికొనివచ్చుటకై ఆదేశించిరి. మహాపూర్ణులు కంచికి బోయి, యామునులు రచించిన 'స్తోత్రరత్న'శ్లోకములచే రామానుజాచార్యులను సంతసింపజేసి, తామును - మిక్కిలి సంతసించిరి.

34 రామానుజార్యోఽపి స యామునార్యం
సంసేవితుం రంగపురీం గమిష్యన్ ।
ప్రాజ్యం మహాపూర్ణయుతః కవేర
కన్యా తటే సూరిగణం దదర్శ ॥

యామునమునులను సంసేవించుటకు మహాపూర్ణులవెంట- శ్రీరంగమునకు వెడలుచున్న రామానుజార్యులు - కావేరీనదీతీరమున గుమిగూడిన పండితబృందమును దర్శించిరి.

35. రంగేశముఖ్యా అపి సూరయస్తే
దృష్ట్వా మహాపూర్ణయుతాయ తస్మై ।
రామానుజార్యాయ నివేద్య కాంతాః
శ్రీయామునార్యాంగులి ముద్రకారిశ్చ ॥

'తిరువరంగ ప్పెరుమాళ్ అరైయార్'[9] మొదలగు పండితప్రకాండులు మహాపూర్ణయుతులైన రామానుజార్యులను చూచి, యామునా

8. శ్రీ పరాంకుశ దాసులు - పూర్ణార్యులు' - అని వీరికి నామాంతరములు. వీరి జన్మస్థానము - శ్రీరంగము. యామునమునుల శిష్యులు. శ్రీమద్రామానుజులకు పంచసంస్కారాదులనుచేసినవారు. వీరిని - 'పెరియనంబి' యని - వ్యవహరింతురు.

9. తిరువరంగప్పెరుమాళ్ అరైయార్ - అనియు వీరికి పేరు. వీరు - యామునాచార్యులవారి శిష్యులు.

చార్యులు పరమపదించి రను సమాచారమును నివేదించి, ముడుచు కొనియున్న యామునాచార్యుని వ్రేళ్ళను వారికి చూపి, ప్రశాంత చిత్తులైరి.

36. తద్వ్యాససూత్రం వివరీవరిష్యే
తత్రాతనామాపి శఠారి నామ ।
యుక్తం విధాస్యా మ్యుభయో రితీవ
రామానుజోఽవందత తత్పదాబ్జే ॥

వ్యాసభగవానుని బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానమును రచించి, విరివిగా వ్యాప్తిచేసెదను. సమర్థులు, సర్వసద్గుణ సంపన్నులునైన శ్రీవైష్ణవకుమారులకు - వ్యాస పరాశరనామములను, శఠకోపుని నామమును - ఉంచగలను' - అని రామానుజార్యులు యామునుల పాదపద్మములకు ప్రణమిల్లిరి.

37. క్షణేన తస్యాంగులయశ్చ త్రిస్రః
పురేవ భూతా స్తదవేక్ష్య సర్వే ।
సిద్ధాంత నిర్ధారణ సార్వభౌమః
స్సత్యం భవిష్యత్యయమి త్యవోచత్ ॥

క్షణములో యామునముని మూడు వ్రేళ్ళును - పూర్వమువలె చక్క నయ్యెను. అచ్చట - వా రది గమనించి, 'ఈ మహాపురుషుడు - శ్రీవైష్ణవ సిద్ధాంత నిర్ధారణ సార్వభౌముడై భాసిల్లు' నని పలికిరి.

38. త్వర న్నసంసేవ్య స రంగనాథ
మాగమ్య కాంచీం వరదం ప్రణమ్య ।
తీర్థాదికైంకర్యకరః కదాచిత్
కిం వాద్య కర్తవ్య మితీవ దధ్యౌ ॥

శ్రీరంగమున శ్రీరంగనాథస్వామిని సేవింపకయే - రామానుజార్యులు శీఘ్రముగ కంచికి తిరిగివచ్చి, శ్రీ వరదరాజస్వామికి ప్రణమిల్లిరి. తీర్థాది కైంకర్యమున - శ్రీ వరదరాజస్వామికి నిత్యసేవలొనర్చుచు - ఒకరోజున - తమ భవిష్య త్కార్యక్రమమునుగూర్చి ఆలోచించిరి.

39. తత్రత్య పూర్ణం వరదాంతరంగం
వర్ణాశ్రమాచార విధాయకం తమ్ ।
సంప్రార్థయ చ్చిత్తగతం మహార్థం
జ్ఞాత్వా కరీశా ద్వరదేశికేతి ॥

వర్ణాశ్రమాచార విధాయకులును, శ్రీ వరదరాజస్వామినిత్యకైంకర్య నిరతులును - కాంచీపురవాసులునైన 'తిరుకచ్చినంబి' యను నామాంతరముగల కాంచీపూర్ణులను [10] సమీపించి రామానుజాచార్యులు - ఆచార్యవర్యా! నేను మనసున తలచుకొనిన అంశములకు సరియైన సమాధానములను కరిగిరి వరదు నడిగి తెలిసికొని, దయతో నాకు తెలియజేయుడి' – అని ప్రార్థించిరి.

40 శ్రీమాన్ పరం తత్త్వ మహం మతం మే
భేదః ప్రవృత్తి ర్నిరపాయహేతుః ।
నావశ్యకే చ స్మృతి ర న్త్యకాలే
మోక్షో మహాపూర్ణ ఇహార్యవర్యః ॥

---

10. వీరి జన్మస్థానము – పూనమల్లి . నివాసము - కాంచీపురము. కంచి వరదరాజస్వామికి ఆజన్మాంతము – సేవగావించినవారు. ఆ స్వామి అంతరంగ భక్తులుగా ప్రసిద్ధిగాంచినవారు. పరమభాగవతోత్తములు.

శ్రీసమేతుడనైన నేనే పరతత్త్వము. నాకును - జీవాత్మకును భేద మున్నది. మోక్షసాధనకు శరణాగతియే సులభమైన మార్గము. మోక్షప్రాప్తికి అంతిమస్మృతి అనావశ్యకము. దేహావసానమున మాత్రమే మోక్షప్రాప్తి. మహాత్ములగు మహాపూర్ణులే ఆచార్యులు.

41. ఇత్యర్థషట్కం వరదోపదిష్టం
రామానుజార్యాయ స చాథ పూర్ణం ।
రహస్యవాదీ త్స రహస్యవాదీ
తస్మాద్ధి రామానుజ మాన్యనామా ॥

ఈవిధముగా శ్రీ వరదరాజస్వామిద్వారా ప్రబోధింపబడిన ఆఱు అర్థములను రహస్యవాదియైన కాంచీపూర్ణులు రామానుజాచార్యులకు తెలియజెప్పిరి. అందువలన, (రహస్యవాదియైన) ఆయన నామము - రామానుజార్యులకు మిక్కిలి గౌరవప్రద మయ్యెను.

42. రామానుజార్యోఽపి పురం గమిష్యన్
రంగం తత శ్రీ మధురాంతకస్థమ్ ।
శ్రీ భూమి నీలాదియుతం తటాక
పాలం నిషేవే రఘునందనం తమ్ ॥

అంుపిమ్మట రామానుజార్యులు - శ్రీరంగమునకు వెళ్ళుచు, మార్గ మధ్యమున - మధురాంతకమున నున్న శ్రీభూనీళాసమేతుడగు వానిని, అచ్చటి తటాకపాలకుడైనవానిని రఘునందనుని సేవించిరి.

43. సతీర్థ్య సందేశత ఆసతస్తం
దిష్ట్యా మహాపూర్ణ ముదీక్ష్య తత్రి ।
తత్పాదపద్మే ప్రణిపత్య హర్షా
ద్రామానుజార్య స్స చ బాష్పపూర్ణః ॥

సహచారు లగు శ్రీవైష్ణవుల సందేశము ననుసరించి విచ్చేయుచున్న మహాపూర్ణుల నచట అదృష్టవశమున చూచి, సంతసమున రామానుజార్యు లాయన పాదపద్మములకు సాష్టాంగముగ ప్రణమిల్లిరి. మహాపూర్ణులును - ఆనంద బాష్పలోచనులైరి.

44. పరస్పరాదేశవిచారహర్షాత్
తత్సంనిధౌ శ్రీ వకుల ద్రుమస్య ।
ఛాయాయుతం తత్పరమం పదం చ
ధ్యాత్వా మహాపూర్ణగురుం స భేజే ॥

ఒకరి నొకరు తా మాచరింపబోవు కర్తవ్యమునుగూర్చి తెలిసికొని హర్షమంది, చక్కని నీడతోఁగూడిన పొగడ్రమానుచేరువ ప్రదేశమును పరమపదనాథుని సన్నిధిగ నెంచి, రామానుజార్యు లచట మహాపూర్ణులను తమ గురువుగపొందిరి.

45. స శంఖ చక్రాంకనపుండ్రయాగం
మంత్రాంస్త రర్థై రపి మంత్రరత్నమ్ ।
అన్యాశ్చ తత్రోపదిదేశ మంత్రాన్
రామానుజాచార్యవరాయ తస్మై ॥

ఆ ప్రదేశమున మహాపూర్ణులు - "తాపః పుండ్ర స్తథా నామ - మంత్రో యాగ శ్చ పంచమః" - అనునట్లు, అగ్నితప్తమైన శంఖ చక్రములను రామానుజాచార్యుల భుజములమీద ముద్రించి, ఊర్ధ్వ పుండ్రములను ధరింపజేసి,వైష్ణవదాసనామము నిడి,నిత్యదేవతార్చనా విధానములను వివరించి, మంత్రరాజ - మంత్రరత్న - చరమ మంత్రముల నుపదేశించి, మంత్రార్థములను విశదీకరించి, తదితర

మంత్రములను (విష్ణు షడక్షరిని, వాసుదేవ ద్వాదశాక్షరిని)కూడ బోధించిరి.

46. తాదృ క్మహా వైభవ దివ్యదేశాత్
కాంచ్యా మథాగమ్య గురు స్స శిష్యః
అన్వర్థనామ్నా వరదం ప్రణమ్య
రామానుజార్యావసథం ప్రపేదే॥

పిమ్మట గురువు శిష్యునిగూడి, ఆ విధమైన మహావైభవ దివ్యదేశము నుండి కాంచీపురికి విచ్చేసి, సార్థకనాముడైన వరదరాజస్వామికి ప్రణమిల్లి, రామానుజార్యుల నివాసమును జేరిరి.

47. ఉపాదిశ త్స త్రిసహస్ర గాథా
స్తద్వా సనూత్రార్థ మపి ప్రహృష్టః।
రామానుజార్యశ్చ గురుం సదారమ
పూజయ న్నిత్య మభీష్టవృత్త్యా ॥

మహాపూర్ణులు రామానుజార్యులయెడ మిక్కిలి ప్రీతివహించి, నాలాయిరములోని మూడువేల పాశురములను బోధించిరి. అది యునుగాక, వ్యాసభగవానుని బ్రహ్మసూత్రములకుగూడ - అర్థమును వివరించిరి. రామానుజార్యులును - ప్రతిదినము గురువును, గురుపత్నిని పూజించుచు, వారికి ప్రీతికరమైనవిధముగ - జీవితమును కొనసాగించుచుండిరి.

48. కేనాపి కార్యేణ తతః కదాచి
ద్రామానుజే భూతపుర[illegible]తే
తత్రత్యశ్యధిక్షేప నికర్ష వాదా
దుష్టాం స్వదేవీం న చుకోప పూర్ణః ॥

తరువాత ఒకప్పుడు రామానుజార్యులు ఏదియో పనిపై భూతపురికి వెళ్ళినప్పుడు, ఆయనభార్య - గురుపత్నిని అవమానించి, దుర్భాష లాడెను. అందులకు కినుకబూని, తిరిగి ఆమెతో తగవులాడినందులకు మహాపూర్ణులును - ఆమెపై కోపగించిరి.

49. పూర్ణ స్స దేవ్యాధ జగామ రంగం
తచ్చాపి వృత్తం స విశమ్య రుష్టః ।
రామానుజార్యో గురుభక్తిపూర్ణః
స్వదేవికాం మాతృగృహం నినాయ ॥

పిమ్మట మహాపూర్ణులు - తమ భార్యను వెంట నిడుకొని, శ్రీరంగము నకు వెళ్ళిరి. గురుభక్తిసంభరితు లగు రామానుజులు — ఆ విషయ మును విని, మిక్కిలి కోపగించిరి. తమ భార్యను ఆమె మాతృగృహ మునకు గొంపోయిరి.

50. వల్నీం పరిత్యజ్య స వీతరాగః
శ్రీదేవరాజం ప్రణిపత్య తస్మాత్ ।
తుర్యాశ్రమం స్వీకృతవాన్ దదౌ స
దేవోఽపి తస్మై యతిరాజ నామ ॥

పిదప - వీతరాగులై (సంసార వ్యామోహము తొలగినవారై), పత్నిని పరిత్యజించి, శ్రీ వరదరాజస్వామికి సాష్టాంగదండప్రణామ మాచ రించి, ఆ స్వామియనుగ్రహమున, సన్యాసాశ్రమమును స్వీకరించిరి. శ్రీ వరదరాజస్వామియును - కరుణించి, వారికి - 'యతిరాజు' - అను నామమును ప్రసాదించిరి.

51. తత త్రిదండీ స శిఖోపవీత
కాషాయయుక్తో మనురత్న జప్త్వా ।
వర్ణాశ్రమాచారపర శ్చ కాసే
రామానుజార్యో యతిసార్వభౌమః ॥

అంతట - పరివ్రాజకులలో ముఖ్యులైన రామానుజార్యులు, చేతిలో త్రిదండము గలిగి, శిఖా యజ్ఞోపవీత కాషాయాంబరములు ధరించి, మూలమంత్రమును జపించుచు, వర్ణాశ్రమాచారపరులై, యతిసార్వభౌములై విరాజిల్లిరి.

52. తత్రైవ కూరాధిప వాత్స్యనాథ
వాధూలనాథాశ్చ సమాశ్రితా స్తమ్ ।
తేభ్యోఽపి రామానుజసంయమీంద్ర
స్స శంఖచక్రాంక రహస్యదోఽదూత్ ॥

కాంచీపురమున - శ్రీవత్సాంకమిశ్రులు (కూరత్తాళ్వారులు),[11] వాత్స్యనాథులు,[12] వాధూలనాథులు[13] అనుహరలు శిష్యులుగ చేరవచ్చిరి. అంతట రామానుజసంయమీంద్రులు - వారికి శంఖ చక్రాంకనము గావించి, మంత్రోపదేశము చేసిరి.

---

11. పరమభాగవతోత్తములు, వైరాగ్యసంపన్నులు, రామానుజులకు పవిత్రమువంటివారు.

12. శ్రీవత్సగోత్రులు, 'నడాదూరు' అను గ్రామవాసులు, రామానుజుల శిష్యులు.

13. వాధూల గోత్రులు, కందాడై వంశమువారు, రామానుజాచార్యుల వారి మేనల్లుడు, శ్రీరంగ నివాసము.

53. తతోఽభవ ద్యామునసంప్రకాశః
శ్రీ యామునాచార్య కటాక్షశుద్ధః ।
గోవింద యోగీ యతిరాజశిష్యో
గ్రంథం స కాంచి ద్యతిధర్మ మాహ ॥

యామునాచార్యుల దయార్ద్రదృక్కులచేత పరిశుద్ధుడైన యాదవ ప్రకాశుడు - కంచిలో యతిరాజులకు శిష్యుడై, 'గోవింద యోగి' - అను పేరున - 'యతిధర్మసముచ్చయము' అను గ్రంథమును రచించెను.

54. శ్రీరంగరాజార్య వరః కదాచిత
గత్వాథ కాంచీం వరదం ప్రణమ్య ।
ఆదాయ రామానుజనంయమీంద్రం
శ్రీరంగ మేవాప్తవద ప్రతస్థే ॥

వరరంగార్యులు [14] కాంచీపురికి వెళ్ళి, శ్రీ వరదరాజస్వామికి నమస్కరించిరి పిమ్మట-రామానుజ సంయమీంద్రులను తమ వెంట నిడుకొని, శ్రీరంగమునకు పయనమై వెళ్ళిరి.

55. తత స్స కూరేశముఖాంతరంగైః
అన్యైశ్చ శిష్యై ర్యతిరాజవర్యః ।
శ్రీశం చ నత్వా మధురాంతకస్థం
శ్రీరంగ మాపార్య నిసేవితస్సన్ ॥

14. వరరంగనాయకు లనియు, తిరువరంగప్పెరుమాళ్ అరైయార్ అనియు వీరికి నామాంతరములు కలవు.

కూరేశ దాశరథులతోను, తదితర ప్రముఖ శిష్యులతోను బయలు దేరిన యతిరాజు - మార్గ మధ్యమున - మధురాంతకమున నున్న శ్రీశునకు నమస్కరించి, శ్రీరంగములోని పెద్దలను సేవించునిమిత్తము అచ్చటకు చేరుకొనిరి.

56. ప్రత్యుద్గతై రంగపతే ర్నియోగాత్
సంమానితో మాల్యముఖై ర్యతీశః ।
శ్రియం ప్రణమ్యాథ చ రంగనాథం
శ్రీకార్యనిర్వాహధురంధరోఽభూత్ ॥

శ్రీరంగనాథస్వామి ఆజ్ఞానుసారముగ - మాలాధీశాది [15] (తిరుమలై ఆండాన్), తదితర ప్రముఖులు - యతిరాజునకు ఎదురేగి, స్వాగతము పలికి, సమ్మానించి, వెంచేపుచేసికొనివచ్చిరి. మహనీయులైన యతిరాజు - శ్రీదేవికిని, రంగనాథస్వామికిని - సాష్టాంగ దండప్రణామ మాచరించి, శ్రీకార్యనిర్వాహధురంధరులై విరాజిల్లిరి.

57. విభూతియుగ్మాదిపతాదికంచ
సర్వం మహాపూర్ణకటాక్షలబ్ధమ్ ।
మత్వా స తత్పాద సరోజయుగ్మం
సంసేవ్య తద్వశ్యత యావతస్థే ॥

శ్రియఃపతియొక్క ఉభయవిభూతుల (లీలా - నిత్యవిభూతుల) ఆధిపత్యము, తదితర వస్తుసంపద అంతయు - మహాపూర్ణుల దివ్య కటాక్షమువలననే తమకు సంక్రమించినవని తలచి, రామానుజులు - వారి పాదపద్మములను సంసేవించుచు, వారి ఆజ్ఞానువర్తులై యుండిరి.

15. యామునాచార్యులు.

58 తతో మహాపూర్ణ గురో ర్నియోగాత్
ప్రణమ్య గోష్ఠీపుర పూర్ణపాదే ।
మంత్రార్థతచ్ఛ్లోక పదార్థ శిక్షాం
ప్రాప్యాథ సోఽశిక్షయద ప్యనేకాన్॥

పిమ్మట - మహాపూర్ణ గురువర్యుల ఆదేశానుసారము - యతిరాజులు గోష్ఠీపూర్ణుల [16] పాదపద్మములకు ప్రణమిల్లి, వారినుండి తిరుమంత్రార్థమును, చరమశ్లోకార్థమును తెలిసికొనిరి. అనంతరము యతిరాజులు ఆ విశేషములను అనేకులకు బోధించిరి.

59 తత స్స పూర్ణోఽపి తదాంతరంగః
సమ్మానయం స్తం యతిసార్వభౌమమ్ ।
తద్దర్శనం చేద మితీర్య తుష్టః
కటాక్షయన్ లక్ష్మణదర్శనం తత్॥

రామానుజాచార్యుల అంతరంగమెఱిగిన గోష్ఠీపూర్ణులు - వారిని యతిసార్వభౌములుగ సంభావించి, వారి దర్శనమును - "రామానుజదర్శన" మని మిక్కిలి సంతసముతో కొనియాడిరి.

60 తత స్స రామానుజ సంయమీంద్రో
గురుం మహాపూర్ణ మవందతాథ ।
పునశ్చ రంగేశగురో ర్గ్రహీతుం
కాంక్షన్ విశేషాన్ స తదాదిదేశ ॥

---

16. యామునాచార్యుల శిష్యులు వీరు వీరికి - 'తిరుక్కోట్టియూర్‌నంబి' యనియు మఱియొక పేరు కలదు. రామానుజులకు తిరుమంత్రము నుపదేశించిన గురువులు వీరు. వీరికి రామానుజులయందు ప్రీతి అధికము.

తదుపరి - రామానుజసంయమీంద్రులు - మహాపూర్ణదేశికుల పాదపద్మములకు ప్రణమిల్లిరి. వారలు - రంగేశగురుశుశ్రూషతో - విశేష సూత్రములను అధ్యయన మొనర్చు మని ఆదేశించిరి.

61. స త చ్ఛరారే శ్చరమ ప్రబంధే
తదర్థసారం సుకవిప్రబంధమ్ ।
స్తోత్రద్వయంచార్థవిశేష ముక్తం
తస్మా ద్గృహీత్వా పున రాప పూర్ణమ్ ॥

రామానుజసంయమీంద్రులు రంగనాథునినుండి శఠకోపముని (నమ్మాళ్వారులు) సాయించిన - చరమప్రబంధమైన తిరువాయి మొళిని, దాని అర్థ విశేషములను, సుకవియైన మధురకవియాళ్వారులచే రచింపబడిన 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను ప్రబంధమును, స్తోత్రద్వయమును[17] (చతుశ్శ్లోకి - స్తోత్రరత్నము' అనువానిని)-అర్థవిశేషములతో అధ్యయన మొనర్చి, తిరిగి మహాపూర్ణులవద్దకు వచ్చి చేరిరి.

62. పున ర్నియుక్తః స్వగురో ర్యతీశో
మాలాధరాచార్యవరా త్సమేధాః ।
శఠారిసూక్తేః పరశాలసూక్తే
రర్థం సహస్రస్య చ సోఽప్యగృహ్ణాత్ ॥

మహాజ్ఞాన సంపన్నులైన యతిరాజులు - తిరిగి స్వాచార్యులైన మహాపూర్ణులచేత ఆజ్ఞాపింపబడినవారై, మహామహులైన మాలాధ

17 మొదటిది - శ్రీదేవిని గూర్చినది. రెండవది - శ్రీమన్నారాయణుని గూర్చినది ఈ రెంటిని రచించినవారు యామునాచార్యులు.

రాచార్యుల (తిరుమాలై యాండాన్)నుండి శ్రీ శఠకోపసూక్తి నిధి సారాంశమును, పరకాలమహాముని(తిరుమంగై ఆళ్వారుల)సహ్రస సూక్తుల సారాంశమును - గ్రహించిరి.

63. స్వయంవిదో౽ర్థో౽ప్యనితో భవేది
త్యుక్తో క్వచి త్తత్ర యతీశ్వరేణ ।
శ్రుత్వా గురుః పూర్ణ యుగాయ చాహ
తాభ్యాం చ తేనా వ్యతివర్తిత స్సః ॥

మాలాధరులనుండి విశేషములను గ్రహించుకొనిన సందర్భమునందు - విశేషార్థములు సూచించుచు, యతిరాజు ఆ యా భాగములకు తాము సూచించిన అర్థమే సముచితమైయుండనచ్చునని పలుకుచుండిరి. యతిరాజు ప్రకటించిన దోషార్థములను విని, మాలాధరులు విస్మిత, మహాపూర్ణ - గోష్ఠీపూర్ణులకు చెప్పుచుండిరి. ఈ సునిశితబుద్ధి పై శారదమ్యమునకు మాలాధరులేకాక, మహాపూర్ణ - గోష్ఠీపూర్ణులును యతిరాజును ప్రశంసించుచుండిరి.

64. ఏవం రహస్యార్థవిశేషయుక్తం
వేదాంతమాచార్యగణా చదీత్య ।
కూరేశ వాత్స్యేశముఖం శ్చ శిష్యై
రువాస రంగే ముదితో యతీశః ॥

ఈ విధముగా యతిరాజు - రహస్యార్థవిశేషయుక్తమైన వేదాంతమును ఆచార్యగణశుశ్రూషతో అధ్యయనమొనర్చి, కూరేశ - వాత్స్యాయనాది (వడాదూరాళ్వాన్) ముఖ్య శిష్యులతో శ్రీరంగమునందు సంతోషముతో నుండిరి.

65. తత స్తదాత్రేయవరా ర్తిహర్త్రా
యతీశపాదాంబురుహం ప్రపన్నః ।
పిళ్లా నభిఖ్యం స్వపితృవ్యసూనుః
శ్రీశైలపూర్ణస్య సుతం నివేద్య ॥

అంతే - ఆత్రేయవంశీయులైన ప్రణతార్తిహరు లనువారు [18] - యతీశునకు శిష్యులై, వారి పాదపద్మముల నాశ్రయించిరి. అదియును గాక, శ్రీశైలపూర్ణుల కొమరుడును, తమ మేనత్తకొమరుడునైన 'పిళ్లాన్' [19] అను పేరుగలవానిని సమర్పించి (అప్పగించి) -

66. అజానసద్వృత్తయతీశభక్తి
త త్సేవనేచ్ఛా ద్యపి త త్సుతస్య ।
శ్రీశైలపూర్ణోక్త మపీ హ్యరోచక్
శ్రీవేంకటాద్రీశ మిమం భవేతి ॥

జన్మాది సద్వృత్తి - యతిరాజుపై గల భక్తితత్పరత, సేవాభిలాష - ఇత్యాది విశేషములు గల శ్రీశైలపూర్ణుల కుమారు డగు 'పిళ్లాన్' గూర్చి, ప్రణతార్తిహరులు-యతిరాజుకు వివరించి, 'శ్రీవేంకటాద్రీశుని భజింపుము' - అను శ్రీశైలపూర్ణుల సందేశమునుగూడ తెలియ జేసిరి

---

18. వీరిని 'కిడాంబి ఆచ్చాన్' అనియు వ్యవహరింతురు రామానుజుల ఆంతరంగిక శిష్యులలో నొకరు వీరికి - 'వేదాంతోదయన' అను బిరుదము గలదు 74 సింహాసనాధిపతులలో వీ రొకరు.

19. రామానుజులు వీరికి 'కురుకేశ' అను నామ మిడిరి.

67. తం వీక్ష్యం స తదైవ సర్వా
మంత్రాన్ సహార్థాన్ ప్రణతార్తిహర్త్రే ।
విదేశ తన్మంగల దివ్యదేహ
సంరక్షకోఽభూ త్తత ఏవ సోఽపి॥

యతిరాజు - బాలకుడైన పిల్లానును చూచిరి. అప్పుడే - ప్రణతార్తి హరులకు మంత్ర - మంత్రార్థముల నన్నింటిని ప్రబోధించిరి. ప్రణతార్తిహరులును ఆనాటినుండి - యతీశుని మంగళకరమైన దివ్యదేహమునకు సంరక్షకులైరి.

68. తతః కదాచి ద్విషయుక్త భిక్షాం
జ్ఞాత్వా యతీశ స్త్రిదినోపవాసః ।
నిశమ్య తద్వావపి పూర్ణవర్యౌ
గోష్ఠీపురా నావతు రాశు రంగమ్ ॥

అంత నొకనాడు - భిక్షాన్నము విషయుక్తమైయున్నదని తెలిసికొని, యతిరాజు - మూడురోజులు ఉపవాస ముండిరి. ఈ సమాచారమును తెలిసికొని మహాపూర్ణులు, గోష్ఠీపురమునుండి గోష్ఠీపూర్ణులును వెంటనే శ్రీరంగమును చేరిరి.

69. ప్రత్యుద్గతం తం ప్రణతం యతీశం
త్వద్దేహమాని ప్రణతార్తిహర్త్రే ।
సంశోధితం స్వీకురు నిత్యభిక్షా
మి త్యూచ తు స్తౌ స తథాకరోచ్చ ॥

తమ కెదురువచ్చి సాష్టాంగపడిన యతిరాజుతో ఆచార్యవర్యు లిరువురును దేహసంరక్షణమున మిక్కిలి జాగరూకతగల ప్రణతార్తిహరా

చార్యులచే సంశోధింపబడిన (పరిశుద్ధ మొనర్పబడిన) నిత్యభిక్షాన్నమునే ప్రతిదినమును స్వీకరింపవలసినదని పలికిరి. యతిరాజును ఆ ప్రకారముగనే ఆదరించిరి.

70. గోవిందభట్టాంతర శిక్షణార్థం
స్వప్రేరితాప్తాపురతోవదేవమ్ ।
శ్రీశైలపూర్ణాంఘ్రి సరోజభృంగో
గోవిందభట్టోఽభవదంతరంగః ॥

గోవిందభట్టుమనఃపరివర్తనమునకై తమచే పంపబడిన వ్యక్తి తిరిగి వచ్చి చేరి, గోవిందభట్టు శివలింగమును త్రోసివైచి, శ్రీశైలపూర్ణాంఘ్రిసరోజభృంగమై విలసిల్లుచున్నారు - అని యతిరాజునకు తెలియజేసెను.

71 వేదార్థసంక్షేప మథో యతీశో
వేదాంతసూత్రస్య చ సారదీపః ।
భాష్యం చ గీతావివృతిం చ కృత్వా
వత్స్యేశముఖ్యేభ్య ఉపాదిశచ్చ ॥

అప్పుడు యతిరాజు - వేదార్థసంగ్రహమును, వేదాంతసారమును, వేదాంతదీపమును, బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానముగ శ్రీభాష్యమును, శ్రీమద్భగవద్గీతకు వ్యాఖ్యానమును రచించి, వాత్స్యేశాది ముఖ్యశిష్యులకు వానిని ప్రబోధించిరి.

72. ఆవాదితార్థై రనపాయబాధం
తద్వ్యాససూత్రస్య యథార్థభాష్యమ్ ।
కృత్వా యతీంద్రో ధురి యామునార్య
మనోరథం పూరితవాన్ స ఆద్యమ్ ॥

బాదరాయణుని బ్రహ్మసూత్రములకు, అపూర్వమైన - ప్రామాణిక మైన - శాశ్వతమైన - ప్రతిభావంతమైన వ్యాఖ్యానమును వెల యించి, యతిరాజు శీఘ్రముగ యామునాచార్యులవారి ప్రథమ వాంఛను నెఱవేర్చిరి.

73. తతః కదాచి త్సహరంగనాయికా
శ్రీరంగనాథా వపి ఫాల్గునో త్తరే ।
ముదాబిషిక్తౌ స తదా ప్రపద్య తౌ
గద్యత్రయం చా వ్యవర ద్యతీశ్వరః ॥

పిమ్మట - ఒకానొక ఫాల్గున మాసములోని ఉత్తరఫల్గునీ నక్షత్ర శుభదినమున, యతిరాజు - పవిత్రస్నాన మొనర్చి, సంతోషభరిత స్వాంతులై, లోకమాత యగు రంగనాయకిని, నిఖిలలోకైకనాథు డగు శ్రీరంగనాథుని-శరణు వేడి (శరణు పొంది), గద్యత్రయమును (శరణాగతి - శ్రీరంగ వైకుంఠ గద్యలను) విన్నపము చేసిరి.

74. భాష్యాదిభి స్తత్త్వవిదో౽వ గద్యైః
శ్రీశం ప్రపన్నస్య తదేకవృత్తేః ।
కైంకర్య మాప్రాయణకార్య మాహ
నిత్యాభిదగ్రంధముఖ ద్యతీశః ॥

తాము వ్యాఖ్యానించి ప్రవచించిన శ్రీభాష్యాది గ్రంధములద్వారా, స్వయముగ శ్రియఃపతిత్వము నెఱింగినవారు, తాము సాయించిన గద్యత్రయ పఠనముద్వారా, స్వయముగ - శ్రియఃపతికి శరణాగతి యొనర్చి ప్రపన్నులై మెలగువారును, తమ జీవితాంతమువరకును, భగవత్కైంకర్య మొనర్చుచు జీవితమును గడుపుచుండవలయు నని,

యతిరాజు — తాము రచించి ప్రసాదించిన 'నిత్యగ్రంథము'ద్వారా ప్రబోధించిరి.

75. తత స్స శిష్యై ర్బహుభి ర్యతీశః
కాంచ్యాః పథా వేంకటశైలవర్మమ్ ।
భక్త్యా భజం స్త ద్బహుమానితస్సన్
శ్రీశైలపూర్ణం ప్రణతో గురుం తమ్ ॥

అంత యతిరాజు - పెక్కుమంది శిష్యులు వెంట రాగా, కంచిమార్గముగా పయనించి, భక్తితో - సుప్రసిద్ధమైన వేంకటాచలమును చేరిరి. అచట - ఘనముగా సమ్మానింపబడి, వారు - శ్రీశైలపూర్ణులకు సాష్టాంగప్రణామ మాచరించిరి.

76. త ద్వీక్షితస్సన్ కమలానివాసం
ప్రపద్య తత్పూర్ణవరా ద్యతీశః ।
రామాయణం త ద్వివిధై ర్మహార్థైః
సంవత్సరం తత్ర వసన్న గృహ్ణాత్ ॥

శ్రీశైలపూర్ణుల కృపాన్విత దృక్కులతో వెలుగుచు, యతిరాజు అచట శ్రీనివాసభగవానునకు శరణాగతులై యుండి, ఒక సంవత్సర కాలమువరకు శ్రీశైలపూర్ణ మహోదయులనుండి - రామాయణ మహాకావ్యమును, అందలి వివిధ విశేషార్థములతో గ్రహించిరి.

77. పూర్ణాత్మజో ద్వా దపి త న్నియుక్తో
యతీశ మాశ్రిత్య సమస్త మర్థమ్ ।
అవాపతు స్తత్ర సుతం కనిష్ఠం
పూర్ణోఽప్యదా త్త ద్బహుమానపాత్రమ్ ॥

జనకుని ఆదేశము ననుసరించి - శ్రీశైలపూర్ణుల తనయు లిర్వురును యతిరాజునకు శిష్యులై, సమస్త విశేషములను అధ్యయన మొనర్చి, గ్రహించిరి. అంత శ్రీశైలపూర్ణులు - తమ కనిష్ఠసూనుని యతిరాజు అభిమానపాత్రు డగుటకై అప్పగించిరి.

78. పిల్లా నభిఖ్యం స చ తేన దత్తం
గోవిందభట్టం నిజయాచితం చ
సంగృహ్య హృష్ట స్స మహావ రంగం
కాంచీపథా దేవ యతీశ్వర శ్చ ॥

శ్రీశైలపూర్ణులు అప్పగించిన 'పిల్లాన్'- అని వ్యవహరింపబడువానిని, తాము స్వయముగ అభ్యర్థించి పొందిన 'గోవిందభట్టు' అను వానిని వెంట నిడుకొని, యతిరాజు సంతుష్టులై, కంచిమీదుగ - శ్రీరంగ మును చేరిరి.

79. గోవిందభట్టం చ విరక్త మైక్ష్య
యతిం తమేమ్బారధిదం స చక్రే ।
అతస్సుతో రంగపతేః ప్రసాదాత్
తత్కూరనాథస్య చ సాధుభట్టః ॥

సాంసారిక జీవనమున విరక్తుడైన గోవిందభట్టును చూచి యతిరాజు - ఆతనిని యతిగా నొనర్చి, 'ఎంబార్'- అను నామము నిడిరి. శ్రీరంగ నాథస్వామికృపవలన, కూరనాథునకు కొమరుడు జన్మించెను. ఆయన - సత్పురుషుడైన భట్టు.

80. భట్టారకం తం చ పరాశరాఖ్యం
కృత్వా కృతం దేవసహస్రనామ్నామ్ ।
భాష్యం ప్రతిష్ఠాప్య చ యామునార్య
మనోరథం పూరితవాన్ ద్వితీయమ్ ॥

ఆ బాలకునకు యతిరాజు - 'పరాశరభట్టు' - అని నామకరణము చేసిరి. ఆమహామహులు వ్రాసిన 'విష్ణుసహస్రనామ స్తోత్రభాష్యము'ను కొనియాడి, యతిరాజు - యామునాచార్యుల రెండవ కోరికను నెఱవేర్చిరి.

81. కదాచి దన్తమర మర్థచిన్తాం
దివ్యప్రబంధస్య సమాచరన్తమ్
యతీశ్వరం వీక్ష్య చ పూర్ణపుత్ర
స్తచ్చిన్తితార్థో హ్యయమి త్యవోచత్ ॥

ఒకప్పుడు మఠములోనున్న యతిరాజు - దివ్యప్రబంధములోని అర్థమునుగూర్చి పర్యాలోచనచేయుచుండ, శ్రీశైలపూర్ణుల కుమారులైన 'పిళ్లాన్' అది చూచి, వారు తలచుచున్న భావార్థమునే విశదీకరించి చెప్పిరి.

82. తదీరితార్థం నిజచిన్తితం తం
శ్రుత్వా యతీశోఽప్యతివిస్మితస్సన్ ।
నాథాన్వయ ద్వేద తదేతి మత్వా
మజ్ఞానపుత్ర త్యభిష్వజే తమ్ ॥

తాము తలచిన అర్థమునే 'పిళ్లాన్' వివరించుట విని యతిరాజు - మిక్కిలి ఆశ్చర్యము నొందిరి. నాథమునుల వంశీయుడై యున్నందున, 'పిళ్లాన్' ఆ విశేషములను తెలిసికొనియుండవచ్చునని యెంచి, యతిరాజు - 'నా జ్ఞానపుత్రుడవు' - అని ఆయనను కౌగలించుకొనిరి.

౮౩. రామానుజార్యస్య యతీశ్వరస్య
జ్ఞానాత్మజ స్తస్య చ పాదుకేతి ।
ఖ్యాత శ్శఠారే శ్చ రమప్రబంధం
వ్యాఖ్యాతవాం స్తం కురుకేశవర్యః ॥

యతీశ్వరుడైన రామానుజాచార్యుని జ్ఞానాత్మజుడు - వారి పాదుకలుగ 'పిళ్లాన్' అను మహోదయుడైన కురుకేశుఁడు - శఠకోపమునీంద్రుని కడపటి ప్రబంధమైన 'తిరువాయిమొళి'కి - వ్యాఖ్యానమును రచించెను.

౮౪. పిల్లా నభిఖ్యం కురుకేశ్వరాఖ్యం
కృత్వా తు తం తత్కృత షట్సహస్రమ్ ।
భాష్యం ప్రతిష్ఠాప్య స యామునార్య
మనోరథం పూరితవాన్ తృతీయమ్ ॥

నమ్మాళ్వారుల జన్మస్థలమైన ఆళ్వారుతిరునగరికే - 'కురికాపురి' అని ప్రసిద్ధి. యతిరాజు - పిల్లాన్ మహోదయునకు - నమ్మాళ్వారుల యందు గల అచంచలమైన శ్రద్ధాసక్తులను మెచ్చుకొని, 'కురుకేశ్వరుడు' అను నామ మిడి, ఆ మహామహుడు రచించిన 'ఆరాయిరప్పడి' అను పేరు గల తిరువాయిమొళివ్యాఖ్యానమును ప్రస్తుతించి, యామున మునుల మూఁడవ కోరికను నెఱవేర్చిరి.

౮౫. యతీశ్వరస్యా ప్యథ యజ్ఞమూర్తేః
వితోరవేల జ్జయతో మతస్థః ।
ఇతి ప్రతిజ్ఞాయ చ రంగపుర్యాం
ప్రవక్తి తాష్టాదశరాత్రవాదః ॥

ఓడినవారు తమ మతమును వదలి, జయించినవారిమతమును స్వీకరింప వలె ననెడి ప్రతిజ్ఞ కలిగి, శ్రీరంగమున - పదునెనిమిదిరోజులవఱకు - యతిరాజునకు, యజ్ఞమూర్తికిని - వాదము కొనసాగెను.

86. స్వప్నే యతీశో వరదేక్షితస్సన్
మాయామతస్థాపకయజ్ఞమూర్తిమ్ ।
వాదేఽజయ త్తం వరదాఖ్యయాస్యం
నామాన్యధాత్సోఽపి ముమోద శిష్యః ॥

శ్రీ వరదరాజస్వామిచే స్వప్నమున అనుగ్రహింపబడి, యతిరాజు మరుసటిరోజున, మాయామతస్థాపకు డగు యజ్ఞమూర్తిని ఓడించిరి. అతనికి - 'వరదరాజులపేరు, తనపేరు - కలిసివచ్చునటుల, 'అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్' - అను నామ మునుంచిరి. ఇందులకు అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానారుకూడ - సంతసించెను.

87. తతో యతీశ స్స దిశో విజేతుం
శిష్యై రనేకై స్సహ తత్ర తత్ర ।
గత్వా విజిత్వాన్యమతం సమస్తం
సరస్వతీపీఠ మథాససాద ॥

అంత యతిరాజు - పెక్కుమంది శిష్యులతో - వివిధ ప్రాంతములం దంతట గల అన్యమతస్థులను జయించుటకు వెళ్ళిరి. అన్యమతము లన్నింటిని జయించి, వారు - కాశ్మీరదేశమునందుగల సరస్వతీపీఠము చేరిరి.

88. త ద్భాష్య మాదాయ విధాయ మూర్ధ్ని
శ్రీభాష్య మేత ద్వర భాష్యకృత్తమ్ ।
ఇతీవ తస్మై ప్రదదౌ చ దేవీ
భాష్యం హయగ్రీవ మపి స్వదేవమ్ ॥

వాగ్దేవియైన సరస్వతీదేవి - యతిరాజ రచితమైన భాష్యమును స్వీక రించి, శిరముపై నిడుకొని, 'మాచే ప్రశస్తముగ వ్యాఖ్యానింపబడిన శ్రీభాష్య మిది' - అని పలికి, ఆ భాష్యగ్రంథమును, శ్రీ హాయ గ్రీవ విగ్రహమును - వారి కొసంగెను.

89. గృహ్ణన్ హయగ్రీవ మపి ప్రణమ్య
కులాగతం తం వరదం చ నిత్యమ్।
ఆరాధయ న్నన్యమతాని జిత్వా
శ్రీవేంకటాద్రిం పున రాససాద ॥

సాష్టాంగ దండప్రణామ మాచరించి, స్వీకరించిన హయగ్రీవమూర్తి కి, వంశపారంపర్యముగ - పూర్వాచార్యు లగు పెద్దలనుండి తాము స్వీక రించిన శ్రీ వరదరాజస్వామికిని - ప్రతినిత్యము ఆరాధనాది నిత్య కైంకర్య మొనర్చుచు, ఇతర మతములను జయించి, (తిరుగు ప్రయా ణమున) - వేంకటాద్రిని చేరుకొనిరి.

90. భక్త్యా త్తలక్షణ శంఖచక్రం
శ్రీ శ్రీనివాస శ్శివ ఏవ నాన్యః ।
ఇతీవ శైవై రచితే వివాదే
త ద్భృత్యయం ప్రాహ యతీశ్వరోఽపి ॥

భక్తునిచే గొంపోబడుటవలన, శంఖచక్రములు లేని శ్రీనివాసభగవా నుని గని, శైవులు - 'ఇతడు శివుడే తప్ప, ఇతరుడు కాడు' - అని వివాదమును కలుగజేయ, యతీశ్వరుడును - దానిని ఖండించి, శ్రీనివాసునిగూర్చి యదార్థమును ప్రకటించిరి.

91. నిశ్చిత్య సర్వేఽప్యథ శంఖచక్రే
శూలం చ నిక్షిప్య తదాలయాన్తః ।
కవాట మాబధ్య తతః ప్రభాతే
ఉద్ఘాట్య సర్వే దదృశు స్సహైవ ॥

అందఱును ఒక నిశ్చయమునకు వచ్చి, దేవాలయ మధ్యమున శంఖమును, చక్రమునుకూడ ఉంచి, తలుపులు మూసివేసిరి. మరు నాటి ఉదయమున అందఱును కలిసి తలుపులు తెరచి, కౌతుకముతో చూచిరి.

92. భజ్క్త్వా త్రిశూలం ధృత శంఖచక్రం
శ్రీ శ్రీనివాసం చ సమీక్ష్య శైవాః ।
ప్రభావితా శ్చాశు యతీశ్వరేణ
శ్రీశైలపూర్ణోఽపి ముమోద భూరి ॥

త్రిశూలమును విడిచి, శంఖచక్రములు ధరించిన శ్రీనివాసభగవానుని చూచిన శైవులు — యతిరాజువలన అచటినుండి పలుదిక్కులకు పారద్రోలబడిరి. శ్రీశైలపూర్ణులును - మిక్కిలి సంతసించిరి.

93. తతో యతీశో గురువీక్షితస్సన్
శ్రీరంగ మాగమ్య సమస్త శిష్యైః ।
వేదాంత సిద్ధాంత విచక్షణోఽభూత్
మతాంతరస్థాశ్చ తతః కృతేర్ష్యాః ॥

అంతట యతిరాజు - శ్రీశైలపూర్ణ గురుదేవుల దయార్ద్ర దృక్కులను పొంది, సమస్త శిష్యగణముతో శ్రీరంగమునకు విచ్చేసి, వేదాంత సిద్ధాంత విచక్షణులైరి.(వేదాంత సిద్ధాంతములకు అధికారిక

మైన వ్యాఖ్యానమును వెలయించెడి సుప్రసిద్ధవేదాంతాచార్యులైరి.)
ఇతరమతానుయాయులు — వారియెడ ఈర్ష్యాళువులైరి.

94. దుర్బోధిత శ్చోలనృపోఽథ సాధూన్
'శివా త్పరతరం నాస్తి' లిఖేతి పత్రే
నిర్బధ్య వారై రపి తం యతీశం
ఆహూతవాన్ తద్వి విశం చ శిష్యైః ॥

అప్పుడు దుర్బోధితుడైన చోలరాజు - సాధువులైనవారి నందరిని
ఒక పత్రముపై - 'శివునికంటెను పరదైవము లేదు' - అని వ్రాయు
టకు నిర్బంధించెను. చారులద్వారా యతిరాజును తనకడకు పిలిపించెను.
ఈ విషయము శిష్యులకు - ముందే తెలిసిపోయెను.

95. కాషాయకృ త్కూరపతి స్త్రిదండీ
ప్రాయా న్మహాపూర్ణయుత స్తు తత్ర ।
వాత్స్యేశముఖ్యై స్సహితో యతీశః
శుక్లాంబరః ప్రాప దిశం ప్రతీచీమ్ ॥

కాషాయాంబరములు ధరించి, త్రిదండమును వహించి, కూరత్తాళ్వా
రులు - మహాపూర్ణులతో చోలరాజసభకు వెళ్ళిరి. శుక్లాంబరములు
ధరించి, యతిరాజు - వాత్స్యేయాదిశిష్యులవెంట - పడమట దిక్కున
వెళ్ళిరి.

96. తత్ర క్వచిత్ కైశ్చన శిష్యభూతైః
కాషాయ దండాది సమర్పితం సః ।
శాస్త్రోక్తమార్గేణ పునః ప్రగృహ్య
యదాక్రమారాధనతత్పరోఽభూత్ ॥

ఒకానొకతావున - తమ శిష్యులైనవారు సమర్పించిన కాషాయ వస్త్రములు, త్రిదండము, తదితర వస్తువులు - శాస్త్రోక్తవిధానము ననుసరించి తిరిగి స్వీకరించి యతిరాజు - యథాక్రమముగ ఆరాధనా తత్పరులైరి.

97. యతీశ్వరం తత్ర నృప శ్చ కశ్చిత్
కేచి ద్ద్విజాగ్రాశ్చ సమాశ్రితా స్తమ్ ।
నిష్పిష్టదేహా అపి జైనవర్గా
మహాన్ ప్రభావః ప్రకటీకృత శ్చ ॥

భిత్తిదేవుడను ఒకానొక జైనరాజు, గొప్పవారైన కొందఱు బ్రాహ్మణులును, యతిరాజును సమాశ్రయించి, శిష్యులైరి. అచ్చటి జైనులు ప్రాయశ్చిత్తముగ - తమ దేహములను గాయపరచుకొనిరి. యతిరాజు మహాప్రభావము - దేశమం దంతట - ప్రకటింపబడెను.

98 నారాయణః స్వప్నగతో యతీశం
శ్రీ యాదవాద్రా విహ భూతలాన్తః ।
వర్తే ప్రతిష్ఠాపయ మాం మృదం చ
శ్వేతాం గృహాణే త్యవద త్స తత్ర॥

అచట శ్రీమన్నారాయణుడు - యతిరాజునకు స్వప్నమున సాక్షాత్కరించి, 'నే నీ యాదవాద్రికడ - భూతలములో నున్నాను. నన్ను ప్రతిష్ఠింపుము. శ్వేతమృత్తికను స్వీకరింపుము' - అని పలికెను.

99. తతో యతీశః సహసా ప్రహృష్టః
కల్యాణితీర్థే ష్వవగాహ్యశుద్ధః ।
తదంశ సంశోధిత సద్విమానే
చక్రే స నారాయణ సుప్రతిష్ఠామ్ ॥

పిమ్మట యతిరాజు - మిక్కిలి సంతసించి, కల్యాణతీర్థమునందు స్నాన మొనర్చి పరిశుద్ధులై, వారి లక్షణము లన్నింటిని సరిచూచిన పిదప, చక్కని విమానమున - శ్రీమన్నారాయణుని ప్రతిష్ఠించిరి.

100. శ్వేతాం మృదం శిష్యయుతః ప్రగృహ్య
ధృత్వాథ రామప్రియవిగ్రహం తమ్ ।
అన్విష్య దిల్లీశ సుతాగృహస్థం
సంపత్సుతాగచ్ఛ మమే త్యవోచత్ ॥

శిష్యయుతుడైన యతిరాజు - శ్వేతమృత్తికను గ్రహించి ధరించిరి. తరువాత వారు - రామప్రియ విగ్రహమునుగూర్చి వెదకిరి. ఢిల్లీశ్వరుని కొమరిత గృహమం దున్నందున, అచ్చటకువెళ్ళి, 'ఓ సంపత్కుమారా ! నా వద్దకు విచ్చేయుము' - అని పలికిరి.

101. త మాగతం రామహితం స నీత్వా
కృత్వా స నారాయణ ముత్సవాద్యైః ।
సంపూజయన్ మోద మవాప తత్ర
దిల్లీశ ప్రత్యన్తరధాత్త మాప్య ॥

అంతట - తమవద్దకు విచ్చేసిన రామప్రియుని స్వీకరించి, ఆ శ్రీమన్నారాయణునిగ పూజించి, ప్రార్థించి, నేత్రానందకరముగ ఆ యా ఉత్సవములలో - తిరువీథులందు ఊరేగింపజేసి, యతిరాజు మిక్కిలి ఆనందము నందిరి. ఢిల్లీశుని కొమరిత అటకు వచ్చి, స్వామియందు లీనమయ్యెను.

102 పూర్ణార్య కూరేశ్వర నేత్రహానిం
శ్రుత్వా తదా క్లిష్టతరో యతీశ
నిశమ్య కూరేశ మరోగ మాశు
చోలం తథా దుర్గతమాప హర్షమ్ ॥

మహాపూర్ణులకు, కూరేశులకును కలిగిన నేత్రహానినిగూర్చి విని, యతిరాజు బహుక్లేశము నొందిరి. కొంతకాలమునకు కూరత్తాళ్వారులకు శీఘ్రముగ బాధానివృత్తియైనదని, చోలాధీశుడు దుర్మరణ మొందెనని విని, యతిరాజు సంతోషము నొందిరి.

103. తీర్థం కల్యాణ మాసీ త్తదపి పురవరం తచ్చ నారాయణాఖ్యం
శ్రీశ స్సంపత్కుమారో యతినృపతిజయస్థాన మాసీ త్తత స్తత్ ।
కిం చ శ్రీమాన్ యతీంద్రః స్వపదగతజనశ్రేయ సేస్వీయ మర్చ్యం
రూపం ప్రాదాచ్చ తస్మా ద్యతిపతి రితి తద్యాదవాద్రేస్తు నామ ॥

ఆ పవిత్ర జలాశయము - కల్యాణ తీర్థమున నొప్పుచున్నది. ఆ ప్రసిద్ధ పురమును - 'నారాయణపుర'మను పేరు పొందినది. శ్రియఃపతి - సంపత్కుమారుడై నాడు. ఆ స్థలమును — యతిరాజు విజయస్థల మైనది. అదియునుగాక, మహానుభావులైన యతీంద్రులు - తమ పాదపద్మముల నాశ్రయించిన జనుల శ్రేయస్సునకై పూజింపబడుటకుగాను - తమ అర్చామూర్తిని ప్రసాదించిరి. అందువలన - 'యాదవగిరి' - అను పేరును పొందెను.

104 నత్వా సంపత్కుమారం యదుగిరికమలాయుక్త నారాయణం తం
శిష్యా నాదిశ్య తత్రా ప్యథ కతిపయ చ్ఛిష్యయుక్తో యతీశః ।
గత్వా శ్రీరంగనాథం స సలిల నయనః ప్రాణమత్తం ప్రహృష్టః
తత్ర త్యా స్తం తదోచ శ్రుతపతనగిరా ముత్సవం సంవిరుద్ధమ్ ॥

యదుగిరి లక్ష్మీనారాయణులైన సంపత్కుమారులకు సాష్టాంగ ప్రణామము గావించి యతిరాజు - తమ శిష్యుల నచటనే యుండుట కాదేశించి, మఱికొంతమంది ప్రముఖ శిష్యులను వెంట నిడుకొని, శ్రీరంగమునకు వేంచేసిరి. అట వారు - అశ్రువులతో గూడిన నేత్రములు గలవారై, శ్రీరంగనాథస్వామికి సాష్టాంగముగ నమస్కరించి అమందానంద మందిరి. అంతే అచట ప్రముఖులు కొందఱు - నమ్మాళ్వారుల దివ్యప్రబంధాధ్యయనోత్సవమును నిలిపివేయబడినదని వారికి తెలియజెప్పిరి.

105. తత్ర శ్రీమాన్ యతీశః క మపి శఠరిపుం సంప్రతిష్ఠాప్య తేన శ్రీరంగాధీశ్వరస్యాధ్యయన మహో వింశకం కారయిత్వా । పశ్చా చ్ఛైత్రకృత్యత్ర్యబ్దై స్వవిషయకకథం తం ప్రబంధం మిలిత్వా రంగం సంప్రాప్య చక్రే స తదితరో మహాసూరిగోదాప్రతిష్ఠామ్ ॥

అంతట యతిరాజమహోదయులు - అట నమ్మాళ్వారుల అర్చావిగ్రహమును చక్కగ ప్రతిష్ఠించి, ఆ విగ్రహముతో శ్రీరంగనాథస్వామికి ఇరువది రోజుల వఱకు - అధ్యయనోత్సవము జరిపిరి. తదుపరి ఆ దివ్యప్రబంధములను వానివెంట - స్వవిషయికమైన ప్రబంధమును గూడ శ్రీరంగనాథస్వామిసన్నిధిమున - చక్కగా అధ్యయన మొనరింపజేసిరి. అటుపిమ్మట వారు - ఇతరాళ్వారులయొక్క, గోదాదేవి యొక్కయు విగ్రహములను ప్రతిష్ఠించు కార్యమును నిర్వర్తించిరి.

106. తద్వ ద్దివ్యస్థలేష్వపదిమహిను త్వత్సూరి గోదాప్రతిష్ఠాం కృత్వా సర్వత్ర తంచాధ్యయనమహ మపి ప్రాజ్యహైయంగవీనమ్ । దాజ్యక్షీరో ద్గుడాన్నం వృషగిరిపతి ప్రీణనార్థం నివేద్య శ్రీమాన్ రామానుజార్యః కృతబహుమతిర ప్యాన గోదాకటాక్షైః ॥

ఆ విధముగనే - మహామహిమాన్వితమైన ఇతర దివ్యస్థలములందును, ఆళ్వారాచార్యులయొక్కయు, గోదాదేవియొక్కయు - విగ్రహము లను ప్రతిష్ఠించి, అన్నితావులయందును అధ్యయనోత్సవములను నిర్వర్తింపజేసిరి. సమృద్ధమైన వెన్నను, ఆజ్య - క్షీర - గుడ మిశ్రిత మైన (నేయి, పాలు, బెల్లము - అను పదార్థములతోగూడిన) పాయసాన్నమును, 'తిరుమాలిరుంశోలై' క్షేత్రములో వేంచేసియున్న శ్రీవృషభగిరినాథస్వామిసంప్రీతికై నివేదించి, మహానుభావులైన రామానుజయతిశేఖరులు - శ్రీ గోదాదేవియొక్క దయార్ద్ర దృక్కులచేత సంభావింపబడిరి.

107. నీతం గోవిందరాజం రహసి నిజతలా ద్వేంకటాద్రేస్తు సానౌత్
సంస్థాప్యార్చాః శఠారిప్రభృతి గురుతతేః శ్వశ్వసంస్థే ర్యతీశః ।
గత్వా రంగం స పశ్చా దితరమతజనాన్ స్వాశ్రితానేన కుర్వన్
శిష్యాన్ తాంశ్చ ద్విజజ్ఞః క్రమత ఇహ తదా విజ్ఞరస్సంముమోద ॥

'చిత్రకూట'మను నామాంతరము గల 'చిదంబరము'నుండి, రహస్యముగా తీసికొనివచ్చిన గోవిందరాజ విగ్రహమును యతిరాజు - వేంకటాద్రిసానువులందు ప్రతిష్ఠించిరి. అంతేయకాక, నమ్మాళ్వారులు మొదలైన తదితర ఆళ్వారాచార్యుల అర్చావిగ్రహములనుగూడ ప్రతిష్ఠించిరి. అంతట వారు - ఇతర మతస్థులగు జనులను తమ శిష్యులుగా నొనర్చుటకుగాను - శ్రీరంగమునకు వెళ్ళిరి. పిదప ఒకక్రమమున - తమ శిష్యులను వర్గీకరించి, నిర్విచారులై, మహానందభరితులైరి.

108 పీఠాధీశాంశ్చ కాంశ్చి చ్చతురధిగణనాయుక్తసప్త త్యభిఖ్యాన్
తత్రా ప్యగ్ర్యాం శ్చ కాంశ్చి చ్చతుర ఇహ తథా భాష్యసింహాసనేశాన్ ।
తత్ర జ్ఞానాత్మజం తం తదుభయ నిగమాన్తాగ్ర్యభాష్యేశ్వరం చ
శ్రీమాన్ రామానుజార్యో యతినృపతిమహాదేశికేంద్ర శ్చకార ॥

యతినృపతి, మహాదేశికేంద్రులునైన శ్రీ రామానుజాచార్య మహోదయులు - తమ శిష్యులలో - డెబ్బది నల్గురు (74) పీఠాధిపతులుగ నియమించిరి. వారియందునను - నల్వురు ప్రముఖులను శ్రీభాష్యసింహాసనస్థులుగ ఏర్పరచిరి - వీ రందరికిని - తమ జ్ఞానపుత్రులు - మహామహులునైన 'పిల్లాన్' అనువారిని - ప్రధాన ఉభయవేదాంత ప్రవర్తకాచార్యవర్యులుగ నియమించిరి.

109. సప్తా ర్యాశై శ్చతుర్భి ర్యతిభి రపి తథా స ప్తశత్యాద్భుతశ్రీ
రన్యై శ్చైకాన్తిభిశ్చ ద్వియుత దశమితై స్సహస్రై స్సమేతః ।
జ్యేష్ఠాన్ కూరేశముఖ్యా ననుజ మపి యథా వౌరసం జ్ఞానపుత్రం
వీక్ష్య వ్యాపృత్వవాహాన్ యతినృపతిరపి ప్రేక్ష్య సంమోదమాస ॥

చతుస్సప్తతి(74) మహాసింహాసనస్థులగు మతప్రవర్తకాచార్యులచేత, సప్తశతి (700) సంయమీంద్రులచేతను, అత్యద్భుత శ్రీయుతులైన ద్వాదశ సహస్ర (12,000) సంఖ్య నొప్పారు ఏకాంతుల (భగవద్భక్తుల)చేతను కూడియుండి యతీంద్రులు - నిరంతరము సంసేవ్యమానులై యుండిరి. జ్యేష్ఠులైన కూరేశులను, ముఖ్యులైన తమ అనుజులు - ఎంబారులను, జ్ఞానపుత్రులు - ఔరసపుత్రులునైన 'పిల్లాన్' అను వారిని, పట్టుదలతో మతవ్యాప్తిగావించువారైన తదితర శిష్యగణమును చూచి, అత్యద్భుత కాంతిమంతులైన యతిరాజు — మిక్కిలి సంతసించిరి.

110. శాస్త్రాచారవశ్యై ర్విదిత సుచరితై శ్శిష్యవర్గై స్సమేతః
కైశ్చి త్సంప్రార్థితస్సన్ యతిపతి రపిచాలింగ్య సద్విగ్రహాన్ త్రీన్
శ్రీరంగే, భూతపుర్యా మపి చ యదుగిరౌ ప్రాప్య మేత త్త్రియం చే
త్యుక్త్వా దత్వా చ తేభ్యో జగ దఖిలభవ న్మాం కటాక్షై స్స పాయాత్ ॥

శాస్త్రాచారవశ్యులు, విదిత సుచరితులునైన శిష్యవర్గముతోఁగూడి యున్న యతిపతి, ఒకానొక శిష్యునిచేత సంప్రార్థింపఁబడినవారై, తమ విగ్రహములు మూఁడింటిని నిర్మింపజేసి, తాము ఆ విగ్రహములను ఆలింగనము గావించుకొని, ఆ శిష్యున కొసంగి, ఆ మూఁడింటిలో ఒకటి శ్రీరంగమందును, వేరొకటి శ్రీపెరుంబూదూరునందును, ఇంకొకటి - యదుగిరి (మేల్కోట)యందును - ప్రతిష్ఠింపవలసినదిగా ఆదేశించిరి. అఖిల జగత్తును కాపాడువారు - తమ కటాక్షములచే నన్ను కాపాడుదురుగాక !

111. సర్వత్రో త్సారయిత్వా హ్యపగతవసతిం మామకార్షీ ర్యత స్త్వం
తస్మా త్త్వం ప్రాప్తకాలే వ్రత మపి భవతః క్షోభయిష్యే శపేఽహమ్ ।
శ్రుత్వే త్యుక్తిం కలేర ప్యథ యతినృపతిః శ్రీశ మాద్యం ప్రపన్నో
జీయా దవ్యాహతం మే మత మితి చ వదనే పాలయే న్మాం కటాక్షైః ॥

'నన్నింతటినుండి పాఁద్రోలి, నాకు వసతి లేనట్లు చేసినందుకు గాను దానికి కాల మాసన్నమైనపుడు, నీ మతమును చెదరఁగొట్టెదరు. ఇది నేను శపించుచున్నాను' - అని కలిపురుషుడు పలికిన. ఈ మాటలను ఆకర్ణించి, యతిరాజు - అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు, సర్వేశ్వరుడు, సర్వనియంత, పరమాత్ముడు, శ్రియఃపతియునైన శ్రీమన్నారాయణుని శరణు వేడి, 'నా మతము నిరంతరము జయమునొంది,

నిరాటంకముగ నిలచియుండుగాక!' అని భగవద్రామానుజులు పలికిరి.
యతిరాజు - నన్ను తన దయావలోకనములతో కాపాడుగాక !

112. జీయాత్ శ్రీయామునార్యైస్తదుపచిత మహాపూర్ణ గోష్ఠిపురీ ద్యత్
పూర్ణ శ్రీశైలపూర్ణై రపి మహిమనిధీ రంగమాలాధరార్యైః ।
ప్రాచీ నారాధనం తం వరద మపి హయగ్రీవ మాస్తాం చ యాప్యా
దన్వీక్షానాత్మజాయ త్రిభువన తిలకీభూతకీర్తి ర్యతీశః ॥

శ్రీ యామునముని కృపగలవారును, వారి కృపచేత మహామహులైన మహాపూర్ణ - గోష్ఠీపూర్ణ - శ్రీశైలపూర్ణ - తిరువరంగ ప్పెరుమాళ్ అరైయార్ - మాలాధరాది గురువరేణ్యులచేత పొందిన మహాజ్ఞాన సంపన్నులును, మహాద్భుత ప్రతిభాతిశయముగల వారును, పూర్వకాలమునుండి తమ పూర్వీకులచేత వంశపారంపర్యముగ పూజింపబడుచు వచ్చిన శ్రీ వరదరాజస్వామి అర్చావిగ్రహమును, వాగ్దేవిచే తమ కొసంగబడిన హయగ్రీవ విగ్రహమును-తమ జ్ఞానపుత్రుల కర్పించినవారును, త్రిభువన తిలకులైన యతిరాజు - కీర్తిమంతులై, విజయ మంచెదరుగావుత !

113 కాంశ్చిత్కాన్స్మింశ్చి దర్థే ప్రతినియతతయా సంయోక్ష్యన్తరంగాన్
తత్ర క్షీరార్థకృత్యే ప్రతినియత మహో దాసమప్యత్యనర్హమ్ ।
కుర్వన్ శ్రీమాన్ యతీశః స్వపద వినత తద్దాసదాసానుదానం
మామ ప్యత్యన్తభక్తం స్వహిత మివసదా గోపయన్ సోఽపి జీయాత్ ॥

మహాకీర్తిమంతులైన యతిరాజు - కొంతమంది ఆంతరంగిక శిష్యులకు ప్రతి ఒక్కరికి - ఒక్కొక్క పనిని అప్పగించి, ఆచరించుటకు

నియమించినట్లు, తమ పాదములపై వ్రాలిన దాసానుదాసుని, మిక్కిలి అనర్హుడ నగు దాసుని నన్ను, తమకుమాత్రమే శ్రీరమును సంసిద్ధ మొనర్చెడి కార్యమున నియమించిరి. వారు - నన్ను సదా రక్షింపు చుందురుగాక !

114. కమలేశముఖ్య గురుపంక్తి వైభవ
ప్రతికర్మశోభి యతిరాజ వైభవమ్ ।
య ఇదం పఠన్తి కలికల్మషాపహం
త ఇమే విభూతియుగనాయకా ధ్రువమ్ ॥

శ్రియఃపతియొక్క-యు, గురుపరంపరయొక్క-యు వైభవముతో భాసిల్లునది ఈ యతిరాజ వైభవము. కలికల్మషమును పోద్రోలు దీనిని ఎవరు పఠింతురో, అవ్వారలు - నిక్క-ముగ విభూతియుగమున నాయకు లగుదురు.

## 5. ముగింపు

ఆంధ్రపూర్ణులు ఈ యతిరాజవైభవము నేగాక, మఱియొకను శ్రీరామానుజ అష్టోత్తరశతనామస్తోత్రమునుకూడ రచించియున్నారు.

శ్రీకృష్ణదేవరాయలు 'భువనవిజయము'నందలి అష్టదిగ్గజ కవుల వలె - భగవద్రామానుజుల సన్నిధియందును - అష్టదిగ్గజము లను మహాపండితు లుండెడివారనియు, అట్టివారిలో - వారి ఆ ప్రశిష్యులు, ఆంధ్రపూర్ణులును - ముఖ్యు లనియు-పేరొ్క-నబడినది.[19] అందువలన,

19, Govindacharya-Life of Ramanuja-page 222 (1906 A.D.)

ఆంధ్రపూర్ణులు - మహాత్ము లనియు, మహా పండితు లనియు, పరజ్ఞాన పయోనిధు లనియు, గురుచరణ కమలసేవా పరాయణు లనియు తెలియుచున్నది. ఇంద్రవజ్రా, ఉపేంద్రవజ్రా, స్రగ్ధరాది వృత్తములలో, సులభసరళిశైలిలో, 'యతిరాజ వైభవము'న - శ్రీమద్రామానుజ సలియమీంద్రుల దివ్యచరితమును – రమణీయముగ కీర్తించి ఆంధ్రపూర్ణులు ధన్యాత్ములైరి.

"శుభం భూయాత్"



# శ్రీ మణవాళ మహామునుల వైభవము

" ఉభయ వేదాంత శిరోమణి - పద్మ విభూషణ "

## శ్రీమాన్ ప్రతివాదిభయంకర అణ్ణంగరాచార్యులు

( శ్రీ రామానుజ పీఠాధిపతులు )



## ప్ర వే శి క

"పుణ్యాంభోజ వికాసాయ - పాపధ్వాంత క్షయాయ చ
శ్రీమా నావిరభూ ద్భూమౌ - రామానుజ దివాకరః "

శ్రీ రామానుజులవారనెడి విలక్షణ సూర్యుడు - ఈ లోక ములో అవతరించి, మహోపకారము గావించెను. శ్రీ రామానుజుల వారు - వేదబాహ్య కుదృష్టుల నందఱను - తమ సూక్తిశరములచే నిరసించి, ఆళ్వారుల దివ్యప్రబంధములను ప్రవర్తింపజేసి, దివ్య దేశముల నుద్ధరించి, ఒకరీతిగ అవతార కృత్యమును ముగించుకొని, పరమపదమునకు వేంచేసిన పిదప, కొంత కాలమునకు - మఱల భూలో కమున అవతరించి, 'మణవాళ మహాముని' లను పేర ప్రసిద్ధులై, శ్రీవైష్ణవధర్మ తేజమును విశేషముగ ప్రకాశింపజేసిరి.

'పూర్వాచార్యులు' - అని నేటికిని మనము సంభావించునట్లు అనేక మహాచార్యుల అవతారములచే పూరితమైన యీ లోకము నందు, ఆ యాచార్యపరంపర - మణవాళ మహామునులతో ముగియు చున్నది. మహామునులకు పిమ్మటను - అనేకులు మహాచార్యు లవత

రించియున్నను, 'పూర్వాచార్యులు' అనెడి వ్యపదేశము - మహామునులవఱకే విశ్రాంతమైయుండునని, పెద్దలు నిర్ణయించియున్నారు.

## మహామునుల దివ్యావతారము

శ్రీ రామానుజుల శ్రీపాదములలో - వందలకొలదిమంది స్వాములు ఆశ్రయించియున్నను, ఒక్కొక్క పురుషుని మార్గముగ వచ్చుచున్న మన గురుపరంపరలో - శ్రీరామానుజులకు పిదప - శ్రీ గోవిందభట్టారకులు ఆచార్య పదమును వహించిరి. వారి శిష్యులు (కూరేశుల కుమారులైన) శ్రీ పరాశరభట్టరు. వారి శిష్యులు - నంజీయరు. వారి శిష్యులు - నంబిళ్ళై, వారి శిష్యులు - వడక్కు త్తిరువీధిపిళ్ళై, వారి శిష్యులు — పిళ్ళైలోకాచార్యులు, వారి శిష్యులు - తిరువాయిమొళిప్పిళ్ళై, వారి శిష్యులు - మణవాళ మహామునులు' అని - మన గురుపరంపరాక్రమ మీరీతిగ నున్నది.

విమతులైనవారి బ్రతుకులు నశించునట్లును, వైదికుల కొఱత దీరునట్లును, తత్త్వబోధకము లయిన శాస్త్రములు-దోషరహితములై వెలుగొందునట్లును - ఈ భూలోకములో అవతరింప నెంచిన అనంతసూరి(ఆదిశేషులు) - సత్పురుషులచే కొనియాడబడెడి 'కురుకూర్' అనెడి ఆళ్వార్ తిరునగరిలో వేంచేసియున్న 'తిరునావీఱుడైయపిరాన్ దాస రణ్ణన్' అనియెడి మహాచార్యులను తండ్రిగా నెంచి, వారికి కుమారుడై, (కలియుగాది - నాల్గువేల నాల్గువందల డెబ్బది రెండవదియైన) సాధారణ సంవత్సరమునందలి తులామాసములో — మూలానక్షత్రమున, ఆ తిరునగరియందే అవతరించిరి.

ఈ మహనీయులకు - శ్రీరంగనాథుని దివ్యనామమును పెట్ట దలంచిన పెద్దలు - 'అళగియ మణవాళన్' అను దివ్యనామము నుంచిరి. కాని, 'అళకియ మణవాళనాయనార్' అను పేరు - గౌరవముగ వాడుకలోనికి వచ్చెను. అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము - మొదలైన వర్ణోచిత సంస్కారములును-క్రమముగనే నెఱవేఱినవి.

## విద్యాభ్యాసము

"దుగ్ధోదన్వ ద్ధవళ మధురం శుద్ధసత్త్వైకరూపం
రూపం యస్య స్ఫుటయతితరాం యం ఫణీన్ద్రావతారమ్ ॥"

— [వరవరముని శతకము]

అనునటుల, సాక్షాదనంతసూరివరేణ్యుని దివ్యావతారమైన వీరు -

" ప్రకృష్ట విజ్ఞాన బలైక ధామని "

అని ఆళవందారులు అనుగ్రహించినటుల, జ్ఞానసాగరులై యున్నను, శ్రీ రామకృష్ణాదులును - వశిష్ఠ విశ్వామిత్ర సాందీపని ప్రభృతుల వద్ద విద్యల నధికరించినటుల, లౌకిక ప్రక్రియానుసారము వేదములను, వేదాంగములను, మిగిలిన సకల శాస్త్రములను - తండ్రిగారు మొదలైనవారల శ్రీపాదముల సన్నిధిలో అధికరించి, మిక్కిలి వెలుగొందిరి. ఆనాటి వీరి ప్రకాశమునుగూర్చి (శ్రీ వరవరకావ్యమునందు) ఎఱుమ్బియప్పా అనుగ్రహించిన శ్లోకములు :-

''ఆత్మాపాద మాజానుభుజ మంబుజలోచనమ్
అకార మస్య సంపశ్యన్ ముముదే సకలో జనః
కాలేన సకలానాం చ కలానా మేక మాస్పదమ్
శుభః సతతం పూర్ణ స్సుధాంశు రివ నిర్మలం
సౌశీల్యేన సుహృత్త్వేన గాంభీర్యేణ గరీయసా
రంజనేన ప్రజానాం చ రామోఽయ మితి మేనిరే ॥"

ఉచితకాలమునందు గృహస్థాశ్రమమును స్వీకరించి, శ్రీవైష్ణవ శిఖామణులై విరాజిల్లుచున్న కాలమునందు -

## ఆచార్యాశ్రయణము

పిళ్ళైలోకాచార్యులవారి శ్రీపాదములలో చాలకాల మాశ్రయించి యుండి, సకలశాస్త్రం రహస్య సారార్థముల నన్నిటిని అధికరించినవారును, ఆళ్వారుల శ్రీసూక్తులయందు అప్రతిమమైన అభినివేశము గలవా రగుటచే, 'తిరువాయ్ మొళిప్పిళ్ళై' అని నిరూపక నామమునుబడసినవారును.

''నమ శ్శ్రీశైలనాథాయ - కున్తీనగర జన్మనే
ప్రసాద లబ్ధ పరమప్రాప్య కైంకర్యశాలినే."

అని - నిత్యము ముల్లోకములను స్తుతింప వేంచేసియున్న 'తిరుమలై యాళ్వార్' అనెడి మహాచార్యులు - 'ఇక ఈ శ్రీవైష్ణవ దర్శనమును నిర్వహింపగలవా రెవరో' యని చింతించుచు, అధికారిని అన్వేషించుచుండ, యాదృచ్ఛికముగ వీరు - వారి శ్రీపాదముల సన్నిధికి ప్రవేశించి, ప్రణామ మాచరించి, 'వస్తువుకాని నన్ను - వస్తువుగజేసి,

దాస్యము నొసగవలెను' అని ప్రార్థింప, వారును వీరి అద్భుతమైన జ్ఞాన భక్తి విరక్తి సంపత్సమృద్ధిని కటాక్షించి, అలభ్య లాభమును పొందినచందమున నెంచి, ఆనందసాగరమగ్నులై, వీరిని తమకు మిక్కిలి అంతరంగులుగ అంగీకరించి, సదాచార్య పరంపరాప్రాప్తము లైన సకల విశేషార్థ విధులను వీరికి పరమకృపతో అనుగ్రహించి, ఒక దినమున - ఈ విధముగ నియమించిరి :-

## ఆచార్య నియమనము

ఓ సుందరజామాతృవరా ! నీవు సర్వతోముఖమైన జ్ఞానము కలవాడవై యున్నావు. శ్రీ రామానుజులవారు అవతారపురుషు లని దృఢముగ దెలిసియుండియు పెరియనంబి, తిరుమాలైయాండాను మొదలైనవారలు వారికి ఆచార్యులుగ ఒప్పియుండ తటస్థించినటుల, ఏదియో విధివశమున నేనును నీకు ఆచార్యుడనైతిని. 'నా యాజ్ఞాను వర్తనము నీకు అవర్జనీయము' అను విషయమును నేను విస్తరించి చెప్ప వలసినది కాదు. ఆళ్వాను, భట్టరు, నంబిళ్ళై మొదలైన మన పూర్వులు - సకల శాస్త్రప్రవీణులై యున్నను, ఆళ్వారుల శ్రీసూక్త్యనుభవమునందే మిక్కిలి ఆస్థ కలవారై యుండి, వారి ప్రవచనమే ముఖ్య కైంకర్య మని సేయుచు సుఖించుచు వచ్చి రను సమాచారము నీకు తెలియనిది కాదు.

"ముఱ్పాద ద్వయత్తై క్కేట్టు, ఇతిహాస పురాణంగళైయుమ్ అధికరిత్తు, పరపక్ష ప్రతిక్షేపత్తుక్కుడలాక - న్యాయ మీమాంసాదికళుమ్ అధికరిత్తు, పోదు పోక్కుమ్ అరుళిచ్చెయలిలే యామ్ నంబిళ్ళైయెప్పోలే."

ముందుగ ద్వయమును విని, ఇతిహాస పురాణములను జదివి, పరపక్ష ప్రతిక్షేపములకు దగినటుల - న్యాయ మీమాంసలను జదివి, కాలయాపనము దివ్యప్రబంధమునందే సాగు నట్లెవ్వరివలె - అని పెరియవాచ్చాన్ పిళ్ళైగారు వక్కాణించియుండుట నెఱుంగుదువు గదా ! నీవును ఆరీతిగనే, మన పూర్వాచార్యుల ననుసరించి దివ్య ప్రబంధముల ప్రవచనమునందే అతిమాత్రము నిష్ఠగల్గియుండవలెను. ఈ నా కోరికను నీవు హృదయపూర్వకముగ అంగీకరించితి వను విష యమును నే నెఱింగి, దుఃఖము దొలంగినవానినిగ నన్ను చేయ వలెను' - అని నియమింప, వెంటనే – అళగియ మణవాళనాయనార్ (మహామునులు)-

"రాగప్రాప్తమావదు తానే వైదమానాల్ కడుక పరిగ్రహిత్తైక్కు ఉడలా యిరుక్కుమిఱే.

'రాగప్రాప్తమైనదే విధింపబడినచో, శీఘ్రముగ పరిగ్రహించుటకు హేతు వగునుగదా !' అనియెడి పిళ్ళైలోకాచార్యుల దివ్యసూక్తిని స్మరించి, పరమానంద మంది, పాలను ద్రావ పాదముల బట్టుకొనునట్లు ఈ విధముగను ఒక నిర్బంధము కలిగెనా ! 'స్వామి శ్రీపాద ముల సాక్షిగ - ఈ కైంకర్యమును నిర్వహించుటకు దాసుడనైన నేను శిరసావహింప సిద్ధుడనై యున్నాను; ఇందులకు సర్వాత్మనా యోగ్యత లేని దాసుని గ్యుడ నగునటుల దిద్ది, దాస్యమును గొనవలయును' అని విన్నవించి, శ్రీపాదములలో - వేరు తెగిన వృక్షమువలె పడి యుండ, తిరుమలై యాళ్వారుమ గ్రుచ్చియెత్తి కౌగిలించి, "అముద ల్వానివన్"-'మొదటివా డితడు' అని కటాక్షించి, ఆ దినము మొదలు

గొని తమ శ్రీపాదముల సన్నిధిలో వీరిని ఛాయవలెను, పాదరేఖ వలెను - ఉంచుకొనియుండి, నిధివలె; అతిగుహ్యముగ కాపాడి యుంచిన సకలార్థ విశేషములను క్రమముగ ననుగ్రహించిరి. నాయనారును - కృతకృత్యులై, వారిని దక్క-, వేఱొకదైవము నెఱుంగక, వారి శ్రీపాదములలో అంతరంగదాస్యమును వారి ఆజ్ఞాపరిపాలనమే అవశ్య కర్తవ్య మని దృఢముగ భావించి వేంచేసియుండిరి.

## నాయనారు - యతీంద్రప్రవణు లనెడి దివ్య నామమును పొందుట

తిరువాయ్ మొళిప్పిళ్ళగారు ఒక దినమున శ్రీ రామానుజులవారి గుణానుభవమును చేయుచుండుటలో -

" మాఱనడి పణిన్దుయ్న్దవిరామానుశన్ "

ఇత్యాది పాశురములను పఠించి, ఆళ్వారుల శ్రీపాదములయందును, దివ్యప్రబంధములయందును శ్రీరామానుజులకు ప్రసిద్ధమైయున్న అతిమాత్రప్రావణ్యమునకు దగినటుల, ఈ తిరునగరిలో - వారి కొక గుడిని నిర్మింపవలెనని తలంచి, అందులకు శిష్యులను నియమించి, ఉడయవరుల సన్నిధిని దానినిబట్టి 'శ్రీ రామానుజ చతుర్వేది మంగల' మనెడి వీధిని ప్రతిష్ఠించి,

" ఇరామానుజనై త్తొళుమ్ పెరియార్. "

అనునటుల - శ్రీరామానుజులను సేవించుచుండెడి పెద్దల నచట నివాసమును సేయ నియమించి, ఆ సంపత్తు నంతయు - నాయనారుల

కథీనము చేసిరి. నాయనారును - ఆయుడయవరుల శ్రీపాదములలో మిక్కిలి ప్రవణులై యుండి, వారికి తగిన కైంకర్యముల నన్నింటిని కొఅతలేక జరుపుచుండుటనుజూచి, సంతసించిన తిరువాయ్ మొళిప్పిళ్ళ గారు - 'యతీంద్రప్రవణులు' అని, నాయనారును పిలువ నారంభించిరి. ఈ దివ్యనామమే అపు డంతటను ప్రసిద్ధ మయ్యెను.

## యతిరాజవింశతి ననుగ్రహించుట

ఆ యుడయవరుల శ్రీపాదములలో నొక స్తోత్రమును విజ్ఞాపింప వలెనని ఆచార్యులు నియమింపగా, 'యతిరాజవింశతి' యను స్తోత్రమును యతీంద్రప్రవణులు విన్నవించి, దానిలో -

"శ్రీమన్ యతీంద్ర తవ దివ్య పదాబ్జసేవాం
శ్రీశైలనాథ కరుణా పరిణామదత్తామ్ ।
తా మన్వహం మమ వివర్ధయ నాథ ! తస్యాం
కామం విరుద్ధ మఖిలం చ నివర్తయ త్వమ్."

అనియెడి శ్లోకముచే, స్వాచార్య విషయమునందు ఉపకారస్మృతిని గూడ ప్రకాశింపజేసిరి.

(అనంతరము శ్రీరంగనాథుని సన్నిధిలో -

"యః స్తుతిం యతిపతి ప్రసాదినీం
వ్యాజహార యతిరాజవింశతిమ్ ।
తం ప్రపన్న జనచాతకాంబుదం
నౌమి సౌమ్య వరయోగిపుంగవమ్."

అను శ్లోకమును ఈ స్తోత్రమునకు తనియనుగా - ఎఱుంబియప్పా విజ్ఞాపించిరి.)

ఈ యతిరాజవింశతిలోగల మాధుర్యము మొదలగు గుణ విశేషములనుగూర్చి, 'అణ్ణా' - వరవర శతకమునందు -

"య దుదితా యతిభూపతి వింశతి : సమపదీరితశీదు స ధారసా."

అనియు -

"ద్రాక్షా మధిక్షివతి నిన్దతి మాకరన్ద సుధారసఝరీ మధరీకరోతి"

అనియు అనుగ్రహించియున్న శ్లోకముల నిచట అనుసంధింపనగును.

## నాయనారుకు - కుమారు లవతరించుట

(శ్రీ వరదరమునికి నాయనా రని - పూర్వాశ్రమ నామము.)

అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనారు - ఈ విధముగ ఆచార్యపరతంత్రులై సుఖముగా నుండ,

"ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మావ్యవత్సేత్సీః."

అను ఉపనిష ద్వాక్యానుసారము - క్షీరార్ణవమున చంద్రునివలె వారికి 'రామానుజప్పిళ్ళ' అను నామ ముంచు మనెడి ఆచార్య నియమ నానుసారము — 'నాయనారు' - అని నామకరణము చేసిరి.

## తిరువాయిమొళిప్పిళ్ళగారు పరమపదించుట

అపరిమితమైన శిష్యసంపత్తితో సుఖించుచున్న తిరువాయి మొళిప్పిళ్ళగారు - శారీరకమైన బాధ అధికమగుటచే - పరమపదము

నకు వేంచేయ నిచ్ఛగలవారై యుండ, ఒకనాడు స్వప్నమున పిళ్ళ లోకాచార్యులవారు దర్శన మనుగ్రహించి,

"వలమన్ద మిల్లదోర్ నాడు పుకువీర్"

(అంతులేని యానందముగల దేశమును జేరుడు) అని సెలవీయగా, పిళ్ళగారును - తేఱుకొని మేల్కాంచి, నిత్యకర్మానుష్ఠానములను నెఱ వేర్చుకొని, స్వాములందఱను పిలిపించి -

"ఇన్ఱు విణ్ణులకమ్ తిరువానాయ్ విత్తకిన్ఱాన్ విదివకైయే"

(కృపానుగుణముగ నేడు పరమపదమును అనుగ్రహించుటకై త్వరపడు చున్నాడు)

"దానేఱవశిదన్దవాట్టాక్కన్ వణివకైయే
వానేఱ ప్పోఱుకిన్ఱేన్ నరకత్తె నకు నెంజే."

(పరమపదమునకు జేరెడి మార్గము నను గ్రహించిన 'వాట్టాఱు' అని యెడి దివ్యదేశమున వేంచేసియున్న లక్ష్మీనాయకుని కారుణ్యానుగుణ ముగ నేను పరమపదమును జేరబోవుచున్నాను. ఓ మనసా ! నరక మును జూచి నవ్వుమా) అను పాశురములను విశేషముగ పఠించి, 'స్వాములారా ! సర్వేశ్వరుడు నన్నును - ఆచార్య శ్రీచరణసన్ని ధికి జేర్ప నిచ్ఛగించియున్నాడు. ఇక మీా రందఱు - మన అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనారును సామాన్యునిగ దలంపక, మన రామానుజుల పునరావతారమే వీరని యెంచి, వీరి యభిమానమునం దొదిగి సుఖింతురుగాత !' అని నియమించి, నాయనారును ఆచార్య పీఠమున నేర్పరచి, కులనాథా !

"జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా
సీతా భర్తార మాసాద్య రామం దశరథాత్మజమ్."

అని జనకచక్రవర్తి యపేక్షించినటుల - నేనును నిన్ను ఆధారముగ జేసికొని, అధికముగ సంతృప్తి జెందవలెనని అపేక్షించుచున్నాను. మన శ్రీ వైష్ణవ వర్గము నీచే పరమ విలక్షణమైన గౌరవమును పొందగలదు.

"శ్రేయాంసి సర్వా ణ్యధిగుణ్మష స్తే."

అనునటుల, ఒకదానియందును కొఱతలేని నీకు - ఇక నేను ఆశాసింప నలసిన దేమియు లేదు. నా హృదయమందున్న కొఱంతను పూర్వమే నీకు చెప్పియున్నాను. ఆ కొఱంతఁపేర నేటివఱకు నడచుచు వచ్చునట్లే, ఇకమీదను — మన పూర్వాచార్య దివ్యగ్రంథ ప్రవచ నానుభవములే కాలక్షేపముగ వెలసియుందువుగావుత! మన ఆళ్వారు లును - ఐకకంఠ్యముగ ఆసక్తులైయుండి, దర్శన నిర్వాహము చేసిన చోటు - శ్రీరంగము. కావున, నీవును ఆ ప్రదేశమునకు జేరి, పూర్వానతారమునందువలెనే. షడ్దర్శనము లనెడి వృక్షమును మొద లంత పెగగొట్టి, కలి గర్వము నడంచి, శ్రీరంగనాథుని సంపత్తును వృద్ధిజేసి, వేదార్థముల నన్నింటిని విశదము గావించి, నమ్మాళ్వారులు అనుగ్రహించిన ద్రవిడవేదమును వృద్ధినొందించి, ఈ లీలావిభూతిని నిత్యవిభూతిగ చేయుదువుగాత !' అని - నాయనారులను జూచి నియమించి, అనంతరము సన్నిధికి వేంచేసి, ఆళ్వారులను మంగళా శాసనముచేసి, స్వాముల నందఱను నాయనారుల శ్రీహస్తమునం దుంచి, గృహమునకు మరలి, పిళ్ళలోకాచార్యుల శ్రీపాదములను

ధ్యానించుచు, పరమపదమునకు వేంచేసిరి. నాయనారులు మొదలుగా గల స్వాము లందఱు - వారికి తిరుపధ్యయనాంతమైన చరమకైంకర్యములను జరిపించిరి.

## శ్రీ వానమామలై స్వామి నాయనారుల నాశ్రయించుట

అనంతరము నాయనారులు - తమ ఆచార్యుల నియమనమును శిరసావహించి, పూర్వాచార్యుల శ్రీసూక్తుల నన్నింటిని కంఠపాఠము చేసి - వానిని ధ్యేయముగ జేసికొని, ప్రసిద్ధప్రభావులై, తిరునగరిలో వెలసియున్న అతిశయమును విని, అనేక ప్రాంతముల నుండి అనేకు లేతెంచి, నాయనారుల శ్రీపాదముల నాశ్రయింప నారంభించిరి. మున్ముందుగ — వానమామలలో జ్ఞానాధికులుగా గల అళగియవరదులు - వైరాగ్యముచే ఆశ్రమస్వీకారము చేసి, 'శ్రీ రామానుజ జీయరు' - అను దివ్యనామమును పొంది, నాయనారుల శ్రీపాదములలో ఛాయారేఖవలె మిక్కిలి విధేయులై వచ్చి చేరి, విశేష ఫలమునుపొందిరి. వీరికి - 'పొన్నడిక్కాల్ జీయరు' - అను నామము కూడ - వాడుకలోనికి వచ్చెను.

## నాయనారులు శ్రీరంగమునకు బోవ - అనుమతిని పొందుట

నాయనారులు ఈరీతిగ అనేకులగు శిష్యులతో కూడియుండ, ఒక ఆర్ద్రానక్షత్రమున - గద్యత్రయానుసంధానము జరుగుచుండ నపుడు -

"యావ చ్ఛరీరపాత మత్రైవ శ్రీరంగే సుఖ మాస్వ"

అనియెడి శ్రీసూక్తి ప్రకరణమునందు - స్వాచార్యులయిన తిరువాయి మొళిప్పిళ్ళైగారి నియమనమును స్మరించి, అరామములచే చుట్టబడి యున్న శ్రీరంగమున నిత్యనివాసము జేయుచు, శ్రీరంగేశుని మంగళాశాసనమే తమకు కాలక్షేపముగనుండి సుఖంపవలెనని తలంచి, ఆళ్వారుల సన్నిధి కరిగి సేవించి, 'నీచుడనైన నన్ను - శ్రీరంగక్షేత్ర మున కేగి, అచట వర్తింపు'మని మా ఆచార్యులు నియమించి యుంచుటచేతను, దేవరవారి దివ్యప్రబంధములకు ప్రధాన ప్రమేయ భూతుడైన శ్రీరంగనాథుని శ్రీపాదముల సన్నిధిలో సుఖంచుట - దాసునకును హితముగా నుండుటవలనను, అచ్చోటునకు వెళ్ళి వసింప ననుమతిని అనుగ్రహింపవలెను' — అని ప్రార్థింప, ఆళ్వారులును - 'అట్లే శ్రీరంగమునకు చేరి, శ్రీరంగనాథుని శ్రీపాదముల నాశ్ర యించి, ఆ స్వామి యనుగ్రహమును పొంది, ఉజ్జీవింతువుగాక !' అని యనుగ్రహించి, అనుమతి నొసంగెను.

## నాయనారులు శ్రీరంగయాత్రకై బయలుదేరుట

ఆళ్వారుల పరమకృపచే అనుమతిని పొందిన నాయనారులు - 'శ్రీరంగేశుని పరమకృపకు లక్ష్యము కాగల్గితిమిగదా!' అని సంత సించి, స్వాములతో గూడి బయలు వెడలి, శ్రీవిల్లిపుత్తూరునకు చేరిరి. అచట వేంచేసియున్న వటపత్రశాయిని, పెరియాళ్వారులను, ఆండా ళమ్మను సేవించి, అచటి భక్తులు ప్రార్థించుటచే - అచట కొన్ని దినము లుండి, ఆశ్రయించినవారలకు శ్రీసంప్రదాయ విశేషములను వివరించి, అచటినుండి బయలుదేరి - 'తిరుమాలిరుంశోలై' (వనాద్రి) యను దివ్యదేశమునకు వేంచేసి, అచటనున్న 'నూపురగంగ' యను

నదిలో స్నాన మాచరించి, సుందరబాహుస్వామిని సేవించి మంగళా శాసనము చేసి, అచట - శ్రీకూరేశులు వేంచేసియున్న ప్రదేశమున నుండి - సుందరబాహు స్తవమునందలి గూఢార్థములను దాసుల కుప దేశించి, అచటినుండి పయనమై -

"వన్పెరు వానకముయ్య ......."

అను మొదలగు పలు పాశురములను,

"కదాఽహం కావేరీతట పరిసరే రంగనగరే
శయానం భోగీన్ద్రే శతమఖ మణిశ్యామలరుచిమ్ ।
ఉపాసీనః క్రోశన్ మధు మథన నారాయణ హరే
మురారే గోవిన్దే త్యనిశ మపనేష్యామి దివసాన్ "

అను మొదలైన శ్లోకములను - పరమ భోగ్యముగ అనుసంధించు కొనుచు వేంచేసి, క్రమక్రమముగ - శ్రీరంగములోని కావేరిని, వనము ను సమీపించి, అచట వేంచేసియున్న దైవశిఖామణియైన శ్రీరంగనాథుని శ్రీపాదముల సన్నిధిని చేరగల్గితిమిగదా ! అని మిగుల హర్ష మంది, నిత్యకర్మానుష్ఠానములను నెరవేర్చుకొని, వీథుల నన్నింటిని కనులార గాంచి, ఆనందించుచు - లోనికి ప్రవేశించిరి.

## శ్రీరంగమున - గౌరవ మర్యాదలు

ఆ కాలమున అచట - 'అణ్ణన్' అనెడి మహాత్మ లోకరు ప్రసిద్ధులై వేంచేసి యుండిరి. వారు - నాయనారుల వైభవమును ఇంతకుమున్నే వినియున్నందున, వీరిని సేవించి, వీరి సర్వజ్ఞత్వమును గ్రహించి ఆశ్చర్య మంది, వీరు అవతారపురుషులని ప్రపత్తిచేసి,

పెరుమాళ్ళు సన్నిధిలో - వివిధములైన అనేక గౌరవమర్యాదలను చేయింపనెంచి, అపుడు సన్నిధికి అర్హాహకులై యున్న 'తిరుమాలై త్తన్దపెరుమాళ్ భట్టర్' అనియెడి మహనీయులకు దెలుప, వారును సంతసముతో నేతెంచి, నాయనారుల శ్రీపాదములను సేవించి, కొన్ని సూక్తులను విన్నంతలో -

''శ్రీమాన్ శ్రీభాష్యకారోఽసౌ భూతలే పున రుద్ధితః ।
ఇతి నిశ్చిత్య సంతుష్య ప్రావణ్య మతులం దధౌ.''

అనునటుల - నాయనారులను శ్రీరామానుజులవారి పునరవతారముగ నిశ్చయించి, పరిజన పరిబర్హ పరిచ్ఛద పురస్కార విశేషములతో సన్నిధియందు మంగళాశాసన మొనర్ప నియమించిరి

## శ్రీరంగ మంగళాశాసనము

అనేక పరివారములతో సన్నిధిమంగళాశాసనమునకు వేంచేసిన నాయనారులు - మున్ముందుగ శ్రీ రామానుజులను దర్శించి, వారి దివ్యమంగ విగ్రహ సౌందర్యమునకు ఆనందానుభూతిని పొంది, అనంతరము - సపరివారుడైన శ్రీరంగశాయిని మంగళాశాసనము గావించి, తిరుమాలై, అమలనాదిపిరాన్ - మొదలగు దివ్యప్రబంధములను, శ్రీరంగరాజ స్తవము - మొదలైన స్తోత్రములను అనుసంధించుచు, రంగనాథస్వామియెదుట నిలిచియుండగా, పెరుమాళ్ళును-నాయనారును కటాక్షించి, 'నాకు కావలసినవారిని నేనే వెదకు కొంటిని; నా అవాప్త సమస్త కామత్వము-నేడే పరిపూర్ణమైనది' - అని పలికి, సకలవిధములైన బహుమానములను ప్రసాదింప, నాయనారులు ఆ బహుమానముల గైకొని, కృతార్థులై,

"పెరియక్కాళ్ పట్టక్కాల్ - పెఱాద వయన్ పెరుమూరు."

అనునట్లు, అణ్ణనువిషయమునందును కృతజ్ఞతానుసంధానము గావించి, గొప్ప గౌరవ మర్యాదలతో బయలుదేరి, పిళ్ళలోకాచార్యుల మందిరమునకు వేంచేసి, నమస్కరించి, 'రహస్యములు వృద్ధిబొందిన మన్ను' – అని ఆ ప్రదేశమునందలి మృత్తికను మిక్కిలి ప్రశంసించి, ప్రతిదినము అచటికి వేంచేసి, రహస్యగ్రంథములందలి విశేషములను ప్రవచనము జేయుచు -

"సమయా నానందమయాన్‌గమయా మాసైశరంగిణం సమయా."

అనునట్లు - ఆనందమయములుగ దినములు గడపిరి.

## నాయనారులు - దివ్యదేశయాత్ర చేయుట

ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట, ఒకానొకపుడు నాయనారులు - చోళ, మధ్య, తొండదేశములలో గల దివ్యక్షేత్రముల నన్నింటిని సేవింప సంకల్పించి, శ్రీరంగనాథుని సన్నిధికిబోయి, స్వామి యనుమతిని పొంది, శిష్యవర్గముతో పయనమైరి. మార్గ మధ్యమున గల దివ్యదేశములను సేవించుచు రాగా, తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామికి కన్యామాసమునందలి బ్రహ్మోత్సవము సమీపించినట్లు తెలిసికొని, అచటకు విచ్చేసి, శ్రీనివాసుని సేవించి, ఆ దేవాలయ సత్కారములను పొంది, అచటినుండి బయల్వెడలి – కాంచీపురమునకు వేంచేసిరి.

# శ్రీ వరదరాజస్వామికి - మంగళాశాసనము

నాయనారులు కాంచీపురమునగల దివ్యదేవాలయములన్నింటిని సేవించి, అచట వేంచేసియున్న వరదరాజస్వామిదివ్యమంగళవిగ్రహ సౌందర్యమునకు ముగ్ధులై, దేవరాజమంగళ మనెడి స్తుతిని అనుగ్రహించిరి.

## దేవరాజ మంగళము

మంగళం వేధసో వేది - మేదినీ గృహమేధినే ।
వరదాయ దయాధామ్నే - ధీరోదారాయాస్తు మంగళమ్ ॥ ౧

వాజిమేధే వపాహోమే - ధాతు రుత్తరవేదితః ।
ఉదితాయ హుతా దగ్నే రుదారాంగాయ మంగళమ్ ॥ ౨

యజమానం విధిం వీక్ష్య - స్మయమానముఖశ్రియే ।
దయమానదృశే తస్మై - దేవరాజాయ మంగళమ్ ॥ ౩

వారిదశ్యామవపుషే - విరాజత్పీతవాససే
వారణాచలవాసాయ - వారిజాక్షాయ మంగళమ్ ॥ ౪

అద్యాపి సర్వ భూతానా మభీష్ట ఫలదాయినే ।
ప్రణతార్తి హరాయాస్తు - ప్రభవే మమ మంగళమ్ ॥ ౫

దివ్యావయవసౌందర్య - దివ్యాభరణహేతవే ।
దన్తావళ గిరీశాయ - దేవరాజాయ మంగళమ్ ॥ ౬

పురుషాయ పురాణాయ - పుణ్యకోటి నివాసినే
పుష్పితోదారకల్పద్రు కమనీయాయ మంగళమ్ ॥ ౭

కాంచనాచలశృంగాగ్ర కాలమేఘానుసారిణే ।
సుపర్ణాంసావతంసాయ - సురభూజాయ మంగళమ్ ॥ ౮

భోగాపవర్గయో రేకం - వాంఛద్భ్యో దదతే ద్వయమ్ ।
శ్రీమ ద్వరదరాజాయ - మహోదారాయ మంగళమ్ ॥ ౯

మతం గజాద్రితుంగాగ్ర శృంగశృంగారవర్షిణే ।
మహాకృపాయ మద్రదష్టాదిక్షితాయాస్తు మంగళమ్ ॥ ౧౦

శ్రీకాంచీపూర్ణమిశ్రేణ - ప్రీత్యా సర్వాభిభాషిణే ।
అతీతార్చావ్యవస్థాయ - హస్త్యద్రీశాయ మంగళమ్ ॥ ౧౧

అస్తు శ్రీస్తవ కస్తూరీ - వాసనా వ్వాసితోరసే ।
శ్రీహస్తిగిరినాథాయ - దేవరాజాయ మంగళమ్ ॥ ౧౨

మంగళాశాసనపరైః - మదాచార్యపురోగమైః
సర్వైశ్చ పూర్వై రాచార్యైః - సత్కృతాయాస్తు
మంగళమ్ ॥ ౧౩

అను శ్లోకములు - దేవరాజస్తుతిపరములుగా ప్రశిద్ధములై యున్నవి.

శ్రీహస్తిగిరినాథాయ - మంగళాశాసనం ముదా ।
కుర్వతే రమ్యజామాతృమునీంద్రాయాస్తు మంగళమ్ ॥

అనెడి శ్లోకమును ఈ స్తోత్రమునకు చివర చేర్చి, పెద్దలు అనుసంధించుచున్నారు.

## నాయనారులు శ్రీభాష్య మధికరించుట

కాంచీపురమున వేంచేసియున్న - సత్సంప్రదాయశుద్ధి గలవారగు 'కిడాంబినాయనారు' అనిమెడివారికడ - నాయనారులు

శ్రీభాష్యమును అధికరింపదలచినవారై, అందులకు ముందుగా శ్రీ రామానుజుల నియమనమును పొందగోరినవారై, ఒకానొక ఆర్ద్రా నక్షత్రమున - శ్రీపెరుంబూదూరుకు వేంచేసిరి. అచట ముక్తకములుగ కొన్ని పాశురముల ననుగ్రహించిరి.

అచట శ్రీరామానుజులను సేవించి, అనుమతిని పొంది, తిరిగి కాంచీపురమునకు వేంచేసి, కిడాంబి నాయనారువద్ద శ్రీభాష్యమును అధికరించి ముగించినంతనే, కొందఱు భాగవతోత్తములు స్వామి శ్రీపాదముల సన్నిధిలో శ్రీభాష్యమును సేవింపవలెనని తలంచిన వారలై వీరిని మిగుల ప్రార్థింప, స్వామియు - సంతసముతో శ్రీ యథోక్తకారి సన్నిధిలో వేంచేసియుండి, వారలకు ఒక సంవత్సరకాలము శ్రీభాష్యప్రవచనము గావించిరి. (ఈ కారణమువలననే 'తిరువెడికా' అను దివ్యదేశమునందు మణవాళమహాముసులు - వ్యాఖ్యాన ముద్రతో దర్శన మనుగ్రహించుచున్నారని - పెద్దలు వక్కాణింతురు.)

## నాయనారుల - సకలశాస్త్ర పారంగతత్త్వము

స్వామి - తాము శ్రీభాష్యము నధికరించెడికాలమునందును, శిష్యులకు దానిని ప్రవచనముచేసెడి కాలమునందును - తమ న్యాయ మీమాంసాది సకలశాస్త్ర పారావార పారీణత్వమును బహుముఖములుగ ప్రకాశింపజేసిరి. తర్క మీమాంసాదులలో పాండిత్యముగల ఆచార్యులు ఇంకను ఎందఱో వేంచేసియున్నను, స్వామికి గల పాండిత్య ప్రకర్ష ము పరమ విలక్షణ మనునది - స్వామి యనుగ్రహించిన వ్యాఖ్యానములలో - ప్రతి అక్షరమందును - అతి

స్ఫుటముగ వెలుంగును. ఒక్కొక్క శ్రీసూక్తియందు - శాస్త్రార్థ సారమే స్వరూపముగా గలదనునట్లు ప్రస్ఫుటించును.

## నాయనారులు శ్రీరంగమునకు చేరుట

ఈవిధముగ కాంచీపురమున నొక సంవత్సరకాలము వేంచేసి యుండి, ఆశ్రితులకు శ్రీభాష్యసారమును బోధించి, తిరిగి నాయనారులు శ్రీరంగమునకు వేంచేసి, ఇచట శ్రీరంగనాథుని విశేష కటాక్షమునకు భాజనులయి, వర్తించుచుండిరి.

## నాయనారులు ఆశ్రమ స్వీకారము చేయుట

ఇట్లు కాలము గడచుచుండ, ఒకానొకపుడు స్వామి - తురీయాశ్రమస్వీకారము గావింపవలెనని సంకల్పించిరి. అపుడు కోవెలలో - 'శ్రీ శఠకోప జీయరు' అని ప్రసిద్ధిజెందియున్న మహనీయుల వద్ద సన్యాసాశ్రమమును స్వీకరించి, శ్రీరంగనాథునకు మంగళాశాసనము చేయుటకై వేంచేసి నిలిచియున్నంతలో, పెరుమాళ్ళును వీరిని ఆదరించి, తమ దివ్యనామమునే వీరికి ప్రసాదించి, (అళగియ మణవాళమహామునులు సుందరజామాతృమునులు' అని యుంచి), సకల గౌరవమర్యాదలను చేయించి,

"యావ చ్ఛరీరపాతం - అత్రైవ శ్రీరంగే సుఖ మాస్వ."

అని శ్రీరామానుజులకువలె - వీరికిని అనుమతి ననుగ్రహించి, పల్లవరాయని మఠమును బహుమానముగ ప్రసాదించి, సకల పరివారముతో పంపగా, అళగియమణవాళమహామునులైన నాయనారులు - పెరు

మాళ్ళ నియమనమును శిరసావహించి, మఠమున వేంచేసి, శ్రీరంగ నాథుని కృపావిశేషమునకు పాత్రులై యుండిరి. ఇట్లుండ, ఆ కాలము నందు మహామునుల వైభవ మంతటను వ్యాపింప, అనేక ప్రాంతముల నుండి పలువురు వచ్చి, ఈ స్వామిని ఆశ్రయింపసాగిరి.

## శ్రీవైష్ణవధర్మ పరిచారము

మహామునులు - తమ మఠములో కొంతభాగమును స్వాచార్యులైన తిరువాయిమొళిప్పిళ్ళగారి దివ్యనామముతో కాలక్షేపకూటముగ నేర్పఱచి, దానిలో - పూర్వాచార్య దివ్య శ్రీసూక్తులను శిష్యవర్గమునకు బోధించుచుండిరి.

ఇట్లుండ, 'గోవిందదాసరప్ప' అను నామాంతరముగల 'పట్టర పిరాన్ జీయరు' - అనువారును, శ్రీరంగమునందలి ఆచార్యపురుషు లలో నొకరైన 'కందాడై అణ్ణన్' అను వారును ఆగమించి, మహా మునుల శ్రీపాదముల నాశ్రయించిరి.

## మణవాళమహామునులు శ్రీరంగమునకు జేరుట

ఈరీతిగా మహామునులు ఆశ్రితులకు అచట కాంచీపురమున శ్రీవైష్ణవ సంప్రదాయ విశేషములను ఉపదేశించినవారై, అచటి నుండి బయలుదేరి, ఆ పాండ్యదేశమునందుగల ప్రసిద్ధ దివ్యక్షేత్రము లను సందర్శించుచు, అట నట - తమ శ్రీపాదముల నాశ్రయించిన వారలకు విశేషార్థముల ననుగ్రహించుచు, కైంకర్యమును చేయునట్లు కటాక్షించి, ఆయా క్షేత్రనాథులకు విశేషముగ కైంకర్యమును గావించి,

"రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్."

అను మంగళాశాసనమును వృద్ధిచేసి, శ్రీరంగనాథుని సేవగావించుటకు మరల శ్రీరంగమునకు విచ్చేసిరి. అపుడు ఘటికాచల సమీపముగా గల 'ఎఱుంబి'యను అగ్రహారమునకు జెందిన ప్రముఖ విద్వాంసు లగు 'ఎఱుంబియప్పా' అనువారొకరు శ్రీరంగమునందలి మహామునుల మఠమున కేతెంచి, వారి శ్రీపాదముల నాశ్రయించి, పంచసంస్కారములను, సకలార్థములను బడసి కృతార్థులై, మహామునులయందు పరమభక్తిపరీవాహ విశేషమున - మణవాళ మహామునుల వైభవ ప్రాభవాదులను వర్ణించుచు - కావ్య, నాటక, చంపూ, స్తోత్రము లాదిగా అనేక గ్రంథములను రచించిరి. క్రమముగ ఇట్లే వారి శ్రీపాదముల నాశ్రయించి, పలువురు కృతార్థులైరి.

## మహామునులపై శ్రీరంగనాథుని భవ్యభావన

మణవాళ మహామునులయందు శ్రీరంగనాథునకు అనుగ్రహము గలవారగుటయేగాక, అత్యంతము సంతుష్టాంతరంగులై, ఒకనాటి కాలక్షేపగోష్ఠిలో —

"అవావిలన్దాది యిప్పత్తఱిన్దాళ్ పిఱన్దారుయరన్దే."

అను వరుకు వ్యాఖ్యానమును సాయించి, అటుపిమ్మట బహుమానము లందుచున్నతరుణమున శ్రీరంగనాథుడు - నాలుగైదు సంవత్సరముల వయస్సుగల అర్చకకుమారుని వేషము ధరించి, అతివేగముగ గోష్ఠినడుమకు వచ్చి, అచటివా రడ్డగించుచున్నను లక్ష్యము సేయక నిల్చి కేల్మోడ్చి —

"శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరంమునిమ్"

అని శ్లోకమును విన్నవించి, అంతర్ధాన మందె, ఈ విచిత్ర సన్నివేశ మును జూచి అందఱు ఆశ్చర్య మందిరి.

ఇట్లు దైవవాక్కుగా వెలువడినదియు, మహామంత్రమువంటి దియు నగు ఈ శ్లోకము - నాటినుండి ద్రవిడ వేదాధ్యయనమునకు పూర్వమునందును, అంతమునందును అనుసంధించుట పరిపాటి యయ్యెను.

## మణవాళ మహామునుల రచనలు

మహామునులు - తత్త్వత్రయము, రహస్యత్రయము, శ్రీవచన భూషణము, ఆచార్య హృదయము, జ్ఞానసారము, ప్రమేయసారము, పెరియాళ్వార్ తిరుమొళి, రామానుజ నూత్తందాది - అనియెడి ఎనిమిది గ్రంథములకు వ్యాఖ్యానములను, ఈడుకు - ప్రమాణ త్తిరట్టు, ఆరాయిరమ్, తత్త్వత్రయ త్తిరట్టు, శ్రీవచనభూషణ త్తిరట్టు' ఆర్తి, యతిరాజవింశతి, ఉపదేశరత్నమాలై, తిరువాయిమొళి నూత్తందాది, తిరువారాధనక్రమము - మున్నగు గ్రంథములను రచించియున్నారు.

## అష్టదిగ్గజ శిష్యవర్గము

మణవాళ మహామునుల శ్రీపాదముల సన్నిధిలో - వేల కొలదిమంది ఆశ్రయించి ఉజ్జీవించియున్నను, అందు ప్రధానతములు

అష్టదిగ్గజము లని - ప్రసిద్ధిజెందినవారు - ఎనమండుగురు ఉన్నారు. వారి నామధేయము లివి :-

౧) వానమామలై జీయరు

౨) పట్టరపిరాన్ జీయరు

౩) తిరువేంగళ రామానుజ జీయరు

౪) కోయిల్ అణ్ణను

౫) ప్రతివాది భయంకరం అణ్ణను

౬) ఎఱుంబియప్పా

౭) అప్పిళ్లై

౮) అప్పిళ్ళాన్

వీరిలో మొదటి మూవురు - జీయరులు. మిగిలినవారు - గృహస్థులు.

## వైభవ విశేషములు

శ్రీ రామానుజ వైభవము వలె - మణవాళ మహామునుల వైభవము అతి విస్తృతమైనది. కనుక -

"తులామూలావతీర్ణాయ - తోషితాఖిలసూరవే
రమ్యజామాతృమునయే - శేషాంశాయాస్తు మంగళమ్."

అను మంగళాశాసనముతో - మహనీయుల వైభవమును సంగ్రహముగా నిట ముగించుచున్నారము. *

---

* మణవాళమహామునుల సమయము - క్రీ. శ: 1370 నుండి, 1444 వరకు మొత్తము 74 సంవత్సరములు ఆ మహనీయులు - ఈ లీలా

విభూతిలో వేంచేసియున్నారు. వీరికి - నామాంతరము లనేకములు కలవు. అట్టివానిలో - పెరియజీయరు, సౌమ్యజామాతృయోగీంద్రులు, రమ్యజామాతృమునీంద్రులు, యతీంద్రప్రవణులు, అళగియమణవాళజీయరు, కాన్తోపయన్తా, వరవరముని, వరవరయోగి, రామానుజం పొన్నడి, రుచిరజామాతృయోగీంద్రులు - మొదలగు నామాంతరములు మిక్కిలి ప్రసిద్ధములై యున్నవి. వీరి వైభవ విశేషములు- గురుపరంపరాప్రభావము నందును, ఆచార్యసూక్తిముక్తావళియందును, మఱికొన్ని గ్రంథము లందును - విపులముగా వర్ణింపబడియున్నది. ఈ మహనీయుల ఆలయములు - శ్రీరంగము, తిరుపతి - మున్నగు క్షేత్రములలో అనేకము లున్నవి.

— సంపాదకుడు.



# ఆంధ్ర యతిరాజ వింశతి

(శ్రీ మణవాళ మహామునుల సంస్కృత మూలమునకు - ఆంధ్ర పద్యానువాదము)

-: సమర్పణ :-

' విద్యాభూషణ - కవితా విశారద '

## శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు



ఏ వరయోగిచంద్రుఁడు యతీంద్రుని వింశతి పద్యరాశిచే
శ్రీ విలసిల్ల సంస్తుతులు చేసెను, అట్టి మహాగమాంతక
శ్రావణులన్. సుభక్త జనచాతకవారిదుఁ డార్యసన్నుతుం
డా వరయోగిచంద్రుని నహర్నిశమున్ భజియింతు నెప్పుడున్.

*  *  *

శ్రీరమణీశపాద సరసీరుహయుగ్మమునందు నిత్య సే
వారతుఁడైన భవ్య శరవైరికి శ్రీచరణాబ్జరూపమై
ధారుణి నాశ్రితౌఘ దురితంబులఁ బారఁగ దోలినట్టి యా
ధీరుని రామసోదరు యతీంద్రునిఁ బ్రస్తుతిఁజేతు నెప్పుడున్.

౨

శ్రీయుతు రంగపాదసరసీరుహయుగ్మమునందు నెప్పుడుం
బాయని రాజహంస శరభంజన సచ్చరణాబ్జభృంగమున్
ధ్యేయ చతుష్క విప్రముఖ నీరజ తీక్ష్ణకరుండు కూరభూ
నాయకు నేలినట్టి యతినాథుఁడు మాకుఁ బ్రసన్నమయ్యెడిన్.

౩

మానస వాక్య కాయక సమాజముచేత భవ త్పదాబ్జముల్
పూని భజించు కూరకులపుంగవముఖ్యుల పాదపద్మముల్
మానసమందు నిల్పి, యనుమానములేక వహించి యెప్పుడున్
ధ్యానము సేయఁగావలయు ధారుణి నో యతిరాజశేఖరా !

౪

ఆరయ నా మనంబు భవదాకృతిసంస్మృతియందె వాక్యమున్
చారుతర ప్రమేయ గుణసన్నుతిజేయును భూరినిష్క్రియా
ధార కరద్వయంబునకు దాస్యమె యీ కరణత్రయంబు ని
స్సారత మాన్యవృత్తి కవచంబగుఁగాక యతీంద్రశేఖరా !

౫

దక్షతరాష్టవర్గ సముదాయ లస త్త్రిపదార్థనిష్ఠ నా
కీ క్షితిలో నొసంగు మీఁక నెందు దృఢం బగు నాదు బుద్ధి మ
ప్పక్షయకృద్భవచ్చరణ పంకజసారముఁ గ్రోలి పేర్మిచే
నక్షయ సౌఖ్య మందు వినయాన్వితమై యతిరాజశేఖరా !

౬

లేదు భవత్ప దాబ్జరుచిలేశము నాకు - మదీయ వాంఛా శ
బ్దాదిసుఖాదిభోగవిభవంబులయందె వసించు,నిదాన మిందుకున్
మోదముతోడ బాఢ నఘపుంజమె యూరసి వానినిన్ వెసన్
ఆదర మొప్పఁద్రుంచుము దయాళుఁడవై యతిరాజశేఖరా !

౭

మానుషవేషినై దురభిమానమునన్ పశువృత్తి నెప్పుడున్
మానకయున్న నన్ను గని, మాన్పు డితం డమితప్రభావ సు
జ్ఞాని యటంచు మంతన విచారము చేయుదురే మొకాని, నే
హీనుడనయ్య, సద్వినయ మించుక లేదు యతీంద్రశేఖరా !

౮

ప్రోడిగ నేరు శబ్దముఖభోగములందుఁ బ్రియుండ నెప్పుడున్
మేదినిలో బలాదుల సమేతుఁడనై శరణాగతాఖ్యచే
ఖేదమె చేతు నీకు సపకీర్తికి నోడక; సిద్ధికోటిలో
మోదముతోఁ జరింతు నతిమూఢుఁడనై యతిరాజశేఖరా !

౯

వర గురుమంత్ర దేవతల వాసి యెరుంగక గర్వినై తిర
స్కారణమె చేతు నిశ్చయముగా భయ మించుక లేక ధూర్తనై
నిరతము మంచివానివలె నిన్ను భజించెడివారిలోపలన్
మురియుచు సంచరింతు నతిమూర్ఖుడనై యతిరాజశేఖరా !

౧౦

ప్రాకట వాఙ్మనః కరణ భావముచే త్రివిధాపచారముల్
గైకొని దుర్యశంబునకుగా మది నోడక శిష్టకోటిలోఁ
జేకొని నీకు నప్రియము చేసి, ప్రియంకరుమాడ్కి నుండెదన్
హా కరుణించు మూర్ఖచరితాహ్వయుడన్ యతిరాజశేఖరా !

౧౧

పాతక మేను సేయు నెడ భావములోని భయానుతాప అ
జ్ఞాతతి గల్గి నే మగుడ శక్తుఁడగాను; భయాదిలేశ మీ
భూతలమందు నాకుఁ దలపోయఁగలే దటుగాన, దుష్కృతో
పేతుఁడనై మఱి న్నఘము పెంచెదనో యతిరాజశేఖరా !

౧౨

లోపల వెల్పలన్ సకలలోక పదార్థములందు నిశ్చల
వ్యాపకుఁడైన శ్రీవిభుని యండ సమీప భవంబుమానియున్
ఏపునఁ గానలేక భువి నెప్పుడు గామవశంగతుండ, నీ
దాపున సంచరింప నుచితజ్ఞుఁడగాన్ యతిరాజశేఖరా !

౧౩

దారుణమైన యీ త్రివిధ తాపజ దుఃఖముచేత నాకు నా
కారము పూని యందె రుచి గల్గెడు నెప్పుడు; దన్నివృత్తికిన్
ఆరయఁగా మనంబు ధృతి నందక నిందుకుఁ గారణంబు మ
త్ప్రేరితపాతమే నది హరించుము నీవు యతీంద్రశేఖరా !

౧౪

కూరిమితోడ వాక్కుల కగోచర సద్గుణరాశి గల్గు నా
కూరకులేశ తత్కథిత కుంఠిత నైచ్యముఖేనపాత్రుఁడన్
ఆరసి చూడ నీ జగతియందున నా సరిలేఁడు — నీ కృపా
సారమె యెందు నాకుఁ గతి సంతతమున్ యతిరాజశేఖరా !

౧౫

ధీరత యామునార్య గుణదీపిత కూరకులేశ నాత్మ వి
ద్యారత భట్టదేశిక కదంబము పల్కినయట్టి నైచ్యమున్
సారెకు గల్గు నా యెడల సంశయ మించుకలేదు - నీ కృపా
సారమె యెందు నాకు గతి సంతతమున్ యతిరాజశేఖరా !

౧౬

సొంపగు భోగ పంచకరుచుల్ భువి నీ దయచేత బాసి, తా
కంపన మొంది నష్ట మగుఁగాత, భవ త్ప్రియదాస దాస పా
రంపరితాంతమందుల దిరంబుగ నెవ్వరో, వారి సేవ నా
కింపున నుండుగాక యిక నెప్పటికిన్ యతిరాజశేఖరా !

౧౭

అలవడ సారభూత నిగమాంత సువేద గుణ స్వరూపమున్
గలిగిన రంగభూవిభుఁడు గన్పడు నీకు విధేయమూర్తియై
నిల నటుగాక, నీ మహిమలే యని యెన్నుదు నాశ్రితౌఘముల్
దలఁపగ బాపఁజేయు మిక మూఘుఁడవై యతిరాజశేఖరా !

౧౮

అంచితమా త్రికాలములయందును దుష్కర వాఙ్మనఃక్రియా
సంచిత పాపకర్మునకు జక్రి దయాశరణంబు వేడ్క భా
వించగ నా రమావిభుని వేడితి, నా క్షమయే త దంఘ్రులన్
గాంచినవారికిన్ అవిమె కౌశలమా యతిరాజశేఖరా !

౧౯

శ్రీయుతు శైలనాథ సవిశేషకృపాపరిణామదత్తమై
యాయతమై, ప్రసిద్ధ మగునట్టి భవత్పదకంజసేవ నా
కీ యెడ నుండఁజేసి యిక నెప్పుడు తత్ప్రతికూలకామముం
బాయఁగఁజేయు నీకు నది భారమె చూడ యతీంద్రశేఖరా !

౨౦

సందియ మేల నాత్మగుణసంశయ మించుక లేదు; మూఢుడన్
బొందుగ నన్యులన్ శరణు బొందినవాఁడని నన్నుఁ జూచి, పీ
డంధుఁ డటంచు నీవు కరుణారసమగ్నునిఁ జేసి, చింతలోఁ
జెందఁగనీకు - విన్నపము చేసెదనో యతిరాజశేఖరా !

* * *

స్తుతిమధురంబుచేఁ జెలఁగు సూక్తులచే యతినాథు నెప్పుడున్
అతిశయ మొందఁజేసిన గుణాకరు నా వరయోగినీసమం
చిత మగునట్టి సంస్మరణ సేయుచునుండెడి నాదు బుద్ధి, సం
తత మతిహేయ నా శరహితంబగునట్టి విరక్తి నొందెడిన్.

వాసియు గల్గినట్టి మణవాళమహామునిచంద్రుఁ డార్తి చే
జేసినయట్టి భవ్య యతిశేఖరవింశతి నెవ్వరేనియున్
వ్రాసిన, సంస్మరించినను, వర్ణనఁ జేసిన - దుష్కృతంబులన్
బాసి, యతీశ్వరక్షమకు పాత్రులునై విహరింతు రెప్పుడున్.



# శ్రీ వైష్ణవ మత ప్రాశస్త్యము

'ఉభయ వేదాంత విశారద'

## డాక్టర్ : కిడాంబి నరసింహాచార్యులు

ఎం. ఏ; పిహెచ్. డి.



## ఉపక్రమము

వైదిక కాలమునుండియు - విష్ణు పూజ, వైష్ణవ మతము ప్రచారములో నున్నట్లు - అనేక నిదర్శనములు కలవు. అట్టివానిలో - ముఖ్యముగా వేదములు సాక్ష్యాధారములుగా పరిగణింపదగియున్నవి.

## వేదములలో వైష్ణవము

౧. సంహితలు :-

"శృణోతు మిత్రో అర్యమాభగోః."

ఇత్యాదిగా - వేదములందు భగదేవతా నామము కన్పించుచున్నది. ఈ భగదేవత - శుభాశీర్వచనప్రదాతగా వ్యవహృత మగుచున్నది. ఈ భగశబ్దమున - 'శ్రేయశ్శక్తి' యను భావము పెంపొంది, క్రమముగా అట్టి శక్తిగలవాడే 'భగవాను[1] డని తలపబడెను. భగవదారాధనతో కూడిన మతము భాగవత మతము. అట్టి భాగవతమతమే వైష్ణవ

1. సర్వసిద్ధాంత సౌరభము . 7 - వ భాగము. పుట 42. (1962) అనుభవానందస్వామి.

మతము. భాగవతులు విష్ణువును భగవానునిగా గ్రహించిరి. ఈ భాగవత మతమే సాత్వత వాసుదేవ మతము.[2] భగశబ్దము నందలి భకారమునకు-'అధారమైనది' అని సూచించును.[3] వాసుదేవ శబ్దము కూడ - జగత్తునకు ఆశ్రయమైనవాడు. (ఆహార రూపమున సర్వప్రాణిగతుడు) అను అర్థము నిచ్చును. కాన, భాగవత మతమే వాసుదేవ మతము. వాసుదేవ మతమే వైష్ణవ మతము.

ఋగ్వేదమున విష్ణుపూజకుల వర్గమున్నది. కొన్ని తావులలో - దైవముగా చెప్పబడెను. విష్ణువు - చైత్యరూపుడు. విష్ణువును - 'సిపివిష్టుడు' - అని వ్యవహరించిరి. అనగా :- కిరణములను ధరించినవాడని యర్థము. విష్ణువు - తన కిరణములతో భూమియందు ఆవరించియున్నాడు. ఈ కారణమున, విష్ణువును సూర్యుని యొక్క అనేక రూపములలో - ఒక మూర్తిగా భావించిరి. విష్ణుచక్రము - సూర్యచక్రముగా వర్ణింపబడెను. సూర్యుడు - రెక్కలుగల దేవతాపక్షిగా చెప్పబడెను. విష్ణువాహనము గరుడుడు గావున, విష్ట్వాధిక్యము గమనార్హము. విష్ణువు ఆదిత్యునితో గూడియు, వర్ణింపబడెను. విష్ణువు గోరక్షకుడుగా చెప్పబడెను. విష్ణుప్రకటనయందు 'కుచర' శబ్దము వాడబడినది. ఆ కుచరయే కృష్ణుడు. కృష్ణుడే

---

2. భారతీయ తత్త్వశాస్త్రము (డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆంగ్లమూలమునకు ఆంధ్రానువాదము) 5 - వ భాగము. పుటలు 279 - 280. (1961) బులుసు వేంకటేశ్వరులు.

3. సర్వసిద్ధాంత సౌరభము : 7 - వ భాగము. పుట 15. (1983) అనుభవానందస్వామి.

విష్ణువు. భూమియందు అవతరించుటచే - ఆ పేరు వచ్చినది. [4] విష్ణువు ప్రాణికోటి రక్షకుడు. [5] ఋగ్వేదములో -

"ఇదం విష్ణు ర్విచక్రమే - త్రేధా నిదధే పదమ్...."

"త్రీణిపదా విచక్రమే విష్ణు ర్గోపాదాభ్యః...."

అనెడి మంత్రములు - విష్ణుప్రశంసతోపాటు - అతని త్రివిక్రమములు సూచింపబడినవి.

"న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమం తమాప్." [6]

ఋక్సంహితయందు విష్ణువర్ణనలు అనేకములు కలవు. పై ఋగ్వేద ప్రశంసలు - విష్ణువునకు గల ప్రాచీనత్వమును, దైవత్వమును, శక్తి సామర్ధ్యములను గ్రహించుటకు ఉపయుక్తము లగు అంశములు.

"త త్పురుషాయ విద్మహే - నారాయణాయ ధీమహి. తన్నో విష్ణుః ప్రచోదయాత్".

అని - కృష్ణయజుర్వేదములో - 'విష్ణు గాయత్రి' కలదు.

---

4. "వసంతి అస్మి న్నితి - వాసుదేవః". "జగతి వసతి అయమితి."

5. ది కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా : భాగము 4. పుట 108. [రామకృష్ణ మిషన్ - 1976]

6. ది క్రిటికల్ స్టడీ ఆఫ్ ది ఫిలాసఫీ ఆఫ్ రామానుజ. అనిమా సేన్ గుప్త : పుట - 8, 9, [1967].

౨. బ్రాహ్మణములు :-

ఐతరేయ బ్రాహ్మణమునందు - విష్ణువు ఇంద్రునకు మిత్రుడుగా ఉండి, యుద్ధములో సహకరించె నని కలదు.[7]

"అగ్ని ర్వై దేవానా మవమః. విష్ణుః ప్రథమః. తదంతరేణ సర్వే అన్యా దేవతాః"

అని - విష్ణువు అధికుడుగా, అగ్ని తక్కువవాడుగా చెప్పబడెను.[8] శతపథ బ్రాహ్మణమందు విష్ణువు సర్వదేవతాధిక్యతను గాంచినట్లు గలదు.[9] అందు - 'వామన' ప్రశంస కలదు. ఈతని త్రివిక్రమత్వము పలువిధముగా వర్ణింపబడినది. సూర్యోదయ-మధ్యాహ్న-అస్తమయ రూపములుగా మఱియొక తావున విష్ణువు వర్ణింపబడెను. మఱి యొకతావున, పృథివిపై, అగ్నిపై-వాతావరణమున వెలుగుగా, ఆకాశ మందు సూర్యుడుగా ఈ త్రివిక్రమములు వర్ణింపబడినవి.[10] స్వర్గ వాసులు, రోదసి అధిపతులు, భూదేవతలు - అని, దేవతలను మూడు విధములుగా యాస్కుడు తన నిరుక్తమునందు విభజించెను. ఈ మూడుమూర్తుల సమాహారమే త్రివిక్రమము. ఇయ్యది - సర్వదేవ తాసైక్యసూచకము.

ప్రధానోపనిషత్తులందు బృహదారణ్యకము విష్ణ్వాధిక్యమును వివరించును. స్వర్గద్వారమునకు విష్ణువే ప్రధాను డనియు, గతించిన వారికి వాసము - విష్ణుపద మనియు - ఇందు వివరింపబడినది. విష్ణు

7,8,9. "శైవిజం అండ్ వైష్ణవిజం". పుట 24. [ఆర్. జి భండార్కర్] 19[illegible].

10. ది కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా : 4 భా. 109 పు

పదము మైత్రేయోపనిషత్తులో - విష్ణువునకు ఆహారముగా సర్వ ప్రాణికోటియు వర్ణింపబడినది.

"నామైషా తనూః భగవతో విష్ణోః యదిదమన్నః"

తైత్తిరీయారణ్యకమునందలి -

"నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి ।
తన్నో విష్ణుః ప్రచోదయాత్" 11

అనునది విష్ణుగాయత్రిగా చెప్పబడినది. విష్ణుగాయత్రిగా వచ్చిన మారు ఇది. కఠోపనిషత్తునందు ఆత్మజ్ఞానాభివృద్ధి - విష్ణువుయొక్క పరమపదమునకు మార్గముగా చెప్పబడెను.

"విజ్ఞానసారథిర్యస్తు - మనః ప్రగహనా న్నరః ।
సాధ్వనః పార మాప్నోతి - త ద్విష్ణోః పరమం పదమ్" 12

౩. ఉపనిషత్తులు ..

తైత్తిరీయ సంహిత - విష్ణువునకు గల ప్రత్యేకగుణములు రెండు రక్షించుట, రక్షించుటయందు ఆతురత ఈ విష్ణువుపేర యజ్ఞము చేసిన, సమస్త కామములు సఫలముకాగలవని తెలియుచున్నది.[13] ఈ విధముగా వేదములందు, బ్రాహ్మణములలో, ఉపనిషత్తులందు, సంహితలలో అనుస్యూతముగా వర్ణింపబడు విష్ణువు, వైష్ణవము, విష్ణ్వారాధకులును అనాది యని ప్రమాణీకరించుచున్నవి.

---

11,12 కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా : భా 4 పు. 110, 111 [1975]

13 ఎ క్రిటికల్ స్టడీ ఆఫ్ ఇండియా భా 4. పు. 32 [1986] మాసేన్ గుప్త

# ఇతిహాసములలో వైష్ణవము

౧. రామాయణము :-

వేదముల తరువాత ప్రమాణ గ్రంథములు ఇతిహాసములు. రామాయణము విష్ణ్వవతారములైన - అందు ప్రసిద్ధములైన దశావతారములను గూర్చియు వివరించును. దుష్టశిక్షణ, శిష్టరక్షణానే ప్రధానాంశముగా, కార్యార్థమై భగవంతుడు పొందు రూపము - అవతారము. రావణసంహారము - రామాయణ ప్రయోజనము. రాముడు విష్ణ్వావతార మగుట - విష్ణుప్రతిపాదక గ్రంథమైనది. ఈ యంశము - పుత్రకామేష్టి సందర్భమున, విష్ణువు దేవతలకు వరము లిచ్చునపుడు, శ్రీరామచంద్రుడు జటాయువునకు మోక్ష ప్రదానము చేయు సందర్భమున, రావణసంహారానంతరము బ్రహ్మాదులు స్తుతించు సందర్భమునందును - వాల్మీకి సూచించెను. మఱియింకను ఉత్తరకాండమున ఈ యంశము విపులముగా విస్తరింప బడినది.

౨. మహాభారతము :-

కృష్ణావతార తత్త్వమహత్త్వమును, భగవన్మాహాత్మ్యమును, సర్వాంతర్యామి యగు వాసుదేవ (విష్ణు) తత్త్వమూలకముగను ఐనది మహాభారతము. ఇందలి శాంతి - అశ్వమేధపర్వములు - విష్ణుప్రశంసాపాదకములు. మహాభారతము వాసుదేవప్రశంసాపాత్రకమైనది.

"భగవాన్ వాసుదేవోఽత్ర కీర్త్యతేఽత్ర సనాతనః"

అని - దానినిగూర్చి చెప్పబడినది.

"నారాయణం నమస్కృత్య."

అని ప్రారంభించుటవలన, శాంతిపర్వమునందలి 'పాంచరాత్ర పరికర ణము'నకు వ్యాఖ్యారూపమైనట్టిది. విశిష్టాద్వైత సిద్ధాంతమునకు ఆకరములైనవానిలో - పాంచరాత్ర మొకటి. వైదికకాలమునుండియు బీజప్రాయముగానున్న పాంచరాత్రము - ఈ నారాయణీయముతో మహోన్నతవృత్తమైనది. మహాభారతమందలి భగవద్గీత - శ్రీవైష్ణవు నకు మఱొక ఊతకఱ్ఱ. భగవద్గీతయందు చివరగా చెప్పబడిన మోక్షో పాయము - శరణాగతి. సర్వాత్మనా భగవంతునకు ఆత్మసమర్పణమే శరణాగతి. విశిష్టాద్వైతమున భగవచ్చరణారవిందప్రాప్తికి ఉపాయ ముగా చెప్పబడినది - ఇది యొక్కటియే. దీనిని భగవద్గీతయందు ప్రతిపాదించినాడు - కృష్ణావతారరూపుడైన విష్ణువు.

## పురాణములలో వైష్ణవము

భాగవతము భగవంతుని ఏకవింశత్యవతారములను, సర్వాంత ర్యామిత్వమును, సృష్టి - స్థితి - లయకారకత్వమును - ప్రతిపాదించు నది. హరివంశము - కృష్ణతత్త్వమును నిరూపించునది. ఈ రెండును -

"ఇందు గల డందు లేడని సందేహము వలదు
చక్రి సర్వోపగతుండు .."

అని - శంఖ చక్ర లాంఛనుడైన విష్ణుభగవానుని తత్త్వమహత్వ మును విపులముగా విశదీకరించునది.

పురాణములలో విష్ణుపురాణము - తన నామములోనే తన ప్రయోజనమును ఇముడ్చుకొనినట్టిది. ఇది - విష్ణుపారమ్యప్రతిపాదక మైనది. శ్రీ యామునాచార్యులవారు దీనినిగూర్చి —

"తత్త్వేన యశ్చిదచిదీశ్వర తత్స్వభావ
భోగాపవర్గ తదుపాయ గతీరుదారః ।
సందర్శయ న్నిరమిమీత పురాణరత్నం
తస్మై నమో మునివరాయ పరాశరాయ."

అని - విష్ణుతత్త్వ ప్రతిపాదనకు కాక, తత్త్వత్రయమును, అర్థ పంచకమును బోధించుటచేత - పురాణరత్నమైనదని పేర్కొనిరి. ఇదికాక, బ్రహ్మాండ - భవిష్యత్ - మార్కండేయ - వాయు పురాణములు విష్ణువును ప్రశంసించినవి.

## సూత్రగ్రంథములలో వైష్ణవము

పరాశర గృహ్యసూత్రమున వివాహప్రసక్తియందు - సప్తపది సందర్భమున, వరుడు వధువుతో - 'విష్ణువు నీతో ఉండుగాక!' అని చునియెడి వాక్యము - విష్ణువుయొక్క రక్షకత్వశక్తిని, సర్వవ్యాపకత్వశక్తిని వివరించినది.[14] బోధాయన ధర్మసూత్రము - గరుడుడు విష్ణువునకు నిత్యానపాయిని యని - విష్ణుప్రశస్తి నిగూర్చి చెప్పినది.

## లౌకిక వాఙ్మయములో వైష్ణవము

అష్టాధ్యాయియందు -

"వాసుదేవార్జునాభ్యాం వుఞ్"

అను సూత్రము గలదు. భాష్యకారుడగు పతంజలి దీనిని వ్యాఖ్యానించుచు - ఇచటి వాసుదేవశబ్దము - దైవనామమని ప్రతిపాదించెను.

14. ది కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా - భా. 4. పు 111 [1975]

కథాసరిత్సాగరమున - నరవాహనదత్తుని కథయందు విష్ణుప్రసక్తి కలదు.[15]

కాళిదాసుని మేఘసందేశములో -

"గోపవేషస్య విష్ణోః"

అని, విష్ణువును ఉపమానముగా నుడివెను. ఈవిధముగా వేదములు, ఇతిహాసములు, పురాణములు, సూత్రగ్రంథములు, లౌకికవాఙ్మయము - అన్నింటను విష్ణువు ప్రసిద్ధుడైనాడు. విష్ణువు రక్షకుడు. (విష్ణుల్ వ్యాప్తౌ). చివరిగమ్యమైన మోక్షముకూడ ఆ విష్ణుభగవానుని కరుణా కటాక్షఫలమే యని స్పష్ట మగుచున్నది.

## ఆళ్వారుల - ద్రావిడ ప్రబంధములలో వైష్ణవము

భాగవతపురాణములోని వాక్యములచే, తామ్రపర్ణి, కృత మాల, పయస్విని, కావేరీ నదీతీరములందు - విష్ణుభక్తు లుండెడివా రని తెలియుచున్నది.[16] భాగవతమాహాత్మ్యమునందు ఒక కథకలదు. భక్తి ఒక దుఃఖభాగిని. ఆమె - ద్రావిడదేశమున జన్మించెను. కర్ణా టక, మహారాష్ట్రదేశములకుచేరి, చాల బాధతో - గుజరాత్, ఉత్తరప్రదేశములమీదుగా ప్రయాణించి, బృందావనము చేరెను.

---

15. "శైవిజం అండ్ వైష్ణవిజం" పుట 32. [1983] ఆర్. జి. బండార్కర్.

16. శ్రీమద్భాగవతము : 11-వ స్కంధము. 5 అధ్యా. 38-40 శ్లో.

ఆమెకు జ్ఞాన వైరాగ్యములు సంతానము. సంతానము మరణించెను.[1] ఈ కథ - భక్తికి దక్షిణభారతము జన్మస్థానమని తెలియుచున్నది.

ఉపనిషత్తులకాలమందలి భక్తి, జ్ఞాన, కర్మలవలన తెగిపోగా, దక్షిణదేశమున భక్తి తిరిగి ఆరంభమైనదని తెలియుచున్నది. ఆ యా నదీతీరములలో జన్మించిన విష్ణుభక్తులే ఆళ్వారులు. నమ్మాళ్వారులు, మధుర కవులు - తామ్రపర్ణీ తీరమున జన్మించగా, పెరియాళ్వారులు, ఆండాళు - కృతమాల (వేగైనది) తీరమునందు జన్మించిరి. కావేరీ తీరమున తొండరపిప్పొడియాళ్వారులు, తిరుప్పాణాళ్వారులు, తిరుమంగయాళ్వారులు జన్మించగా, పయస్విని (పాలార్) తీరమందు - పొయిగ, పూదత్త, పేయాళ్వారులు, తిరుమళిశైయాళ్వారులును జన్మించిరి. కులశేఖరాళ్వారులు మహానదదేశమందు జన్మించిరి.

'ఆళ్వారు' అనగా - 'భక్తిపరవశుడు' అని యర్థము. భగవద్గుణములలో ఈడుపడినవాడు. 'ఆళ్‌దళ్' అనగా - శాసించుట. అట్టి మహనీయులే ఆళ్వారులు. తమ భక్తితో లోకమునంతను శాసించగలిగిరి. భగవంతుని సైతము - శాసింపగల్గిరి. 'ఆళ్వార్' అనగా - 'మగ్నమగుట' యని అర్థము. భగవద్భక్తియందు మగ్నమైనవారుకాన, ఆళ్వారులుగా వ్యవహరింపబడుచున్నారు.[18]

---

17. శ్రీమద్భాగవత మాహాత్మ్యము : 1 అధ్యా. 48-50 శ్లో.

18. ఆళ్వారులు - దివ్యప్రబంధములు : పుట 62 [1970]. ధనకుధరం వరదాచార్యులు.

'ఆళ్వారు' అనగా - ఆధ్యాత్మికజ్ఞానసంపన్నుడు. అతడు ధ్యానసిద్ధుడు.[19] వైష్ణవమతమును ప్రవర్తింపజేసిన ఋషితుల్యులను ఆళ్వారు లని వ్యవహరించిరి. వీరు - భక్తిప్రచారమహోద్యమమును ఆరంభించినారు. భక్తితో - ప్రజలభాషయందు - భగవంతునిగూర్చి గానము చేసిరి.

వీరి హృదయము ప్రేమకు నెలవు. వీరికి శ్రీమన్నారాయణుడే దైవము. అతనిని శరణాగతి రూపమున ఆశ్రయించిరి.

ఆళ్వారు లెంతమంది ? మణవాళ మహామునులు రచించిన ఉపదేశరత్నమాలలోని నాల్గవ పాశురమందు ఆళ్వారులయొక్క పేర్లు క్రమముగా ఇవ్వబడినవి. ఇందు పదుగురాళ్వారుల పేర్లే కలవు. వారు వీరు :- పొయిగ, భూదత్త, పేయాళ్వారులు, తిరుమడిశై, నమ్మాళ్వారులు, కులశేఖరులు, పెరియాళ్వారులు, తొండరడిప్పొడి, తిరుప్పాణి, తిరుమంగయాళ్వారులు. ఈ సంప్రదాయము తరువాతి కాలమున ఆళ్వారులు పండ్రెండుమందిగా నిర్ణయించినట్లు గోచరించుచున్నది. పదుగురికి - మధురకవులను, ఆండాళును-చేర్చిరి. ఈ పన్నిద్దరాళ్వారులను సంప్రదాయము పదునేనవ శతాబ్దినాటికే ప్రాచుర్యములోనికి వచ్చినట్లు తాళ్ళపాక చిన్నన్న పరమయోగి విలాసము ననుసరించి చెప్పవచ్చును. అల్లెరాయల ఆముక్తమాల్యదలో - పన్నిద్దరుసూరుల ప్రసక్తి కానవచ్చుచున్నది. పన్నిద్దరాళ్వారులలో మధురకవులను కాదని, రామానుజులను చేర్చుట కలదు. నిత్యానుసంధానమున - "భూతం సరశ్చ" ఇత్యాది శ్లోకమున మధురకవుల ప్రసక్తి లేదు. దీనియందు స్పష్టముగా రామానుజులు పేర్కొనబడిరి.

19. తమిళ సాహిత్యము [దక్షిణ భారత సాహిత్యములు] : గడియారం రామకృష్ణశర్మ.

గరుడవాహన పండితుని దివ్యసూరి చరిత్రమందుకూడ - మధురకవుల చరిత్ర నమ్మాళ్వారుల చరిత్రలో భాగముగా చెప్పబడి, రామానుజ చరిత్రము విశేషముగ వర్ణింపబడినది.

దీని ననుసరించి పదుగురాళ్వారుల సంప్రదాయము ప్రాచీనమైనదనియు, పన్నిద్దరాళ్వారుల సంప్రదాయ మర్వాచనీయమైనదనియు, వీరిలో మధురకవులకుబదులు రామానుజులను చేర్చుట తరువాత జరిగినదనియు భావింపవచ్చును. (భగవద్వైభవమును ప్రకటించినవారు పదుగురు. ఆండాళు - భూదేవి అవతారము. ఆచార్య ప్రాధాన్యమును వివరించినవారు మధురకవులు. మతోద్ధారకులు రామానుజులు. వీ రందరు - ప్రాత రనుసంధేయు లనుట అభిప్రాయము).

వీరి కాల విషయమున - గురుపరంపరాప్రభావము, దివ్యసూరి చరితము - ఇట్లు తెలుపును :- తొలి ముప్వురు అనగా - పొయిగ, పూదత్త, పేయాళ్వారులు ద్వాపరయుగమువారు. తిరుమడిశ యాళ్వారులు ద్వాపరాంతము, నమ్మాళ్వారులు కలియుగాదిలో (5 వేల సంవత్సరములకుపూర్వము)వారు. మిగిలినవారు(మధురకవి, కులశేఖరులు, పెరియాళ్వారులు, ఆండాళు, తొండరడిప్పొడి, తిరుప్పాణి, తిరుమంగై ఆళ్వారులు) క్రీస్తునకు పూర్వమువారే యని భావించినది. (మొత్తము మీద ఈ కాలము క్రీ. పూ. 4000 నుండి క్రీ. పూ. 2700 వరకు అని సంప్రదాయము సూచించుచున్నది.)

ఆధునిక చరిత్రకారులు [20] ఆళ్వారులు క్రీ. శ. రెండు, ఏడు శతాబ్దముల మధ్యకాలమునాటివారని నిర్ణయించిరి. వైయాపురిపిళ్ళై

20. వరదాచారి, కె. సి. - "ఆళ్వారాస్ ఆఫ్ సౌత్ ఇండియా" పే. 9 [ఉపోద్ఘాతము [1966]

ఆళ్వారులు పదు, తొమ్మిది క్రీస్త్వబ్దములనాటివా రనిరి. నమ్మాళ్వారులు, వారి పూర్వమువారును - క్రీ. శ. ఏడవ శతాబ్దికి పూర్వము వారు. మిగిలినవారు ఎనిమిది తొమ్మిది శతాబ్దములవారని నిర్ణయించిరి.

వీరి రచనలే దివ్యప్రబంధములుగా వ్యవహరింపబడుచున్నవి. ఇందు నమ్మాళ్వారులు వ్రాసిన నాలుగు ప్రబంధములు-ద్రావిడ వేదములుగా భావింపబడుచున్నవి. (తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియ తిరువన్దాది, తిరువాయిమొడి). నాలాయిరములలోని యంశములు కొన్ని భాగములు - త్రివిక్రమావతారమును, కృష్ణలీలలను, నారాయణ మాహాత్మ్యమును బోధించినవి. పొయిగయాళ్వారుల ముదల్ తిరువన్దాదియందు భక్తితత్త్వము వర్ణింపబడినది. (తిరు అనగా పవిత్రమైనది. లక్ష్మి, కాంతి, సుందరము మొదలగునవి అర్థములు). అన్దాది ఛందస్సు అనగా - ముక్తపదగ్రస్తము పూదత్తాళ్వారుల రచనయందు భగవద్వైభవము, శరణాగతిప్రాశస్త్యము వర్ణింపబడినవి.

తిరుమడిశె ఆళ్వారుల రచనలందు - విష్ణ్వాధిక్యము, వైష్ణవ ధర్మము వర్ణింపబడినవి. నమ్మాళ్వారుల రచనలందు తిరువాయిమొడి సామవేదముగా ప్రశస్తిగాంచినది. (భగవద్గీతయందు - "వేదానాం సామవేదోఽస్మి" అని చెప్పబడినదిగదా!) 'తిరువాయిమొడి' అనగా మహనీయుని ముఖమునుండి వెలువడిన దివ్యవాణి యని అర్థము. 'వాయిమొడి' అనగా - 'వేదము' అను నర్థమునిచ్చు శబ్దముగా ప్రాచీన తమిళమున ప్రయోగింపబడినది. ఈ ప్రబంధమునందు - ఆచార్య ప్రభావము, భక్తిప్రపత్తులు - మిక్కుటము. భక్తివలన కలుగు సుఖము, స్వర్గ సుఖముకన్న మిన్నయైనట్టిది.

"నేను నా దను భావముల్ పూనక విశ్వస్వరూపు దేవదేవుని
శ్రీహరి దెలిసికొనుము ఆత్మ కద్దియగా గమ్య స్థలమ్ము"

అని నమ్మాళ్వారులు జీవితప్రయోజనమును వివరించిరి. "పృథివ్యాప స్తేజోవాయురాకాశ ములను పంచభూతములందు నీవున్నావు. ఈ పంచ భూతముల సంయోగ వియోగమువలన ఏర్పడుచున్న ప్రతివస్తువునందు నీ వున్నావు. అట్టి నిన్ను నే నెట్లు భజింపగలను?" అని తిరుమడి యాళ్వారులు భగవంతుని సర్వవ్యాపిత్వము, తన అశక్తతను చక్కగా తెలిపిరి. పెరియాళ్వారుల రచనలందు వాత్సల్య భక్తి కన్పించును. మధురకవుల రచన - ఆచార్య ప్రాశస్త్యమున కేర్పడినది. ఆళ్వారుల రచనలలోని సార మిది :- విష్ణువే పరదైవము, అతడే శ్రీమన్నారాయణుడు. వైష్ణవుడుగా జీవుని స్వరూప ముండవలసిన పద్ధతి యిది :- ఆచార్య సమాశ్రయణమున భగవత్సన్నిధి లభింపజేసి కొని, శరణాగ తిఒక్కటియే ఉపాయముగా భగవ దనుగ్రహమును పొంది, భగవద్వైభవమును గాంచుట.

ఆళ్వారుల రచనలు ప్రధానముగా భగవద్భక్తిని ప్రతిపాదిం చును. ఈ భక్తి-భాగవతాది గ్రంథములయందు వర్ణింపబడిన రామ కృష్ణాద్యవతారముల లీలావిశేషములను వివరించునది. అంతియకాక, ప్రత్యక్షోపాస్యమైన అర్చావతారమునకు సంబంధించినదికూడ ! అందువలననే వీరి రచనలయందు శ్రీరంగాది దివ్యస్థలములయందు నెలకొనియున్న స్వామి మరల మరల కీర్తింపబడి, శరణాగతి చేయ బడినాడు. ఈ అర్చావతారమునందు భగవదనుభవము నింత ప్రత్యక్ష ముగా పొందిన మధుర రచనలు - ఆళ్వారులవి. ఇయ్యవి - భారతీయ

సాహిత్యమున ప్రత్యేకస్థానము గలవి. అర్చావతారమున శరణాగతి నందుటకు అందరు అర్హులే. కులవివక్ష లేక, ప్రపత్తిద్వారా భగవత్సమాశ్రయణమును బోధించినవారు ఆళ్వారులు.

వీరి రచనలు - మాతృభాషలో నుండుటచేత వారి ద్రావిడ దేశములో జనసామాన్యమున ప్రసిద్ధినందినవి. ప్రజలభాషకు సాహిత్య గౌరవము లభించెను. ఇయ్యవి గానానుకూలమైనవి. శ్రీమన్నారాయణుడే పరతత్త్వ మని ప్రతిపాదించుటచే, వీరు వైష్ణవ మత వ్యాప్తికి చేసినసేవ ఎనలేనిది. వైష్ణవ ధర్మ చరిత్రయందు వీరి ప్రశంస - అవశ్యంభావి యగును.

## ఆచార్యులు - వైష్ణవ మత వ్యాప్తి

ఆళ్వారులకు పిమ్మట వైష్ణవ మత వ్యాప్తికి కడంగినవారు ఆచార్యులు. ఆళ్వారులు భక్తిమార్గమును బోధించిరి. వారు ముముక్షువులు. ఆచార్యులు సిద్ధాంత ప్రతిపాదనకై నడుముకట్టిరి. వీరు ప్రవర్తకులు. ఆచార్య-పరంపరలో మొదటివారు-నాథమునులు. వీరు నమ్మాళ్వారుల ప్రబంధములను తిరిగి సాధించినవారు. ఇట సాంప్రదాయిక కథ ఒకటి కలదు. నమ్మాళ్వారుల తిరువాయిమొళి పఠన మాత్రముననే సద్యోముక్తిదాయకమై, పఠించినవారు పరమ పదమున కేగసాగిరి. అందులకు భయపడి, ఆగ్రంథమును తాళపత్రము లందు తిరిగి వ్రాయకుండిరి. వ్రాసినపత్రములు ఖిలమైనవి. కొన్నాళ్ళకు ఆ ప్రబంధము అలభ్యమైనది. నాథమునులు పరదేశాగతులైన వైష్ణవులనోట — ఖిలముకాగా మిగిలిన ఒండు రెండు పాశురములను (సంస్కృత శ్లోకముల వంటివి) విని సంతసించి, పూర్తిగా వినిపింప వేడిరి. వారు తమకు ఇంతకంటెను తెలియదనియు, మధురకవుల "కణ్ణియన్ శిరుత్తాంబు" పన్రెండువేలమార్లు జపించినచో - తిరిగి

నమ్మాళ్వారులద్వారా అది లభించుననియు - మార్గము జూపిరి. అట్లే చేసి, నాలాయిర ప్రబంధములను సాధించి, పరన పారనములలో నుండునట్లు చేసిరి.

పరనమాత్రమునకాక, అంత్యకాలమున ముక్తి లభించునట్లు నమ్మాళ్వారులను ప్రార్థించి, కృతకృత్యులైరి. ఈవిధముగా ఖలమైన ద్రావిడ వేదమును తిరిగి సాధించిన నాథమునులు-ఆచార్య పరంపరలో తొలివారైరి. వీరు పాంచరాత్ర తంత్రముల ఆధారముగా ప్రపత్తిని ప్రతిపాదించి, వైష్ణవసంప్రదాయమునకు క్రొత్తదారిని చూపిరి.

వీరి తరువాతివారు యామునులు. వీరికే - 'ఆళవందారు' లని పేరు. తాతగారగు నాథమునుల శిష్యులద్వారా ప్రబంధములను, వైదిక విష్ణుకత్వమును అవగాహన చేసికొని, విశిష్టాద్వైతతత్త్వమును బీజప్రాయముగ తమ రచనలద్వారా వ్యాపింపజేసినవారు. రామానుజులకు మార్గదర్శకులైనవారు యామునాచార్యులు. వీరి స్తోత్ర రత్న మొక్కటియే చాలు-విశిష్టాద్వైత తత్త్వమును ప్రతిపాదించి రనుటకు చక్కని ఉదాహరణము.

వీరి తరువాతివారు శ్రీ రామానుజులు. వీరు ప్రపంచమునకు చాటి చెప్పినదే విశిష్టాద్వైతము. వీరు స్థాపించిన దగుటచే, ఇది రామానుజీయ సిద్ధాంతమైనది. వీరు దేశసంచారముగావించి, వైష్ణవాలయములను పునరుద్ధరించిరి. ఆసేతుహిమాచలము పర్యటించి, ఇతర మతములనుఖండించి, విశిష్టాద్వైతసిద్ధాంతమును స్థాపించిరి. విష్ణ్వాలయములలో ద్రావిడ దివ్యప్రబంధాధ్యయనమును, ఆళ్వారాదుల ఆలయ ముంతునస్లును గావించిరి. వాసుదేవ తత్త్వమును నారాయణ తత్త్వ

ముగా ప్రకటించిరి. అదే విష్ణుతత్త్వము. ఆళ్వారాదుల భక్తితత్త్వమును, భగవద్గీత యందలి భక్తి - శరణాగతులను, పాంచరాత్ర వాసుదేవ తత్త్వమును, నారాయణీయ విష్ణుతత్త్వమును-వీనినన్నిటిని మేళవించి, విశిష్టాద్వైత తత్త్వముగా ప్రతిపాదించిరి. వీరి శ్రీభాష్యము - విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదకము. వీరు-మత ప్రచారమునకై ఏడువందల యతులను, పండ్రెండువేల ఏకాంగులను, డెబ్బదినల్వురు పీఠాధిపతులను ఏర్పరచిరి. ఆధునిక వైష్ణవమునకు ఈ ఆచార్యులే కారణము. వీరు తమకాలముననే భాష్య, భగవద్విషయ (ద్రావిడ ప్రబంధములు), మంత్ర, మంత్రార్థ ప్రచారములకై ఆచార్యులను విడివిడిగా నేర్పరచిరి.

వీరి తరువాత పేర్కొనదగినవారు పిళ్ళలోకాచార్యులు. అష్టాదశ రహస్యము లని నుడువబడు పదునెనిమిది రహస్య గ్రంథములను వీరు రచించిరి. అవి అష్టాక్షరి, ద్వయ, చరమ మంత్రములకు వ్యాఖ్యా రూపములైనవి. ఆచార్య ప్రభావమును, భాగవత లక్షణమును వివరించు గ్రంథము లివి. వైష్ణవ లక్షణములు, విష్ణులోకావాప్తిసాధనములు - ఈ గ్రంథములందు చక్కగా వివరింపబడినవి. ఇవి నేటికిని పఠన పాఠనములందుగల గ్రంథములు. ద్రావిడ ప్రబంధమునకు వేదత్వమును ప్రతిపాదించినవారు వీరు.

వీరి తరువాతివారిలో - మణవాళమహామునులు పేర్కొనదగినవారు. వీరు - పిళ్ళలోకాచార్యులవారి గ్రంథములకు వ్యాఖ్యానములు రచించిరి. మఱి యింకను - స్వతంత్రగ్రంథములను సైతము కొన్నింటిని రచించి, శ్రీవైష్ణవ మత ప్రవర్తకాచార్యులుగా ఖ్యాతి గాంచిరి.

వీరకంటెను కొలది ముందే వేదాంతదేశికులు. వీరు హయగ్రీవోపాసకులు. మాయావాదులను జయించి, అనేక వేదాంత గ్రంథములను రచించిరి. శతదూషణి, తత్త్వముక్తా కలాపము. పాదుకా సహస్రము మొదలగు స్తోత్రములు, కావ్యములు, నాటకములు మొదలగు 120 గ్రంథములను రచించిరి. శ్రీ రామానుజ సిద్ధాంతమును నిలబెట్టినవారువీరు. ఈ కాలమున వైష్ణవములో రెండు తెగలేర్పడినవి.

## చరిత్ర పుటలలో వైష్ణవము

శాతవాహనులు భాగవత(వైష్ణవ)మతమును ఆదరభావముతో చూచినవారు. వారి శాసనములలో - సంకర్షణ, వాసుదేవ, గోపాల నామములు కానవచ్చుచున్నవి. హాలునినాటికి - తెలుగు నాట వైష్ణవ సంప్రదాయము వ్యాపించినది. [21] ఈ శాతవాహనులలో కొందఱు - పరమవైష్ణవ బిరుదాంకితులు.[22] యజ్ఞశ్రీశాతకర్ణి కేవలము విష్ణుభక్తుడు. క్రీ. శ : రెండవ శతాబ్దమునకు జెందిన పల్లవ విష్ణుగోపవర్మ - విష్ణుభక్తుడుగా ప్రసిద్ధి గాంచెను. క్రీ. శ : నాల్గవ శతాబ్దియందు - గుంటూరు జిల్లాలో - 'నారాయణాలయము' నిర్మింపబడినది. [23] క్రీ. శ : నాల్గవశతాబ్దమున ధాన్యకటకమును

21 విజ్ఞాన సర్వస్వము : 3 వ భాగము.

22. దక్కన్ హిస్టరీ. [1960] యాజ్దాని.

23. ది కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా : భా 3. పుట 123.

పాలించు యువరాజగు బుద్ధవర్మభార్య చారుదేవి - దావులూరులో కూళిమహాతరకుడు నిర్మించిన భగవంతుడగు నారాయణుని దేవకులమునకు కొంత భూమిని దానము చేసెను. రాజతటాకముక్రింది నాలుగు నివర్తకములభూమిని దేవభోగముచేసి దాన మిచ్చెను.

పల్లవులలోని యువమహారాజు విష్ణుగోపవర్మ - ఉరుపుపల్లి లోని రెండువందల నివర్తనముల భూమిని - కందుకూరిలో విష్ణువర్మ సేనాపతి నిర్మించిన విష్ణుహార దేవకులమునకు దేవభోగముచేసి, దానము చేసెను. [24]

ఐదవ శతాబ్దినాటి కదంబులు - విష్ణువును స్తుతించిరి. [25] వీరి తగరశాసనమందు - వరాహస్తుతి కలదు. [26]

శాలంకాయనులు వేంగీపురము రాజధానిగా - క్రీ. శ: నాలుగైదు శతాబ్దములలో రాజ్య మేలిరి. వీరిలో - చండవర్మ పుత్రు డగు నందివర్మ - తన ధర్మయశోభివృద్ధికి - త్రిలోకనాథు డైన విష్ణుగృహస్వామికి - తన రాజ్యములోని వేరువేరు గ్రామములలో కొన్ని హలముల భూమిని దేవహలముచేసి, దానముచేసెను. [27]

---

24. విజ్ఞాన సర్వస్వము : భా 3.

25. ది కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా ; భా 4.

26. 'క్లాసికల్ ఏజ్' - భా 3. భారతీయవిద్యాభవన్ పబ్లికేషన్.

27. విజ్ఞాన సర్వస్వము , భా 3.

క్రీ. శ : ఆఱవ శతాబ్దమునకు జెందిన బాదామిచాళుక్యుల యందు — మంగళేశుడు కార్తీక ద్వాదశి దినమున ఉపవసించి, విష్ణుదేవుని పూజించి, కుండివాటక గ్రామమును దాన మొనర్చెను. ఈతని అన్న యగు కీర్తి వర్మయు - విష్ణ్వారాధకుడు.

సతారా (కుబ్జ) విష్ణువర్ధనుడు విష్ణుదేవునకు - బలిచరు, వైశ్వదేవ, అగ్నిహోత్రహవన, పంచమహాయజ్ఞ ఉత్సర్పణార్థముగా గ్రామదాన మొనర్చెను.[28] వీరికాలమున - శేషతల్పశాయిపాద సంవాహనము చేయుచున్న లక్ష్మి - ఒక గుహాలో చెక్కబడెను.[29]

కళింగ దేశమును పాలించిన గంగవంశజులలో హస్తివర్మ గాంగశకము 29 — వ సంవత్సరమున, భగవంతుడును, సప్తార్ణవ శాయియు - సప్తసామోపగీతుడును - సప్తలోకైకనాథుడును అయిన నారాయణునకు - బలిచరు సత్త్రప్రవర్తన నిమిత్తము, ఖండస్ఫుటిత సంస్కార నిమిత్తమును - 'రోహిణికి' గ్రామమున - ఆఱుహాలముల భూమిని దానము చేసెను. ఈతడు - 6 వ శతాబ్దమునకు చెందిన వాడు. ఈతని తరువాత తొమ్మిది సంవత్సరములకు ఇంద్రవర్మ — భగవంతుడైన రామేశ్వరభట్టారకునకు - బలిచరు, సత్త్రప్రవర్తన నిమిత్తము, ఖండస్ఫుటిత సంస్కారము నిమిత్తము - క్రోష్టకవర్తినీ విషయములోని హరిభటగ్రామములో - రెండు హాలముల భూమిని దేవాగ్రహారము చేసి, దానము చేసెను.[30]

---

28. దక్కన్ హిస్టరీ ; యాజ్దాని.

29. 'శైవిజం - వైష్ణవిజమ్' పు 44 ఆర్. జి. భండార్కర్.

30. విజ్ఞాన సర్వస్వము ; భా 8.

క్రీ. శ : 750 ప్రాంతమున - రాష్ట్రకూట దంతిదుర్గుని కాలమున - విల్లోరా దశావతారాలయమున - శేషశయనుని మూర్తి కలదు.[31] రాష్ట్రకూటులలోని మొదటి అమోఘవర్షుని కాలమున - దేవాలయములందు నృత్య సంగీతములు - ఉచిత భోజనవసతితో ఏర్పరుపబడుచుండెడివి. దేవాలయములు ఆధారముగా - వివిధకళలు అభివృద్ధిచెందినవి. దేవాలయముల పేరిట - ఎన్నో దానములు జరిగెడివి.[32]

క్రీ. శ. 7, 8 శతాబ్దములలో చాళుక్యులు - పరమభాగవతుల మని చెప్పికొనిరి. వారి నాణెములపై వరాహముద్ర కలదు. వారి శిల్పములలో - వరాహ, నారసింహ, వామన, శేషశాయిమూర్తులు కలవు.[33] చాళుక్యరాజ్యస్థాపకుడైన విష్ణువర్ధనుడు - వైష్ణవమతావలంబి. క్రీ. శ : 1040 సంవత్సరమువాటి బళ్ళారిలోని మైలారు శాసనమునందు - రెండువందలమంది వైష్ణవులనుగుఱించిన ప్రసక్తి కలదు.[34]

క్రీ. శ : 11వ శతాబ్దికి - తిరువాయిమొళి - ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రములలో గానము చేయబడినది. ఈ పాశురములు పాడుటకు నిబంధనలుకూడ చేయబడినవి. పరివారదైవతములకు ఆలయము లేర్పడినవి.[35]

---

31. 'శైవిజం వైష్ణవిజమ్' ఆర్. జి. భండార్కర్.
32. దక్కన్ హిస్టరీ ; పు 45. యాజ్దాని.
33 'క్లాసికల్ ఏజ్' భా 3. భారతీయవిద్యాభవన్.
34. దక్కన్ హిస్టరీ.
35. విజ్ఞాన సర్వస్వము ; భా 3.

శ్రీకూర్మము, సింహాచలము - ప్రసిద్ధివహించిన విష్ణుక్షేత్రములు. ఈ ఆలయములు నాడు - మహావైభవము ననుభవించినవి. స్వామిపూజాపురస్కారభోగాదులనిమిత్తము, ఊడిగము చేయు పరిచారక బృంద మయిన సానుల — మానుల నిబంధముల నిమిత్తము, దీపదానము నిమిత్తము - మహారాజులు మొదలగువారు — కట్టడములను చేసి, మాన్యము లిచ్చిరి.[36] కాకతీయుల కాలమున-అనూన్యశయనవ్రత, లక్ష్మీనారాయణ వ్రతాదివ్రతములు కల్పసూత్ర విధానముగ - విరివిగా సాగినవి. కరీంనగరమండలి 'పేరంపేట' యందు విష్ణ్వాలయము ఈ కాలముననే నిర్మింపబడినది. [37]

## ఆచార్య పీఠములు - వైష్ణవమతవ్యాప్తి

క్రీ: శ : 13వ శతాబ్దికి వైష్ణవమత వ్యాప్తి నిమిత్తము ఆచార్య పీఠములు నియమింపబడినవి. నెల్లూరుమండల శాసనమువలన తెలిసిన ఆచార్యులు శ్రీమతు మార్గము పముడిముక్కల వీరతిరువేంగళ కుమారులు - వేదాంతదేశికులవారి కుమారు లగు నైనాచార్యులు - రాచకొండ సంస్థానమున సర్వజ్ఞసింగమనాయనికి, వైష్ణవమతమిచ్చి, మతవ్యాప్తికి పునాదివేసిరి. [38] వీరు - శాకల్యమల్లభట్టు నోడించి, వైష్ణవమును స్థాపించిరి. నెల్లూరు దోళుల ఆచార్యులు-భట్టరు కందాడ తిరుమల వారలు. పరాశరభట్టరునకు కోరుకొండ సంస్థానాధిపతి -

---

36. విజ్ఞాన సర్వస్వము ; భా 3.

37. దక్కన్ హిస్టరీ.

38. విజ్ఞాన సర్వస్వము : భా 3.

ఇమ్మడి నాయకుడు - కొరాలపురమును దానముగా నిచ్చెను. తరువాత కందాడవారి శిష్యుడై, శ్రీరంగవర్ధన నామధారి యయ్యెను. గుంటూరుజిల్లా - రొంపిచెర్ల గ్రామమునందలి ఎఫిగ్రాఫికల్ కలక్షన్ నంబరు 300-తిరుమల నల్లంతివారి శిష్యుడగు రామదాసును తెలియ జేయుచున్నది. [39] రెడ్డిరాజులయందు - కుమారగిరి, కాటవేములు - వైష్ణవ సంప్రదాయులు. [40] కందుకూరి రాజులు వైష్ణవమతాను యాయులు. సంగమ వంశమందలి మొదటి విరూపాక్షరాయడు - వైష్ణవసంప్రదాయుడు. మల్లికార్జునుడు - ఏలూరి గురువుల ప్రేర ణచే, వైష్ణవమతమును స్వీకరించెను. హొయసల ప్రభువులు - వైష్ణవ సంప్రదాయులు. [41] శాళువ నరసింగరాయలు - పరమవైష్ణవుడు. ఈతనికాలమునుండి-తిరుపతి-వైష్ణవమునకు ప్రధానకేంద్రమైనది. [42] అచ్యుతరాయలు గోవిందరాజుల నిత్యపూజనిమిత్తము - ఐదువందల బంగారునాణెముల నిచ్చెను. [43] రెండవ దేవరాయలు - శ్రీవైష్ణవ మతావలంబకుడు. చిక్కరాయలకాలమున వైష్ణవగ్రంథములు రచింప బడెను. [43] అరవీటిరాజులు - వీరవైష్ణవులు.

---

39. రెడ్డి రాజుల చరిత్ర – మల్లంపల్లి సోమశేఖరశర్మ.

40. విజ్ఞాన సర్వస్వము : భా 3.

41. ది కల్చరల్ హెరిటేజ్ అఫ్ ఇండియా · భా 4. పు 161.

42. విజ్ఞానసర్వస్వము : భా 3.

43. ది కల్చరల్ హెరిటేజ్ అఫ్ ఇండియా . భా 4. పు 161.

వడగల - తెంగల సంప్రదాయములు - పదునాఱవశతాబ్దములో - తిరుపతి, కర్నూలు పట్టణములలో - ప్రాచుర్యము వహించినవి. అహోబిలమఠస్థాపకులు - ఆదివణ్ శఠగోపస్వామి—నృసింహుని పేరుతో మతప్రచారకులను నియమించెను. నిమ్నజాతులవారికి దేవాలయములు అవకాశము కల్పింపబడెను. కదిరి - మున్నగుచోట్ల కొండజాతులవారిని ఉద్ధరించి, అహోబిలదాసరుల చేర్చరచెను. స్వామిముందు వారి నాట్య మేర్పరిచి, వారిని పవిత్ర వస్తువులతో సత్కరించెను. వీరి తరువాత - తోళప్ప-వైదిక సార్వభౌముడని పేరు గాంచెను. పరాంకుశజీయరు విజయనగరరాజులచే గౌరవ మందెను. తాతాచార్యులుకూడ - గౌరవ మందినవారు.[44] కర్ణాటాధీశ్వరులు ఆచార్య పురుషులకు వైష్ణవ సంఘమందు, సమావేశములందును ప్రథమ గౌరవము నెరపవలెనని - కట్టడిచేసిరి. శ్రీవైష్ణవులు - మత సాంఘిక విషయములలో దుర్వర్తనులైనయెడల, వారిని దండింప - ఆచార్యుల కధికార మిచ్చిరి.[45]

## ముగింపు

అద్దంకి వీరమువారు _ పంచములకు, ఎరుకలకు, ఏనాదులకు, రాజులకు, సమస్త జాతులవారికి వైష్ణవము నిచ్చి, మతమును బోధించు అధికారము అన్నిజాతులవారికిని ఈయబడినది. అన్నమాచార్యుల శిష్యులు సాతెవారు. శూద్రశాఖల వైష్ణవు లందఱకును హవ్యకవ్యములలో, మతగోష్ఠులలో - అధ్యక్షత వహించువారు _

44. ది కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా : భా 4. పు 182.

45. విజ్ఞాన సర్వస్వము : భా 3

చాత్తాదవైష్ణవులు. శూద్రదాసరులు, మాలదాసరులు, మాదిగ దాసరులు - తమ తమ కులములలో వైష్ణవ మతమును బోధించుటకు, హవ్య కవ్యములు నిర్వహించుటకు ఏర్పరుపబడిరి. [46] ఈ విధముగా వైష్ణవము - వైదిక కాలమునుండి నేటివఱకును అభివృద్ధిగాంచెను.



46. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము . మాగంటి బాపినీడు.

# పురాణవాఙ్మయములో వైష్ణవ తత్త్వము

'విద్యా భూషణ - కవితా విశారద'

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు



## 1. దైవస్తుతి

"యం బ్రహ్మా వరుణేంద్ర రుద్ర మరుత
స్తున్వంతి దివ్యై స్తవైః
వేదై స్సాంగ పదక్రమోపనిషదై
ర్గాయంతి యం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా
పశ్యంతి యం యోగినః
యస్యాంతం న విదు స్సురాసురగణా
దేవాయ తస్మై నమః."

## 2. వ్యాసస్తుతి

"జయతి పరాశరసూనుః
సత్యవతీహృదయనందనో వ్యాసః
యస్యాస్య సకలకోశవాఙ్మయ
మమృతం జగత్ పిబతి."

## 3. ఆరంభ వాక్యము

శ్రీమన్నారాయణుని యంశచే, పరాశర - సత్యవతీసుతుడుగా నుద్భవించిన వ్యాసుండు - మహర్షి ప్రముఖుండై, లోకకల్యా

ణార్థము - అష్టాదశ పురాణములను రచించి, అనంతరము - ఈ పురాణములకు వ్యాఖ్యానప్రాయముగ - మహాభారతేతిహాసమును రచించెను. [1]

వ్యాసభగవానునిచే రచింపఁబడిన పురాణములు - సృష్టి, స్థితి, లయ విషయములను వివరించునవియై, దేవ, మానవ, రాక్షస గణములకుఁ జెందిన ప్రముఖుల జీవిత చరితములను వ్యక్తముచేయునవియై, చతుర్విధ పురుషార్థములను బోధించునవియై, వర్ణాశ్రమ ధర్మములను తెలియజేయునవియై, విఖ్యాతిగాంచియున్నవి.

## 4. పురాణ పద నిర్వచనము

1 పూ రభవం పురాణమ్.

ప్రాచీనకాలమునకు చెందినది కావున — పురాణము.

2. పురా అపి నవం పురాణమ్.

ప్రాచీనమైనదైనను - నూతనమైనదిగా గోచరించునదికావున - పురాణము.

3. పూర్వస్మిన్ భూత మితి పురాణమ్.

పూర్వకాలమునకుఁ జెందినదికావున - పురాణము.

---

1 అష్టాదశ పురాణాని - కృత్వా సత్యవతీసుతః
భారతాఖ్యాన మఖిలం - చక్రే తదుపబృంహితమ్."
—(మహాభారతము - శాంతిపర్వము : 347-80)

4. పురతి అగ్రే గచ్ఛతీతి పురాణమ్

దీనిని పఠించినవారిని ముందుకు తీసికొనిపోవునది కావున పురాణము.

ఈ నిర్వచనము లిట్లుండ :-

5. పరంపరా వ్యక్తం - పురాణ మితి కథ్యతే.

ప్రాచీన పరంపరలకుఁ జెందినదికావున, 'పురాణ' మని - శాస్త్రకారులు నిర్వచించుచున్నారు.

ఇంతకును - ఈ నిర్వచనములనుబట్టి మనకు తెలియవచ్చున దేమనగా :- పురాణములు ప్రాచీనకాలమునకుఁ జెందినవనియు, ఐనను, ఇయ్యవి - నవంనవములుగా నుండునవనియు, పురాతన విషయములను తెలియజేయుననియు - స్పష్ట మగును.

## 5. పురాణ లక్షణము

"సర్గ శ్చ ప్రతిసర్గశ్చ - వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చేతి - పురాణం పంచలక్షణమ్"
—[మత్స్యపురాణము : 53 - 64]

౧. సర్గము (జగత్సృష్టి), ౨. ప్రతిసర్గము (సృష్టి విస్తరణము, ప్రళయములు, పునస్సృష్టి), ౩. వంశము (ధార్మికప్రవృత్తి కలిగి, పేరు గాంచిన ప్రాచీనులగు విశిష్టవ్యక్తుల వర్ణనము), ౪. మన్వంతరములు (సృష్ట్యారంభమునుండి - కాలమానమునకు కారణభూతు లగు

చతుర్దశ (14 మనువుల ² వృత్తాంతములు), 7 వంశానుచరితములు (సుప్రసిద్ధులైన మహర్షులయొక్కయు, చక్రవర్తులయొక్కయు - జీవిత చరితములు.) అనునవి యైదును - పురాణలక్షణములుగా చెప్పబడు చున్నవి.

## 6. పురాణముల ప్రాముఖ్యము

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం - యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై ।
తగుం హ బుద్ధి మాత్మ ప్రకాశం - ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే"
- [శ్వేతాశ్వతరోపనిషత్తు 6-18]

శ్రీమన్నారాయణుండు - తన నాభికమలమునుండి బ్రహ్మను ఉద్భవింపజేసి, ఆతనికి నాలుగు వేదముల నుపదేశించెను. ఆవేదములను చతుర్ముఖుఁడు శ్రద్ధగా అధ్యయనముగావించి -

"పురాణం సర్వశాస్త్రాణాం - ప్రథమం బ్రహ్మణా స్మృతమ్."
- [మత్స్య పురాణము]

---

2. చతుర్దశ [14] మనువులు -
[1] స్వాయంభువ మనువు [2] స్వారోచిష మనువు [3] ఉత్తమ మనువు [4] తామస మనువు [5] రైవత మనువు [6] చాక్షుష మనువు [7] వైవస్వత మనువు [8] సావర్ణిక మనువు [9] దక్షసావర్ణిక మనువు [10] బ్రహ్మసావర్ణిక మనువు [11] రుద్రసావర్ణిక మనువు [12] ధర్మసావర్ణిక మనువు [13] రౌచ్య మనువు [14] భౌమ మనువు. ఈ పదునాల్గురు మనువులును - ప్రసిద్ధులైన మనుమహర్షి తనయులు. ఇపుడు మనము - వైవస్వత మన్వంతరములో నున్నాము.

సర్వశాస్త్రార్థ సారముగా మొదట నొక పురాణమును రచిం చెను. అటుపిమ్మట -

"విస్తారస్య చ వేదానాం - స్వయం నారాయణ ప్రభుః
వ్యాసరూపేణ కృతవాన్ - పురాణాని మహీతలే."

- [పురాణార్ణవము : 18]

వేదములలోని విశేషములను వివరించు నిమిత్తము శ్రీమ న్నారాయణుఁడు వ్యాసునిరూపమున నుద్భవించి, అష్టాదశ (18) పురాణములను రచించెను.

## 7. అష్టాదశ (18) పురాణముల వివరణము

1 2 3 4 5 6
"బ్రాహ్మం - పాద్మం - వైష్ణవం చ - శైవం - లింగం - సగారుడమ్
7 8 9 10
నారదీయం భాగవత మాగ్నేయం స్కాందసంజ్ఞకమ్
11 12 13 14
భవిష్యం బ్రహ్మవైవర్తం - మార్కండేయం స వామనమ్
15 16 17 18
వరాహం మాత్స్యం కౌర్మం చ - బ్రహ్మాండాఖ్య మితి త్రిషట్."

- [శ్రీమద్భాగవతము : 12-7-23, 24]

(౧) బ్రహ్మపురాణము (౨) పద్మపురాణము (3) విష్ణుపురాణము (౪) శివపురాణము (౫) లింగపురాణము (౬) గరుడపురాణము (౭) నారదపురాణము (౮) భాగవతపురాణము (౯) అగ్నిపురాణము (౧౦) స్కందపురాణము (౧౧) భవిష్యపురాణము

(౧౨) బ్రహ్మవైవర్తపురాణము (౧3) మార్కండేయపురాణము (౧౪) వామనపురాణము (౧౫) వరాహపురాణము (౧౬) మత్స్య పురాణము (౧౭) బ్రహ్మాండపురాణము - అనునవి - అష్టాదశ (18) పురాణములుగా - భాగవతపురాణము వివరించుచున్నది. ఈ పదు నెనిమిదియును - మహాపురాణములుగా సంభావింపఁబడుచున్నవి. ఇయ్యవి - వ్యాసభగవానునిచే, ద్వాపర - కలియుగముల సంధి కాలములో రచింపఁబడినవి. ఇది యిట్లుండ, ఉపపురాణములు ఔపపురాణములు అను పేరులతో - పదునెనిమిది పురాణములు - (18×18=) అనంతరకాలమున వచ్చియున్నవి. వీనికి మహాపురాణములే ఆధారములుగానున్నది కాని, కొన్ని కొన్ని తావులలో - మార్పులు, చేర్పులు - చేయఁబడినవి.

## 8. మహాపురాణ విభజనము

పైన పేర్కొనఁబడిన అష్టాదశ (18) మహాపురాణములును - వాని వానిలోఁ గల యంశములనుఁబట్టి, సాత్త్విక - రాజస - తామస పురాణములుగా - మూఁడు విభాగములు చేయఁబడినవి.

౧. సాత్త్విక పురాణములు :-

"వైష్ణవం నారదీయం చ - తథా భాగవతం శుభమ్
గారుడం చ తథా పాద్మం - వారాహం శుభదర్శనే"

(౧) విష్ణుపురాణము (౨) నారదపురాణము (3) భాగవత పురాణము (౪) గరుడపురాణము (౫) పద్మపురాణము (౬) వరాహ పురాణము అనునవి యాఱును - సాత్త్వికపురాణములుగా నిర్వ చింపఁబడుచున్నవి.

౭. రాజస పురాణములు :—

"బ్రహ్మాండం - బ్రహ్మవైవర్తం - మార్కండేయం తథైవ చ
భవిష్యం వామనం బ్రాహ్మ్యం - రాజసాని నిబోధత."

(౧) బ్రహ్మాండపురాణము (౨) బ్రహ్మవైవర్తపురాణము (౩) మార్కండేయపురాణము (౪) భవిష్యపురాణము (౫) వామన పురాణము (౬) బ్రహ్మపురాణము - అనునవి యారును - రాజస పురాణములుగా పరిగణింపఁబడుచున్నవి.

౮. తామస పురాణములు -

"మాత్స్యం కౌర్మం తథా లింగం - శైవం స్కాందం తథైవచ
ఆగ్నేయం చ షడేతాని - తామసాని నిబోధత"

(౧) మత్స్యపురాణము (౨) కూర్మపురాణము (3) లింగ పురాణము (౪) శివపురాణము (౫) స్కాందపురాణము (౬) అగ్ని పురాణము అనునవి యారును - తామసపురాణములుగా వ్యవహ రింపఁబడుచున్నవి.

ఈ వివరణము మనకు - పద్మపురాణములో - 23 వ అధ్యా యమునందలి 17, 20, 21 శ్లోకములనుఁబట్టి తెలియవచ్చుచున్నది.

## 9. త్రివిధ పురాణ ఫల వివరణము

"సాత్త్వికా మోక్షదా ప్రోక్తా - రాజసా స్వర్గదాయకాః
తథైవ తామసా దేవిని - తన్నప్రాప్తి హేతవః." -(ప. ఉ 236-21)

సాత్త్వికపురాణములు మోక్షదాయకములు. రాజసపురాణ ములు - స్వర్గదాయకములు. తామసపురాణములు తామసగుణ ప్రేరకములు.

సాత్త్విక పురాణముల సమీక్ష :-

## 10. విష్ణు పురాణము

విష్ణుభగవానుఁడు-సత్త్వగుణసంపన్నుఁడు కావునను, సాత్త్వతాం పతి కనుకను - అట్టి విష్ణుభగవానుని ప్రభావ విశేషాదులను వివరించు నదియే విష్ణుపురాణము.

"వేదేషు పౌరుషం సూక్తం - ధర్మశాస్త్రేషు మానవమ్
భారతే భగవద్గీతా - పురాణేషు చ వైష్ణవమ్."

వేదములలో పురుషసూక్తము, ధర్మశాస్త్రములలో మను స్మృతి, భారతములో భగవద్గీత, పురాణములలో విష్ణుపురాణము అనునవి ప్రముఖములై నవి.

ఇట్లు ప్రముఖస్థాన మలంకరించిన యీ విష్ణుపురాణములో - రెండు భాగములు కలవు. ఈ రెంటిలో - ఆఱు అంశ లున్నవి. ఈ ఆఱింటిలో 126 అధ్యాయము లున్నవి. ఈ అధ్యాయము లన్నింటిలో మొత్తము - ఇరువదిమూడు వేల (23,000) శ్లోకములు కలవు.

"వారాహకల్ప వృత్తాంత మధికృత్య పరాశరః
యత్రాప ధర్మా నఖిలాన్ తదుక్తం వైష్ణవం విదుః."
- (మత్స్య పురాణము : 53 అధ్యాయము)

ఈ విష్ణుపురాణమునందలి పూర్వఖండములో - శ్వేతవరాహకల్ప వృత్తాంతమును ఆధారము గావించుకొని, పరాశరమహర్షి గ్రహిం

చిన ధర్మములు వివరింపబడినవి. అట్టి ఆ విష్ణుపురాణమునందలి పూర్వభాగములో - సృష్టిక్రమము, 'వాసుదేవ'శబ్ద నిర్వచనము, 'నారాయణ'శబ్ద నిర్వచనము, ఇంద్రుని గర్వభంగము, క్షీర సాగరమథనము, లక్ష్మ్యుత్పత్తిక్రమము, ధ్రువోపాఖ్యానము, ప్రహ్లాద చరిత్ర, జడభరతోపాఖ్యానము, సగరుని చరిత్ర, శ్రీరామ చరిత్రము, జనకుని వంశానుక్రమము, చంద్రవంశపు రాజుల వృత్తాంతము, శ్రీకృష్ణ జననము, కృష్ణలీలలు, కాళియమర్దనము, ధేనుకాసుర సంహారము, గోవర్ధనోద్ధరణము, రాసక్రీడాదికము, అరిష్టాసురవధ, జరాసంధవధ, పారిజాతాపహరణము, బాణాసుర వధ, శ్రీకృష్ణ నిర్యాణము, మున్నగు చరితాంశము లే కాక, నడుమ నడుమ - సందర్భోచితముగా వైష్ణవ మాహాత్మ్యము, వైష్ణవ లక్షణము, వర్ణాశ్రమధర్మములు, కలియుగదోషాది వివరణము, కలియుగ ధర్మములు, యమ నియమాది అష్టాంగయోగములు — మున్నగు విషయములును వివరింపబడినవి.

## 11. ఆంధ్ర విష్ణు పురాణోదయము

సంస్కృతభాషలో గల యిట్టి యీ విష్ణుపురాణమునందలి పూర్వభాగమును - ఆశువిస్తార విచిత్రమాధుర్యశీలుఁడు, నిజకులాచారమార్గైక నిపుణుఁడు, పరమసాత్త్విక మహోదయుఁడు, వైష్ణవ పురాణవేది, సారస్య విద్యాప్రవీణుఁడు, సుకవిమాననీయుఁడు నగు వెన్నెలకంటి సూరనార్యుఁడు ఆంధ్రభాషలోనికి ఛందోబద్ధముగ అనువదించియున్నాఁడు.

ఈ సూరనకవి (6వ శతాబ్దమునకుఁ జెందినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు, హరితసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుండు. ఈ కవి

శేషరుఁడు విష్ణుపురాణమును ఆంధ్రీకరించుచుండగా, 'కృష్ణా! దేవకీనందనా!' - అను మకుటముతో నొక శతకమును సైతము రచించి, తనకు విష్ణుభగవానునియందుగల అచంచల భక్తిభావమును విస్పష్టము గావించెను.

## 12. ఆంధ్ర విష్ణుపురాణ సమాలోకనము

౧. విష్ణు ప్రభావము :-

> "విష్ణుఁడె భక్తవత్సలుఁడు - విష్ణుఁడె దేవమయుండు, వేల్పులన్
> విష్ణుఁడె బ్రోవనేర్చు, మఱి - విష్ణుఁడె విశ్వమయుండు - సర్వమున్
> విష్ణుమయంబులై నడచు, వేయునుఁ జెప్పఁగ నేల ? నీవు శ్రీ
> విష్ణుపురాణమున్ వినుము - వేదసమానము తాపసోత్తమా !" [1-24]

ఓ తాపసోత్తమా ! ఆశ్రితులైన భక్తులయందు వాత్సల్యము నుంచి రక్షింపఁగలవాఁడు విష్ణువే. దేవత లందఱియందును వ్యాపించి యున్నవాఁడు విష్ణువే. సర్వవిశ్వమునకు విష్ణువే గురువు. సకల చరాచర ప్రపంచము విష్ణుమయమై ప్రవర్తించుచుండును. వేయిఁ జెప్పనేల ? వేదసమానము విష్ణుపురాణము. కావున, నీవు వినుము.'

౨. పరమపద వైభవము :-

> "సంతతంబునుఁ గాలచక్రమధ్యమ్మున - వేదియబోలె ధ్రువుఁ డెుదుఁడెందు
> నారద సనక సనందన సనత్సుజాతాదు లెవ్వేటిఁ బాయక చరింతు
> రాకల్పపర్యంతమైన కాలంబు - సుపర్వు లే లోకంబు బాసిచనరు
> భూ ర్భువ స్స్వర్లోకముల కెల్ల నున్నతస్థానమై యేవంకఁ దనరారియుండు
> హరిపదధ్యానపూజాప్రయత్నవిముఖులైనవారికి దురవగాహప్రదేశ
> మెద్ది, యెది నిరుపాధియై యెల్లఁ బొద్దుఁబరగుచునది విష్ణుదేవుని పరమపదము."

నిరంతరము కాలచక్రములో వేదికవలె ధ్రువుఁ డెందు ప్రకాశించునో, నారద - సనక - సనందన - సనత్సుజాతాది దేవర్షులు ఎచట సతతము సంచరింతురో, ప్రళయకాలమునఁ గూడ - దేవతలు ఏ లోకమును వదలియుండరో, భూ ర్భువ స్సువ ర్లోకాదుల కెల్లను ఉన్నతస్థానమై ఎచట విరాజిల్లుచుండునో, విష్ణుభగవానుని చరణారవిందసంసేవనము సేయునివానికి ఎయ్యది దురవగాహ ప్రదేశమో, ఎయ్యది నిర్విచారమై,ఎల్లపుడును ప్రకాశించుచుండునో-అయ్యదియే విష్ణుభగవానుని పరమపదము. (3-185)

"నిరతాష్టాక్షరవిద్యాపరతంత్రులు, చిత్సుఖానుభవనిత్యాత్మల్
హరిభక్తులు - "త ద్విష్ణోః పరమపద"మ్మనుచు నెచట భక్తిఁదలతుర్."

నిరంతరము - అష్టాక్షరమంత్రజపతత్పరులు, భగవదానందానుభవముగలవారలు, "తద్విష్ణోః పరమంపదమ్" అను దివ్యమంత్రమును నిరంతరము అనుసంధించు భక్తిభావ ఘంటాపథ మహారథులు ఎచట గలరో, అయ్యదియే విష్ణుభగవానుని పరమపదము. (3-186)

౬. వాసుదేవశబ్ద నిర్వచనము :-

"విను మైత్రేయ ! జగంబులు
దనలోనను, జగములోన - దాను వసియిం
చు నిమిత్తంబునజూమ్మీ
యనఘాత్ములు వాసుదేవుఁ డంద్రు ముకుందున్." [1-85]

తనలో సకలచరాచర ప్రపంచము, తాను సమస్త ప్రపంచమందును వసించియుండుటచే, వాసుదేవుఁ డనఁబడుచున్నాఁడు.'

౪. కాలము వాసుదేవ స్వరూపము :-

"అమలం బవ్యయ మప్రమేయ మఖిల వ్యాపార మాద్యంతహీ
నవ్య మశేషంబు సమస్తముం దనమయంబై యుండు గా
లము, కాలం బన - వాసుదేవునకు లీలారూప, మాకాలమా
నము నిత్యంబు దివానిశాప్రకృతి జూపట్టున్ మునీంద్రోత్తమా!" [1-87]

నిర్మలము, శాశ్వతము, అనిర్వచనీయము, అఖిలవ్యాపారము, ఆద్యంతరహితము, అశేషమునైన ఈ సర్వప్రపంచమును తన యధీనములోనుండి, కాలము వర్తించుచుండును. కాల మనఁగా - వాసుదేవునకు లీలారూపము. ఆ కాలరూపము - నిత్యము - రాత్రింబవళ్ళుగా (ప్రకృతిగా) కన్పట్టుచుండును.

౫. వైష్ణవ ప్రభావము :-

యమునిచే నియుక్తుఁడైన కింకరుం డొకఁడు (యమ భటుఁడు) దండధరుఁడగుచు, భూలోకమునఁగల జీవరాసుల నరసి, అపరాధము లను చేసినవానినిఁబట్టితెచ్చుటకు పయన మగుచుండ, అపుడా యముఁడు - అ కింకరుని తనకడకు రమ్మని పిలిచి, వానికి రహస్యముగా నిట్లు చెప్పినఁట !

"నీవు మహీతలంబునకు నేఁగి, ముకుందునిమీది భక్తిచేఁ
జీవనహింధియున్న గుణశీలుర డెన్నెడు నుమ్ము; వైష్ణవుల్
పావనుల మ్మహాత్ములకు బాపము లేనియు జేర వెన్నడున్
కావున, వారు-లోకములకంటెను మాన్యులు, ధన్యులెంతయున్." [4-111]

ఓ కింకరా ! నీ విపుడు భూలోకములో దండముచేసినవారిని గొనితెచ్చుటకు పయనమగుచుంటివిగదా! ఇపుడు నీ కొక ముఖ్య

విషయమునుఁ జెప్పెద వినుము :- ఏమన, విష్ణుభగవానునియందలి భక్తి భావమునుంచి సముపార్జించిన బలశాలురను పట్టి తేవలదుసుమా! వైష్ణవులు పరమ పవిత్రులు, ధన్యులు, కావున - వారికి పాపము లెన్నఁడును అంటవు. కనుక, వారు మనకు మాననీయులు.'

''నళినదళాక్ష రాజసగుణంబునఁ బుట్టిన తమ్మిచూలికిన్
దలవరివాఁడనై తగిన దండనముల్ గడుజేయునాకు, ను
జ్జ్వలమహిమాన్యులై వెలయు వైష్ణవు లెల్ల నజేయు లట్టివా
రల దరిబోకుమా! బ్రతుకు. బ్రాణములున్ వలతేని కింకరా!" [4-112]

"విష్ణుభగవానుని రజోగుణముచే సృష్టించిన బ్రహ్మదేవునకు తలవరివాఁడనై, అపరాధులకు దండములు విధించునట్టి నేను - మహా మహిమోపేతులైన వైష్ణవులను జయింపఁజాలను. కావున, అట్టి వైష్ణవుల వద్దకు పోవలదు."

"విష్ణు పరిగ్రహంబు లేని దురితమతులు - మనవలన అతి క్రూరదండంబు నకు అర్హులు. పరమ వైష్ణవులకు - సకల శోభన కల్యాణమైన కైవల్యంబు గాని, మన లోకంబు దుస్తరంబు" [4-26]

'విష్ణుభక్తి లేని పాపాత్ములు - మనుదండనమునకు తగినవారు. పరమ వైష్ణవులకు - సకల శుభములకును నిలయమైన పరమపదము లభించుఁగాని, మన లోకము [యమలోకము] ప్రాప్తింపదు."

అని యముఁడు - భీష్మ ఁడను తన భటునకు జెప్పియుండుటను, బట్టి, విష్ణుభక్తులగువారలకు యమలోకభయము లేదనియు, శాశ్వత మైన ఆనందమునకు ఆటపట్టు అగు పరమపదము లభించుననియు స్పష్ట మగును.

ఉ. విష్ణుపురాణ ప్రశస్తి :-

"వేదంబులకు నెల్ల వేదంబు
ధర్మశాస్త్రములలో ధర్మశాస్త్ర
మాగమములలోన నాగమం బగు
జ్యోతిషంబులలోన జ్యోతిషంబు
బహుపురాణములలోపల పురాణం
బితిహాసంబులో నితిహాస మరయ
నీతిశాస్త్రములలో నీతిశాస్త్రము, మహా
యోగవిద్యలలోన యోగవిద్య
కావ్యములలోన గావ్యంబు - భవ్యతరము
సకల లోకైకవేద్యంబు - సకల సుకవి
చిత్తరు జనకారణం బుత్తమంబు
క్షోణి నొప్పారు - విష్ణుపురాణ మనఘ." [1-30]

వివిధ విశేషములతోఁ గూడిన యీ విష్ణుపురాణమును - వేదముగా, ధర్మశాస్త్రముగా, ఆగమశాస్త్రముగా, జ్యోతిశ్శాస్త్రముగా, మహేతిహాస సముచ్చయముగా, యోగశాస్త్రముగా, మహాకావ్యముగా, వేద్యముగా (తెలియఁదగినదిగా), చిత్తరంజకముగా, ఉత్తమమైనదిగా భూలోకమున విలసిల్లుచున్నది' అని - సూరన కవియే స్పష్టముగ తెలియఁజేసియున్నాడు.

## 13. పద్మ పురాణము

పద్మపురాణములో - (1) సృష్టిఖండము (2) భూమిఖండము (3) స్వర్గ ఖండము (4) పాతాలఖండము (5) ఉత్తరఖండము -

అనఁబడు ఐదు ఖండము లున్నవి. సృష్టిఖండములో - 72 అధ్యాయములు, భూమిఖండములో - 125 అధ్యాయములు, స్వర్గ ఖండములో 39 అధ్యాయములు, పాతాలఖండములో - 113 అధ్యాయములు, ఉత్తరఖండములో - 272 అధ్యాయములును కలవు. వెరశి మొత్తము 621 అధ్యాయములు కాగా, ఈ యధ్యాయము లన్నిటిలో - 55,000 శ్లోకములు కలవు.

హిరణ్మయపద్మమునుండి జగ దుత్పత్తియైయున్నందున, ఈ పద్మపురాణము - 'బుధజనపాద్మము' అని వ్యవహరింపబడుచున్నట్లు ఈ పద్మపురాణమునందు వివరింపఁబడినది.

ఈ పద్మపురాణములో సృష్టిఖండమున - జగత్సృష్టిని గుఱించియేగాక, దేవతలగుఱించియు, పితృదేవతలనుగుఱించియు, భూమిఖండమున - సప్తద్వీపములు, సప్తసాగరములు, పర్వతములు - మున్నగువానినిగుఱించియు, స్వర్గ ఖండమున దక్షుని శాపము మున్నగువానినిగుఱించియు, స్వర్గ ఖండమున - వంశానుచరితములు, రాజుల చరితములు మున్నగునవియు - వర్ణింపబడినవి. కడపటి దగు ఉత్తరఖండములో - మోక్షమార్గము, వైష్ణవసంప్రదాయ విశేషములు, అనేక తాత్త్విక విషయములును - వివరింపబడినవి. మఱియు, జైన - బౌద్ధ - ప్రచ్ఛన్నబౌద్ధ - చార్వాకమతములు ఖండింపఁబడినవి.

"పంచఖండయుతం పాద్మం - య శ్శృణోతి నరోత్తమః
సలభే ద్వైష్ణవం ధామ భుక్త్వా భోగా నవాప్సితాన్."

ఐదు (5) ఖండములు గల ఇట్టి యీ పద్మపురాణమును ఆకర్ణించిన మానవులు - ఇహలోకములో సకల భోగములను, పర

లోకములో విష్ణుసాయుజ్యమును పొందఁగలరని - గ్రంథాంతమున ఫలశ్రుతిగాఁ జెప్పఁబడినది.

## 14. వరాహ పురాణము

వరాహ పురాణములో - పూర్వభాగము, ఉత్తరభాగము - అనునవి రెండు కలవు. వీనిలో మొత్తము 217 అధ్యాయము లున్నవి ఈ అధ్యాయములలో నిర్దేశింపఁబడిన ప్రకారము - శ్లోకములు 24,000 ఉండవలసియున్నవి. కాని, నేఁడు కేవలము 10,000 శ్లోకములు మాత్రమె ఇందు కానవచ్చుచున్నవి.

"శ్రుణు వత్స ! ప్రవక్ష్యామి - వారాహం వై పురాణకమ్
భాగద్వయయుతం శశ్వత్ - విష్ణుమాహాత్మ్య పంచకమ్
మానవస్య చ కల్పస్య - ప్రసంగం మత్కృతం పురా
నిబద్ధపురాణేఽస్మిన్ - చతుర్వింశ త్సహస్రకమ్
వ్యాసో హి మానుషాం శ్రేష్ఠః - సాక్షాత్ నారాయణో భువి
కల్పాదౌ శుకసంవాదః - స్మృతో భూమివరాహకః."

ఓ వత్సా ! నారదా ! వరాహ పురాణ వైశిష్ట్యమును వివరించెద వినుము. వరాహ పురాణము రెండుభాగములు కలదియై, విష్ణు భగవానుని మాహాత్మ్యమును వర్ణించుచున్నదని. దీనిని నేను మానవ కల్పములో రచింప, వ్యాసుఁ డపుడు - భూవరాహావతార విశేషము లతోఁ గూడిన ఈ వరాహ పురాణమును - ఇరువదినాల్గువేల గ్రంథముగా రచించె ననియు - నారదునితో చతురాననుఁడు పలికె నని - నారద పురాణమునందలి 20 వ అధ్యాయమునుఁబట్టి తెలియుచున్నది.

ఈ వరాహ పురాణములో – చాతుర్మాస మాహాత్మ్యము, భగవద్గీతా మాహాత్మ్యము, విమాన మాహాత్మ్యము, వేంకటాచల మాహాత్మ్యము - మున్నగు విశేషము లనేకములు వివరింపఁబడినవి.

## 15. నారద పురాణము

నారద పురాణములో - పూర్వోత్తర భాగములు రెండు కలవు. పూర్వభాగములో - 125 అధ్యాయములు, ఉత్తరభాగములో 62 అధ్యాయములును ఉండగా, వెరశి మొత్తము 207 అధ్యాయములలో 25,000 శ్లోకములుగా గలదని తెలియును. కాని, నేఁడు వానిలో కొన్ని లుప్తములై, ఇపుడు కేవలము 18,160 శ్లోకములు మాత్రము లభించుచున్నవి.

ఈ నారద పురాణములో - కార్తికమాహాత్మ్యము, యదుగిరి మాహాత్మ్యము, శ్రీకృష్ణ మాహాత్మ్యము - మున్నగునవి వర్ణింపఁబడినవి.

## 16. గరుడ పురాణము

గరుడ పురాణము ఖండద్వయాత్మకము పూర్వఖండములో 240 అధ్యాయములు, ఉత్తరఖండములో 78 అధ్యాయములును ఉన్నవి. వెరశి మొత్తము 318 అధ్యాయములుకాఁగా, వీనిలో 19,000 శ్లోకములు కలవని - నారదపురాణము, 18,000 శ్లోకములు కలవని మత్స్యపురాణము సూచించుచున్నవి, ఈ యంశమును గుఱించి ఈ గరుడపురాణమును నిశితముగ పరిశీలింప, ఇందు 10,000 శ్లోకములు లుప్తములై, ఇపుడు నేఁడు కేవలము 8,000 శ్లోకములు మాత్రము లభించుచున్నట్లు స్పష్ట మగును.

ఏ మానవుఁడేని మరణించిన యనంతరమున మననము చేయఁదగిన పురాణ మిది. ఇందు - శ్రాద్ధక్రియలు, దానధర్మములు, వాని ఫలములు, గయాది పుణ్యక్షేత్ర మాహాత్మ్యములు మున్నగునవి ఈ గరుడపురాణమునందు వర్ణింపఁబడినవి.

ఇవియెగాక, మఱియింకను - విష్ణుభక్తి వైశిష్ట్యము, విష్ణ్వర్చనావిధి, ధ్యానము, బ్రహ్మాండ స్వరూపము, వర్ణాశ్రమ ధర్మములు, యుగముల వివరములు - తద్విశేషములు, జ్యోతిషము, ఆయుర్వేదము, వ్యాకరణము, ఛందస్సులు, అష్టాంగయోగములు, గీతార్థసారము, గయాక్షేత్రము, ఓషధుల వివరణము, నవరత్న పరీక్ష, త్రివేణీస్తోత్రము, పంచపర్వమాహాత్మ్యము, విష్ణుధర్మోత్తరము, వేంకటాచలమాహాత్మ్యము, సుందరపురమాహాత్మ్యము, స్వర్గలోక ప్రశస్తి మున్నగు విశేషములు - ఈ గరుడపురాణములో వివరింపఁబడినవి.

## 17. శ్రీమద్భాగవత పురాణము

భాగవత పురాణములో - 12 స్కంధము లున్నవి. వీనిలో 335 అధ్యాయములు కలవు. ఈ అధ్యాయము లన్నింటిలో - వెరశి మొత్తము 14,615 శ్లోకము లున్నవి.

ఈ భాగవత పురాణములో - (1) సూతుఁడు నారాయణుని కథాప్రశంస చేయుట (2) భగవంతుని యనేకవింశ త్యవతారములు (3) కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించుట (4) భీష్ముండు శ్రీకృష్ణుని స్తుతించుట (5) శ్రీకృష్ణుడు ద్వారకా నగరమును ప్రవేశించుట (6) శ్రీకృష్ణుని - అంతఃపురకాంతలు చూడఁబోవుట (7) పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించి, ధర్మపరిపాలనము సేయుట (8) శుకుఁడు

పరీక్షిత్తునకు ముక్తిమార్గము దెలుపుట (9) నారదుండు బ్రహ్మను ప్రపంచప్రకారంబు నడుగుట (10) నారాయణుండు బ్రహ్మతపంబునకు మెచ్చి, వరంబు లిచ్చుట (11) శ్రీయజ్ఞవరాహావతారవర్ణనము (12) సనక - సనందనాదులు శ్రీవైకుంఠమున కరిగి, నారాయణుని ప్రార్థించుట (13) ధ్రువోపాఖ్యానము (14) పురంజనోపాఖ్యానము (15) భరతోపాఖ్యానము (16) భూగోళవర్ణనము (17) నరకలోక వర్ణనము (18) శ్రీవిష్ణుదూత, యమదూత - సంవాదము (19) శ్రీమన్నారాయణ కవచము, (20) ప్రహ్లాద చరిత్ర (21) గజేంద్రమోక్షము (22) శ్రీవిష్ణుమూర్తి మోహినీస్వరూపమును ధరించుట (23) దేవాసుర యుద్ధము (24) అంబరీషోపాఖ్యానము (25) శ్రీరామచరిత్రము (26) శ్రీకృష్ణావతారఘట్టము (27) శ్రీకృష్ణ లీలలు (28) కాళియ మర్దనము, (29) గోపికా వస్త్రాపహరణము (30) రాసక్రీడాభివర్ణనము (31) వృషభాసుర సంహారము (32) శ్రీకృష్ణుండు - కువలయాపీడుని వధించుట (33) గోవర్ధనోద్ధరణము (34) రుక్మిణీకల్యాణము (35) కుచేలోపాఖ్యానము (36) పరీక్షిత్తునకు శుకయోగి - విష్ణుసేవా ప్రాశస్త్యంబు దెలుపుట - ఇత్యాది విషయ విశేషము లనేకములు వర్ణింపఁబడినవి.

ఇట్టి యీ భాగవతపురాణ మాహాత్మ్యము - స్కాందపురాణము నందలి విష్ణుఖండమున విపులముగ దెలుపఁబడినది. మఱియు - పద్మపురాణమునందును, యీ భాగవత పురాణ మాహాత్మ్యము వర్ణింపఁబడినది.

## 18. సర్వవేదసారము భాగవతము

భక్తిప్రధానమైన శ్రీవైష్ణవ సంప్రదాయమునకు - మహా నారాయణోపనిషత్తును, శ్రీపాంచరాత్రాగమమునకుం జెందిన

సాత్త్వత సంహిత, పరమ సంహిత, పరమపురుష సంహిత, పురుషోత్తమ సంహిత, పారమేశ్వర సంహిత - మున్నగు ఆగమ శాస్త్రములను, నారద భక్తి సూత్రములను, శాండిల్య భక్తి సూత్రములను, భగవద్గీతా శాస్త్రమును, విష్ణు భాగవతాది సాత్త్విక పురాణములను - ఆధారముగావించుకొనియే - నాథ, యామున, రామానుజాచార్యాది వైష్ణవమత ప్రవర్తకులు - శ్రీవైష్ణవ సంప్రదాయ గ్రంథములను రచించి, విఖ్యాతిగావించియున్నారు.

అట్టి ఆధారగ్రంథములలో నొకటియగు భాగవత మహాపురాణమునకు - 14 వ శతాబ్దమునకు జెందిన వైష్ణవప్రముఖులగు 'రాఘవాచార్య' లనఁబడువా రొకరు - 'భాగవత చరిత్ర చంద్రిక' - అను పేర వ్యాఖ్యానమును రచించుచు, అందు - * "శ్రీమద్భాగవత మహాపురాణము - 'సర్వవేదసారము' అని వ్యక్తీకరించియున్నారు. దీనినిఁబట్టి, యీ భాగవత మహాపురాణ వైశిష్ట్యము సుస్పష్టము.

## 19. ఆంధ్ర భాగవత సందేశము

సంస్కృత భాషలోఁ గల భాగవత మహా పురాణమును-15 వ శతాబ్దమునకు జెందిన పరమ భాగవతోత్తముఁడు, సహజ పాండిత్య శిఖామణియు నగు పోతనామాత్యుఁడు - భావమధురముగ ఆంధ్రీకరించి, చిరయశమును గాంచెను.

---

* భగవద్రామానుజుల శ్రీభాష్యమునకు - 'శ్రుతప్రకాశిక'యను పేర వ్యాఖ్యానమును రచించి, ప్రముఖ వైష్ణవ పండితులుగా ప్రసిద్ధి గాంచిన 'సుదర్శనసూరి' అను మహనీయులును - 'శుకపక్షీయ'మను పేర - భాగవత పురాణమునకు సంగ్రహముగ వ్యాఖ్యానమును రచించియున్నారు.

— సంపాదకుఁడు.

ఇట్టి యీ ఆంధ్రమహాభాగవతమునందలి కొన్ని విశేషములను ఇట విలోకించి, మహాకవియగు పోతనకవితావైశిష్ట్యమును, రసాలయ మగు భాగవతమహాపురాణ ప్రాశస్త్యమును - ఇట కొలదిగా గ్రహింతముగావుత !

౧. విష్ణు ప్రభావము :-

"విష్ణుండు విశ్వంబు - విష్ణువుకంటెను
వే రేమియును లేదు - విశ్వమునకు
ధనవృద్ధి, జయము లా రమేశుచే నగు." [1-122]

విశ్వమే విష్ణువు. విష్ణువునకంటెను - వే రేమియు లేదు. ధన వృద్ధి, జయము అనునవి - విష్ణువువలననే కలుగును."

౨. సర్వం విష్ణుమయమ్ :-

"సంతతంబును కృష్ణ సంకీర్తనంబులు
వీనుల విందుగవలయు
హర్షంబుతో హరినామకథనంబు
పాటల నాటల జరగివలయు
నారాయణుని దివ్య నామాక్షరంబులు
హృద్వీథి సతతంబు నిలువవలయు
కంజాక్షులీలలు - కాంతారవులనైన
భక్తి యుక్తులతోడ చాటవలయు
వెఱ్ఱిమాడ్కిని లీలతో విశ్వమయుని
నుడువుచును లోకబాహ్యత నొందవలయు
వింతయును విష్ణుమయ మని తెలియవలయు
భేద మొనరింపకలవదు మేదినీశ !" [11-44]

ఓ రాజా ! నిరంతరము – వీనులవిందుగా కృష్ణనామ సంకీర్తనముగావింపవలెను. మనసులో ఎల్ల ప్పుడు – నారాయణ నామమును ధ్యానించుచుండవలెను. హరికథలను అరణ్యమందైనను – భక్తి భావముతో పాడుచు, ఆడుచుండవలెను. ఈ ప్రపంచములో వెఱ్ఱి వానివలె ప్రవర్తించుచు, బాహ్యలోకమును మఱచి, సర్వము విష్ణుమయమని తెలియవలెను.”

ఇ హరిభక్తి ప్రశస్తి :—

“హరివార్త లెఱుఁగువారికి
హరిపదములు దలఁచువారి కనవరతంబున్
హరికథలు వినెడువారికి
మరణాగత మోహ భ్రమము లే దనఘా !”

–(ఆంధ్ర భాగవతము : 1-49)

విష్ణుభగవానునకుఁ జెందిన విశేషములు తెలియువారికి, ఆ భగవానుని పాదపద్మములను స్మరించువారికి, ఆ దేవదేవుని దివ్యచరితములను ఆకర్ణించువారికిని – మరణ సంబంధమను మోహము కలుగదు.’

## 20. పరిశిష్టము

విష్ణుభగవానుని వైకుంఠలోకము, ఆ స్వామిచే చేయబడిన సృష్టివిశేషము, కలియుగలక్షణములు, కలియుగాంతమున సంభవించు మహాప్రళయములు మున్నగునవి – బ్రహ్మపురాణములో వివరింపబడినవి.

బ్రహ్మవైవర్త పురాణములో - శ్రీకృష్ణస్తోత్రము, ఏకాదశీ మాహాత్మ్యము, ముక్తిక్షేత్ర మాహాత్మ్యము, శ్రీ గోష్ఠీ మాహాత్మ్యము మున్నగునవి వర్ణింపబడినవి.

బ్రహ్మాండ పురాణములో - అధ్యాత్మ రామాయణము, కృష్ణ లీలలు, అంజనాద్రి ప్రశస్తి, కావేరీమాహాత్మ్యము, గోదావరీ మాహాత్మ్యము, క్షీరసాగర - దండకారణ్య - జ్ఞానమండప వైశిష్ట్యములు, లక్ష్మీపూజా విధానము, నరసింహావతార ప్రాముఖ్యము, శ్రీరంగ - కాంచీపురక్షేత్ర మాహాత్మ్యములు మున్నగునవి వర్ణింపబడినవి.

కూర్మపురాణములో - మత్స్య, కూర్మ, వరాహ, కృష్ణ, కల్కి అనఁబడు భగవదవతార విశేషములు, విష్ణుపూజా విధానము, ఉత్సవ విశేషములును వర్ణింపబడినవి. మఱియు, విష్ణుపంజరస్తోత్రము, విష్ణు పవిత్రారోపణము మున్నగునవియు ఇందు వర్ణింపబడినవి.

స్కాంద పురాణములో - శ్వేతద్వీప వర్ణనము, దశావతార వర్ణనము, బదరీక్షేత్ర మాహాత్మ్యము - మున్నగునవి వర్ణింపబడినవి.

అగ్నిపురాణములో - మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, రామ, కృష్ణ, కల్కి అవతారవైభవములేగాక, మఱియింకను అనేక విశేషాంశములు వివరింపబడినవి.

## 21. ముగింపు

పురాణవాఙ్మయములో - సృష్టిక్రమము, భగవదవతార విశేషములు, భారతీయ మహాపురుషుల జీవిత చరితములు, మహాచక్రవర్తుల

వృత్తాంతములు, సాధ్వీమణుల గాథలు, భక్తుల చరితములు మున్నగునవి వర్ణింపబడినవి. మఱియు - దివ్యక్షేత్రములు, పుణ్యనదీనదములు మొదలగువాని మాహాత్మ్యములును వర్ణింపఁబడి, భారతీయ సంస్కృతీ విశేషమును ప్రతిబింబించునదిగా యీ వాఙ్మయము ప్రసిద్ధిగాంచి యున్నది. అట్టి యీ పురాణవాఙ్మయములో మూలసూత్రముగాఁగల సనాతన ధర్మస్వరూప విశేషమును గ్రహించి, మానవజీవిత పరమార్థమును గుర్తించి, ధర్మస్వరూపుఁడగు శ్రియఃపతిని స్తుతించి, ఆరాధించి, ఆ జగన్నాథుని యనుగ్రహ భాగ్యమును పొందుట - మానవకోటికి ఆవశ్యకమైయున్నది.

"పావనములు దురిత లతా
లావనములు నిత్యమంగళ ప్రాభవసం
జీవనములు - లక్ష్మీసం
భావనములు వాసుదేవు పదసేవనముల్."



# మహా ప్రభువులు - వైష్ణవ మత ప్రభావము

'సాహిత్య విద్యాప్రవీణ'
డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు,
ఎం. ఏ., పిహెచ్. డి.



## 1. అంజలి

అప్రాకృతే దివ్యధామ్ని - శ్రీమాతృపరిషేవితమ్ ।
పుండరీకాయతదృశం - సంశ్రయే ధీపదీప్తయే ॥
శ్రయే రంగపతిం తుంగశేషపర్యంకశాయినమ్ ।
శనైః ఉన్నిద్ర నేత్రాబ్జ ప్రీణితాశేషచేతనమ్ ॥

## 2. ప్రస్తావన

విష్ణువే పరబ్రహ్మమని విశ్వసించి ఆరాధించు విధానమే వైష్ణవము. ఇది వైదికము. ఋగ్వేద - యజుర్వేదాదులలో విష్ణుపారమ్యమును విశ్వసించి ఉపశ్లోకించుట - గోచరించుచున్నది. ఆ విశ్వాసమునకు - దరిద్రుడు, ధనాఢ్యుడు - అను వ్యత్యాసముకాని, వర్ణ ఆశ్రమాది భేదములుకాని, ఏనాడును అడ్డుకాలేదు. విష్ణువును సర్వస్వముగా విశ్వసించి, ఆరాధించి, తరించి, తరింపజేసినవారిలో దరిద్రు లున్నారు; అఖండ భూమండలమును పాలించిన మహా చక్రవర్తులును ఉన్నారు. బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్ర జాతులవా రందరును ఉన్నారు. వైదికము, పరమ సాత్త్వికము నగు వైష్ణవోపాసనావిధానమును త్రికరణశుద్ధిగా నమ్మి, ఆచరించి,

మహానుభావులుగా భాగవతకోటిలో చేరి కీర్తింపబడిన మహాప్రభువులు ప్రాచీనకాలమునుండియు, పలువు రున్నారు. పురాణములలో వీరిని గురించిన ప్రస్తావన - విశేషముగా నున్నది.

''నా విష్ణుః పృథివీపతిః.''

విష్ణ్వంశ లేనివాడు - పృథివీపతి కాజాలడని ప్రసిద్ధి. కనుకనే -

''న హి పాలన సామర్థ్యం - ఋతే సర్వేశ్వరం హరిమ్.''

సర్వేశ్వరుడైన శ్రీహరి యనుగ్రహములేనిచో, లోకపరిపాలనా సామర్థ్యము కలుగదని - విష్ణు పురాణము వివరించుచున్నది. (శ్లో॥ 1-22-21) అంతియకాదు :- దేవాధిపతులు, దైత్యాధిపతులు, దానవాధిపతులు, నరనాథులు — ఇంకను పశు - పక్షి - నాగ - పర్వత - వృక్షజాతులలోకూడ విష్ణ్వంశ కలవియే అధిపతులుగా పరిగణింపబడునని -

''యే భవిష్యన్తి యేయే భూతాః । సర్వభూతేశ్వరాః ద్విజ ।
తే సర్వే సర్వభూతస్య - విష్ణోరంశ సముద్భవాః." [వి. పు. 1-22-17]

ఎవరికముందు సర్వభూతేశ్వరులుగా కాగలరో, ఇంతకుముప్పు ఎవరు ఆరీతిగా నైరో, వీ రందరు విష్ణ్వంశసంభూతులేయని విష్ణుపురాణము ఉద్ఘోషించుచున్నది. అయినచో — సర్వకాలములందును తాము విష్ణ్వంశ సంభూతులై, విష్ణ్వనుగ్రహమువలననే పృథివీపాలనత్వమును నిర్వర్తించుచున్నారని గుర్తించి, విష్ణుప్రీతిని అలవరచుకొనినవారు ఆరీతిగా గుర్తింపలేక - విష్ణుద్వేషులై నశసినవారును ఉన్నారు.

## 3. విష్ణ్వంశ లేక - పరిభుపు కాజాలడు

సకలరాజన్యలోకమునకు మూలపురుషుడైన స్వాయంభువ మనువు - విష్ణ్వారాధనమువలన మనుష్యత్వమును పొందెనని పురాణములు పలుకుచున్నవి.

"ఏత జ్జజాప భగవాన్ జప్యం స్వాయంభువో మనుః ।
పితామహ స్తవ వురా - తస్య తుష్టో జనార్దనః" [వి. పు. 1-12-63]

భువమనుపుత్రులైన ప్రియవ్రత - ఉత్తానపాదులతో, ఉత్తానపాదుని కుమారుడగు ధ్రువుడు - సర్వోన్నత పదమును కోరి, ఇంటి నుండి వెడలినపుడు - సప్తర్షు లాతనికి దర్శన మొసంగి, ఆతని తాతయైన స్వాయంభువమనువు - ఏ విష్ణుమంత్రజపమువలన సర్వలోకనాథత్వమును పొందెనో, దానినే జపింపవలసినదని - ధ్రువునకు ప్రతిబోధించెను. అపు డా ధ్రువుడు - విష్ణ్వారాధనముచే లోకపాలకత్వమును పొందుటేకాక, గ్రహచక్రగమనమునకు కేంద్రస్థానమైన ధ్రువస్థితిని సైతము పొందెను. ఆ ధ్రువుని అంశముతో ఆవిర్భవించి, మొట్టమొదటగా అరాజకమైన భూమికి - రాజ్యవ్యవస్థను కల్పించిన పృథుపు - విష్ణ్వవతారముగా పరిగణింపబడి, కీర్తింపబడినాడు.

"విష్ణుచిహ్నం కరే చక్రం - సర్వేషాం చక్రవర్తినామ్."
-[వి. పు. 1-13-46]

అని, చక్రవర్తి కాదగిన వ్యక్తిని - కరతలములో చక్రచిహ్నముండునవియు, అయ్యది - వైష్ణవచిహ్నమనియు, అది పృథువునకు కలదనియు - బ్రహ్మ గుర్తించి, ఆతనిని చక్రవర్తిగా అభిషేకించెనని - పురాణములు చెప్పుచున్నవి.

ఋగ్వేదములో విష్ణువు యజ్ఞమూర్తిగా, యజ్ఞఫలప్రదాతగా నిరూపింపబడినాడు. అందువలన, వైష్ణవారాధనమైన 'యజ్ఞము' - పృథివీపాలనకు అపరిహార్య లక్షణముగా - వేద పురాణ కాలములకు పిమ్మటకూడ గుర్తింపబడినది.

''యజ్ఞేన యజ్ఞపురుషో - విష్ణుః సంప్రీణితః.''

''యజ్ఞై ర్యజ్ఞేశ్వరో యేషాం - రాష్ట్రే సంపూజ్యతే హరిః.''

ఇత్యాదిగా పురాణములచే యజ్ఞపురుషుడుగా కీర్తింపబడిన విష్ణువు యొక్క ఆరాధనా విధానములలో - యజ్ఞమునకు ప్రాముఖ్య మేర్పడినది.

పృథువు యజ్ఞనిర్వహణ రూపముగా విష్ణ్వారాధనమును చేసి, మొట్టమొదటి పాలకు డయ్యెను. ఆతనిపేరనే ఆనాటినుండి భూమికి 'పృథివి' - అనుపేరు వచ్చెను. భూమిని సస్యశ్యామలముగా, ప్రజోపయోగముగా చేయుట - పరిపాలకుల ప్రధాన కర్తవ్య మయ్యెను. ఆనాటినుండియే ప్రజాపతిపాలకులకు - 'పార్థివులు' - అనుపేరు ఏర్పడెను.

పురాణములలో - విష్ణుప్రీతికొరకు సర్వస్వమును సమర్పించుటే కాక, వైష్ణవధర్మ ప్రధానమైన రాజ్యపాలనము చేసి వినుతి కెక్కిన వారు దేవ - దానవ — మనుష్యజాతులలో అనేకు లున్నారు. ప్రహ్లాదుడు, అంబరీషుడు, ధ్రువుని వంశములోని నాభి, ఋషభదేవుడు - ఈ కోవకు చెందినవారే.

# 4. భారతదేశములో వైష్ణవధర్మము

భారతీయ చరిత్రను పరిశీలించినచో - పలువురు చక్రవర్తులు, మహారాజులు, ప్రభువులు, సామంతులు - వైష్ణవధర్మమును అవలంబించినట్లు స్పష్ట మగును. క్రీస్తుకుపూర్వము, క్రీస్తునంతరముకూడ ఆ యా వంశములకు చెందిన ప్రభువులు యజ్ఞాదులను నిర్వహించుటే కాక, తమ పేర్లలోను, తాము వేసిన శాసనములలోను, తమ వైష్ణవత్వమును లోకమునకు ప్రకటించిరి.

వైష్ణవమత ప్రసారమునకు చెందిన ప్రాచీన చరిత్రను అవగాహనము చేసికొనగలవారికి - ఆనాటివారి శాసనములు, నాణెములు, ఆయావారిచే నిర్మింపబడిన దేవాయతనాది నిర్మాణములు, జయస్తంభములు - నేటికిని కన్పట్టును.

**సాత్వత మత వ్యాప్తి :—**

చరిత్రకారులు - తమకు లభించిన ఆధారములనుబట్టి, క్రీ.పూ. 6, 7 శతాబ్దములకు ముందు - వైష్ణవోపాసనాప్రక్రియ లున్నట్లు తెలియుచున్నారు. మౌర్యవంశము భారతభూభాగమును పాలించుచున్న కాలములో - 'సాత్వతము' - అనబడు భాగవత మతము వ్యాప్తిలోనికి వచ్చెను. ఆనాడు - దేవకీపుత్రుడైన వాసుదేవుని - విష్ణ్వవతారముగా ఆరాధించు భక్తి విధానము ప్రబలినది. క్రీ. పూ. 4 వ శతాబ్దమునాటికి — వాసుదేవకృష్ణోపాసనము ప్రబలముగా గలదు. యమునానది యొడ్డున 'మధుర' ప్రాంతమందును, మరి యింకను ఇతర ప్రదేశములందును ఈ వాసుదేవకృష్ణోపాసనము కలదని చరిత్రకారుల నిర్ణయము.

## 5. శుంగవంశపు ప్రభువుల కాలములో వైష్ణవము

### (క్రీ : పూ : 185 నుండి, 93 వరకు)

ఈ వంశపు ప్రభువులనుగురించి, పురాణములలో ప్రస్తావన ఉన్నది. 'భాగవత మత' మనబడు సాత్త్వతమతమనునది - ఆ కాలమున బాగుగా వ్యాప్తి గాంచినది. ఇందులకు ప్రత్యక్ష నిదర్శనము - మధ్యప్రదేశముసందుగల 'బెన్‌సాగర్' (Bensagar) - అను చోట గుర్తింపబడిన స్తంభముపై చెక్కబడిన శిలాశాసనమే.

ఈ స్తంభము - వాసుదేవుని ఆరాధనమునకు చిహ్నముగా వేయబడినది. దీనిని ఒక గ్రీకు రాయబారియైన 'హెలియోడోరస్' (Heliodoras) - అను నతడు వేయించుట - చాల విశేషము. తనను అతడు 'భాగవతుడు'గా చెప్పుకున్నాడు. ఆ కాలములో వైష్ణవ మతము - గ్రీకులనుసైతము ఆకర్షించె ననుటకు - ఇది యొక ప్రబలమైన తార్కాణము.

## 6. కుషాణ - శక - క్షాత్రపుల కాలములో - భాగవత మతము

ఈ కాలములో మథుర - భాగవత మతమునకు కేంద్రస్థానముగా నున్నట్లు తెలియుచున్నది. మహాక్షాత్రపరంజువులుని కుమారుడైన షోడశుఁడు (క్రీ : శ : 1-15) వేయించిన 'మోడా' (Moda) శాసనమునుబట్టి, ఐదుగురు వృష్ణివరుల విగ్రహములను ప్రతిష్ఠించె నని తెలియుచున్నది. మరియొక శాసనములో - ఈతఁడు వాసుదేవ విగ్రహమును ప్రతిష్ఠించి, ఆలయమునకు తోరణమును, వేదికను

నిర్మించినాడనియు తెలుపబడినది. ఈ రెండు శాసనములనుబట్టి, మధుర ప్రాంతములో రెండు వైష్ణవాలయములు ఆ కాలములో నిర్మింప బడినట్లు స్పష్టమగుచున్నది.

కుషాణ రాజుల కాలమునకు జెందిన విగ్రహములు, శిల్పపు కట్టడములును ఇటీవల బయల్పడినవి. వీనిలో - వైష్ణవ విశ్వాసమును సూచించు కథ లున్నవి. మధురకు సమీపమున లభించిన ఒక శిల్ప ములో - వసుదేవుడు కృష్ణుని గోకులమునకు నీటి మడుగులో తీసికొని వెళ్ళినట్లు చెక్కబడినది. ఇది - 1 వ శతాబ్దమునకు చెందినదని, శిల్ప నిర్మాణమునుబట్టి నిర్ణయింపబడినది. కుషాణ కాలముననే చెందిన గోవర్ధనోద్ధరణ ఘట్టము. ఒక ఎఱ్ఱరాతిలో మలచబడినవి. ఇట్లే, మరి ఇంకను అనేక విష్ణువిగ్రహములు లభించినట్లును, ఇవి యన్నియు ఆనాటి వైష్ణవ భక్తివిశ్వాసములను తెలియజేయుచున్నవనియు, చరిత్రకారులు నిర్ణయించియున్నారు.

## 7. శాతవాహనుల కాలములో - వైష్ణవము

శాతవాహనరాజులు - మహాసాంఘికములను, మహాయాన బౌద్ధులను ప్రోత్సహించినను, వీరి కాలములో వైష్ణవమునకుకూడ కొంత ఆదరణ లభింపకపోలేదు. క్రీ : శ : 174 - 203 వ ప్రాంతము లోనివాడైన గౌతమీపుత్రయజ్ఞ శ్రీ వేయించిన ఒక శాసనమును ఒక చరిత్రకారుడు సమీక్షించి, అందులో - 'వాసుదేవ' - అను మూడక్షరము లున్నట్లు గుర్తించి, ఇది ఆనాటి వాసుదేవ తత్త్వ మహత్త్వమునకు ప్రతీకయని స్పష్టీకరించినాడు.

## 8. గుప్తుల కాలమునాటి వైష్ణవ మత వ్యాప్తి

గుప్తయుగము భారతీయ చరిత్రలో - స్వర్ణయుగముగా పేర్కొనబడినది. వాస్తవమునకు - వైష్ణవ విశ్వాస వ్యాప్తికికూడ - ఈ గుప్తులయుగము స్వర్ణయుగ మనియే చరిత్రకారులు నిర్ణయించినారు. వీరి కాలములో - వైష్ణవ మతము భారతదేశమం దంతటను వ్యాపించుటేకాక, భారతదేశమునకు పరిసరమునగల జావా, సుమాత్రా, బలి మున్నగు విదేశములకుకూడ వ్యాపించినది.

రాజస్థాన్‌లోని 'హిస్సార్ మశామ్' - అను గ్రామములో లభించిన శాసనము - విష్ణుస్తుతితో ఆరంభింపబడినది. ఒక భాగవతునకు గృహార్చన, రెండు సరోవరములను - యశస్కరిత మనుమడైన 'సోమొద్రాయ' యనునతడు - సమర్పించెననియు, అతడు భాగవతుడనియు చెక్కబడియున్నది. దీనినిబట్టి, గుప్తుల కాలములో - ప్రజానీకమునసైతము వైష్ణవప్రపత్తి వ్యాప్తిచెందెనని స్పష్టమగుచున్నది.

ఆఱవ దశాబ్దమునాటికి బెంగాల్ రాష్ట్రము - వైష్ణవమునకు ఆశ్రయస్థానములలో ఒకటియై నది. రాజషాహీజిల్లాలోని 'పహర్‌పూర్' (Paharpur) - అనుచోట లభించిన శిలాప్రతిమలలో - కృష్ణావతారమునకుచెందిన అనేక గాథలు సూచింపబడియున్నవి. వీనిలో - యమళార్జునభంగము, కేశివధ, చాణూర ముష్టికవధ, కృష్ణుని గోకులమునకు గొనిపోవుట - మొదలగునవి కొన్ని కానవచ్చును.

బార్ద్వాన్ జిల్లాలోని చైతన్ పూర్ లో - నల్ల రాతితో చెక్కబడిన విష్ణు విగ్రహము లభించినది. ఈ విగ్రహామునుబట్టి, ఆభిచారిక క్రియలతోకూడ వైష్ణవ విగ్రహములు వినియోగించెడివని స్పష్టమగుచున్నది.

గుప్తప్రభువుల పరిపాలనాకాలములో - వైష్ణవము అస్సాము రాష్ట్రమునకుకూడ వ్యాపించినది. ఉమాచలాశ్రమమునకు సమీపములోని కొండరాతిపై చెక్కబడిన శాసనమునుబట్టి, మహారాజు సురేంద్రవర్మ బలభద్రస్వామికొఱకు గుహాలయమును నిర్మించినట్లు తెలియుచున్నది. ఈతడు - భౌమరాజవంశమునకు చెందిన మహేంద్రవర్మ యని - చరిత్రకారులు గుర్తించినారు - ఈతడు - క్రీ : శ : 470 నుండి, 490 వఱకు రాజ్యమును పరిపాలించినాడు.

## 9. గుప్తుల కాలములో - దక్షిణ భారతమున వైష్ణవము

క్రీ : శ : 1 నుండి 5 వఱకు గుప్తులు పరిపాలించు కాలములో - దక్షిణభారతమున శాతవాహనులకు తరువాత - ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, ఆనందగోత్రీయులు, విష్ణుకుండినులు - ఆంధ్రదేశమును పరిపాలించిరి. క్రీ : శ : 3 వ శతాబ్దము నుండి, దాదాపు 9 వ శతాబ్దమువరకు దక్షిణప్రాంతమును పల్లవ రాజులు పరిపాలించిరి. అయినచో, 4 నుండి 5 వ శతాబ్ది మధ్యములో ఆంధ్రమును పరిపాలించినవారిలో శాతవాహనులకాలమునుగురించి పూర్వము ప్రస్తావించుట జరిగినది. వారితరువాతివారైన ఇక్ష్వాకు రాజు మెహాపుల శాంతిమూలుడు వేయించిన శాసనము - నాగా

ర్జునకొండ ప్రాంతములో లభించినది, దానినిబట్టి కొందఱు రాజులు - దేవకులమను ఒక స్థలములో - 'నాడగీశ్వరస్వామి' ప్రీతికొఱకు నిర్మించినారని ఉన్నది. సర్కారు వారి నిర్ణయ ప్రకారము ఈ శాసనము క్రీ : శ. 333 ప్రాంతమునకు చెందియున్నది. ఈ 'నాడగీశ్వరుడు' - విష్ణువేయని డి. సి. సర్కారు నిర్ణయము. నాగార్జునకొండ చుట్టు ప్రక్క ప్రాంతములలో - కనీసము రెండు విష్ణ్వాలయములైన నిర్మింపబడియుండు నని వారు ఊహించినారు.

శాలంకాయనప్రభువులలో నందివర్మ - పెదవేగిలో వేయించిన శాసనమున - త్రిలోకనాథుడైన 'విష్ణుగృహస్వామి'కి వేరువేరు గ్రామములలో - కొంత కొంత భూమిని దేవభోగముచేసి, తన 10 వ విజయరాజ్యసంవత్సరములో - శ్రావణ శుద్ధ పాడ్యమినాడు - దానము చేసినాడని పేర్కొనబడినది. ఈ నందివర్మ - పరమభాగవతుడు. తెలుగునాట విష్ణ్వాలయము లుండినట్లు స్పష్టముగా ఉట్టంకించు శాసన మిదియే యని చరిత్రపరిశోధకుల నిర్ణయము.

వినుకొండను కేంద్రముగా చేసికొని ఆంధ్రదేశమును పరిపాలించిన విష్ణుకుండినప్రభువులపై గ్లస్నియు - వైష్ణవ ప్రభావమును స్పష్టము చేయుచున్నవి. వీరికాలమున బెజవాడదగ్గరలో, కృష్ణానదికి దక్షిణ తీరమున 'ఉండవల్లి' - అనుచోట నిర్మించిన గుహాలయములో గల అనంతశయనవిగ్రహము - ప్రసిద్ధమైనది. శ్రీరంగములోని రంగనాథుని విగ్రహమువలెను, తిరువనంతపురములోని అనంతపద్మనాభస్వామివలెను - శేషశయనుడైన ఈ నారాయణుని విగ్రహమును ప్రతిష్ఠించుటలో - విష్ణుకుండినుల వైష్ణవ భక్తివిశేషము స్పష్టమగును.

## 10. గుప్తుల కాలములో - విదేశములలో వైష్ణవ వ్యాప్తి

క్రీ. శ. 5 వ శతాబ్దపు మధ్యభాగములో, వైష్ణవ విశ్వాసము దక్షిణ తూర్పు ఆసియా ప్రాంతములలో విస్తరించినది. జావాలోని ప్రభువులు తమను 'విష్ణు' అవతారముగా భావించినట్లు, శాసనము లనుబట్టి తెలియుచున్నది. 'మలయ' భూమిలోని పెరక్ (Perak) ప్రాంతమునందలి 'సెలింగ్సిన్' (Selengsin) అను తావులో లభించిన బంగారు ఆభరణముమీద, గరుడవాహనుడైన విష్ణువు చిత్రింపబడియున్నాడని – 'The Vakataka Gupta Age' అను గ్రంథమున 320 పుటలో పేర్కొనబడియున్నది. కాంబోడియాలో లభించిన శాసనములు - వైష్ణవప్రభావమును స్పష్టము గావించు చున్నట్లు - చరిత్ర పరిశోధకులు నిర్వచించుచున్నారు.

## 11. పల్లవుల కాలములో వైష్ణవము

గుప్తులకు పిమ్మట దక్షిణదేశములో పల్లవులకాలమందును, అర్వాచీనగాంగమశేపురాజుల కాలమునందును - భారతదేశములో తూర్పునగల వంగ కళింగాది భూములందును - వైష్ణవ విశ్వాసము ప్రబలినది. మహాపల్లవులుగా పేర్కొనబడు సింహవిష్ణువు, నరసింహ వర్మ మొదలగువారిపేర్లలోను, వారికంటెను పూర్వకాలమునకు చెందిన విష్ణుగోపుడు మున్నగువారి పేర్లలోను - వైష్ణవ సంస్కారము స్పష్టముగ కానవచ్చును. కాంచీపురము కేంద్రముగా విలసిల్లిన వైష్ణవమత ప్రాభవమునకు - ఈ పల్లవరాజులే మూలకారణము.

క్రీ. శ. 733 - 794 ప్రాంతపువాడైన ఇమ్మడి నందివర్మ వైష్ణవ మతమునందు అత్యంతము భక్తివిశ్వాసములు కలవాడుగా సుప్రసిద్ధుడు. ఇతడు కాంచీపురములోని వైకుంఠ పెరుమాళ్ కోవెలను నిర్మింపజేసెను. కాంచీపురము - వైష్ణవపీఠముగా, వైష్ణవ సంస్కృతికి నిలయముగా - ప్రసిద్ధిగాంచినది.

## 12. హొయసల ప్రభువుల వైష్ణవాదరము

కులోత్తుంగ చోళునికాలములో, దమనకృత్యమునకు గురియైన భగవద్రామానుజులకు ఆశ్రయమిచ్చినవారు హొయసల ప్రభువులు. వీరు కదంబకులమునకు చెందిన శాఖ యగు హంగల్ కదంబులు. వీరిలో - 'బిట్టిదేవుడు' - రామానుజుల ప్రభావముచేత, వైష్ణవ ప్రభువు అయినాడు. ఈతడే తరువాతికాలమున - విష్ణువర్ధన నామమును ధరించినాడు. ఈ హొయసల ప్రభువులలో - వీరరామనాథుడు - చోళప్రభువులను జయించిన జటావర్మసుందరపాండ్యుని సామంతుడుగా - శ్రీరంగప్రాంతమును స్వాధీనముగావించుకొని, క్షేత్రరక్షణము చేసినాడని శాసనములవలన తెలియవచ్చుచున్నది, మొత్తముమీద చోళప్రభువులకాలములోకూడ - వైష్ణవము - పట్టును కోల్పోవక, విశేషప్రాచుర్యమును, ఆదరమును పొందినట్లు స్పష్టమగుచున్నది.

## 13. అర్వాచీన గాంగవంశ ప్రభువుల వైష్ణవ పోషణము

వైష్ణవమత చరిత్రలో - అర్వాచీన గాంగప్రభువుల పాత్ర ఉన్నది. వీరి పరిపాలనము క్రీ. శ. 960 నుండి ప్రారంభమైనది. ఈ

గాంగవంశ ప్రభువులు - వైష్ణవధర్మారాధకులనియు, వీరికి కదంబ వంశీయులతో సన్నిహిత సంబంధము కలదనియు - తెలియవచ్చు చున్నది. ఈ కదంబులు - హానుగల్లు (బొంబాయి) ప్రాంతమునుండి ఆంధ్రదేశములోని కళింగప్రాంతమునకు వచ్చి, గాంగవంశప్రభువు లతో సంబంధ బాంధవ్యములను పెంచుకొని, గాంగరాజ్య విస్తరణలో సహాకరించిరి. వీరి కులదైవము - మధుకేశ్వరుడు. మధుకేశ్వరు డనగా - విష్ణువే. కళింగనగరములో మధుకేశ్వరస్వామి ఆలయ మున్నది. గాంగవంశపు మొదటివాడైన వజ్రహస్తదేవుని (క్రీ. శ. 1038 - 1070) మనుమడైన అనంతగంగదేవుని పూర్వులలో ఒకడైన రెండవ కామార్ణవుడు - ఈ దేవాలయమును నిర్మించెను. కదంబులు తాము కళింగకు వచ్చినపుడు - తమ ఇలవేల్పగు 'మధుకేశ్వరుని' తమతో తీసికొనివచ్చియుందురని చరిత్రకారుల మనోభావన. వీరి దానశాసనములపై - 'మత్స్య'లాంఛన మున్నది.

## 14. పల్లవుల కాలములో శ్రీరంగము - ఆళ్వారులు

దక్షిణదేశములో - ప్రముఖ వైష్ణవకేంద్రముగా - ఆళ్వారుల చేత కీర్తింపబడిన శ్రీరంగనాథునకు నెలవైనది శ్రీరంగము. ముదలా ళ్వారులు తప్ప, ఇంచుమించుగా అందరు - క్రీ. శ. 8 వ శతాబ్దము నకు ముందు - కొలది వ్యత్యాసముతో - ఒకేకాలమునకు చెందిన వారలే. ఈ కాలము - పల్లవుల పరిపాలనకు చెందిన ప్రాచీన ప్రభువు- చరిత్రకారులు 13 వ శతాబ్దమునకు చెందిన చేరరారాజులగు పాండ్య ప్రభువుల తామ్రశాసనములలో, తమచే జయింపబడినవానిగా వారు పేర్కొన్న కులశేఖరుడు - కులశేఖరాళ్వారులే. ఈ తామ్రశాసన

ములు 8 వ శతాబ్దమునకు చెందినవి. కనుక, కులశేఖరులు ఈ కాలమున నుండువారే. 11 వ శతాబ్దమునాటికే వీరి పాశురములు శ్రీరంగనాథుని గురించి తమ 'పెరుమాళ్ తిరుమొళి' ప్రబంధములో కీర్తించినారు. ఈ కాలముననే తిరుపతిక్షేత్రముకూడ ప్రసిద్ధమై, కీర్తింపబడినది. 'చేరకులవల్లి' (చోళవల్లి) అనెడి తమ కుమార్తెను కులశేఖరాళ్వారులు - అళగియ మనవాళస్వామి కొసగి వివాహమును చేసినట్లు - శ్రీరంగ మందిరమునకు చెందిన 'కోయిల్ ఒళుపు' అను గ్రంథమునుబట్టి తెలియుచున్నది. మూడవప్రాకారమునకు చెందిన గోడలను, భవనములను వీరు బాగుచేయించిరట. దక్షిణ ప్రతీచీభాగమున - సేనై వెంగ్డాన్ తిరుమండపమును నిర్మించినారట. ఆ ప్రాంతమునకు నేటికిని 'కులశేఖర్ తిరువీథి' - అనుపేరు ఉన్నది. శ్రీరంగ మందిరములో చేరకువల్లి విగ్రహముకూడ ప్రతిష్ఠింపబడియున్నది. ఈ కులశేఖరాళ్వారుల 'ముకుందమాల' - వైష్ణవ సాహిత్యలోకములో . అనర్ఘరత్నముగా ప్రసిద్ధిగాంచినది.

ఈ కాలముననే చెందిన (క్రీ. శ. 8 వ శ) ఆండాళ్ళకు తండ్రియైన పెరియాళ్వారులు - తన వాదపటిమచే శత్రుపక్షమును పరాజితులగావించి, పాండ్యరాజు అగు వల్లభదేవుని వైష్ణవుని చేసిన విషయము, శ్రీ గోదా రంగనాథుల వివాహమును జరిపించిన విషయము - వైష్ణవ చరిత్రగ్రంథములమూలమున తెలియవచ్చుచున్నది.

ఈ వల్లభదేవుడు - శ్రీరంగమునకు చెందిన అళగియ మణవాళపెరుమాళ్ళకు అపారమైన ధనమును సమర్పించినాడని

'కోయిల్ ఒళుపు' - అను గ్రంథమువలన తెలియుచున్నది. తొండరడి ప్పొడియాళ్వారులు, తిరుప్పాణాళ్వారులు, తిరుమలగై యాళ్వారులు కూడ – ఈ కాలమునకే చెంది, వైష్ణవ సంప్రదాయమును బహుళ ప్రచారమునకు తెచ్చిన మహానుభావులు. వీరిలో – తిరుమంగ యాళ్వారులుకూడ దేశపాలకుడని – వైష్ణవగ్రంథములు పేర్కొను చున్నవి. ఈతడు – చోళదేశమునకు చెందిన అల్లినాడు ప్రాంతము నకుచెందిన చిన్న పాలకుడు. శ్రీరంగదేవాలయనిర్మాణవిషయములో ఈ తిరుమంగయాళ్వారులు – ప్రముఖస్థానమును పొందియున్నారు. నాల్గవ ప్రాకారమునకు – 'అళందాన్ తిరువీథి' – అని దీనినిబట్టియే పేరు కలిగినది. నిర్మాణమునకు కావలసిన ధనము లేనందువలన, నాగపట్టణమువద్దగల ఒక బౌద్ధగ్రామమును కొల్లగొట్టి, ఆ ధనముతో ప్రాకార కుడ్యమును, ధాన్యాగారములను, గోపురములను – ఈ తిరు మంగయాళ్వారులు నిర్మించినారు.

ఈ తిరుమంగయాళ్వారులచే ద్రావిడ భాషలో రచింపబడిన (1) పెరియ తిరు మొళి (2) తిరుక్కురుందాండకమ్ (3) తిరునెడుం దాండకమ్ (4) తిరువెళుకూత్తిరుక్కై (5) పెరియ తిరుమడల్ (6) శిరియ తిరుమడల్ - అను ఆఱు ప్రబంధములును ఆఱు వేదాంగ ములుగా సంభావింపబడుచున్నవి.

## 15. కాశ్మీర ప్రభువుల వైష్ణవప్రీతి

కాశ్మీరదేశములో 6 వ శతాబ్దమునుండి 13, 14 శతాబ్దముల వఱకు పరిపాలించిన హైందవప్రభువులలో – కొన్ని వంశములవారు శైవమును, మఱికొన్ని వంశములవారు వైష్ణవమును పోషించినారు.

కల్హణుని రాజతరంగిణిలోను, జోనరాజు శ్రీవరపండితుడు, ప్రాజ్య భట్టు - అనువారు రచించిన రాజ తరంగిణియందును - వైష్ణవ మందిర నిర్మాణమునకు సంబంధించిన ప్రస్తావన విశేషముగా నున్నది. కాశ్మీర దేశములో - హైందవరాజుల పాలనమున - ఏ యే దేవమందిరములు నిర్మింపబడినవియో - ప్రాజ్యభట్టు ఇట్లు చెప్పినాడు :-

"చత్వారశ్చవధాపి పంచగిరిశాః, షష్ఠి శ్చ చక్రాయుధాః
బ్రహ్మాణ త్రయ ఇత్యనాధినిధనా ద్వావింశతి శ్శక్తయః ।
నీలాదీని గతాని సప్త ఫణినాం తీర్థాకసాం కోటయో
విఖ్యాతా శ్చ చతుర్దశో త్తమదశాః కాశ్మీర భూమండలే."

43 శివ మందిరములు, 60 వైష్ణవ మందిరములు, 3 బ్రహ్మ మందిరములు, 22 శక్తిస్థానములు, 'నీలుడు' - మొదలైన నాగదేవత లకు 700 స్థానములు, 14 కోట్ల తీర్థములు - కాశ్మీర భూమండలములో కలవట !

కల్హణుడు రాజతరంగిణిలో - కాశ్మీరమును వర్ణించుచు —

"చక్రభృగ్విజయేశాది - కేశవేశానభూషితే ।
తిలాంశో౽పినయత్రాస్తి - పృథ్వ్యా స్తీర్థైర్విహిష్కృతః" [3-38]

చక్రధారి, విజయేశుడు - మొదలైన కేశవస్వామిమూర్తులతో అలంకరింపబడిన కాశ్మీరములో - నువ్వుగింజంత భాగమైనను తీర్థములేని భూభాగము లేదట. కేశవ, శివ, సూర్య, శక్తి, నాగపూజనము

విశేషముగ విస్తరించియున్నది. ప్రభువుల విష్ణుప్రీతిని ఆవిష్కరించు సన్ని వేశములను విశేషముగా కల్హణుడు వర్ణించినాడు.

అవంతిదేవురను కాశ్మీరప్రభువు - తన ప్రాణములను విడచు నపుడు - భగవద్గీతా శ్రవణముచేయుచు - వైష్ణవ ధామమును ధ్యానించుచు, తన ప్రాణములను వదలెనట !

"అవన్తిదేవ పార్థివ్య । మాంధాతేవ మహీపతిమ్ ।
ప్రాణాన్తే ప్రాంజలి ర్మ్యరో వైష్ణవత్వ మదర్శయత్
తేహాన్తే భగవద్గీతా - శృణ్వతా భావితాత్మనా
ధ్యాయతా వైష్ణవం ధామ - ఏవముచ్యత జీవితమ్."

-[రాజతరంగిణి : 5-124, 125]

## 16. రాష్ట్రకూట - చాళుక్య - చోళ ప్రభువుల కాలములో వైష్ణవ ప్రీతి

పల్లవులు పరిపాలించిన కాలమందే, ఇంచుమించుగ 6 వ శతాబ్దమునుండియే చాళుక్యప్రభువులకు సామంతులుగానుండి, ఇమ్మడి కీర్తివర్మకాలమున, అనగా - క్రీ. శ. 755 వ శతాబ్దములో - స్వతంత్రించిన రాష్ట్రకూట ప్రభువుల నామములలో - వైష్ణవ ప్రభావము బాగుగా కానవచ్చును. వీరిలో చాలమంది ప్రభువులు - కృష్ణభూపాలనామమును ధరించియున్నారు. వీరిలో అనేకులు శ్రీవల్లభ, కీర్తినారాయణ, ధవళనారాయణ - ఇత్యాది బిరుదములను ధరించుటనుబట్టి, వీరిపై వైష్ణవప్రభావము ఉండితీరు ననుటకు

అవకాశము కలదు. అయిన నో, వీరి రాజ్యమును అంతమొందించి, చాళుక్యరాజ్యమును పునరుద్ధరించిన ప్రభువులు - వైష్ణవహృదయులుగా చరిత్ర ప్రసిద్ధిగాంచియున్నారు. వీరిలో - కుబ్జవిష్ణువర్ధనుడు పేర్కొనదగినవాడు. త్రివిక్రమ సమప్రభావుడని చాటుకొనుటకు ఈతడు - 'కుబ్జవిష్ణువు' (వామనుడు) - అను పేరును ధరించినాడు. ఈతడు - పల్లవరాజులకు సామంతుడుగా ఉన్నాడు. ఈతడు దళనాయకుడై నను, ఈతని ధైర్యసాహసములను స్ఫూర్తిగ దీసికొని పలువురు - 'విష్ణువర్ధన' నామమును బిరుదముగా ధరించినారట. ఈతడు వేయించిన చీపురుపల్లి శాసనములో, ఈతని దానశాసనమును అమలుపరచిన 'బుద్ధవర్మ' - అను అధికారి, విష్ణువుకు గరుడునివలె, రావణాంతకునకు హనుమంతునివలె - సేవచేసినాడని ఉన్నది. ఈతడు (కుబ్జవిష్ణువు) వేయించిన తిమ్మాపురతామ్రశాసనములో - ఇతడు విష్ణుభక్తుడనియు, పరమభాగవతుడనియు - పేర్కొనబడియున్నది.

ఈ విష్ణువర్ధనుడే తూర్పుచాళుక్యరాజ్యస్థాపకుడు ఈ కాలమందే - వైష్ణవ సంప్రదాయమునకు విశేషప్రాచుర్యము లభించినది. ఈ వంశమునకు చెంది, విష్ణువర్ధన నామమును ధరించినవారిలో - కొందరు శైవులును ఉన్నారు. కాని, కుబ్జవిష్ణువర్ధనునకుమాత్రమే వీరిలో వైష్ణవపోషకుడుగా పేరు ఉన్నది. ఈతని సంతతివారు ఈతనిని - 'కారణవిష్ణువు' అని ప్రశంసించినారు.

లక్ష్మణసేనుడుకూడ వైష్ణవప్రీతిని ఆవిష్కరించినాడు. ఈతని ఆస్థాన కవియగు జయదేవుడు - రాధాకృష్ణ భక్తి, శృంగారప్రధానమైన 'గీతగోవిందము'ను రచించినాడు. గాంగవంశమునకుచెందిన

రాజరాజదేవుని కాలమందే, 'ఉడిపి'లో - ఆనందతీర్థ శ్రీపాదులు - వైష్ణవములోని భాగమైన ద్వైతమును స్థాపించినారు. ఈ వంశము నకుచెందిన వీరనరసింహదేవుని వైష్ణవప్రీతి విశిష్టమైనదని చరిత్ర కారులు పలుకుచున్నారు. శ్రీకూర్మములోని కూర్మనాథాలయము నకు ఈతడు అనేక దానములు చేసినాడు. సింహాచలములోని వరాహ నృసింహస్వామిఆలయమునకు నల్లరాతి విమానము, ముఖమండ పము, నాట్యమండపము, తిరుచుట్టుమాలె - మున్నగువానిని ఈతని ఆదేశానుసారము - ఇతని సేనాపతి కట్టించినాడు. అనంతవర్మ చోళ గంగుడు - పూరీక్షేత్రమునగల జగన్నాథాలయమును నిర్మించిన యనంతరము, గాంగవంశప్రభువులకు సేనానులు, ప్రధానులు అయి నను వారు - వారి ననుకరించి, ఎన్నియో విష్ణ్వాలయములను నిర్మించి నారట. నరసింహదేవునికాలములో - కళింగమున, అనగా - ఉత్త రాంధ్రమునందును, ఓఢ్రమునందును - వైష్ణవము బాగుగా విజృంభించినది. అప్పన, అప్పకొండ, నరసింహము, అప్పలకొండ - ఇత్యాదిగా పేర్లు పెట్టుకొని - సింహాచల వరాహనృసింహనాథుని యందు భక్తిభావమును ప్రస్ఫుటింపజేయు సామాన్య ప్రజలు - దక్షిణ కళింగములో - అనగా శ్రీకాకుళము, విశాఖపట్టణము జిల్లాలలో - ఎందరో ఉన్నారు. వీరి కాలములో - సింహాచలముతో కూడ వీరు - సంబంధబాంధవ్యములను ఏర్పరచుకొన్నారు. వీర నరసింహదేవునికాలములో - 23 వ అంకసంవత్సరమునకు సరియగు శకవర్షము 1178 లో, సింహళదేశములోని అజ్జకేశవదేవుని తనయ - గాయకిభాగలదేవి - కళింగమున కేతెంచి, శ్రీకూర్మనాథునకు అఖండదీపదానము చేసెనట! వీరనరసింహదేవుడు - తన కళింగ

రాజ్యముపై దండెత్తిన కాకతీయప్రభువులపై ప్రతీకారము తీర్చుకొనుటకు - తన పెంపుడుతమ్ముడగు అనంతపాలదండనాథుని పంపినాడట. ఆతడు మార్గ మధ్యములో, కృష్ణాజిల్లాలోని 'శ్రీకాకుళము'వద్ద ఆగి, అచట ఆంధ్రవిష్ణువునకు ఒక ఆలయము కట్టించినాడని, శ్రీకాకుళ స్థలపురాణమునకు సంస్కృతమైన శ్రీకాకుళమాహాత్మ్యమునకు అనువాదమైన 'వల్లభాభ్యుదయ'మను అర్వాచీన తెలుగు కావ్యములో ఉట్టంకింపబడినది. అయినచో, శ్రీకాకుళములోని ఆంధ్రమహావిష్ణుమందిరము - శకవర్షము 1088 నాటికే ఉన్నట్లు చారిత్రక ప్రమాణము ఉండుటవలన, బహుశః - అనంతపాల దండనాథుడు - శిథిలమైన ప్రాచీనదేవాలయమును పునర్నిర్మించియుండ వచ్చునని చరిత్రకారులు భావించుచున్నారు.

## 17. ఓఢ్రి గజపతులు - వైష్ణవ పోషణము

గాంగులకు పిమ్మట - కళింగమును స్వాధీనము గావించుకొని తృప్తిచెంది శ్రీరంగము వరకు వెడలి, స్వల్పకాలమైనను - తమ రాజ్యమును ఆంధ్ర, ద్రావిడ దేశములలో వ్యాపింపజేసి, తుదకు శ్రీకృష్ణదేవరాయల విజృంభణముచే, రాజ్యమును కోలుపోయినను, హైందవ స్వాతంత్ర్యమునకు ప్రతీకలుగా నిలచిన గజపతులుకూడ తమ పూర్వులవలెనే వైష్ణవప్రీతులైన ప్రభువులే. దక్షిణమున కృష్ణ దేవరాయలవలె కళింగములో - ఓఢ్ర ఆంధ్ర సంస్కృత వాఙ్మయ వ్యాప్తికి, వైష్ణవదీప్తికి - మూలమైన పురుషోత్తముడు, ప్రతాప రుద్రగజపతి - అను వీరిరువురును - చరిత్రలో స్థిరమైన స్థానమును కల్పించుకున్నారు. భక్తివాఙ్మయ నిర్మాణమునకు వీరి సేవ - విశేష

ఖ్యాతినీయము. స్వయముగా - కవి, పండితుడు అయిన పురుషోత్తమ గజపతి - అభినవ గీతగోవిందము, ఆగమకల్పతరువు, గోపాలార్చనా విధి - మొదలగు గ్రంథములను రచించినాడు. ఇక - ప్రతాపరుద్ర గజపతియు - విద్యలలో చతుర్ముఖుడుగా కీర్తింపబడి, కౌతుకచింతామణి, నిర్ణయసంగ్రహము - మున్నగు బహుగ్రంథ నిర్మాతగా ప్రసిద్ధి గాంచినాడు. శ్రీకృష్ణదేవరాయలవలె, కవి - పండిత సభలను నిర్వహించినాడు. ఈతని ఆస్థానములోని వాసుదేవసార్వభౌమ భట్టాచార్యులవారు - చైతన్య మహాప్రభువుతో అద్వైతముపై చర్చ చేసి, వైష్ణవమును స్వీకరించి. చైతన్యసంప్రదాయపరులైనారు. ఈతడు - గౌడీయవైష్ణవములో విశేషముగా శ్రీకృష్ణచైతన్య మహాప్రభువుతో భక్తి చర్చ చేసి అలరించిన భాగవతోత్తముడుగా కీర్తింపబడు రామానందరాయనికి ఆశ్రయమై, ఆతనిని రాజమహేంద్రవర ప్రాంతమునకు పాలకునిగా చేసినాడు. రామానందుని జగన్నాథ వల్లభ నాటకము - ప్రసిద్ధమైనది. ప్రభుత్వాధిపతియైన రాయరామానందుడు చైతన్యమహాప్రభువుతో కలిసిన ప్రదేశము - పశ్చిమ గోదావరిజిల్లాలోని కొవ్వూరునందలి గోష్పదీక్షేత్రమే. ఇచట ఒక మందిరముకూడ నిర్మింపబడినది.

చైతన్య మహాప్రభువునకు భక్తుడై ప్రతాపరుద్ర గజపతి - వైష్ణవ ధర్మవ్యాప్తికి, భాగవత మతోద్ధరణమునకు - ప్రధానపాత్రను ధరించినాడు. ఓఢ్రభాషలో వైష్ణవ వాఙ్మయము వృద్ధిచెందునట్లు ప్రోత్సహించినాడు. ఈరీతిగా-దక్షిణమున భగవద్రామానుజసిద్ధాంత వ్యాప్తివలె, ఓఢ్ర - గౌడదేశములలో చైతన్య సంప్రదాయవ్యాప్తి - అప్రతిహతముగా సాగినది. ప్రతాపరుద్రగజపతి రచించిన 'ప్రతాప

మార్తాండః' అను గ్రంథములో - 'విష్ణుభక్తినిరూపణము' - అను ఒక ప్రకరణ ముండుటవలన, ఇది వివేచకుల దృష్టిని ఆకట్టుకున్నది. ఈ ప్రకరణములో - ముప్పది రెండు(32)వైష్ణవాచారముల విశ్లేషణ మున్నది. పదమూడు (13) ప్రాయశ్చిత్త విశేషములుకూడ ఉన్నవి. అముద్రితమైన ఈ గ్రంథపు ప్రాతప్రతులు - పూనా, వారణాసి - మున్నగు ప్రాంతములలో లభించుచున్నవి. ఈ గ్రంథము ఉత్కళీయ వైష్ణవాచారమునుగురించి లెస్సగా నిరూపించినది. ఈ విధముగా వైష్ణవు లగుటయేగాక, వైష్ణవాచార నిదర్శకులుగాకూడ గజపతు లగుట - చరిత్రలో అరుదైనవిషయము.

## 18. రెడ్డి - పద్మనాయక ప్రభువుల వైష్ణవ భక్తి

క్రీ. శ. 12, 13 శతాబ్దములనాటికి - ఆ యా ప్రభువుల పోషణమువలన, ఆంధ్రదేశములోని దేవాలయములలో - శ్రీరామానుజ వైష్ణవ సంప్రదాయము, శ్రీరామానుజులచే నియమింపబడిన దివ్యప్రబంధ పఠనాదికము - విస్తృత ప్రచారమును పొందినవి. 11వ శతాబ్దమునుండి దేవాలయ నిర్మాణములో - గర్భగృహము, అంతరాళికము, ముఖమండపము - ఇత్యాదులతో నిర్మాణము సాగి, ప్రధాన దేవతలతోపాటు, పరివార దైవముల ప్రతిష్ఠాపనము, ముఖ్యముగా - సన్నిధ్దరాళ్వారుల ప్రతిష్ఠ - విశేష ప్రాచుర్యమును పొందినది. దేవాలయమున్నులు - నాట్య, సంగీతాది కళలకు, ద్రావిడ వేదముతోపాటు - విద్యలకు నెలవులైనవి. అయినచో, భగవద్రామానుజులకు పిమ్మట వైష్ణవములో ఏర్పడిన వడగల - తెంగల సాంప్రదాయిక భేదములు - ఆలయములలోకూడ ప్రస్ఫుటమైనవి. ఈ సాంప్ర

దాయిక భేదములు - పోషకులైన ప్రభువులను ప్రభావితము గావించినవి.

రెడ్డిప్రభువుల కాలములో - వైష్ణవక్షేత్రములకు ప్రోత్సాహము లభించినది. కొండవీటిరెడ్డిరాజ్యములో చేరిన అహోబల దేవాలయములో - దర్శనమునకు వీలుగా - వేమారెడ్డి మెట్లు కట్టించినట్లు - చరిత్ర ప్రసిద్ధి. అనవేమారెడ్డికాలమందే - వెన్నెల కంటి సూరన - తన విష్ణుపురాణానువాదము వెలయించినాడు. వేదాంతదేశికులు - రెడ్డిరాజుల కాలమునను, పద్మనాయకుల కాలమునను - వైష్ణవ ధర్మ వ్యాప్తికి కృషిసల్పినట్లు - చరిత్రకారుల పక్కణ.

శ్రీరంగమునుండి - భట్టరు వంశమునకు చెందిన పరాశరభట్టరులు - ఆంధ్రదేశమును పర్యటించి, కోరుకొండరాజ్యమునకు విచ్చేయగా, కోరుకొండ రాజ్యపాలకుడైన ముమ్మడినాయకుడు భట్టరు వారికి శిష్యుడై, గురుదక్షిణగా - 'కొరాలపఱు' అను గ్రామమును గురుదక్షిణగా సమర్పించినాడు. కొంతకాలమునకు ఈ భట్టరువారు పరమపదించినపిమ్మట - ముమ్మడినాయకుడు - కందాడై వంశము వారికి శిష్యుడయ్యెనట ! తిరుమల వంశీయులైన వైష్ణవులుకూడ, రెడ్డియుగములో ఆంధ్రదేశమునందు వైష్ణవమత ప్రచారము చేసినారు.

## 19. పల్నాటి సీమలో - వైష్ణవ ధర్మ వ్యాప్తి

కళింగమును అర్వాచీన గాంగవంశపు చివరివారు - దక్షిణమును తూర్పు - పశ్చిమ చాళుక్యప్రభువులు పరిపాలించు కాలములో,

క్రీ. శ. 11 వ శతాబ్దపు చివరిభాగమునుండి 12 వ శతాబ్దపు చివరి వరకు - ఆంధ్రభూమి, వెలనాడు, పలనాడు, పాకనాడు, కమ్మనాడు మొదలగు మండలములుగా విడిపోయి, పల్నాటిప్రాంతమును హైహయవంశప్రభువులు పరిపాలించెడివారు. ఈ వంశమునకు చెందిన అనుగురాజు పుత్రులమధ్య ఏర్పడిన పల్నాటియుద్ధము కుటుంబ కలహములచే ఏర్పడినను, ఇరువైపులవారి మతవిశ్వాసములు వేరగుట కూడ - ద్వేషమునకు ఉద్దీపకమైనదని చరిత్రకారులు వ్రాసిరి. నిజముగ మతకారణముగనే యుద్ధము జరిగెనా! లేదా ? - అను విషయము అటుంచి, ఆనాడు రెండు మతవిశ్వాసములు - రెండు పక్షముల నాశ్రయించియుండినవనుట - నిరాకరింపరాని సత్యము. వానిలో నొకటి వైష్ణవము. అనుగురాజు పట్టమహిషియగు విజ్జలదేవీ పుత్రుడైన మలిదేవునిపక్షము వహించిన బ్రహ్మనాయుడు వైష్ణవ సంప్రదాయుడగుటచే, రాజును - వైష్ణవధర్మమునే పోషించియుండును. ఇక - అనుగురాజుభార్యయగు మైలమాదేవికి పుత్రుడైన నలగామునిమంత్రిణి యగు నాగమ్మ - శైవమతావలంబురాలగుటచే, ఆ ప్రభావము - నలగామునిపైనుండియుండవచ్చును, పల్నాటియుద్ధమును వర్ణించిన శ్రీనాధాది కవులు - ఈ మతవిశ్వాసములపై తమ దృష్టిని నిగిడ్చకున్నను, బ్రహ్మనాయని విష్ణ్వవతారముగా భావించి గౌరవించుట - పల్నాటిసీమలో నుండినదని పేర్కొనియున్నారు. పల్నాటి చరితమును విడివిడిగా రచించిన మల్లయ్య, కొండయ్యలుకూడ - బ్రహ్మనాయని ప్రసక్తివచ్చినపుడు - 'హరితులసిమాలను ధరించి శ్రీకృష్ణరాయని చెలువంబు బొందె' - అనియు, 'శీలమబ్రహ్మయాది

విష్ణుంషు' అనియు వర్ణించినారు. శ్రీనాథుడు మలిదేవుని వర్ణించు సందర్భమున - 'విష్ణునామజపంబును నయమార జేసి' అని, మలిదేవుని విష్ణుభక్తిని ఉట్టంకించినాడు. నాగమ్మ శైవసంప్రదాయనిరత యైనను, ఆశ్రయుడైన నలగాముల సభను - 'శ్రీరామ కథలును, శ్రీకృష్ణ కథలు పన్నుగా వ్రాసిన పటము తెచ్చి కట్టిరి గోడలు' - అని వర్ణించినాడు. అంతేకాదు. ఆతడు వైష్ణవతిలకమును (=ఊర్ధ్వ పుండ్రమును) దిద్దెనని - 'నిలువుటద్దముచూచి నేరుపుమీర తిలకంబు నుదుటను తిన్నగా దీర్చి' - అని వర్ణించినాడు. పల్నాటిప్రభువులు పూర్వమునుండి వైష్ణవభక్తులగుటచేత, ఆ సంప్రదాయమునకు బద్ధమైన ఆచారవిధానమునే కొనసాగించిరనియు, అయినవో - శైవ ద్వేషము వారికి లేదనియే చెప్పనగును. వాస్తవమునకు పరమభాగవతుడు, వీరవైష్ణవాచారపరుడు నగు బ్రహ్మనాయుడు - అనుగురాజు మరణించిన పిమ్మట, హాలిదేవునకు వివాహముచేయదలచి, శైవాచార పరుడైన కల్యాణపురాధీశుడు వరసోమునివద్ద కేగి, కన్య నర్థించినాడనియు, ఆతడు వైష్ణవసంప్రదాయులతో శైవసంప్రదాయులకు వియ్యము సరిపడదనియు, తొలుత తిరస్కరించినను - అటుతరువాత జరిగిన ఒక యుద్ధములో బ్రహ్మనాయుని సహకారమునకు కృతజ్ఞతగా తన కుమార్తెను మలిదేవున కొసంగి వివాహముచేసెనట. హైహయ వంశజుల తొలిరాజైన కార్తవీర్యార్జునుడు జమదగ్నిని చంపినలదు వలన కలిగిన పాపమును - తీర్థయాత్రలద్వారా పోగొట్టుకొనుమని, సాక్షాత్తుగ నారాయణుడు అనుగురాజుకు చెప్పినాడట. ఆ కారణముగా, సహజముగ వైష్ణవారాధకుడైన ఈ ప్రభువులకు - బ్రహ్మన్న సాహచర్యముచే వైష్ణవప్రీతులైన ఈ ప్రభువులకు ఇనుమడించగా,

శైవద్వేషమును బ్రహ్మన్న గాని, ఇతరులుగాని - ప్రదర్శింపలేదనియు, పైన పేర్కొనబడిన మలిదేవ వివాహప్రయత్నమునుబట్టి, శైవులతో కలిసియుండుచు, తమ సంప్రదాయమును ఆచరించిరని స్పష్ట మగు చున్నది.

బ్రహ్మనాయునిచేత ఆశ్రయింపబడిన వైష్ణవమే - నేటికిని పల్నాటిసీమలో వీరాచారవంతులైన వైష్ణవులచే ఆదరింపబడు చున్నది. మాచెర్ల చెన్న కేశవస్వామి - వీ రియిలవేల్పు. చెన్న కేశ వుని మెడలోని వనమాల - కన్నమదాసుగా ఆవిర్భవించెనట. అతడు పరమభాగవతుడు. అంత్యజుడు భగవద్రామానుజులకాలమునందే - వైష్ణవములో భాగవతులను - వారి కులమునుబట్టికాక, ఆచారమును, వైష్ణవశీలసంపదనుబట్టి గౌరవించవలెనని అభిప్రాయవిధానమే ఆళ్వారులను వేరువేరు జాతులకు చెందినవారినైనను - వైష్ణవాలయ ములలో వారి విగ్రహములను కలిపి పూజించుట, వారికి నివేదించిన ప్రసాదమునే పుచ్చుకొనుట - అనునది ఉన్నది. ముఖ్యముగా తెంగల సంప్రదాయములో - ప్రపన్నుడైన శూద్రుడిచ్చు తీర్థమును పుచ్చుకొనితీరవలెనని నిర్దేశించుట, వైదిక సంప్రదాయము - కర్మ కాండ, వైదికాచారము, ప్రధానముగా గల వడగలుకంటెను తెలుగుదేశములో తెంగలులకు విశేషప్రాచుర్యముకలిగి, వైష్ణవము సమాజములోని అట్టడుగువర్గములకుసహితము ఉపాదేయ మగుట మొదలగు అనేక కారణములు బ్రహ్మనాయుని - కడపటివాడైన కన్నమదాసును దగ్గర చేసినవి. వైష్ణవము సామాజికముగా - విశిష్ట సంస్కరణమే ఇది. పల్నాటిసీమలో కన్నమదాసుకూడ, నేటికిని పూజ లందుకొనుచున్నాడు. శ్రీనాథుడు - తాము రచించిన పల్నాటి

యుద్ధకావ్యమును - వీరభాగవతముగా పేర్కొనినాడు - 'పలనాటి వీరుల భాగవతంబు' అని. దీనినిబట్టి, పల్నాటివీరులు భాగవతులుగా భావింపబడినారనియు, వారి వీరచరితముతోపాటు - వైష్ణవ భక్తి విశ్వాసములు పల్నాటిసీమలో ప్రబలివదనియు - స్పష్ట మగుచున్నది.

## 20. విజయనగర ప్రభువుల వైష్ణవ భక్తి

హైందవ సంస్కృతిని తురుష్కుల బారినుండి దాదాపు రెండువందలసంవత్సరములకాలము రక్షించిన విజయనగరసామ్రాజ్య ప్రభువులు - హైందవ సంస్కృతీపరిరక్షకులుగా భారత దేశచరిత్రలో చిరస్థానమును పొందిరి. వీరిలో కొందరు - శైవ, స్మార్త సంప్రదాయములకు పోషకులుకాగా, మరికొందరు - వైష్ణవమతమును స్వీకరించి ఆదరించిరి. విజయనగరపాలకులలో - సంగ వంశమునకు చెందిన విరూపాక్షమహారాయలు - వైష్ణవమును అవలంబించిన మొదటిప్రభువని చరిత్రకారులు తెలుపుచున్నారు. మొదటి బుక్కరాయల కాలములో జరిగిన విశేషకృత్యములలో - మధురా విజయముగా చరిత్రకారులు పేర్కొనిరి. ఈ విజయము వైష్ణవ చరిత్రలోకూడ, విశేషముగ ఉట్టంకింపదగియున్నది. ఏలనన, ఇక్ష్వాకుల కులదైవముగా - త్రేతాయుగములో విభీషణ ప్రతిష్ఠితమైన శ్రీరంగములోని శ్రీరంగనాథ విగ్రహము - 'మాలిక్ కాఫర్' అను మ్లేచ్ఛుని దండయాత్రాకాలమున, తిరుమల - తిరుపతికి గొనిపోబడగా, మధురావిజయమునకు పిమ్మట, క్రీ. శ. 1371 లో తిరిగి శ్రీరంగములో యథాస్థానమునకు చేర్చబడుటయే. ఈకంపరాయనికి సహాయకములుగా గల సాళువ తుంగభూపతి (గొంగు) - శ్రీరంగనాథుని పునః

ప్రతిష్ఠకు కారకుడై, ఆ దేవునకు అరువది (60) వేల మాడలు ఉమ్మడిగ ఇచ్చెనట. మరియొక సహాయకారకుడైన గోపన్న మంత్రి - వైష్ణవమతావలంబకుడు. సాళువమంగుచూపిన పరాక్రమమునకు మెచ్చి, కంపరాయలు నారాయణవనముగా పేర్కొనబడు చంద్రగిరి రాజ్యభాగమును ఈతని కిచ్చెనట. ఈతడే క్రమముగా చంద్రగిరి దుర్గమును ఆక్రమించి, దానిని రాజధానిగ - స్వరాష్ట్రమును ఏర్ప రచుకొనెనట. చంద్రగిరిలో నివాసమున్న ప్రభువులకు ఇలవేల్పు - శ్రీనివాసుడే.

మల్లికార్జునరాయల తరువాత, ఆతని పినతండ్రికుమారుడు విజయనగరసామ్రాజ్యాధిపత్యమును వహించె ననియు, ఈతడే వైష్ణవమును స్వీకరించిన మొదటి విజయనగరప్రభువనియు - మున్నే పేర్కొనుట జరిగినది. ఈతనిగురించి వైష్ణవగ్రంథమైన ప్రపన్నామృతములో - కొంత పేర్కొనబడియున్నది. ఈతని బద్ధశత్రువు, సామంతుడు అయిన సాళువ నరసింహరాజు - మిక్కిలి పరాక్రమ శాలి. కంచిపైబడి దోచుకొనిపోవుచున్నవా డీతడే. ఈతడు వైష్ణవ హృదయుడని, ఈతని వరాహధ్వజమే స్పష్టముగావించుచున్నది. ఈతడు - పరమవైష్ణవుడని - చరిత్రనుబట్టి తెలియుచున్నది. ఈతనికి తిరుపతి వేంకటేశ్వరస్వామి - ఇష్టదైవము. ఈతడు సింహాసనమును అధిష్ఠించుటవలన, దక్షిణదేశములో - వైష్ణవమునకు నూతనస్ఫూర్తి కలిగెను. వీరికాలమునుండి - తిరుపతి తిరుగులేని వైష్ణవక్షేత్రముగా, ప్రధాన వైష్ణవకేంద్రముగా విలసిల్లెను. 'తిరుపతి' - అను పదము - వైష్ణవక్షేత్రములకు సాధారణ వ్యవహారముగాచేసి, అష్టోత్తర శత (108) వైష్ణవ దివ్యస్థలములను 'తిరుపతులు'గా వ్యవహరించుట -

వైష్ణవలోక పరిపాటి అయినది. ఇంతటినుండి తరువాతి ప్రభువులును-వైష్ణవమతావలంబకులై, వైష్ణవాచారనిరతులుగా ప్రసిద్ధి చెంది నారు. వైష్ణవాలయములకు విశేషముగా దానధర్మములు చేసి ఉద్ధరించినారు. ఈ వైష్ణవప్రభువుల కాలమందే కొందఱు వైష్ణవాచార్యస్వాములకు విశేష గౌరవము కలుగునట్లు కట్టడిచేసి, శ్రీరామానుజ మతావలంబకులైన సర్వవర్ణ ప్రజలు - ఆ సంప్రదాయ నియమము సక్రమముగా పాటించుచున్నదియు, లేనిదియు పర్యవేక్షించి, అవసరమైనచో - శిక్షించు అధికారమునుకూడ ఇచ్చినారు. దీనినిబట్టి, విజయనగర ప్రభువులును - వైష్ణవధర్మము ఎంతగా ప్రభావితులను చేసెనో, వేరుగా చెప్పనక్కరలేదు. ఆంధ్రదేశమందేగాక, కర్ణాటకదేశమందును వైష్ణవమతవ్యాప్తి ఈ కాలములో విశేషముగ సాగినది. కర్ణాటకములో అనేక మఠములు వైష్ణవమతవ్యాప్తికి దీక్షవహించినవి. ఆంధ్రదేశములోకూడ ఈ వ్యవస్థ ఏర్పడినది.

## 21. శ్రీకృష్ణదేవరాయని వైష్ణవ భక్తి

విజయనగరరాజులలో - తుళువవంశమునకు చెందిన శ్రీకృష్ణదేవరాయడు - భారతదేశములో మిక్కిలి ప్రశస్తిగాంచిన విజయనగరపాలకుడు. ఈతని కాలము - ఆంధ్రసాహిత్యమునకేకాక, వైష్ణవసాహిత్యమునకుకూడ స్వర్ణయుగమే. ఇంతటి వైష్ణవాభిమానము, అభినివేశము గల ప్రభువు - మరొక్కడు కానరాడు. కళింగ్రైతయాత్రలో - శ్రీకాకుళము, సింహాచలము మీదుగా - కటకమునకు తన అప్రతిహత ప్రతాపమునుచూపిన మహావీరుడు.

కళింగయాత్రాకాలమున - ఉత్తరాంధ్రమున గల వైష్ణవక్షేత్రములను దర్శించి, విశేషదానములు సమర్పించినాడు. సింహాళ దండయాత్రా సమయములో దక్షిణమున ద్రవిడదేశములోగల వైష్ణవ పుణ్యస్థలములను దర్శించి, అనేక దానముల నొసగెను. ఈతడు దండయాత్రలన్నింటిలో - తురుష్కుల మదము నణచి, దుష్టులను సంహరింప నవతరించిన శ్రీకృష్ణునిగా ప్రశంసింపబడెను.

ఈ వంశములోని అచ్యుతదేవరాయలుకూడ - విశేష వైష్ణవ ప్రీతి కలవాడు. తన సామ్రాజ్యములోని పుణ్యక్షేత్రము లన్నింటికిని దానములు చేసెను. తిరుపతి, శ్రీరంగము - మొదలగు క్షేత్రములను తరచుగా దర్శించుచుండెడివాడు. సదాశివరాయలకాలములో నిర్వహించిన దక్షిణ దండయాత్రలో - ప్రధాన భాగస్వాములైన తిమ్మరాజు, విఠలరాజు - అను ఇరువురు దండనాయకులు - శ్రీరంగమున వేంచేసియున్న శ్రీరంగనాథునకు ద్రోహము తలపెట్టిన శత్రువర్గములను వేటాడి, స్వామివారి ద్రవ్యమును మరల సమర్పించిన విష్ణుభక్తులు.

శ్రీకృష్ణదేవరాయల కుమార్తె యగు తిరుమలదేవిని పరిణయమాడి, 'అళియ రామరాజు'గా ప్రసిద్ధిగాంచిన రామరాయలు గురుభక్తి నిష్ఠుడైన వీర వైష్ణవుడు. ఈతని గురువు - తాతాచార్యులవారు వీరి ఆదేశము - రామరాయలకు దాటరానిది.

ఆ తరువాతవారగు ఆరవీటి ప్రభువులుకూడ, వైష్ణవమును లెస్సగా పోషించిరి. వీరిలో అటు తుళువంశముతో అనుబంధించిన అళియరామరాజు ప్రధానుడుకాగా, తిరుమలరాయలు, శ్రీరంగ

రాయలు మున్నగువారు - వైష్ణవ పోషణమున పూర్వికుల మార్గమునే అనుసరించిరి. విజయనగర ప్రభువులు శ్రీ రామానుజ సంప్రదాయమునేకాక, మాధ్వసంప్రదాయమునుకూడ పోషించిరి. పుష్టి వంశీయ వైష్ణవ ప్రవర్తకులకు వల్లభాచార్యులు, మాధ్వవైష్ణవగురుపు లగు వాసతీర్థులు, రామానుజసంప్రదాయ గురువులగు దొడ్డయాచార్య, తాతాచార్యులు - విజయనగర ప్రభువుల ఆదరమును పొందిరి.

విజయనగరప్రభువుల ఇలవేల్పగు వేంకటేశ్వరుని నెలవైన 'తిరుమల - తిరుపతి', వీరిచే తరచుగా సేవింపబడిన శ్రీరంగనాథుని నెలవైన శ్రీరంగము - మున్నగు స్థానములు శ్రీరామానుజ వైష్ణవ స్థానము లగుటచేతను, శ్రీరామానుజ సంప్రదాయ వైష్ణవాచార్యుల ద్వారా వైష్ణవ దీక్షను స్వీకరించుటచేతను - విజయనగరప్రభువుల ఆచారవ్యవహారము లన్నియు - శ్రీరామానుజీయ వైష్ణవమునే ఆశ్రయించియున్నవి. శ్రీకృష్ణదేవరాయల రచనయైన ఆముక్తమాల్యద - ఈ విషయమునకు ప్రత్యక్ష నిదర్శనము. శ్రీరామానుజీయ వైష్ణవమునకు మూలపురుషులైన ఆళ్వారులలో, విష్ణుచిత్తుల వారి చరితమును, శ్రీసంప్రదాయమునకు చెందిన వైష్ణవులు పూజించు ఆండాళ్ (గోదాదేవి) చరితమును, శ్రీ రామానుజుల పరోక్ష గురువరులగు శ్రీయామునాచార్యులవారి చరితమును - అముక్తమాల్యదలో వర్ణింపబడుటనుబట్టి, ఆ రచనము - శ్రీ రామానుజీయ వైష్ణవులకు శిరోధార్యమైనది. ఈ విధముగా అది వైష్ణవ ప్రబంధము. రాయల వర్ణనములు, ఆనాటి దాక్షిణాత్య వైష్ణవాచారములు విజయనగర ప్రభువుల నెంతగా ప్రభావితుల నొనర్చినవియో - పరిశీలకులకు విశదముకాగలదు.

## 22. నాయక రాజుల వైష్ణవ ప్రీతి

విజయనగరప్రభువు పిమ్మట - మధుర, తంజావూరులను రాజధానులనుగా చేసికొని, దక్షిణదేశమును పరిపాలించిన నాయక రాజులును - వైష్ణవ భక్తితత్పరు లనుట - సత్యదూరముకాదు. వీరి కాలములో - సాహిత్యముతోపాటు అనేక రంగములలో వైష్ణవము ప్రాచుర్యమును పొందినది. ఈ వంశమునకు చెందిన చెవ్వప్పనాయకుడు-విజయనగరప్రభువగు అచ్యుతరాయల దేవియైన తిరుమలాంబకు చెల్లెలైన మూర్తిమ్మకును వివాహమగుటమూలమున - విజయనగర ప్రభువుల సంస్కారమును, సాన్నిహిత్యమును పొందినందువలన, ఈతడు వైష్ణవాభిమాని యయ్యెను. తంజావూరునాయక ప్రభువులకు - వారి ఇలవేల్పగు 'మన్నార్‌కోయిల్' క్షేత్రములోని రాజగోపాలస్వామినిబట్టియే మన్నారు గోత్రీకు లనుపేరు కలిగినదని, రంగాజమ్మ - అను కవయిత్రి - తన మన్నారుదాసవిలాసములో పేర్కొన్నది.

ఈ ప్రభువులలో ప్రముఖుడైన రఘునాథనాయకుని కాలములో, వైష్ణవసారస్వతముకూడ - ఆవిర్భవించినది. కుమార తాతాచార్యుని పారిజాతాపహరణ నాటకము, రఘునాథరాయలు స్వయముగా ఆంధ్రములో రచించిన రామాయణము. దానికి మధురవాణి సంస్కృతానువాదమును, ఇట్లే - గజేంద్రమోక్షము, రుక్మిణీ - కృష్ణ వివాహయక్షగానము, జానకీపరిణయము - ఇట్లు అనేక గ్రంథములు వైష్ణవకథా ప్రధానములుగా ఆవిర్భవించినవి. రఘునాథనాయకుని

సోదరుడగు విజయనాయకుడుకూడ వైష్ణవుడే. విజయరాఘవుడు స్వయముగా కవియై, అనేక కావ్యములను రచించినాడు. ఈతడు రచించిన 'రఘునాథనాయకాభ్యుదయ' మను ద్విపదకావ్యము - 'శ్రీరాజగోపాల! చిరకీర్తిజాల!'... రక్షింపగదయ్య రాధికాలోల!' ఇత్యాదిగా కృష్ణస్తుతితో ఆరంభింపబడినది. నాయకరాజులకాలమూ నకు ఉత్తరదేశములో - ప్రచారమునగల రాధాకృష్ణభక్తి ప్రాచుర్య మును పొందినట్లు, స్పష్టమగుచున్నది. ముద్దుపళని రాధికాసాంత్వన కావ్యముకూడ - రాధాకృష్ణ భక్తి నిదర్శక మగుటకు - ఇదియే కారణముకావచ్చును. విజయరాఘవుడు తాతయాచార్యుల శిష్యుడు. ఈయన - పరమ చతుర్వేదపారీణుడు, శతక్రతుయాజి. కాంచీపురము నకు చెందిన వడగలై వైష్ణవాచార్యుడు వీరవైష్ణవు డనియు. ఈ ఆచార్యుని తమ హృదయములో - రెండవ మన్నారుగ సంభ వించిరనియు, అతని కావ్యము - స్పష్టీకరించుచున్నది.

ఇక - మధురనాయకప్రభువులు - విష్ణుభక్తులే. వీరిలో - విజయరంగచొక్కనాథుడు - 'శ్రీరంగమాహాత్మ్య'మను వచన ప్రబం ధమును రచించినాడు. జైమినిభారతముకూడ - ఈకాలమున వెలు వడిన గ్రంథమే. మధురనాయకరాజులలో - విజయరంగచొక్క నాథనాయకుడు - శ్రీరంగమందిరోద్ధరణమును గావించినాడు. విశ్వనాథనాయకుడు - అనేక బంగారు ఆభరణములను, పాత్రలను, 'సహస్రధార' అని వ్యవహరింపబడు అభిషేకపాత్రను - సమర్పించినా డట. తంజాపూరు నాయకరాజులలో - అచ్యుతప్పనాయకుడు (క్రీ. శ 1580 - 1614) గొప్ప వైష్ణవప్రీతికలవాడుగా, శ్రీరంగము విషయమున విశేషాసక్తి గలవాడుగా-కీర్తింపబడినాడు. యజ్ఞనారా

యణ దీక్షితులు - తన సాహిత్యరత్నాకరమందును, గోవిందదీక్షితులు - తన సంగీతసుధలోను, రామభద్రాంబ - తన రఘునాథాభ్యుదయమందును, ఈతనికి శ్రీరంగమునందుగల ప్రీతిని స్పష్టము గావించినాడు. అచ్యుతప్పనాయకుడు చివరి దశలో - తన మూడువందల డెబ్బది(370) మంది భార్యలతో - శ్రీరంగములో దేహత్యాగము చేసినాడట. మధురనాయకప్రభువులలో - కృష్ణప్పనాయకుడు I, కృష్ణప్పనాయకుడు II (క్రీ. శ. 1564 - 1601) అను వీ రిరువురను గూర్చి – 'కోయిల్ ఒళుగు' - అను గ్రంథము - విశేషముగా వర్ణించినది. చొక్కనాథుడు – శ్రీరంగమునకు (= శ్రీరంగనాథునకు) తొంబదియైదు (95) గ్రామములను దానముచేసినట్లు, ఒక శాసనము స్పష్టము చేయుచున్నది. ఈ దానము - ప్రమాది సంవత్సరములో (1673) ఈయబడినది. కూరత్తాళ్వారులు, విరలేశ్వరుల మందిరముల నడుమ - అష్టభుజ గోపాలమందిరమును – చిన్నా బొమ్మయ్యనాయకుడు నిర్మించినట్లు - శ్రీరంగమందిర శాసనము తెలియజేయుచున్నది. రామానుజకూట నిర్వహణమునకు కూడ - గ్రామదానము చేయబడినది. విజయరంగ చొక్కనాథుడే (క్రీ. శ. 1706 - 36) ఇంచుమించుగా - వైష్ణవపోషకులైన ప్రభువులలో - చివరివాడని చెప్పవలసియున్నది. చొక్కనాథుని తల్లి - మంగమ్మ, ఆతని రాణి - మీనాక్షి, వీ రిరువురుకూడ వైష్ణవపోషణ చేసినట్లు దానశాసనములున్నవి.

రఘునాథనాయకుడు రామభక్తుడు. ఇది - ఆతడు రచించిన వాల్మీకిచరితమునుబట్టి తెలియుచున్నది. ఈతని రచన లన్నియు -

రామభద్రాంకితములే. సేతువునందును, శ్రీరంగమునందును, విజయ
రాఘవపురమందును, కుంభకోణమునందును, ఇంకను మరికొన్ని
దివ్యస్థలములందును ఉన్న రామభద్రుని సేవించినాడీతడు. ఈ విషయ
మును వాల్మీకిచరితమునందలి చివరిగద్యలోని - "రామసేతు
శ్రీరంగ - విజయరాఘవపుర - కుంభకోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపి
రామభద్ర !" - అను వాక్యము స్పష్టీకరించుచున్నది. ఈతనికి
శ్రీరంగము విషయమునను, రంగనాథుని విషయమునను - ప్రీతియ
నిరతిశయమని — వాల్మీకిచరితములోని శ్రీరంగనాథవర్ణనము (ద్వి
ఆ. ప. 24 — 34) వివరించుచున్నది.

## 23. ముగింపు

ఈవిధముగా మధుర - తంజావూరు నాయకప్రభువు
తమ వైష్ణవప్రీతిని బహువిధముల ప్రదర్శించినారు. వీరి తరువా
బ్రిటిష్‌వారు ఒకవైపున, మహమ్మదీయప్రభువులు మరొకవైపు
హైందవ సంస్కృతీవికాసమునకు అడ్డుకట్ట కట్టినారు. నాటిను
నూతనముగా దేవాలయ నిర్మాణాదులు విశేషముగా సాగలే
ఒకవిధముగా హైందవములో భాగములైన శైవ - వైష్ణవముల తి
గమనమునకు — 'అది నాంది' - అని చెప్పవచ్చును. అయినను
వైష్ణవాచార్య పరంపర - అవిచ్ఛిన్నముగా కొనసాగినది.



# శ్రీ వైష్ణవ దర్శనము
# విశ్వమానవ కల్యాణము

' విశిష్టాద్వైత వేదాంత విశారద '
శ్రీమాన్ అప్పన్ కందాడై పెరుమాళ్ళాచార్యులు, ఎం. ఏ.



## 1. పరిచయము

కల్యాణమునకు - 'శుభ' మని యర్థము. యోగక్షేమములను కలిగియున్న స్థితి యది. అప్రాప్తములైన వస్తువిషయముల ప్రాప్తి - 'యోగ' మని నిర్వచింపబడును. కోరికలను పరిరక్షించుకొనుచు - అనుభవించుటయే క్షేమము. కోరికలకు అంతముండదు కనుక, తదనుభవములకును తృప్తి యుండదు. ఐహిక పురుషార్థములు - ధర్మార్థకామములు. పరమార్థ మగు మోక్షము - నాల్గవది. ఇయ్యది - ఆత్మానుభవము, ఈశ్వరానుభవము - అని, రెండు విధములు. ధర్మార్థ కామమోక్షములుకూడ - మోక్షసాధనలో సహకారులు కావచ్చును. ఆముష్మికమైన మోక్షముకూడ -

"ఇహైవతైః జితః సర్గః." -[భగవద్గీత : 5-9]

అనునట్లు, ఈ లోకమున నున్నపుడే హస్తగతమైయుండుటకు అవకాశ మున్నది. పారమార్థికమైన మోక్షానుభవముకంటెను, ఐహికమైన ఈశ్వరానుభవము తృప్తికరముగ అనుభవమునకు రావచ్చును.

"నిరంతరం నిర్విశత స్త్వదీయం అస్పృష్ట చింతాపదమాభిరూప్యమ్ ।
సత్యం శపే వారణశైలనాథ వైకుంఠవాసేఽపి నమేఽభిలాషః."

-[వరదరాజ పంచాశత్ : 40 శ్లో.]

అను క్రమమున - ఆచార్యుల శ్రీసూక్తులలో ఇది సుస్పష్టము.

విశ్వమానవ కల్యాణ మనునది - కేవలము మానవాళికి మాత్రమే పరిమితమని తలంపరాదు. విశ్వములో మానవుడు ఒక భాగముమాత్రమే. మిగిలిన చేతనాచేతనములతోడి యనుబంధము మానవునకు గలవు. దేవాదులును ఈ విషయమున కలసివత్తురు. కామ, క్రోధ, ఈర్ష్యా, ద్వేష, అసూయాదులచే, దేవ - మనుష్యాదులు - పశువులకంటెను హీనులగునపుడు విశ్వక్రమమునకే ప్రమాదము వాటిల్లును. కావున, విశ్వమానవకల్యాణములో - మానవ కల్యాణముతోబాటు, విశ్వకల్యాణమురొుక్కయు - ప్రాముఖ్యము చెప్పబడినది.

ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధియు సంభవించినపుడు - సాధురక్షణ, దుష్టశిక్షణ, ధర్మసంస్థాపనము గావించుటకై, భగవానుడు స్వయముగా లోకములో అవతరించును లేక, తనయంశతో భగవానుడు మఱియేరూపమునగాని, మఱియొకరిని అవతరింప జేయును.

విష్ణువే సర్వవ్యాపకుడైన దైవము. స్వామి వైభవమును వివరించు వేద - వేదాంత - ఇతిహాస - పురాణ - శాస్త్రములను దివ్య ప్రబంధములతో సమన్వయించి, విశ్వకల్యాణమునకై మన పూర్వులగు ఆచార్యులచేత నిరూపింపబడిన దర్శనమే శ్రీవైష్ణవ దర్శనము.

## 2. ధర్మ ప్రాచీనత - విశిష్టత

సృష్ట్యారంభమున శ్రీమన్నారాయణుడు ముందుగా బ్రహ్మను సృజించి, ఆతనికి శాస్త్రము నొసంగెను. తదనంతరము తానే నరనారాయణులుగా - శిష్యాచార్య రూపమున బదరికాశ్రమములో అవతరించి, మంత్ర - మంత్రార్థములలో ఈ దర్శన విశేషమును వివరించి, వాల్మీకి - వశిష్ఠ - పరాశర - వ్యాసాది మహర్షుల చేత వ్యాపింపజేసెను. పరవాసుదేవుని ఆజ్ఞతో అవతరించిన శ్రీవిష్వక్సేన - శఠకోప - నాథ - యామున - రామానుజ ప్రముఖుల సూక్తులమూలమున ఈ వైష్ణవ దర్శనము అప్రతిహతముగా విలసిల్లుచున్నది.

ప్రళయదశలో - శ్రీ పాంచరాత్రశాస్త్రవిధానములతో విష్ణువు సప్తఋషులచే అర్పింపబడినందున, ఈ వైష్ణవ సంప్రదాయము అతి ప్రాచీనమైనదని - స్పష్టమగుచున్నది

శ్రీవైష్ణవ దర్శనములోని విశేషములు అనంతములు. ఈ దర్శనమునందు ప్రతిపాదింపబడిన శ్రీహరి - కల్యాణమూర్తి. విష్ణుపత్ని - శ్రీదేవి. ఆయమ - ఆకారత్రయ సంపన్న. ఈ యిరువురును ఆదిదంపతులు. స్వామినై భవమును వివరించు వేద పురాణ గ్రంథములు - పరమ పవిత్రములు. అధ్యయనముచేసి, పారాయణ క్రమమున పఠించినను - క్షేమకరములు. స్వాధ్యాయ - ప్రవచనముల మూలమున, క్రతురూపమున, అర్చనమున, నిత్యోత్సవపూజాదుల చేతను - క్షేమమును కలిగించునవి. అట్టి మార్గములను వివరించునది, దర్శనప్రవర్తకులు - ప్రచారకులునగువారి సందర్శనము సాక సౌభాగ్యకరము.

శ్రీవైష్ణవప్రాతిపదికలైన వేద - వేదాంతములు - ప్రాణికోటికి ఇహపర శ్రేయోదాయకములై, అనిలోక – అనిజ్యోతిష - అధివిద్య – అధిప్రజ – అధ్యాత్మ విషయములను, ఐహిక – ఆముష్మిక కల్యాణ కరములైన ప్రవర్తనలనుకూడ వివరించినవి.

"త్రైగుణ్య విషయా వేదాః ... నిర్ద్వంద్వో నిత్యసత్వస్థో
నిర్యోగ క్షేమ ఆత్మవాన్." -[శ్రీమద్భగవద్గీత : 2-45]

త్రిగుణాత్మకములైనవి వేదములు. ఐనను, శుద్ధసత్వమార్గమును ప్రత్యేకముగ చూపి, అమృతప్రాయములైనవి, శ్రేయస్కరములైనవి.

## 3. పౌరాణిక వైష్ణవ ధర్మములు - భాగవతుల ప్రవర్తనలు

శుకమహర్షి - పరీక్షిన్మహారాజుకు చెప్పినమాట లివి :- ఎందరో దేవత లున్నారు. ఎవరిని పూజించినను - వారి యధీనమందుగల పరిమితఫలమును ఇచ్చువారలే ఐనను -

"బ్రహ్మవర్చస కామస్తు - యజేత బ్రహ్మణ స్పతిమ్
.... .... ....
రాజ్యకామో మనూన్ దేవాన్ - నిరుతిం త్వభిచరన్యజేత్
.... .... ... ....
అకామ స్సర్వకామో వా - మోక్షకామ ఉదారధీః
తీవ్రేణ భక్తియోగేన - యజేత పురుషం పరమ్"
-[శ్రీమద్భాగవతము : 2-3 2 నుండి 2-3-10. వరకు]

అనునట్లు, శ్రీహరి శ్రీ సర్వవిధములుగా క్షేమమును కలిగించువాడు. కావుననే, వాల్మీకి - వ్యాసులును, ఇతిహాసపురాణములద్వారా,

భాగవతోత్తముల ప్రవర్తనను, భగవదవతార రహస్య జ్ఞానమును లోకమున వెల్లడించిరి. శ్రీరామచంద్రుని ధర్మనిష్ఠ, పితృభక్తి - మున్నగు ఆదర్శప్రాయములైన (కల్యాణ) గుణములు, సీతాదేవికి గల పతి (పరమ) భక్తి, పురుషకారము, జాత్యార్యాది సద్గుణములు, భరత - లక్ష్మణుల పారతంత్ర్య - శేషత్వములు, త్యాగనిరతి, శత్రుఘ్నుని షడ్వర్గ జయము — మొదలగు ప్రవర్తనలు, సర్వదేశ - సర్వకాల - సర్వావస్థలందు — అందఱకును ఆదర్శములే. మఱియును గుహుడు, శబరి, జటాయువు, ఆంజనేయుడు, విభీషణుడు మున్నగు వారి ప్రవర్తనలును ఎల్లఱకు గ్రాహ్యములే. త్యజింపదగిన దుష్కార్యము లాచరించువారికి సంభవించిన విపత్తులు — రావణాదుల చర్యలలో సుస్పష్టములు. సంక్షేపరామాయణమునందలి బాల - అయోధ్యాకాండలలో వర్ణింపబడిన శ్రీరామచంద్రుని గుణగణములు - కల్యాణకరములై, సకలజనాచరణీయములై యున్నవి.

ఒక ద్రౌపదీశరణాగతిమాత్రమునసే కృష్ణపరమాత్మ - పాండవులకు అండగా నుండి, వారలకు బహుభంగులుగా మేలొనరించుటెగాక, కురుక్షేత్రసంగ్రామమున పార్థునకు రథసారథియై, పాండవపక్షపాతమున - వారికి విజయమును చేకూర్చిన విషయము - మహాభారతేతిహాసములో వివరింపబడినది. పాండవుల ప్రవర్తన, ఔదార్యము మున్నగు సద్గుణములు - సకలమానవాళికిని ఆదర్శప్రాయములు.

"ఆత్మవ త్సర్వభూతానాం ఏకః ప్రియ సుహృత్తమః
వాసవ త్సన్నతార్యాంఘ్రిః పితృవ ద్దీనవత్సలః
భ్రాతృవ త్సదృశే స్నిగ్ధః గురుష్వీశ్వరభావనః.''

-[శ్రీమద్భాగవతము 4-4-31 నుండి, 4-4-32 వరకు]

అనునట్లును - ప్రహ్లాదుని ప్రవర్తన - అందఱకును ఆదర్శమే. అతని నైతికప్రవర్తన - సర్వజనాదరణీయమే.

"ఆకార జన్మ విద్యా వరిష్ఠుడై గర్వసంస్తంభ సంగతుడుగాడు
వివిధ మహానేక విషయ సంపన్నుడై పంచేంద్రియములచే పట్టుబడదు
భవ్య వయోబల ప్రాభవోపేతుడై కామరోషాదుల గ్రందుకొనడు
కామినీ ప్రముఖ భోగము లెన్ని గల్గిన వ్యసన సంసక్తి నావంకబోడు
విశ్వమందుగన్న విన్న యర్థములందు వస్తుదృష్టిజేసి వాంఛయిడదు
ధరణినాథ! దైత్యతనయుండు హరిపరతంత్రుడై, హతాన్యతంత్రు డగుచు."

-[శ్రీమదాంధ్రమహాభాగవతము - చతుర్థస్కంధము - ప్రహ్లాదచరిత్ర]

ఇట్టి లోకోత్తర సద్గుణ గరిష్ఠుడైన ప్రహ్లాదుడు - వాసుదేవునియందు అలౌకిక సహజ సంపర్థమాన నిరంతరధ్యాన నిరతుడుగా అంతరింద్రియములను చక్కబరచి -

"పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లా నిద్రాదుల సేయుచుం దిరుగుచున్ లక్షింపుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతస్వాద సం
ధానుండై మరచెన్ సురారిసుతు డేత ద్విశ్వమున్ భూవరా !''

[ఆంధ్ర భాగవతము - ప్రహ్లాద చరిత్ర]

అన్నపానాదులు స్వీకరించుచున్నను, మాటాడుచున్నను, నిద్రించుచున్నను, సర్వకాల సర్వావస్థలయందు - శ్రీమన్నారాయణుని పాదారవింద స్మరణముతో జీవితమును ధన్యము గావించుకొనిన ప్రహ్లాదుని చరితము - చిరస్మరణీయమైనది.

ఇట్లే, పురాణగ్రంథములలో వర్ణింపబడిన నారద, ధృవ, అంబరీష, విభీషణ, రుక్మాంగదాది భగవద్భక్తుల పవిత్రచరిత్రములు - నిత్యపఠన యోగ్యములై నెగడుచున్నవి.

## 4. దర్శన గ్రంథ వైశిష్ట్యము

### ౧. శ్రీ పాంచరాత్ర సంహిత :-

శ్రీవైష్ణవదర్శన మూలగ్రంథములైన పాంచరాత్ర సంహితలు చేతనుల త్రివర్గ ప్రాప్తికై - ఆత్మస్వరూపజ్ఞానమును, ఇష్టులను, యోగమహిమలను, తత్ప్రాప్తిసాధనను, ఫలమును విశదీకరించినవి. శ్రీమన్నారాయణుని పర, వ్యూహ, విభవ, అంతర్యామ్యర్చావతారము లనబడు పంచావతారముల వైభవమును వివరించినవి. ఐహిక వైరాగ్యమును, పరజ్ఞానమును, పరమభక్తిని - కలిగించినవి. ఆచార్యానుగ్రహమున - భగవచ్ఛేషత్వైకరూపము నొసంగినవి.

### ౨. భగవద్గీత :-

మహాభారతాంతర్గతమై, ఉపనిషత్సారమైన శ్రీమద్భగవద్గీత - "అభయం సత్త్వసంశుద్ధిః" అని మొదలుకొని, లోకోజ్జీవనకరమైన దైవీసంపదను వివరించినది. సందర్భవశమున - సాత్త్వికక్రియలను,

సాత్త్వికధర్మములను, సాత్త్వికాహారమును, సాత్త్వికజ్ఞానమును, సాత్త్వికఫలమును - వివరించినది.

౩. విష్ణుపురాణము :-

శ్రీవిష్ణుపురాణములోని యమగీత - ధార్మిక, నైతిక యుక్తమగు భాగవతవర్తనను వివరించినది.

౪. వేద శాస్త్ర పురాణేతిహాసములు :-

లౌకికవ్యాధిభీతి, అతివృష్టి - దుర్భిక్షాదులను నివారించుటకును, సుఖశాంతి సువృష్టి ఆరోగ్యసమృద్ధి మున్నగు శ్రేయములను కల్గించుటకును పెక్కులు యాగప్రక్రియలు, వ్రతనియమాదులును వేదశాస్త్ర పురాణేతిహాసములలో విశదీకరింపబడినవి. మరియు - ఈ గ్రంథములందే - శత్రుజయము, సంతానప్రాప్తి, సుఖము, శాంతి, ఆరోగ్యము, విద్య, యశము - మున్నగునవి లభించుటకు మార్గదర్శకసూత్రములు బోధింపబడినవి.

ఇవి యన్నియు - మానవులకొఱకై చెప్పబడిన శ్రేయోమార్గములు. భూదేవి, హిమవంతుడు, గజేంద్రుడు, జటాయువు - మున్నగు మానవేతరములైన చేతనములకు శ్రేయోదాయక ప్రక్రియలను వానిలో వివరింపబడినవి. అంతియగాక, దేవతలకును శ్రేయోదాయకములగు ప్రక్రియలు వీనిలో చెప్పబడినవి. ఇయ్యవి - ఐహికపురుషార్థప్రాపకములైన ప్రక్రియలు.

ఇట్లు ఇంతవఱకు శ్రుతిస్మృతీతిహాస పురాణసంబంధమైన వైష్ణవ దర్శన విశేషములు వివరింపబడినవి. ఇక, శ్రీవైష్ణవధర్మ విశేషములు లోక కల్యాణకారకములుగా నిరూపింపబడుచున్నవి.

## 5. శ్రీరామానుజ దర్శనమే శ్రీవైష్ణవ దర్శనము

వేదోక్తములైన శ్రీవైష్ణవదర్శన బీజములు - శ్రీహరి కృపా వృష్టిచే - ఇతిహాసపురాణాదులలో మొలకలెత్తి, మహర్షాదుల కృషి విశేషమున శ్రీపాంచరాత్రాది శాస్త్రములలో శాఖలుగా విస్తరించి, ఆళ్వారాచార్యుల శ్రీసూక్తులలో దివ్యముగ పుష్పింప, భగవద్రామానుజుల సూక్తిసుధతో ఫలించి, అమృతరసముతో - భాగవతు లనెడి భోక్తలకు ఆస్వాద్యములైనవి. ఈ కారణమువలన, శ్రీవైష్ణవ దర్శనము శ్రీమద్రామానుజుల యనంతరము - శ్రీరామానుజ మతమై, శ్రీవైష్ణవదర్శనమైనది.

## 6. శ్రీవైష్ణవ ధర్మ స్వరూపము

శ్రీవైష్ణవ ధర్మము - ఆప్తవాక్యము. ఆప్తుడనగా - మేలు కోరువాడు, సత్యము చెప్పువాడు. సత్య మనగా - యదాదృష్టభూత హితవచనమని - భగవద్రామానుజుల వివరణ. హితమనునది - లోక కల్యాణకారకమైన విషయప్రక్రియ. సత్యమునకు - దైవ మనియు తాత్పర్య మున్నది :-

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

అను ఉపనిష ద్వాక్యమే ఇందులకు పరమప్రమాణము.

శ్రీవైష్ణవధర్మము - వాత్సల్యభావయుక్తమైనది.

"మాతా పితృ సహస్రేభ్యోఽపి వత్సలతరం శాస్త్రమ్."

అని - భగవద్రామానుజులు - శ్రీభాష్యమున వివరించియున్నారు. ఇట్లు వివరించుటలో - అనేక మధురభావన లున్నవి.

జననీజనకులవలెనే ఈ వైష్ణవదర్శనము - వాత్సల్యభావయుక్త మైనది. ఈ దర్శనమునకు - వేద - వేదాంతశాస్త్రములు - మూలాధారములు.

"తస్యాజ్ఞయా ధావతి వాయుః । నద్యః స్రవంతి"

—(భగవద్రామానుజుల వేదార్థ సంగ్రహములో - ద్రమిడభాషా ప్రమాణము)

ఆ భగవానుని ఆజ్ఞచే - 'వాయువు వీచుచున్నది, నదులు ప్రవహించుచున్నవి' - ఇత్యాది వేదవాక్యములు - చరాచరాత్మక మైన ఈ సృష్టికి - పరమాత్మయే మూలకారణ మనియు, ఆస్వామి ఆజ్ఞచేతనే వాయువు వీచుచున్నదనియు, నదులు ప్రవహించుచున్న వనియు, ఇట్టి పరమాత్మను నవవిధ భక్తిమార్గములతో భజించి, సేవించి, తరించుటే మానవమాత్రుని కర్తవ్యమనియు - శ్రీవైష్ణవ దర్శనము ప్రబోధించుచున్నది.

శ్రీవైష్ణవదినచర్యావిశేషములు, ప్రపన్నాధికార లక్షణము లును - శ్రీ పిళ్ళై లోకాచార్య విరచితములైన రహస్యగ్రంథము లలో విపులముగా వివరింపబడినవి. శ్రీమద్రామానుజుల చరమ వార్తలు - భాగవత స్వరూప నిరూపణమున, పరమధార్మిక ప్రవచన

ములై, లోకోజ్జీవన హేతువులును, లోకకల్యాణ కారకములును అగుచున్నవి.

తత్త్వనిర్ణయమునను, ధర్మాచరణమునను - శ్రీవైష్ణవధర్మము నకును మించిన మార్గము మఱియొకటిలేదు. ఈ మార్గము - మానవ జాతికి మూలపురుషుడైన మనువుచే చూపబడినది. ప్రకృతిని, ఆత్మలను, పరమాత్మలను తెలిసికొనుటకు పలువిధములగు ప్రమాణ ములు ఆవశ్యకములుకావు. ఈ మూడుతత్త్వములను వైష్ణవధర్మము సులభముగా బోధించుచున్నది.

## 7. ఆళ్వారుల సూక్తులలో - లోకక్షేమము

శ్రీవైష్ణవగ్రంథరత్నములు - ఆపన్నివారకములు. అయ్యవి తత్త్వహిత పురుషార్థములను ప్రసాదించుటలో సాటిలేనివి. తత్త్వ త్రయ - అర్థపంచక జ్ఞానములను కలిగించును. భగవదనుగ్రహ కారకము లగును. సదాచారమును, సత్త్వవర్ధనను - అలవరచును.

శ్రీరామానుజులు కులోత్తుంగచోళుని దౌర్జన్యమునకు భీతిల్లి శ్రీరంగమును విడచిపోవునపుడు ఆ రాజభటులు వీరిని వెన్నంటి తరుమగా, ఆ దుష్టుల బారినుండి రక్షించినవి ఆళ్వారులప్రబంధములే. నమ్మాళ్వారుల దివ్యప్రబంధములు - గ్రహాదిదోషములను తొలగింప గలవు. ఆళ్వారుల దివ్యసూక్తులు - మహత్తరమైన ప్రభావముకలవి. ఇయ్యవి - ఐహికములైన వివిధ కష్టములను దూరదూరముగావించి, సుఖమును కల్గించును. భగవద్భాగవతసేవాభాగ్యమును ప్రసాదించును.

ప్రపన్నునకు కోరికయే ఉండదు. కోరబడునది - నిరంతరము భగవద్భాగవతాచార్య సేవాకైంకర్యమే. మఱి - ఈ ప్రబంధాను సంధానమున ఫలము లేకపోవుట ఉండదు. గోదాదేవిచే రచింపబడిన తిరుప్పావు దివ్యప్రబంధమును అధ్యయనము గావించినచో, అయ్యది దేశదుర్భిక్షమును పోగొట్టును, దారిద్ర్యమును తొలగించును, దేశమున వర్ష ధాన్యాదులను, పశువులను వస్త్రసంపదను వృద్ధిజెందించును. పాపములను తొలగించును. భగవద్భాగవతాచార్యానుగ్రహమును కలిగించును.

## 8. ఆళ్వారాచార్యులలో లోక కల్యాణ కాంక్ష

పాండ్యరాజ సంస్థానమున భగవత్పరతత్త్వనిర్ణయము గావించి, సభ నలంకరించిన పండితుల నెల్ల అను మెప్పించి, రాజును పరమ ధార్మికునిగా కొనర్చి, తాత్త్వికులకు ప్రపత్తిమార్గము నుపదేశించిన వారు పెరియాళ్వారులు.

అట్టి ఆ పెరియాళ్వారుల తనయయైన గోదాదేవి - తన వ్రతానుష్ఠానములద్వారా - పరమపురుషుడైన భగవానుని వశీకర ణము గావించుకొని, ఆ స్వామికి సతీమణియై, భగవద్భక్తులకు, భాగవతోత్తములకును - పురుషకారభూతురాలై, భగవదనుగ్రహ మును కల్గించినది.

భాగవతోత్తముల వైశిష్ట్యమును లోకమునకు తమ రచనల మూలముననను, ఆచరణమూలముననను నిరూపించినవారు - కులశేఖ

రాళ్వారులు. వీరి 'ముకుందమాల' స్తోత్రగ్రంథము - వైష్ణవధర్మబోధకమై, భగవద్భక్తి ప్రబోధకమై, విశ్వవిఖ్యాతి గాంచియున్నది.

వర్ణాశ్రమాతీతమైన శ్రీవైష్ణవధర్మ ప్రవృత్తిని, ఆచార్యాభిమానమును, భాగవతశక్తిని, భగవత్కృపా విశేషమును నిరూపించినవారు - తిరుప్పాణాళ్వారులు, తొండరడిప్పొడియాళ్వారులు.

భాగవత కైంకర్య ప్రవృత్తిని ప్రదర్శించి, లోకుల నుద్ధరించినవారు తిరుమంగయాళ్వారులు.

భగవద్వైభవమునకంటెను - భాగవతవైభవము మిన్నయని భావించి, ఆ భాగవతవైభవమును తాము బాగుగా అనుభవించి, ఇతరులచే అనుభవింపజేసినవారు - మధురకవి యాళ్వారులు.

ద్రావిడవేదమును సంస్కృతవేదముతో సమన్వయించి, దానిని స్వరయుక్తము గావించి, వేదములతో, దేవగానముతో తుల్యమొనరించి, సకల ప్రపన్నలోకమునకు అందుబాటులోనుంచి, శ్రీవైష్ణవ ధర్మమును దేశమంతటను పరివ్యాప్తము గావించుటకు ఉద్యమించినమహనీయులు - నాథమునులు.

ప్రజాసామ్రాజ్యమును పరిపాలించుటయందును, మేధావంతులను మెప్పించుటయందును, ప్రపన్నలోకమునకు భవసాగర మార్గమును బోధించుటయందును - అసమానమైన ధైర్యస్థైర్యములను ప్రదర్శించిన ఆచార్యులు - ఆళవందారులు (=యామునాచార్యులు).

## 9. భగవద్రామానుజ ప్రభావము

శ్రీమద్రామానుజులు విద్యార్థిగా కాంచీపురములో - యాదవప్రకాశునివద్ద వేదాంతవిద్య నభ్యసించునపుడే - రాచకన్యకు

గ్రహబాధను తొలగించిరి. మఱియు, నీచమైన యుపమానములతో పరిహాసమునకు గురియైన భగవత్స్వరూపమును - దృష్టి చిత్తాపహారకమైన - మధురోదార పవిత్రమూర్తిగా, దివ్యమంగళవిగ్రహ స్వరూపుడుగా వివరించిరి. లోకోజ్జీవనార్థమై సన్న్యాసాశ్రమమును స్వీకరించిరి. ఆచార్యుని ఆజ్ఞను ఉల్లంఘించి, మంత్ర - మంత్రార్థములను ఆలయగోపురమునుండి జనులకు వివరించిరి. నిర్గుణముగా, నిరాకారముగా వ్యవహరింపబడుచున్న పరమాత్మను - సాకారునిగా, షడ్గుణైశ్వర్యవంతునిగా తీర్చిదిద్ది, ఆ భగవానుని - సామాన్యులకును - అందుబాటులోనికి తెచ్చిరి. వీరు, వారు - అను విభేదములేక, ఎల్లవారలకు భగవత్సేవను కల్పించిరి. ఇట్టి మహత్తర కృత్యము లనేకము లాచరించిన కారణముననే - వైష్ణవమతము - రామానుజ మతముగా ప్రసిద్ధి గాంచినది.

## 10. ముగింపు

పైన పేర్కొనబడిన ఆళ్వారాచార్యుల యనంతరము - పిళ్ళలోకాచార్యులు, వేదాంతదేశికులు, మణవాళ మహామునులు మున్నగు మహనీయులు - ఈ వైష్ణవ సంప్రదాయమును బహుళ ప్రచారములోనికి దెచ్చిరి. అదియునుగాక, భగవద్రామానుజులచే నియమింపబడిన పీఠాధిపతులు, తదనుయాయులు - ఈ వైష్ణవ దర్శనమును విశ్వవ్యాప్తముగానించిరి. ఇట్టి యీ వైష్ణవదర్శనము - విశ్వకల్యాణదాయకమై, నేటికిని - సుప్రసిద్ధమై విలసిల్లుచున్నది.



# షోడశ కళా వైభవము

'విద్వత్కవి - కవికోకిల - సుకవిభూషణ'

## శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు



శ్రీ రామానుజ వైభవంబు విజయశ్రీ, శ్రీనివాసస్తుతి
ప్రారంభమ్మును, భక్తితత్త్వ రచనా న్యాసమ్ము, హిందూమతో
దార వ్యాసములున్, ప్రపత్తిమహిమాధానంబునున్ మున్నుగా
శ్రీ రామానుజ కీర్తిచాంద్రి - ప్రతిపత్ స్థేమంబునై శోభిలున్.

గరిమన్ భాగవతస్థ భక్తివిభవాఖ్యానంబు, పన్నిద్దరా
ళ్వారు నాలాయిరసూక్తి భక్తిమహిమ ప్రాశస్త్యమున్, దివ్య భా
వ రసోదంచిత విష్ణుచిత్తకవితా వైశిష్ట్యమున్ మున్నుగా
శ్రీ రామానుజ కీర్తి కౌముది విరాజిల్లెన్ ద్వితీయాంశమై.

కవితా శ్రీస్తుతిచందనప్రకట సూక్తం బాళువార్ భక్తివై
భవమున్, వైష్ణవ లక్షణాంశ రచనా ప్రాశస్త్య సంపత్తి, వై
ష్ణవ కావ్యావళి ఆంధ్రవాఙ్మయములోనన్ వ్యాప్తియున్ మున్నుగా
నవ రామానుజ కీర్తి కౌముది తృతీయంబై విరాజిల్లెడున్.

నరసింహస్తుత వేంకటేశ్వరపు విన్నాణంబు, నమ్మాళువార్
గరిమంబున్, పరమార్థతత్త్వ రచనా గాంభీర్య ధుర్యంబునున్
పరకాలాహ్వయ భక్త సంస్తుతి కృతివ్యాహారముల్ మున్నుగా
స్థిర రామానుజ కీర్తి కౌముది విరాజిల్లున్ చతుర్థీ స్థితిన్.

వరదాచార్య బుధాగ్రగణ్య కృత మాళ్వార్ భావ వైశిష్ట్య బం
ధుర సంధానము, నాథ - యామునవరాస్తోత్రప్రభావంబు. భూ
పరుడౌ శ్రీ కులశేఖరాళ్వారుల దివ్య స్తోత్రమున్ మున్నుగా
స్థిర రామానుజ కీర్తి కౌముది కళాశ్రీ పంచమిన్ భాసిలెన్.

రమణన్ వేంకటనాథు మేల్కొలుపుతో ప్రారంభమై, భక్తస
త్తము లాళ్వారుల తాత్త్విక ప్రకట సంధానంబు, శ్రీభాష్యకా
ర మహోదార విశిష్టభావ రచనా రమ్యమ్ముగా నెల్ల - పే
రిమి రామానుజ కీర్తి కౌముది తనర్చెన్ షష్ఠిభాగస్థితిన్.

శ్రీ రామానుజ వైభవంబు, కవితాశ్రీ శ్రీనివాసస్తుతి
ప్రారంభమ్ము, యతీశ కేతన కళాస్నిగ్ధంబు ముగ్ధంబునై
శ్రీరామానుజ భక్తితత్త్వకలనా స్థేమంబునున్ మున్నుగా
శ్రీ రామానుజ కీర్తి కౌముది లసించెన్ సప్తమీ సంగతిన్.

జానుగ వేంకటాద్రివిభు సన్నుతి, దివ్యప్రబంధభావ శో
భా నవమా నివాళి, భగవద్విషయార్థ విశిష్టవాణి, రా
మానుజ యోగ దర్శన సమాహిత వాగ్వైభవంబు గల్గి రా
మానుజ కీర్తి కౌముది సమంచిత మష్టమిగా చెలంగెడిన్.

విహితార్థం బగు శ్రీనివాసనుతి గాంభీర్యంబు, శ్రీభాష్య శి
ష్టహృదాఖ్యానము, గీతవ్యాఖ్య, యతిరాజప్రోక్త వేదార్థ సం
గ్రహమున్ మున్నుగ దివ్య భవ్య రచనారాజంబులున్ గల్గి యి
మ్మహి రామానుజ కీర్తిచాంద్రి - నవమీ మాన్యాకృతిన్ భాసిలున్.

సిరి రామాయణ వైష్ణవత్వ మహిమా, శ్రీభాష్యతత్త్వంబు, గో
పుర సందేశ విశిష్టభావగరిమంబున్, మోక్షసంధాయియౌ
తిరుమంత్రార్థ మహత్వపూర్ణ రచనా దివ్యత్వమున్ మున్నుగా
శ్రీ రామానుజ కీర్తి కౌముది కళా శ్రీ యొప్పు ఏకాదశిన్.

రమణీయార్థ కలాప సంభరితమౌ రామానుజస్తోత్ర ర
త్నములున్, పావన సూత్రభాష్య రచనా ధానంబు, గద్యత్రయిన్
యమిరామానుజ వైభవోల్లసన విన్యాసంబునున్ మున్నుగా
క్రమ రామానుజ కీర్తి కౌముదికళా రమ్య మ్మగున్ ద్వాదశిన్.

శ్రీరామానుజ తత్త్వ దృక్పథమునున్, శ్రీ పిళ్ళలోకార్య వ
ర్యాభూషస్థితి, భాష్యతత్త్వకలనం బర్చావతారప్రశం
సా రీతుల్ తనరన్ త్రయోదశికళా సౌభాగ్య మేపారగా
శ్రీ రామానుజ కీర్తి కౌముది విరాజిల్లున్ సుధీస్తుత్యమై.

అవతారంబుల తత్త్వసత్యకథనంబై, భారతస్థాన వై
ష్ణవ తత్త్వంబును, క్షేత్రవైభవపుభాషల్, దేశికస్వామి వై
భవమున్ మున్నగునై చతుర్దశి కళాభవ్యంబుగా వ్యాప్తృత
చ్ఛవి రామానుజ కీర్తి కౌముది విరాజిల్లున్ సుధీస్తుత్యమై.

శ్రీరామా విభు వైభవ ప్రకటమున్, శ్రీదేవి సంస్తోత్రమున్
స్ఫారత్ విష్ణుసహస్రనామమహిత ప్రాశస్త్యమున్, భాష్యసం
భారం బాదిగ నొప్పె పంచదశ సమ్యగ్భాగ విస్ఫూర్తిమై
శ్రీ రామానుజ కీర్తి కౌముది తనర్చెన్ పండిత శ్లాఘ్యమై.

శ్రీరామానుజ తత్త్వరీతి, కృతివైశిష్ట్యమ్ము, వేదాంత దీ
పారంభమ్ము, పురాణవాఙ్మయమహాంబై, వైష్ణవాంశ ప్రశం
సారీతుల్, మణవాళమాని విభవస్థానంబునున్ మున్నుగా
శ్రీ రామానుజ కీర్తి షోడశకళా శ్రీ పూర్ణమై శోభిలున్.

* * *

అరుదారన్ ప్రతిభావిశిష్టత విశిష్టాద్వైత సర్వస్వమా
వర రామానుజ కీర్తి కౌముదిని సంపాదించియున్, నిండు చం
దురు కాంతిన్ వెలయించె కోవిద కవిస్తోమంబు శ్లాఘింప, శ్రీ
వరదాచార్య బుధాగ్రగణ్యులను సంభావింతు వాగ్వైఖరిన్.



# కవి పండిత పరిచయము

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



వీరి జననము 1914. జన్మ స్థానము :- జగ్గయ్యపేట, ప్రస్తుత నివాసము - విజయవాడ. వీరు సంస్కృతాంధ్ర భాషలలో ఉద్దండ పండితులు. తర్క - వ్యాకరణ, అలంకార శాస్త్రవేత్తలు. సంగీత విద్యా నిపుణులు. వాయులీన విద్వాంసులు. కవితాధురంధరులు. ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయన తత్పరులు. 'సంగీత సాహిత్య కళానిధి' బిరుదాలంకృతులు.

త్యాగరాజ చరిత్రము, నారాయణ శతకము, బిడాల మోక్షము — మున్నగు వీరి తెలుగు కావ్యములును, 'నరసింహ తాండవమ్' అను నొక హరికథయు, భూ ప్రశంస, చంద్రకళా షోడశత్వము, నౌకా చరితమ్, రామాయణ కథాయాం వ్యపదేశాః మొదలగు వీని గ్రంథములును - పండిత ప్రశంసలకు పాత్రములైనవి, క్షేమేంద్రుని కళా విలాసమునకు అనువాదము, సింహావలోకనము (సంస్కృతము) శ్రీనివాస కల్యాణము, రామకృష్ణ పరమహంస, వరదాభ్యుదయము (హరికథలు), విప్రనారాయణ (యక్షగానము) మున్నగునవి ముద్రణ భాగ్యమును పొందవలసియున్నవి.

నాట్యకళ, గానకళ మొదలగు పత్రికలలో - వీరి సంగీత సాహిత్య వ్యాసము లనేకములు ప్రకటింపబడినవి. త్యాగరాజు, రామదాసు. గోదాదేవి మొదలగు వీరి హరికథా కాలక్షేపములు శ్రోతలను తన్మయుల గావించుచు, కొనియాడబడుచున్నవి.

ఫిడేలు వాద్యములో అనేక శీతాచలము పెద్ద పెద్ద సభలలో వీరి ప్రక్క వాద్యములు, సోలో కచేరీలు అనేకములు జరిగినవి. ఆంధ్ర ప్రదేశ్ సంగీత అకాడమీ పక్షమున వీరు పెక్కు తావులలో సంగీతమును గూర్చి ఉపన్యాసము లొసంగిరి. 1382 డిసెంబరులో - మద్రాసు మ్యూజిక్ అకాడమీలో – సంగీతోత్సవమున విద్వత్సభసత్తులో - సంగీతమును గురించి తమిళ భాషలో ప్రసంగించి, శ్రోతల మన్ననలను పొంది, ఘన సన్మానము నందిరి.

కపిలేశ్వరపురము జమీందా రగు శ్రీ S. B. P. B. K. సత్యనారాయణరావుగారి కోరికను పురస్కరించుకొని మాలవికాగ్నిమిత్రమ్, మేఘ సందేశమ్, వాల్మీకి రామాయణమ్ కథలు, రఘు వంశానుసారముగా రామ చరితమ్, త్యాగరాజ చరితమ్ - మొదలగు పండ్రెండు హరికథలను వీరు సంస్కృతమున రచించిరి. ఇవి అనితర సాధ్యములు.

ఇటీవలి రచనలు : జగన్నాథ పండితరాయల 'గంగా లహరి' వలె, సంస్కృతములో - 'కృష్ణా లహరి' 20 శ్లోకములును, కావేరీ పుష్కర సందర్భమున సంస్కృతములో 40 శ్లోకములున్నూ, ఇయ్యవి - పూజ్య శ్రీ - జీయరుస్వామి వారి యానతితో రచించిన - కావేరీ మాహాత్మ్యము తెలుగు కథ 100 పుటల గ్రంథములో ప్రచురింపబడినవి.

1991 నవంబరులో – కాళిదాస సమారోహ్ వారిచే ఉజ్జయినిలో నిర్వహింపబడిన పండిత మహాసభలో – వీరు సంస్కృత కవితాగానము గావించి, యావద్భారత పండితులను ముగ్ధుల గావించిరి.

1993 అక్టోబరు 31 వ తేదీన వీరికి – 70 సంవత్సరములు నిండిన సందర్భమును పురస్కరించుకొని, విజయవాడలో – శ్రీ జీయరు వారి సమక్షమున, వారి మంగళాశాసనములతో – పౌరులు, విద్వాంసులు, ఆప్తులు, శిష్యులు – ఎంతో ఘనముగ సన్మానించిరి, స్వర్ణ మయమైన సింహతలాట మనబడు కరకంకణమును బహూకరించిరి.

1996 జనవరిలో – గుంటూరు నగరమునందలి ఏకాదండయ్యా పంతులుహాలులో అభిమానులు వీరిని ఘనముగా సత్కరించిరి.

శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ



జననము :- పరీధావి మాఘ బహుళ అష్టమి (8-3-1913), జన్మస్థానము - అనంతపురము. జననీ జనకులు :– శేషమ్మ, రంగాచార్యులు గారలు. శ్రీమాన్ మద్దికంటి వేంకటరంగాచార్యుల వారికి ఈ శేషశర్మ గారిని బాల్యమునందే దత్తపుత్రులుగా గైకొనిరి.

విద్యాభ్యాసము :- ప్రాథమిక విద్యాభ్యాసానంతరము పితామహులగు శ్రీనివాసాచార్యులవారివద్ద కావ్యపఠనము. అనంతరము – తిరుపతి వేంకటేశ్వర సంస్కృతకళాశాలలో విద్యాభ్యాసము–

'సాహిత్య శిరోమణి' పరీక్షలో ఉత్తీర్ణత. అటుపిమ్మట బి. విద్వాన్, స్వయంకృషితో S. S L. C. పరిషత్ ట్రైనింగ్, (రాజమండ్రిలో) తెలుగు ఎం. ఏ. (వాల్తేరులో).

ఉద్యోగము :- అనంతపురము జిల్లాబోర్డు స్కూళ్ళలో 1937 నుండి - అపుడపుడు తాత్కాలిక సంస్కృత, ఆంధ్రపండిత పదవి. 1943 నుండి స్థిర ఆంధ్రపండిత పదవి. అనంతపురము జిల్లాహైస్కూళ్ళలో. 1971 లో - ధర్మవరము జూనియర్ కళాశాలనుండి ఉద్యోగ విరమణము.

రచనలు :- (ముద్రితములు. పద్య గ్రంథములు - తెలుగు) 1) సుధా బిందువులు 2) తెనుగుతల్లి 3) రామిరెడ్డి 4) యతిరాజీయము (మూడు భాగములు) 5) కేశన ప్రపత్తి 6) శ్రీనివాస కుసుమాంజనము 7)మిణుగురులు 8)హంససందేశము. ఉపశన కావ్యములు :- 9) గీతామృతము 10) పరకాలమరవైభవము 11) పరమార్థ దీపిక 12) రామాయణ పర్యాలోకనము 13) విశిష్టాద్వైత సిద్ధాంత దర్పణము - వివరణముతోటి పద్యానువాదములు :- 14) వ్యాస మంజరి (సంస్కృతము, 15) ముకుంద విలాసః 16) ఇందిరా వందనమ్ 17) మను సంభవః 18) విష్ణుచిత్తీయమ్ (అముద్రితము) 19) రాఘవేంద్ర విజయః 20, శ్రీనివాస ప్రణతిః 21) సుమతి శతకమ్ (అముద్రితములు) 22) శాంతి విలాసము 23) మేలి నోము 24 శఠకోప వాఙ్మ్ఖరి 25) సింధుజా వందనము 26) గోదా వందనము 27) దయా శతకము 28, 29, 30) కరావలంబన, కనకధారా స్తవ, షట్పదీ స్తోత్రములు. 31) వైరాగ్య పంచకము 32, 33, 34) ఈశావాస్య, కేన, కఠ ఉపనిషత్తుల వివరణ పద్యానువాదములు. వచన

ములు :- కాలక్షేప వ్యాసములు, భారతీయ సంస్కృతి, గురు దక్షిణ, విష్ణుచిత్తీయము, తాతా మనుమని సల్లాపము, అలంకార విచారము, వ్యాకృతి బోధిని, గీతానవనీతము (పద్యము).

ఆంధ్రప్రదేశ్ - సప్తగిరి, నృసింహప్రియ, ఇత్యాది పత్రికలందు అనేక పద్య గద్య వ్యాసములు, శతాధిక ఖండకలు, పద్యములు - వీరి ప్రచురితములు.

సన్మానములు :- అనేక ఉన్నతపాఠశాలలో, లలితకళా పరిషత్ (అనంతపురము) (బ్రహ్మతాలి) స్వతంత్ర పరకాల మఠము (మైసూరు) మున్నగు తావులలో అనేకములు. వీరు 4-5-96 తేదీన పరమపదించిరి.

## డాక్టర్ : శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు



జన్మస్థానము :- చందుపట్ల గ్రామము. నకిరెకల్లు మండలము. నల్లగొండ జిల్లా. జననీ జనకులు : తాయమ్మ, రాఘవాచార్యులుగారలు. జననము 24-10-1944.

విద్యా వ్యాసంగము :- స్వగ్రామములో పాఠశాల విద్య, హైదరాబాదులోని వేదాంత వర్ధినీ కళాశాలయందు కొంత కాలము; ఆంధ్రప్రాచ్య కళాశాలయందు మరి కొంత కాలము (1961 - 66) చదివి, B.O.L. పట్టమును పొంది, 1971 లో - ఉస్మానియా విశ్వ విద్యాలయ ప్రథమ శ్రేణిలో (ప్రసిద్ధములుగా) M.O.L ; 'మరింగంటి కవుల సాహిత్య సేవ' అను విషయమునుగూర్చి పరిశోధన చేసి, 1989 లో - కాకతీయ విశ్వ విద్యాలయమునుండి Ph.D. పట్టమును స్వీకరించిరి.

వీరికి - సంస్కృతాంధ్ర సాహిత్యాధ్యయన పరిశోధనలలో అభిరుచి మెండు.

ఉద్యోగములు :- 1967 లో - మహబూబ్ నగర్ జిల్లా - 'పాలెము'లోని ఓరియంటల్ కాలేజీలో - అధ్యాపకులుగా వీరు ప్రవేశించి, 1991 నుండి అదియే కళాశాలలో - ప్రధానాచార్యత్వ (ప్రిన్సిపాల్) బాధ్యతను వహించుచున్నారు.

పదవులు :- ఉస్మానియా విశ్వ విద్యాలయములో - ఓరియంటల్ కోర్సుల విభాగమునకు ఛైర్ మన్ గా (Boaid of Studiees in Telugu) 1988 - 1991 వఱకు బాధ్యతలను నిర్వహించిరి. అదియే విశ్వ విద్యాలయము - ఎకడమిక్ సెనేట్ మెంబరుగా 1988 నుండి 1902 వఱకు - పదవిని నిర్వహించిరి.

వ్యాసములు :- 1965 నుండి వివిధ పత్రికలలో - వీరి సాహిత్య వ్యాస రచన లనేకములు ప్రచురింపఁబడినవి. అదియునుగాక, విజ్ఞాన సర్వస్వము, నల్లగొండ జిల్లా సర్వస్వము, మహబూబ్ నగర్ జిల్లా సర్వస్వము, వావిళ్ళ శతవసంతి సంచిక - మున్నగువానిలో - వీరిచే విస్తృతముగా రచింపబడిన వ్యాసములు ప్రచురింపబడినవి.

ప్రసంగములు, ఉపన్యాసములు :- వీరు ఆకాశవాణిలో దాదాపు 30 ప్రసంగములు చేసిరి. సభావేదికలపై సాహిత్యోపన్యాసము లనేకము లొసంగిరి.

పరిష్కరణలు, పీఠికలు :- వీరి పరిష్కరణ, విపుల పీఠికలతో వెలువడిన గ్రంథములలో - (1) దశరథరాజనందన చరిత్ర (నిరోష్ఠ్య

రామాయణము) 1971 - 1991 సంవత్సరములో రెండు పర్యాయములు ముద్రణ. (2) చాటుపద్య రత్నావళి (1978). (3) శ్రీరంగ మహత్త్వము (1979). (4) తాలాంకనందినీ పరిణయము (1980) అను గ్రంథములను ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారు ముద్రించిరి.

హైదరాబాదులోని 'యువభారతి' సంస్థ - 1981 లో - పింగళి సూరనకవితావైభవమును, వనపర్తిసాహిత్యవేదిక వారు - 'సి. పి. బ్రౌన్. జీవితము - సాహిత్యము' అను వీరి గ్రంథములను 1984 లో ప్రచురించిరి.

తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయముతో - 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము (1981), పుత్రబంధూపాఖ్యానము (1984) అను గ్రంథములను ప్రకాశింపఁజేసిరి.

రాష్ట్రప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారముద్వారా 'శ్రీకృష్ణ శతానందీయము' ఇపుడు ముద్రణలో నున్నది.

వీరి సిద్ధాంత వ్యాసమైన 'మరింగంటి కవుల సాహిత్య సేవ' - 1991 లో ముద్రింపబడినది.

'నల్లగొండ జిల్లా కవి పండితులు' అను గ్రంథము - వీరి పర్యవేక్షణలో ఇపుడు ముద్రింపబడుచున్నది.

అముద్రిత - లిఖిత - తాళపత్ర గ్రంథ సేకరణ, ప్రశంసనమును వీరు సాహితీ జీవిత ధ్యేయముగా ఇపుడు దాదాపు 50 పుస్తకము

లను తిరుగ వ్రాసి, వానిలో కొన్నిటిని పరిష్కరించిరి. వీనిలోని కొన్నింటిని ముద్రణ చేయించిరి.

ఈ శ్రీరంగాచార్యులవారి తండ్రిగారైన రాఘవాచార్యులవారు విద్వత్కవులు, ప్రౌఢప్రబంధ నిర్మాతలు. వారి ప్రభావము - ఈ శ్రీరంగాచార్యులవారిపైనను, వీరి సోదరులపైనను ప్రసరించి యున్నది. సాహిత్యముతోపాటు - వారికి విద్వత్తు, వైద్య - జ్యోతిష ములయందు మంచి ప్రతిభావంతమైన పాండిత్యము కలదు.

డాక్టర్ : సముద్రాల వేంకటరంగరామానుజాచార్యులు



వీరి జన్మస్థానము - గుంటూరు జిల్లా - రేపల్లె తాలూకా - పెద్ద వరము అగ్రహారము. జననము 5-8-1949. విద్యాభ్యాసము : 1) హైస్కూలు చదువు S.S L.C. వఱకు ధూళిపూడిలో 2) తిరుపతి ప్రాచ్య కళాశాలలో విద్వాన్ (65-66). 3) కొవ్వూరు ఆంధ్ర గీర్వాణవిద్యాపీఠమునందు - సాహిత్య విద్యా ప్రవీణ - మఱియు, కర్ణాటక సంగీతము (66-71).

విశేషగురువులు :- సాహిత్యములో - శ్రీయుతులు పేరి శ్రీరామమూర్తిగారు, 'వేదార్థ విశారద' ధూళిపాళ రామచంద్ర శాస్త్రిగారు, కట్టి శ్రీరామమూర్తిశాస్త్రిగారు, శ్రీమాన్ రొంపిచర్ల శ్రీనివాసాచార్యులుగారు. సంగీతములో సుప్రసిద్ధ వాయులీన

విద్వాంసులైన తిరుపతి పొన్నారావు, వేదాంత దర్శనమున - శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు.

ఉద్యోగములు :- 1) 1971–72 సంవత్సరములలో - ద్వారకా తిరుమల దేవస్థానమునకు చెందిన హైస్కూలులో సంస్కృత పండిత పదవి. 2) కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము సంస్కృత కళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా 1973 జనవరినుండి కొనసాగుచున్నది.

ఉపాధులు :- సాహిత్య విద్యాప్రవీణ, M. A (వ్యాకరణము), Ph. D. అలంకారశాస్త్రము, సంగీత సాహిత్యములందును, నాటక రచన యందును, అభినయమునందును, అభిరుచి, అభినివేశము. భారతీయదర్శనములోని విశేషములను గ్రహించుటయందును, విశిష్టాద్వైత వేదాంత వైశిష్ట్యమును ఆకళించుకొనుటయందును విశేష కృషి.

రచనా వ్యాసంగము :- 1) సంస్కృత సాహిత్యశాస్త్ర ప్రాముఖ్యమునుగురించియు, జైన బౌద్ధాది నాస్తిక దర్శనముల లోని యంశములనుగురించియు, ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులలోను, మఱి కొన్ని సభలలోను వీరు అనేక పత్రములను సమర్పించిరి. 2) దార్శనిక విషయములకు, వేదాంత విషయములకు సంబంధించిన వీరి వ్యాసము లనేకములు - పత్రిక లందును, విశేష సంచికలయందును ప్రకటింపబడినవి. 3) భగవద్రామానుజుల వేదార్థ సంగ్రహమునకు ఆంధ్రానువాదమె గాక, త ద్వివరణము కూడ వీరిచే వివరించబడినది. ఈ గ్రంథము - తూర్పు

గోదావరి జిల్లా మండపేటలోగల మెహర్ చైతన్యనికేతన్ ట్రస్టువారిచే 1990 లో ముద్రించి, ప్రకాశింపజేసిరి. 4) 'హరిభక్తిసుధాకరము' అను నారదీయపురాణాంతర్గతమైన 20 అధ్యాయముల గ్రంధమునకు వీరు తెలుగు వివరణమును వ్రాయగా, దానిని కొవ్వూరులో గల గౌడీయమఠమువారు 1991 ఆగష్టులో ముద్రించి, ప్రకటింప జేసిరి. 5) విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్య సంగ్రహ రూప మైన 'వేదాంత కారికావళి' అను సంస్కృత గ్రంధమునకు వీరు ఆంధ్రానువాదము, 'సుజన తోషిణి' వ్యాఖ్యను వ్రాయగా, గ్రంధ మును మండపేటలోగల చైతన్యనికేతన్ ట్రస్టువారు 1992 జులైలో ముద్రించి ప్రకాశింపజేసిరి. వీరిచే రచింపబడి, నేటివఱకు అముద్రిత ములుగా నున్న గ్రంథము లివి :- 1) చైతన్య వైభవమ్ (సంస్కృత నాటకము. ఇయ్యది - పూరి, మద్రాసు, రాజమండ్రి మొదలగు పట్టణములలో విద్వాంసులచే ప్రదర్శింపబడినది). 2) శ్రీనాథుని పల్నాటి వీరచరితమునకు - మాత్రాఛందస్సులో సంస్కృతానువా దము. 3) 'వైకుంఠనాథ విలాసము' అను సంస్కృత శ్లోక ఆంధ్ర గేయ బద్ధమైన ఖండ కావ్యము 4) భారతీయ వేదాంత పారిభాషిక పద కోశము (సంస్కృతాంధ్రములలో రచింపబడినది. 5) జైన బౌద్ధాది అవైదిక దర్శన కోశము (సంస్కృతాంధ్రాంగ్లములలో)' 6) వైష్ణవవిశ్వాస ప్రాదుర్భావ వికాసములు (చారిత్రక గవేషణము) తెలుగులో, ఇంకను వివిధ విషయములపై వ్రాయబడిన రచనలు మఱి కొన్ని. రేడియో ప్రసంగములు :- ఆకాశవాణి విజయవాడ కేంద్రము ద్వారా వీరిచే అనేక సంస్కృత ప్రసంగములు చేయబడినవి. ప్రస్తుతము సంస్కృతపరిచయ కార్యక్రమము నిర్వహింపబడుచున్నది.

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు

వీరి జననము 1-7-1930. జన్మస్థానము - తిరుపతి. జననీ జనకులు - వేంకట నరసింహాచార్యులు, జానకమ్మ గారలు. విద్యా



భ్యాసము - నెల్లూరు నందలి వేద సంస్కృత పాఠశాలలో. ఉభయ వేదాంతాధ్యయనము - పితృ పాదుల సన్నిధిలో. డిగ్రీలు :- 1) విద్యా ప్రవీణ, 2) భాషా ప్రవీణ, 3) ఎం. ఏ., (సంస్కృతము).

ఉద్యోగము :- నెల్లూరులో- వేద సంస్కృత కళాశాలాధ్యక్షులుగా చిరకాలము పనిచేసి, ఇటీవలనే ఉద్యోగ విరమణ గావించిరి.

రచనలు :- (ముద్రితములు) 1. శుకసందేశమ్ (సంస్కృతకావ్యమ్), 2. సంస్కృత భాషా ప్రవేశిక (వ్యాకరణము) 3. వైకుంఠనాథ పంచాశత్ (స్తోత్రము), 4. శ్రీమన్నృహశిలగిరీశ్వర (పెంచలకోన) సుప్రభాతము. 5. స్వాగతమ్ (ఖండ కావ్యము), 6. హాహా హూహూ (విశ్వనాథ సత్యనారాయణగారి నవలకు సంస్కృతానువాదము) 7. శ్రీభాష్య సారము - 1,2 భాగములు 8. శ్రీభగవద్గీతామృతము - 1, 2, 3 భాగములు. 9. శ్రీ గోదా సహస్ర కమలమాలికా (శ్రీ గోదా సహస్రనామ స్తోత్రము) 10. శిక్షావల్లి (చంద్రికా వ్యాఖ్యానముతో - 'భక్తామృతమ్' మేగజైనులో.

అముద్రితములు :- 11. రత్నమాలా (బెజవాడ గోపాలరెడ్డి గారి వచన కవితకు సంస్కృతానువాదము) 12. శర్వరీ (ఆకెలి శ్రీరామ శర్మగారి ఆంధ్ర పద్య కావ్యమునకు సంస్కృత పద్యానువాదము) 13. బాదరాయణ హృదయము (బాదరాయణ, బోధాయన సంవాద రూపమున బ్రహ్మసూత్రార్థ వివరణము సలుపుట) 14. ఉపనిషచ్చంద్రికా (ఆంధ్రమున ఉపనిషత్తులకు ప్రతిపదార్థ తాత్పర్యములు గలది. ఛాందోగ్య, బృహదారణ్యకములు మినహా).

## శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు

వీరు - క్రీ. శ. 17, 18 శతాబ్దములకు చెందినవారు. జన్మ స్థానము - గుంటూరు మండలాంతర్గతమగు మంగళగిరిక్షేత్రమునకు సమీపమునగల నంబూరు గ్రామము. జననీ జనకులు - అలవేలు మంగమ్మ, వేంకటకృష్ణాచార్యులు గారలు.

వీరు - ప్రతివాది భయంకరంవారి శిష్యులు. మంగళగిరి వాస్తవ్యులగు మంచెళ్ళ వేంకటేశ్వరులవద్ద శ్రీమద్రామాయణము మున్నగు గ్రంథములను; తిరుమల వేంకట నరసింహాచార్యులవారి సన్నిధిలో - శ్రీవచనభూషణాది సంప్రదాయ గ్రంథములను అధ్యయనము చేసిరి.

ఈ కేశవాచార్యులవారు - 'ఆచార్య సూక్తిముక్తావళి' యనుపేర ఒక కావ్యమును - కమనీయమగు ఆంధ్రభాషలో రచించుచు, పరమ భాగవతోత్తములైన ఆళ్వారాచార్యులు మున్నగువారి చరిత్రలనె గాక, శ్రీవైష్ణవుల లక్షణము, ఏకాదశీ నిర్ణయము, ధనుర్మాస హరిపూజా విధానము - మున్నగు విశేషాంశములను సైతము ఇందు పొందుపరచియున్నారు.

డాక్టర్ : తట్టా విజయరామువాచార్యులు

జననము :- 3-6-1959. జన్మస్థానము :- కృష్ణాజిల్లా - చిన శ్రీరంగపురము. జననీ జనకులు :- వేంకటనరసమ్మ, గోపాలకృష్ణమా చార్యులుగారలు. విద్యాభ్యాసము :- కృష్ణాజిల్లా - జగ్గయ్యపేట జిల్లాపరిషత్తు ఉన్నతపాఠశాలలో పదియవ తరగతి వఱకు, అనంత రము 1977 వఱకు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో విద్యా భ్యాసము - సాహిత్యవిద్యాప్రవీణలో ఉత్తీర్ణత. 1981 నుండి 1983 వఱకు ఆంధ్రవిశ్వవిద్యాలయమునందు సర్వదర్శన విభాగమున అధ్యయనము, సంస్కృతములో - ఎం. ఏ. డిగ్రీ స్వీకరణము.

పరిశోధన వ్యాస రచనలు :- 1984 నుండి తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమునందు విశిష్టాద్వైత దర్శనమున పరిశోధనము. తత్త్వీరాధ్యక్షులు, చతుశ్శాస్త్ర పండితులు - 'తర్క వాచస్పతి' బిరుదాలంకృతులు, రాష్ట్రపతిబహుమాన గ్రహీతలు నగు శ్రీమాన్ N S. రామానుజాచార్యులవారి పర్యవేక్షణమున 'వేదార్థ సంగ్రహ సమీక్షాత్మక మధ్యయనమ్' అను విషయముపై పరిశోధన వ్యాసము రచించి, Ph D. డిగ్రీ నిమిత్తమై రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠమునందు 9-10-1986 తేదీన సమర్పించిరి. 2) ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్ జైపూరునందు - 'ఆత్మవిచా రము' అను పరిశోధకవ్యాసమును సమర్పించిరి. 3) ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు గుంటూరులో - 'భక్తేః మోక్షసాధనత్వే వివిధాభిప్రాయాః' అను శీర్షికతో పరిశోధక వ్యాసమును సమర్పించిరి.

పరిశోధనము :- 'విశిష్టాద్వైతస్య ఆంధ్రాణాం యోగదానమ్' 'ఆంధ్రులు - విశిష్టాద్వైతము' అను విషయముపై ఇటీవల పరిశోధన చేసిరి.

సంపాదకత్వము :- శ్రీమాన్ శిరిశినహాళ్ కృష్ణమాచార్యుల వారిచే ఆంధ్రీకరింపబడిన వేదార్థ సంగ్రహమునకు సంపాదకత్వము వహించి, దానిని 'ఆంధ్ర వేదార్థసంగ్రహ' మనుపేర టి. టి. డి. వారి ఆర్థిక సహాయముతో 1986 లో ప్రకటించిరి.

వ్యాఖ్యానము :- శ్రీ యామునాచార్యులవారి 'గీతార్థ సంగ్రహము'నకు వ్యాఖ్యానము రచించిరి.

అనువాదము :- 1) భక్తిసిద్ధాంతమ్, 2) అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యమ్ 3) సవిశేషంబ్రహ్మణి 4) లక్ష్మీపురుషకార వైభవమ్ 5) విశిష్టాద్వైతమ్ 6) తత్త్వత్రయమ్ - అను సంస్కృత వ్యాసములు, వానికి ఆంధ్రానువాదములు వీరిచే రచింపబడినవి.

సంస్కరణము :- 1) శ్రీనివాస రాఘవ విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సంగ్రహః' 2) శ్రీ వాత్స్య వరదాచార్య విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సారః' 3) శ్రీకృష్ణ తాతాచార్య విరచిత మగు 'తత్త్వ చంద్రికా' - అను సంస్కృత గ్రంథములు వీరిచే సంస్కరింపబడి, ముద్రణకు సిద్ధమైయున్నవి. 4) సుకపురం శ్రీనివాసాచార్యులవారి జ్ఞాన రత్న ప్రకాశికా 5) షష్ఠీ దర్పణమ్ - అను సంస్కృత గ్రంథములను, 6) న్యాయమాత్మా భాష్యము 7) శరణాగతి శబ్దార్థ విచారః' 8) 'పత్యనుపాయత్వ విచారః' - అను సంస్కృత

ప్రకరణ గ్రంథములును 9) శుద్ధసత్త్వ రామానుజాచార్యులవారి 'రహస్యత్రయ మీమాంసా భాష్యమ్'- అను సంస్కృత గ్రంథమును ఇపుడు వీరిచే సంస్కరింపబడుచున్నవి.

ఆంగ్ల వ్యాసములు :- 1) క్రియేషన్ ఆఫ్ ది వరల్డు 2) గాడ్ అండ్ సోల్ 3) డాక్టరిన్ ఆఫ్ విశిష్టాద్వైత - అనునవి వీరి ఆంగ్ల వ్యాసములు.

ఉద్యోగము :- రాష్ట్రీయ సంస్కృత సంస్థానము - న్యూఢిల్లీ వారిచే నిర్వహింపబడిన ఇంటర్వ్యూలో వీరు 'సెలక్టు' అయి, తిరుపతిలో కేంద్రీయసంస్కృతవిద్యాపీఠమున, విశిష్టాద్వైత విభాగమునందు 31-7-1987 తేదీన ఉపన్యాసకులుగా నియుక్తులైరి. ఇపుడీ విద్యా సంస్థ - 'రాష్ట్రీయసంస్కృతవిద్యాపీఠ' మను పేర వ్యవహరింపబడుచు, విశ్వ విద్యాలయ ప్రతిపత్తిని పొందియున్నది.

### శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు



జననము :- విరోధి కార్తీక బహుళ చవితి (9-11-49). జన్మస్థానము :- నెల్లూరు జిల్లా - గూడూరు. (మాతామహుల స్థానము). జననీ జనకులు :- లక్ష్మీకాంతమ్మ, నమ్మాళ్వార్ గారలు.

విజయరాఘవాచార్యులవారు ఆంధ్ర విశ్వవిద్యాలయములో

రాజనీతి శాస్త్రమున ఎం. ఏ; ప్రభుత్వ పాలనా శాస్త్రమున ఎం. ఏ. పరీక్షలలో సర్వోత్తములుగా ఉత్తీర్ణులైరి. సంస్కృతములో పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లొమాను సంపాదించిరి.

1972 నుండి 1976 వఱకు విజయవాడలో గల శాతవాహన కళాశాలలో రాజనీతి శాస్త్రోపన్యాసకులుగా, మానవీయ శాస్త్ర విభాగాధిపతులుగా పనిచేసిరి. 1976 నుండి, నాగార్జునసాగర్ లో ఆంధ్రప్రదేశ్ గురుకుల కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేయు చున్నారు. తమ మామగారగు 'కుల తిలక' శ్రీమాన్ డూపాటి రంగరామానుజాచార్యులవారి ఉత్సాహ ప్రోత్సాహములతో శ్రీవైష్ణవ సమాచార సంస్థను, 'కల్యాణ కల్పవల్లి'ని స్థాపించి, కార్యదర్శి పదవిని అత్యంతసామర్థ్యముతో నిర్వహించిరి.

వీరి రచన లనేకములు పత్రికలలో ప్రచురింపబడినవి. శాస్త్రీయ సంగీతము, నృత్యము, సాహిత్యము - మున్నగువానియందు వీరికి అభిరుచి మెండు. భాగవతులతో సంబంధమును కలిగియుండుటలో వీరు ప్రత్యేకమైన ఆనందమును పొందుచుందురు. విశిష్టాద్వైతము నందు విశ్వాసము, ధార్మిక జీవనమునందు ఆసక్తి, అధ్యాపనమునందు తృప్తి, క్షేత్రదర్శనమునందు సంతృప్తియు - వీరికి సహజ లక్షణములు.

**డాక్టర్ : చించాపట్టణం శ్రీరంగాచార్యులు**

వీరి జననము 6-10-1936. జన్మస్థానము - సిరిపురము. హుజూర్ నగర్ తాలూకా, నల్లగొండజిల్లా. జననీ జనకులు :- తాయారమ్మ, వేంకటాచార్యులు గారలు. విద్యా వ్యాసంగము :-

ప్రాథమికదశలో వీరు తమ తండ్రిగారివద్ద శ్రీవైష్ణవ సంప్రదాయము నెఱింగిరి. ఉన్నత విద్యాభ్యాసము :- సూర్యాపేట



ప్రభుత్వోన్నత పాఠశాలలో 1955 వ సంవత్సరమున మెట్రిక్యులేషన్ (H. S. C.) పరీక్షలో ఉత్తీర్ణత. ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఇంటర్ మీడియేట్ 1958 లో బి. ఏ. 1961 వరంగల్లులోగల ప్రభుత్వ శిక్షణాలయమున - బి. ఇడి. 1963 లో ఉస్మానియా విశ్వ విద్యాలయమున 1966 లో ఎం. ఏ. అనంతరము ఉద్యోగ నిర్వహణము.

అధ్యాపక వృత్తిలో 16 సంవత్సరములు. జూనియర్ లెక్చరర్ గా 10 సంవత్సరములు. 1-1-81 నుండి 1986 మే వఱకు జడ్చర్లలో గల డాక్టర్ : బూరుగుల రామకృష్ణారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాల యందు ఆంధ్రోపన్యాసకులుగా, 1987 జూన్ నుండి 1989 జూన్ వఱకు - మహబూబ్ నగరులో గల ప్రభుత్వ డిగ్రీ కళాశాలయందు ఆంధ్రోపన్యాసకులుగా పని చేసి, అటనుండి 1989 జూలై లో - నిజామాబాదు జిల్లా, ఆర్మూరు నందు గల ప్రభుత్వ ఆర్ట్సు మఱియు సైన్సు కళాశాలలో - 1989 జులై నుండి ఆంధ్రోపన్యాసకులుగా పని చేయుచున్నారు.

పరిశోధనలు :- 'గుదిమెళ్ళ రామానుజాచార్యుల ఖండకావ్యములు - సమగ్ర పరిశీలనము' అను అంశముపై వీరు పి. హెచ్. డి.

పట్టణమునకై పరిశోధనవ్యాసమును రచించి, 1985 ఆగష్టులో ఉస్మానియా విశ్వ విద్యాలయమున సమర్పించి, 24-3-1985 తేదీన మౌఖిక పరీక్షానంతరము 'డాక్టరేట్' పట్టమును పొందిరి.

విశేషాంశములు :- ఆంధ్రభూమి, మూసి, జనధర్మ, ఉజ్జీవన్, భక్తి నివేదన మున్నగు పత్రికలలో - వివిధాంశములపై వీరి కవితలు, వ్యాసములు కొన్ని ప్రచురితములైనవి. వివిధ విషయములపై వీరి ప్రసంగములు, స్వీయ కవితలు అనేకములు - హైదరాబాదు రేడియో కేంద్రమునుండి ప్రసారమైనవి. సంగీత సాహిత్యములందును, భాగవద్భాగవత సంసేవనమునందును - వీరికి ఆసక్తి మెండు.

శ్రీమాన్ ప్రతివాదిభయంకర అణ్ణంగరాచార్యులు



శ్రీ మణవాళ మహామునుల అష్టదిగ్గజములలో ఒకరుగా పేరు గాంచి, శ్రీ వేంకటేశ్వర సుప్రభాత స్తోత్ర రచయితలుగా ఖ్యాతి నార్జించిన - 'ప్రతివాది భయంకర అణ్ణా' అనువారి వంశీయులు ఈ మహనీయులు.

వీరి జననము 1891. జననీ జనకులు - అలమేల్ మంగమ్మ, వరదాచార్యులుగారలు. జన్మస్థానము - కాంచీపురము (విష్ణుకంచి).

పండితప్రకాండులైన తండ్రిగారి వద్దనేకాక, సప్తమంజరి, వానమామలై మఠము, శఠగోప నిలయము, వేదాంత వైజయంతి - మున్నగు విద్యాలయములందును విద్యాభ్యాసము గావించి, 12 వ యేట - మైసూరులో ప్రసిద్ధ విద్వాంసులగు కస్తూరి రంగాచార్యుల వారివద్ద - పరీక్షలో ఉత్తీర్ణులై, బహుమానముగ స్వర్ణ పతకమును పొందిన ప్రజ్ఞావంతులు వీరు.

జగద్గురు - గాది అనంతాచార్యులవారితో కలిసి 13 వ యేటనే హైదరాబాదునకు విచ్చేసి, శ్రీవైష్ణవ మత వైశిష్ట్యమును గూర్చి వీరు ఉపన్యాసము లొసంగి, అనేక ప్రశంసల నందుకొనిరి.

14 వ యేట - మాతామహులగు 'సౌమ్యజామాతృయోగి' అను యతీశ్వరులవద్ద వీరు - భగవద్విషయమును, ద్రావిడ వేదాంత మును, రహస్యగ్రంథములను అధ్యయనముగావించి, అనంతరము - 'దివ్యప్రబంధ వైభవము' అను గ్రంథమును రచించిరి. మేలుకోట - మున్నగు దివ్యదేశములను సందర్శించిరి.

18 వ యేట - మదరాసు మహానగరమునందలి తిరువళ్ళిక్కేణిలో - వేదవేదాంత వర్ధినీ సభలో - కత్తిపరీక్షయందు పాల్గొని, నాలాయిర ద్రావిడ దివ్యప్రబంధములందలి విశేషములను వివరించి, ప్రశంసాపత్రమును, బహుమానములను పొందిరి. (ఇచట - కత్తి పరీక్షయనగా :- తప్పు చెప్పినవారు - తమ నాలుకను కోసికొను పరీక్ష.)

[54]

22 వ యేట - తిరుమల వింజమూరు మాంబళే సునర్శనా చార్యుల వారివద్ద - వేదాధ్యయనము చేసిరి.

అనంతరము - నానాయిర దివ్య ప్రబంధమునకు వీరు వ్యాఖ్యానమును రచించి, దానిని - 'దివ్య ప్రబంధ దీపిక' అను పేర ప్రచురించిరి.

1954 లో వీరు - 'సత్కాలక్షేప సభ'ను నెలకొల్పి, వివిధ ప్రాంతములలో - విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్యమును గుఱించి మహోపన్యాసము లొసంగి, ప్రజానీకమున నూతనోత్తేజమును సంతరింపజేసిరి.

1931 మొదలు 1988 వఱకు 52 సంవత్సరములు మదరాసులో, ధనుర్మాస సందర్భమున - 'తిరుప్పావు'దివ్య ప్రబంధమునుగుఱించి కాలక్షేపముల నొసంగిరి.

దక్షిణ దివ్యదేశములను, ఉత్తర దివ్యదేశములను వీరు పలుమారులు సేవించిరి.

వివిధ భాషలలో వీరు సంప్రదాయ గ్రంథముల ననేకములను రచించి, ప్రచురించిరి.

తెలుగులో - 'రామానుజ' అను పత్రికను వీరు (రామానుజ పత్రికను) సుమారు 40 సంవత్సరములు నడపిరి.

అంతియగాక, సంస్కృతమునందును, తమిళమునందును, హిందీభాషయందును సైతము వీరు చిరకాలము పత్రికలను నడపి, భారతదేశమందంతటను శ్రీవైష్ణవ సంప్రదాయమును పరివ్యాప్తము గావించిరి.

కంచిలో వీరు - 'శరగోప సంస్కృత నిలయము' అను పేర ఒక సంస్కృత పాఠశాలను నెలకొల్పిరి.

కంచిలో వేంచేసియున్న శ్రీ వరదరాజస్వామివారికి వీరు - నిత్య నైమిత్తికోత్సవాదులలో నియతముగ చిరకాలము కైంకర్యము గావించిన వీరి భాగ్యము - వాచామగోచరము.

వీరి బిరుదములు :- 1) ఉభయవేదాంతాచార్య 2) మహా విద్వాన్ 3) ప్రతివాది భయంకర 4) జగదాచార్య సింహాసనాధిపతి 5) వేదపారంగత 6) వ్యాఖ్యాన వాచస్పతి 7) పద్మవిభూషణ 8) కవి కేసరి 9) మహామహోపాధ్యాయ 10) శెన్ తమిళ్ శెల్వన్ 11) దివ్య ప్రబంధ పేరాశరియర్ 12) కరైకంట్ముదియర్ 13) విశతవాక్శిఖామణి - ఇత్యాదు లనేకములు.

ఈ మహనీయులు - భగవద్రామానుజుల డెబ్బదినాలుగు (74) సింహాసనాధిపతులలో ఒకరుగా విశ్వవిఖ్యాతి గాంచి, 1983 లో పరమపదించిరి

డాక్టర్ : కిడాంబి నరసింహాచార్యులు



జననము :- తారణ శ్రావణ బహుళ విదియ. (2-7-1943) జన్మ స్థానము. దొంతి గ్రామము. నర్సాపూరు తాలూకా - మెదక్ జిల్లా. జననీ జనకులు:- కమలమ్మ, యామునాచార్యులు గారలు.

విద్యాభ్యాసము :- యాదగిరి గుట్టలో గల శ్రీ లక్ష్మీనరసింహ

సంస్కృత కళాశాలలో - సంస్కృమున ప్రవేశపరీక్ష (ఎన్ట్రెన్సు) వఱకును, ఆ పైన - హైదరాబాదు సీతారాంబాగులో గల వేదాంత వివేకవర్ధనీ సంస్కృతకళాశాలలో - సంస్కృత సాహిత్యమున బి. యల్. వఱకు వీరు విద్యాభ్యాసము గావించిరి. అనంతరము స్వయంకృషితో - తెనుగు బి. ఓ. యల్. డిగ్రీని, ఉస్మానియా విశ్వ విద్యాలయమునుండి ఎం.ఏ. డిగ్రీని - సంపాదించిరి.

పరిశోధనము :- "తిరునామములు - సమగ్ర పరిశీలనము" అను సిద్ధాంతవ్యాసమును రచించి, కాకతీయ విశ్వవిద్యాలయమున సమర్పించి, పిహెచ్. డి. పట్టమును పొందిరి.

అధ్యాపనము :- 1963 నుండి తెలుగుఉపాధ్యాయులుగా, 1970 నుండి కళాశాలలో ఉపన్యాసకులుగా ఉద్యోగములను నిర్వహించుచున్నారు. ప్రస్తుతము వీరు - మెదక్ జిల్లా - సిద్దిపేటలోగల ప్రభుత్వకళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు.

వ్యాసములు :- స్రవంతి, ఆంధ్రభూమి, భారతి, సప్తగిరి, ఆంధ్రప్రభ - మొదలగు పత్రికలలో వీరి వ్యాజములు కొన్ని ప్రచురింపబడినవి. సాహిత్య విమర్శ, కావ్య పరనము - అను విషయము లందు వీరికి అభిరుచి అధికము.

## శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు

జననము :- 27–7–1930. జన్మస్థానము - సిద్దిపేట. జననీ జనకులు :- రామక్క, రంగాచార్యులుగారలు. అభ్యసించిన భాషలు :- తెలుగు, సంస్కృతము, హిందీ. అభ్యసించిన విద్యలు : వ్యాకరణము, తర్కము కొంతవఱకు.



డిగ్రీలు :- బి, వో. యల్. (తెలుగు). హోదాలు :- మెదకు జిల్లా అధికారభాషా సమితా సంఘ సభ్యులు. ఉద్యోగము :- ప్రభుత్వోన్నత పాఠశాలలో – ప్రధానాంధ్ర పండితులుగా చిర కాలము పని చేసి, 31-7-1988 తేదీన ఉద్యోగ విరమణ చేసిరి.

సన్మానములు :- **1)** 1-7-70 లో సిద్ధిపేట పురజనులచే సన్మానము. 2) **1980** లో ఆం. ప్ర. ప్రభుత్వమువారిచే ఘనసన్మానము 3) కోరుట్లలో వానమామలై వరదాచార్యులవారి స్మారక బహుమతి. 4) వనపర్తిలో - **ఉమ్మెత్తల సాహితీ** పురస్కారము, 5) కడపలో - గడియారం వేంకటశాస్త్రిగారి స్మారక బహుమతి. 6) మచిలీబట్టణములో - శ్రీ త్రిపురసుందరీ ప్రతిష్ఠానమువారి సాహితీ పురస్కారము. **1945** లో - కావ్యరచనకు శ్రీకారము చుట్టి, ముప్పది కావ్యములను రచించిన సందర్భమున - 1995 లో - స్థానిక ప్రముఖులచే ఘనసన్మానము. ఇంకను అనేక మండలములలో - వివిధ సందర్భము లందు — వివిధ సంస్థలచే సన్మానములు.

రచనలు :- 1) ప్రబోధము 2) అమరజీవి బాపూజీ 3) కవితాంజలి 4) నవమాలిక 5) తిక్కన 6) మణి కింకిణి 7) వీరపూజ 8) శ్రీ వేంకటేశ్వర వినుతి 9) శ్రీ వేంకటేశోదాహరణము 10) తెలుగు బాలనీతి 11) బాల గేయాలు 12) శ్రీ గోపాలకృష్ణ సుప్ర

భాతమ్ 13) కవితా కాహళి 14) ఆంధ్ర విష్ణువు 15) మంజీర నాదాలు 16) జీవన స్వరాలు 17) కవితా సిందూరం 18 కాంతి వైజయంతి 19) శ్రీ బాసర సరస్వతీ వైభవము 20) వివేక విజయము 21) భక్త రామదాసు 22) వ్యాసకలాపం 23) అక్షరదీపాలు - మున్నగు కావ్యములు ముప్పది. ఇంకను బాలల కొఱకు ప్రత్యేకముగ కొన్ని గ్రంథములు వ్రాసిరి.

విశేషాంశములు :- వీరి కవితలు కొన్ని - హిందీ, గుజరాతీ భాషలలోనికి అనువదింపబడినవి. కొన్ని పద్యములు - కర్నాటక ప్రభుత్వమువారి పదవ తరగతి తెలుగు పుస్తకములో పాఠ్యాంశముగా నున్నవి. ఉస్మానియా విశ్వవిద్యాలయము - 'తిక్కన' కావ్యమును, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము - 'ఆంధ్ర విష్ణువు' కావ్యమును, 'కాంతి వైజయంతి' పద్యకవితా సంపుటిని డిగ్రీపరీక్షలకు పాఠ్య గ్రంథములుగా నిర్ణయించిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు 'వేముగంటి కృతులపై' ఎం. ఫిల్. చేయుటకు అనుమతి నొసంగిరి.

పలుమారులు ఆకాశవాణినుండి వీరి రచనలు, ప్రసంగములు ప్రసారములైనవి. భారతి, ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్ర భూమి, ఆంధ్ర జ్యోతి, స్రవంతి, ఆంధ్రప్రదేశ్ - మున్నగు వివిధ పత్రికలలో వీరి కవితలు, వ్యాసములు ప్రచురింపబడినవి. అనేక గ్రంథములకు వీరు పీఠికలు వ్రాసిరి.



# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 9 | వీథిపై | వీథిపై |
| 1 | 22 | ద్యశ; | ద్యశః |
| 2 | 23 | గాంక్షించినారట | గాంక్షించినారంట |
| 3 | 13 | పాఁదుల్ | పాదుల్ |
| 5 | 16 | నెంతకో | వెందకో |
| 5 | 22 | ద్యానా | ద్యావా |
| 5 | 23 | వేశ్మంబందలి | వేశ్మంబందలి |
| 7 | 12 | మోదంబంచి | మోదంబండి |
| 7 | 19 | వెలుంగుదు | వెలుంగును |
| 7 | 21 | తదణునో | తదణుమో |
| 8 | 2 | గ్రంథోద్యమ | గ్రంథోద్యమ |
| 8 | 4 | కూకాంక్షో | మాకాంక్షో |
| 10 | 19 | సౌభాగ్యలీలాము ర్తే | సౌభాగ్యలీలామూర్తే |
| 13 | 20 | వరదాచార్యులవారు | వరదాచార్యులవారి |
| 16 | 6 | తీరకతె | తీరవతె |
| 16 | 8 | శీర్షికతో | శీర్షికలో |
| 16 | 12 | గ్రంథము | గ్రంథము |
| 20 | 4 | వినార్యర్జనతో | విదార్యర్జనతో |
| 24 | 4 | వేంకటేశ్వక | వేంకటేశ్వర |
| 25 | 9 | పాణిరంయుం | పాణిద్వయుం |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 26 | 9 | సత్సంగత్యే | సత్సంగత్వే |
| 27 | 6 | నిత్యారాధనలు | నిత్యారాధనలు |
| 27 | 6 | దేహదారులకు | దేహధారులకు |
| 28 | 9 | రేమడు | రేమనడు |
| 29 | 2 | మా మెయంచు | మా మెయందు |
| 29 | 6 | ప్రాపంచిన | ప్రాపంచిక |
| 29 | 6 | తవిరిటాకుల | తలిరిటాకుల |
| 30 | 3 | గూర్చునవిద్యై | గూర్చునదియై |
| 31 | 14 | విద్యాచదాది | విద్యాదదాతి |
| 31 | 19 | లింతెకమునూ | లిందెకమునూ |
| 32 | 17 | విష్ణుపదత్వ | విష్ణుపరత్వ |
| 44 | 6 | అకృత్యవరణ | అకృత్యకరణ |
| 45 | 23 | వాస్యమున | వ్యాసమున |
| 50 | 21 | ఇటి | ఇట్టి |
| 53 | 3 | వ్యాదము | వ్యాసము |
| 53 | 10 | మదింగంటి | మరింగంటి |
| 53 | 12 | సవిదరముగా | సవివరముగా |
| 62 | 14 | వక్షయములగూర్చి | విషయములగూర్చి |
| 62 | 16 | రామానుజవారు | రామానుజులవారు |
| 62 | 20 | పడగల | వడగల |
| 63 | 9 | తిణపతి | తిరుపతి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 76 | 9 | పాందదారాత్రగమ | పాంచరాత్రాగమ |
| 77 | 2 | షోదశ | షోడశ |
| 77 | 21 | ధోషణాది | దోషణాది |
| 80 | 19 | శుభోగర్కమై | శుభోదర్కమై |
| 82 | 22 | అనతాయినిగా | అనపాయినిగా |
| 87 | 3 | విఘంటువు | నిఘంటువు |
| 87 | 15 | తద్లి | తల్లి |
| 94 | 7 | పద్వినీ | పద్మినీ |
| 94 | 20 | అశ్వరా | అశ్వదా |
| 113 | 21 | సంహితారుద్గతము | సంహితాంతర్గతము |
| 121 | 14 | శ్రేయస్కరము | శ్రేయస్కరము |
| 122 | 3 | (3-8) | (3-3) |
| 125 | 3 | ఆ యుస్సు | ఆయుస్సు |
| 127 | 2 | దృష్టిని | వృష్టిని |
| 130 | 15 | ప్రకంసించెను. | ప్రశంసించెను. |
| 135 | 7 | వరస్తాత్ | పరస్తాత్ |
| 135 | 22 | మాదిశ్య | మావిశ్య |
| 136 | 8 | దైత్యాది | దైత్యారి |
| 137 | 3 | విదానతః | విధానతః |
| 144 | 13 | పద్యాబలం | విద్యాబలం |
| 154 | 11 | ప్రోత్యద్దండ | ప్రోద్యద్గండ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 155 | 5 | మను సంధానంబు | మనుసంధానంబు |
| 160 | 12 | నిర్దిష్టము, | నిర్దిష్టము. |
| 162 | 4 | జగద్వ్యధరణత్వము | జగద్వ్యవరణత్వము |
| 164 | 19 | సరసద్భావము | సదసద్భావము |
| 164 | 22 | పరావత త్త్వము | పరావరత త్త్వము |
| 166 | 19,20 | అణు మానము | అణుప్రమాణము |
| 167 | 6 | నిర్దిష్టముల | నిర్దిష్టములు |
| 167 | 6 | త్రిదృక్కరణము | త్రివృత్కరణము |
| 171 | 8 | ఉద్గీధాపాసనము | ఉద్గీథోపాసనము |
| 172 | 9 | కైముక్తిక | వైయుక్తిక |
| 173 | 23 | విభయములు | కర్మవిషయములు |
| 174 | 9 | ఉత్కాంతి | ఉత్క్రాంతి |
| 174 | 9 | నిషునకు | నిష్ఠునకు |
| 176 | 4 | యుంచుట | యుండుట |
| 176 | 10 | భగవాత్మకమైన | భగవదాత్మకమైన |
| 179 | 22 | పారని | పాడినారని |
| 186 | 15 | శార్జ సహిత | శార్జ్గ సహిత |
| 18) | 13 | రసవ ర్తర | రసవ త్తర |
| 195 | 13 | సానాంతరము | సానానరతరము |
| 201 | 10 | త త్త్వటీకతో | త త్త్వటీకలో |
| 210 | 14 | అనగాహము | అవగాహము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 210 | 16 | శెషాంశా | శేషాంశా |
| 211 | 14 | ప్రసన్నామృతము | ప్రపన్నామృతము |
| 214 | 2 | యనంతము | యనంతరము |
| 225 | 19 | యతిరాజలై భవము | యతిరాజవై భవము |
| 234 | 18 | ప్రకాశకుడు | ప్రకాశ్యుడు |
| 235 | 18 | కలిరిగి. | కలిగిరి. |
| 268 | 20 | నానర్చుటకు | నొనర్చుటకు |
| 276 | 6 | పర్ణోచిత | వర్ణోచిత |
| 277 | 4 | మాస్పతేన్ | మాస్పిదన్ |
| 278 | 5 | అగీకరించి | అంగీకరించి |
| 283 | 7 | స్వాములంనదఅను | స్వాములనందఅను |
| 286 | 22 | తిరుమాలిముశ్శోలై | తిరుమాలిరుంశోలై |
| 287 | 19 | మహాత్మలొకరు | మహాత్ములొకరు |
| 295 | 14 | మళవాళ | మణవాళ |
| 302 | 19 | నా  సరిలేడు | నీసరిలేడు |
| 307 | 6 | త్రివిక్రమములు | త్రివిక్రమమును |
| 311 | 5 | ఆకములైన | ఆకరములైన |
| 312 | 11 | గృహ్యసూత్ర | గుహ్యసూత్ర |
| 313 | 18 | శైలిజం | శైవిజం |
| 314 | 4 | భక్తి, | భక్తి - |
| 314 | 16 | శాకమునంతను | లోకము నంతను |
| 841 | 16 | పించి | పిలిచి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 349 | 8 | గావించి | గాంచి |
| 349 | 22 | శుకపక్షుయ | శుకిపక్షీయ |
| 350 | 14 | విందుగవలయు | విందుగా వినగవలయు |
| 358 | 9 | ప్రసారమునకు | ప్రచారమునకు |
| 362 | 2 | కల్వాహణుని | కల్హాణుని |
| 369 | 18 | చవ్రధారి | చక్రధారి |
| 374 | 2 | ఖ్యాతినీయము | ఖ్యాపనీయము |
| 374 | 2 | విశెషముగ | విశేషముగ |
| 374 | 20 | ధర్మవ్యాప్తికి | ధర్మవ్యాప్తికి |
| 377 | 8 | మైనదని | మైనవని |
| 378 | 20 | చంపినలదు | చంపినందు |
| 379 | 24 | తాము | తాను |
| 382 | 10 | ప్రభువులును | ప్రభువులను |

—★—

## శ్రీ రామానుజ కీర్తి కౌముది

వదాన్యశేఖరులు



ప్రొఫెసర్ : P. నరేంద్రరెడ్డి,

వారి సతీమణి

శ్రీమతి - సువర్ణలతారెడ్డి

PKRON * (అమెరికా)

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

## వదాన్యశేఖరులు

ప్రొఫెసర్ : పి. నరేంద్రరెడ్డి,
వారి సతీమణి - శ్రీమతి - సువర్ణలతారెడ్డి, } డా॥ 551
AKRON (అమెరికా)

## వదాన్యులు

1. శ్రీమాన్ సి వి. లక్ష్మణాచార్యులు, రూ.
వారి సతీమణి - శ్రీమతి అచ్యుతవల్లి } 5,000/-
గుంటూరు

2. డాక్టర్ : కె. యస్. యన్. చారి, రూ.
వారి సతీమణి - శ్రీమతి ప్రమీలారాణి } 5,000/-
గుంటూరు

## మహారాజపోషకులు

1. శ్రీమాన్ చిలకమర్తి సత్యలక్ష్మణాచార్యులు, Retd, I. T. O
గుంటూరు
2. డాక్టర్ : కిడాంబి సత్యనారాయణాచార్యులు, M S|M N A N.S.
గుంటూరు
3. శ్రీ వి. మధుసూదనరావు, (రిటైర్డు జిల్లా రిజిస్ట్రార్) ,,
4. శ్రీమతి - కిడాంబి సుశీలాదేవి ,,
5. శ్రీమతి - గుడివాడ హేమమాలినీరాణి, M.A. (లెక్చరర్) ,,
6. డాక్టర్ : వి. గోపాలరావు, M.D. ,,

7. శ్రీమాన్ కిడాంబి వేంకట నరసింహాచార్యులు — పెంటపాడు
8. శ్రీ ఘండికోట వెంకట సుబ్బారావు — ప్రశాంతి నిలయము
9. డాక్టర్ : శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M.A Ph.D.
ప్రిన్సిపాల్ . గవర్నమెంటు ఓరియంటల్ కాలేజి — పాలెమ్
10. శ్రీమాన్ S. A. T. సింగరాచార్యులు, (అస్ట్రొలిజర్) నెల్లూరు
11. శ్రీ నల్లమూడి వెంకటేశ్వరరావు — విజయవాడ
12. శ్రీమతి - రావు రమాదేవి (MOBILE) — అమెరికా
13. డాక్టర్ : K. రాఘవాచార్యులు, R. M. P. — ములకలూరు
14. డాక్టర్ : వి. మహేశ్ — గుంటూరు
15. వికాసతరంగిణి సభ్యులు — గుంటూరుశాఖ
16. శ్రీ గ్రంధి సుబ్బారావు, ప్రొప్రయిటర్ : క్రేన్ వక్కపొడి కంపెనీ — గుంటూరు

### రాజపోషకులు

1. శ్రీమాన్ కందాడ శ్రీనివాస రాఘవన్, B. Com — గుంటూరు

### పోషకులు

1. శ్రీమాన్ నంబూరు బుచ్చిరామానుజాచార్యులు — గుంటూరు
2. డాక్టర్ : సి. రామదాసు, D M & E D M. R — ,,
3. శ్రీమతి - కిడాంబి వెంకట లక్ష్మమ్మ — ,,
4. శ్రీమాన్ నండూరు సత్యనారాయణాచార్యులు, — గుడివాడ
5. డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు, M.A; Ph. D. — కొవ్వూరు
సంస్కృతోపన్యాసకులు : ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము

6. శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ, M A. విశాఖపట్టణము
7. శ్రీ వి. పాండురంగరాజు ,,
8. శ్రీమాన్ కండాడై అప్పన్ కృష్ణమాచార్యులు, M A. వాల్తేరు
9. శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులు, M A,B Ed హైదరాబాదు
10. శ్రీమాన్ టి. కె. రాఘవన్, M.A. ,,
11. కుమారి - సి. సీతాదేవి (జాయింట్ కమీషనర్, కమర్షియల్ టాక్సెస్) ,,
12. శ్రీమాన్ యన్. సి. వరదాచారి మద్రాసు
13. శ్రీమాన్ యన్. సి. గోపాలస్వామి ,,
14. శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులు, M A;B.Ed. హనుమకొండ
15. శ్రీమాన్ కె. గోపాలాచార్యులు నిట్టూరు
16. శ్రీమాన్ కె. కృష్ణమాచార్యులు ,,
17. శ్రీమాన్ ఆర్. జె. పార్థసారథి బొంబాయి
18. శ్రీ ఉప్పలపాటి గోపాలకృష్ణ విజయవాడ
19. శ్రీ కె. సుందరరాజు (అసిస్టెంట్ ఇంజనీర్ - టెలికమ్) సిద్దిపేట
20. శ్రీ టి. రాంప్రసాద్ ఘానూరు
21. శ్రీ మెట్టుపల్లి వెంకయ్యపంతులు కిలానపర్తి
22. శ్రీమాన్ యన్. ప్రభాకరాచార్యులు, H.M కరీంనగర్
23. శ్రీ యం. కృష్ణారెడ్డి; B Sc; LL. B. అడ్వొకేట్ ,,
24. శ్రీ మాన్. యన్. సి. వి. నరసింహాచార్యులు, M A;B O.L. తిరుపతి
25. డాక్టర్ : కె. రమారెడ్డి (మానస హాస్పెటల్) రాజమండ్రి

| | | |
|---|---|---|
| 26. శ్రీ ఆర్. సీనయ్య | చంచుపట్ల | |
| 27. శ్రీమాన్ A శేషాచారి | హైదరాబాదు | |

విరాళములు

| | | |
|---|---|---|
| 1. శ్రీమాన్ మాత్రేది సీతారామ్ శ్రీకృష్ణాశ్రమ నిర్వాహకులు | పెదముత్తేవి | రూ. 500 |
| 2. శ్రీమాన్ A. V. దేశికాచార్యులు రాజగురువులు | మైసూరు | 250 |
| 3. శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులు, | కల్వచర్ల | 216 |
| 4. శ్రీ T. రామప్రసాదు | భానూరు | 151 |
| 5. ఈయుణ్ణి వేంకట కృష్ణమాచార్యులు, | మంగళంపాడు | 50 |
| 6. శ్రీమతి - కె. మరుద్వతి | గుంటూరు | 50 |



# శ్రీ రా మా ను జ కీ ర్తి కౌ ము ది

## ఉత్తరార్ధము

### తొమ్మిదవ భాగములో

1. శ్రీనివాస స్తవము — పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు
2. శ్రీమద్రామానుజులు వేదార్థ సంగ్రహము — డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు
3. భగవద్రామానుజులు — శ్రీభాష్యము (ప్రథమాధ్యాయము) — శ్రీ భాష్యం అప్పలాచార్యులు
4. భగవద్గీత - రామానుజ దర్శనము — తెలికిచెర్ల కందాడ గోపాలాచార్యులు
5. యతిరాజ సప్తతి — నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు
6. శ్రీరామానుజీయ మనోభావన — డి. టి. తాతాచార్యులు
7. శ్రీరామానుజ తారావళి — వేముగంటి నరసింహాచార్యులు
8. శ్రీవైష్ణవ మత వైశిష్ట్యము — ధనకుధరం వరదాచార్యులు
9. అన్నమాచార్యులు - సంకీర్తన వాఙ్మయము — బృందావనం రంగాచార్యులు

### పదియవ భాగములో

1. శ్రీ పద్మావతీ శ్రీనివాస స్తుతి — ఆసూరి మరింగంటి పురుషోత్తమాచార్యులు
2. లక్ష్మీ పురుషకార వైభవము — డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు

3. శ్రీమద్రామానుజులు - వారి కృతి రత్నములు
చిలకపాటి విజయరాఘవాచార్యులు

4. శ్రీమద్రామానుజులు - ఉపనిషత్తులు
ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు

5. శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యము (ద్వితీయాధ్యాయము)
కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు

6. శ్రీమద్రామానుజులు - గీతాభాష్యము
డాక్టర్ ! చింతాపట్నం శ్రీరంగాచార్యులు

7. గీతా రహస్యము — గుదిమెళ్ళ రామానుజాచార్యులు

8. విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యము
నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు

9. శ్రీరామానుజ ప్రశస్తి — మొవ్వా వేంకటదాసు

10. శ్రీవైష్ణవ మతము - శ్రీపాంచరాత్ర వాఙ్మయ ప్రధానము
ధనకుధరం వరదాచార్యులు

11. శ్రీ పాంచరాత్ర ప్రాశస్త్యము
దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు

12. వివిధ సంప్రదాయములు - వైష్ణవ మత ప్రధానము
చెలమచెర్ల రంగాచార్యులు

## పదునొకండవ భాగములో

1. శ్రీ వేంకటేశ స్తుతి — పిరాల శ్రీదేవమ్మ

2. శ్రీమద్రామాయణము - వైష్ణవ తత్త్వము
శ్రీభాష్యం అప్పలాచార్యులు

## పంద్రెండవ భాగములో

7. శ్రీమద్రామానుజులు - శ్రీరంగ గద్యము
నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

8. శ్రీరంగ గద్యము - శ్రీరామానుజ భావనా విశేషము
కుంటిమద్ది శేషశర్మ

9. శ్రీమద్రామానుజులు - శ్రీ వైకుంఠ గద్యము
కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు

10. శ్రీమద్రామానుజులు - వర్ణాశ్రమ ధర్మములు
కె. వి. రాఘవాచార్యులు

11. శ్రీ రామానుజ వైభవోల్లాసము కరి నారాయణాచార్యులు

12. శ్రీ పరాశరభట్టరు ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు

## పదమూడవ భాగములో

1. శ్రీనివాస స్తవ రాజము వింజమూరి గోపాలకృష్ణమాచార్యులు

2. అర్చావతార వైభవము
డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు

3. శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యము
(చతుర్థాధ్యాయ - పూర్వార్థము)
మరింగంటి శ్రీరంగాచార్యులు

4. శ్రీమద్రామానుజులు - నిత్యగ్రంథము
కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు

5. శ్రీమద్రామానుజులు - తాత్త్విక దృక్పథము
డాక్టర్ : చించావట్టణం శ్రీరంగాచార్యులు

6. శ్రీ రామానుజ సిద్ధాంత ప్రవర్తకులు
ధనకుధరం వరదాచార్యులు

## పదునాల్గవ భాగములో

## పదునైదవ భాగములో

## పదునాఱవ భాగములో

